# Andhra Vangmaya

# Charitra Sangrahamu

## A Survey of the Telugus, their History and Literature

BY

K. VENKATANARAYANA RAO, B. A., L. T.



PUBLISHED BY

V. Ramaswamy Sastrulu & Sons

292, Esplanade, Madras.

1936

శ్రీరస్తు.

# ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము

గ్రంథకర్త:

కే. వేంకటనారాయణరావు, బి. ఏ., యల్. టి.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ

ప్రకటితము

1936

# విషయసూచిక

విషయము | పుట

# కృతజ్ఞత

సీ. శ్రీదత్త జన్మప్రసిద్ధిఁ గీర్తిత మైన
యాత్రేయ మేపుణ్యగోత్రపంక్తి
రుచిముఖాఖ్యవ్యాఖ్యరచనావిరాజి రా
మస్వామి కేసుబ్రహ్మణ్య కుమారుఁ
డాంధ్రవాఙ్మయసువియత్తున కేసుధీ
కృతి ముద్రణంబ రర్కఘృణుల నీను
వావిళ్ల కులదుగ్ధవారాశి కేసూరి
గుణయశశ్చంద్రికల్ ప్రణుతిఁగూర్చు
నట్టి బుధమాన్యకార్యప్రయత్ననిష్ఠు
వేంకటేశ్వరు శేషాద్రి వేంకటేశ్వ
రుండు సమధికైశ్వర్యయుక్తుండు గాఁగఁ
బ్రోచి భాషాభివృద్ధికిఁ బూన్చుఁగాత!

ద్వితీయముద్రణము

# విజ్ఞప్తి

---

ఈగ్రంథము ప్రథమముద్రణమున 'కవిత్వవేది' యను పేరునఁ బాఠకలోకమునకుఁ బరిచితులయిన గ్రంథకర్త యీ ద్వితీయముద్రణమునఁ దమయథార్థనామమును బ్రకటింప నంగీకరించిరి. అందులకు వారియెడ నెంతయుఁ గృతజ్ఞులము.

24-2-1936,
చెన్నపురి. }

ప్రకాశకులు.

# ప్రథమముద్రణము

## పీఠిక

ఆంధ్రవాఙ్మయచరిత్ర మింతవఱకును గ్రంథ గ్రంథ కర్తృనామావళిగనే ఉన్నదిగాని, వాఙ్మయోత్పత్తి వికాసములనుగాని, గుణదోషవిచారమునుగాని చేసి వ్రాసినవారు లేరు. కవిజీవితములు, కవులచరిత్రములును వాఙ్మయచరిత్ర మంతటయందును యథాప్రాధాన్యముగ తమతమస్థానముల యందు నిలచిననే కాని వాఙ్మయస్వరూపనిరూపణ మేర్పడఁ జాలదు. శ్రీ వంగూరి సుబ్బారావుగారి "ఆంధ్రవాఙ్మయచరిత్రము" క్రొత్తదారిని త్రొక్కినది గాని యింకను దానికి చరిత్రమను నామము సార్థకము కాలేదు. శ్రీభోగరాజు నారాయణమూర్తిగారి "ఆంధ్రకవిత్వచరిత్రము" అంతకంటె మిన్నయై యున్నను, కేవల కవిత్వతత్త్వవిచారపూరిత మగుటచేతను, పరిమితవిషయక మగుటచేతను దానికి పుష్టి కలుగలేదు. ఇట్టి తఱి, ఈగ్రంథకర్త రచించిన ఈ "ఆంధ్రవాఙ్మయచరిత్రము" పై లోపములను జాలవరకు నివారించుచు, నవ్యదృష్టి విలసితమై, ఆంధ్రుల కాదరణపాత్ర మగుచున్నది. అట్టి యీ గ్రంథము నాంధ్రలోకమునకు పరిచితమగునట్లు చేయఁగోరిన

గ్రంథకర్త యభిలాషమును తీర్చుట నాకెంతయు సంతోష దాయకము.

గ్రంథకర్త చెన్నపురీ విశ్వకళాపరిషత్పట్టభద్రుఁడు. బి. ఏ., పరీక్షయం దాంధ్రము నభిమానవిద్యగా నభ్యసించి, మొదటి తరగతియందు నెగ్గి, శ్రీ బొబ్బిలి మహారాజావారి బంగారుపతకమును బహుమానముగా బడసినవాఁడు. పరీక్షయైన తోడనే గ్రంథముల నొకమూలకుఁ ద్రోయు ననేకులవలెగాక తన యభిమానభాషవిషయమున నిరంతరకృషి చేయుచు నిత్యవిద్యార్థియై యున్నవాఁడు. అట్టి యాతఁ డీగ్రంథమునకు తన కర్తృత్వమును బ్రకటింప నిచ్ఛగింపకుండుట యాతని స్వాభిమానరాహిత్యమును, వినయాదిసద్గుణములను చాటుచున్నది. కాని, యీగ్రంథమువంటి గ్రంథమును రచింపఁగల ధీమంతులు తమ నామమును ప్రకటింపకొనకుండుట నాకిష్టము లేదు. ఊరును పేరును లేని యెందఱో చచ్చుపుచ్చు గ్రంథముల కర్తృత్వమును చాటుకొనుచు, తమకుఁ దా మిచ్చుకొనిన కవిరాజశేఖరాదిబిరుదావళులను తగుల్చుకొని విఱ్ఱవీగు నీకాలమున, నిట్టి ప్రజ్ఞావంతులు మఱుగుపడి యుండ నెంచుట తగనిదే యైనను, అదియును నొక మేలే యగునేమో!

ఈగ్రంథమునందు ఆంధ్రవాఙ్మయయుగవిభాగము చేయఁబడి, ఆయాయుగముల నాంధ్రులచరిత్రసంగ్రహమును ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహమును, యుగలక్షణసమన్వయ

మును చేయఁబడినది. ఆంధ్రకవులయం దెవరి కెంతప్రాధాన్య మీవలెనో అంతయే యొసఁగఁబడినది. ఆయాకవుల కవిత్వ లక్షణము కొంత వివరముగ, హృద్యముగ నిరూపింపఁబడినది. విషయవిభాగమునందును, రచనావిధానమునందును, నీగ్రంథము నూతనపంథ ననుసరించి, నూతనదృక్పథమును వెల యించుచున్నది.

గ్రంథకర్త యనేకాంధ్రగ్రంథముల ప్రాశస్త్యమును స్వయముగ గుర్తించి, యింతవరకు నాయాపత్రికలయందు వెలు వడిన విమర్శనములను క్రోడీకరించి, వానినన్నిటిని తనయను భవముతో సమ్మేళనము చేసికొని, అట్లు సమన్వయమునొందిన తనయభిప్రాయముల నిందు పొందుపరచి యున్నాఁడు. ఇం దాంధ్రవాఙ్మయమంతయు నొక్కసారిగ కనులకు పొడ కట్టునట్లావిషయములు విస్తరింపఁబడియున్నవి.

ఆధునికవాఙ్మయమునుగూర్చి గ్రంథకర్తవ్రాసినదాని లో ననేకవిషయముల ననేకులు భిన్నాభిప్రాయులు కావ చ్చును. ఇప్పటిగ్రంథములలో నెన్ని చిరస్థాయులుగా నుండఁ గలవో చెప్పుట కష్టము. తాత్కాలికానందప్రదాయకము లగు కొన్నిగ్రంథములు కొందరికి పరమాదరపాత్రము లగు చుండును. శాశ్వతానందప్రదములు దృష్టినుండి మరుగుపడి యుండవచ్చును. ఆయాగ్రంథముల శాశ్వతత్వమును భావి కాలమే నిర్ణయింపఁగలదు. శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు నూతనకావ్య యుగారంభమును చేసినవారయ్యును, వారి

గ్రంథములలో మున్ముం దేవి నిలువఁగలవో చెప్పలేము. వారి "బుద్ధచరిత్రము" నిలుచునేమో! శ్రీ వేంకటపార్వతీశ్వ... గ్రంథములలో "ఏకాంతసేవ" చిరకాల ముండునని యను కొంటిని. గ్రంథకర్త దాని జిలిబిలి ప్రోఁగని యనుకొన్నాఁ... ఇం దేది సత్యమగునో! నేటిభావకవిత్వనామక హృద... ప్రకటనమున గంభీరస్వభావ మిమిడియున్నదనిన కొందరి... రుచింపదు. ఎవరు నిర్ణయింపఁగలరు? భావికాలమేకదా!

ఎట్లయిన నేఁడు నూతనశకము కొంతవరకు సాగి... కవిత్వవిషయమున దీర్ఘశార్దూలాదివృత్తములపై మక్కు... నది. చంపూప్రబంధములతో చనవు పోవుచున్నది. జాతి... చ్ఛందములపై సరసదృష్టులు సాగుచున్నవి. ఇది ఖండకావ్య ములకు కాలముగా కన్పడుచున్నది. ఇతివృత్తములు క్రొ... ప్రాతవైనను క్రొత్తతొడుగుల తొడుగుచున్నవి. కఠినపు ... బాట్లపై కంటకము కలిగినది. రెక్క కత్తిరింపఁబడిన కావ్య... తము రెక్కలు గలిగి, భావాంబరమున పారాడుచు నే... మనోహరావ్యక్తఋతములఁ జేయుచున్నది. ఆయాలాపము... నాలకించి యానందించుచున్నవారున్నారు. తుపాకిపట్టుకొని దానిపై గురిచూచుచున్న విమర్శకకిరాతు లున్నారు. పక్షి! తప్పించుకొమ్మని కొందరి హృదయము లావేగమును చూ... చున్నవి.

ఇది గద్యయుగమని కొందరితలంపు. అగునేమో... ని "గద్యకావ్య" యుగ మింకను నారంభము కాలేదని ...

యభిప్రాయము. "ప్రమదావనము" ఒక్కటి గద్యకావ్యము కనఁబడుచున్నది. ఇంకను కొన్ని యుండవచ్చును. చాలవరకు కృతకాసంపూర్ణభావప్రకటనములు. అయిన నేదోయొక్క గద్యకావ్య మాంధ్రమున నుదయింపఁగలసూచనలు పెక్కులు కాన్పించుచున్నవి.

"నవలా" నామకములగు పెద్ద గ్రంథములతోఁబాటు "చిన్నకథ" లను క్రొత్తతీరుగ్రంథములు నేఁడు వెలువడు చున్నవి. పత్రికాయుగమగు నీకాలమున నిట్టివి మోదము గొల్పి లోకము నలరించుచున్నవి. ఇట్టివానిలో కొన్ని నిలచి యుండఁగలవని నా నమ్మకము.

అన్నిటికిని మించి, ఇది విమర్శనకు కాలము. కవిత నల్లి నను, వచనమును వ్రాసినను, గ్రంథకర్త యాత్మవిమర్శనము నకు పాల్పడని గ్రంథము నేఁడు కానరాదు. అవ్యక్తగానము, తన్ను దామఱచిన గానము వినరాలేదు. "సరిగమ" లతోఁ గూడిన స్వరకల్పనము కొంతవరకైనను లేని సంగీతమే నేఁడు లేదు. తుదకు "ఏకాంతసేవ"లోఁకూడా నీ స్వరాలాపనము వినఁబడుచున్నది. అనఁగా శాస్త్రమునకు నేఁడు ప్రాధాన్య మున్నది. శాస్త్రమునకును కావ్యమునకును సగమెరిక.

నవీనయుగలక్షణము నిచట వివరించుట నాపనిగాదు. ఇట్టియుగలక్షణ నిరూపణమును ప్రస్తుత గ్రంథకర్త చాలవ రకు స్వతంత్రముగ చేసియున్నాఁడని తెలుపుటకే కొంత పెంచి వ్రాసితిని.

ఇఁక పాఠకులకును గ్రంథమునకును నడుమ సూత్రధారపాత్రమును నిష్క్రమింపఁజేసి, గ్రంథానుభవమునకు పాఠకులను ప్రోత్సాహపరచుచున్నాను. ఇట్టి చక్కని గ్రంథము వ్రాసిన గ్రంథకర్త నభినందించుచు, నిట్టివాని ననేకములను వ్రాసి, యాంధ్రుల కృతజ్ఞతకు పాత్రమగుఁగాక యని హెచ్చరించుచున్నాను.

అనంతపురము
27 - 9 - 1928.

చిలుకూరి నారాయణరావు

# అంకితము.

విశ్వశక్తియు, విశ్వవ్యాపియు, విశ్వసాక్షియు

విశ్వకల్యాణ పరమావధి

నాతోడు నీడ - నావలపుల పంట

కరుణామూర్తి నాపతి;

హనుమదనంత విశ్వనాథ ప్రముఖసకలదేవతా

సకలభూతతత్త్వాలోకసమాకృతి;

నిరంతరభక్తపరిరక్షణవైభవైకప్రవృత్తి;

జగన్మహాకావ్యనిర్మాణప్రసిద్ధసుకృతి;

శ్రీమదాద్యాది సత్యనారాయణ పరం

జ్యోతికి.

# విన్నపము

"ఏకో నారాయణః" యనఁబడిన పరంధామునకు నమోవాకములు. కళాశాలకాలములో విమర్శనపద్ధతికి మార్గదర్శకులైన బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులు గారికి, వ్యాకృతిని సొంతముగ నేర్పిన బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారికి, నాటకలక్షణాదుల నిర్వచించిన శ్రీయుత విద్వాన్ గరిమెళ్ల సోమన్నపంతులు, **M. A., L. T.,** గారికి నావందనములు. అయిదేండ్లపూర్వము నన్నుద్బోధించిన ఈభాషాగురుత్రయము నన్నొకవేళ మఱచియున్నను నేను వారిని మఱువఁజాలను.

ఈగ్రంథము నాంగ్లేయవాఙ్మయచరిత్రగ్రంథములును, కళాశాలలో Text Books గ ప్రసిద్ధమైనవియునగు "Long, Saintsbury" అను వారిపొత్తముల నాదర్శముగాఁ గొని రచించితిని. జాతిమతపరిణామములును భాషయు వేఱగుట, గ్రంథము నూతనాకృతిని దాల్చియుండుట తప్పదు. సాంఘిక చరిత్ర, వాఙ్మయచరిత్ర, మహాకవిచరిత్ర, తత్తద్వ్యాగ ముఖ్యలక్షణచరిత్రలను నాల్గువిషయము లిందుఁబొందుపడినవి.

దీనిని గూర్చుటలో ముఖ్యముగ నుపయుక్తములైనవి 1. ఆంధ్రసాహిత్యపరిషత్సంపుటములు, 2. ఉగాదిసంచికలు, 3. కీ. శే. కం. వీరేశలింగముగారి కవులచరిత్ర, 4. శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములు, 5. కీ. శే. వంగూరి

సుబ్బారావుగారి వాఙ్మయగ్రంథద్వయి, 6. శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిగారి యమూల్యగ్రంథము లన్నియు, 7. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్ర, 8. శ్రీరాజరాజనరేంద్రుని పట్టాభిషేకసంచిక, 9. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారము, 10. కీ. శే. కే. వి. లక్ష్మణరావుగారి కృతులు, 11. భారతీసంపుటములు, 12. భాగవతాదిగ్రంథములలోని పీఠికలు. ఏతద్గ్రంథకర్తలకందఱకు నా కృతజ్ఞతాపూర్వకనమస్కారములు. గుణములు వారివి; దోషములు వారివి కావని విజ్ఞాపన.

అనేకవిమర్శకమహాశయులను బరిశీలించి వ్రాయఁబడినగ్రంథమగుటవలన దీనియం దనేకులభావము లిమిడియుండక తప్పదు. సాధ్యమగునంతవఱకు నుచితపదప్రయోగమును లక్షించి యున్నాను. అల్పజ్ఞుఁడ నగు నాయొక్కయీ "యేర్చి", "మార్చి", "కూర్చి" రూపుదిర్చినగ్రంథమునసున్న దోసంగులను పెద్దలు క్షమియించి, నాతప్పులపైని కోపముచే నైన నుత్తమవిమర్శకగ్రంథముల వ్రాయుదురని తలంచినాను. సంధి నవయుగములలోని విమర్శనములు దగ్గఱివగుటచే నహోహాలే కావచ్చును. వాని కాధునికులు గినియక, నన్నుఁ గరుణించి దోసంగుల దిద్దుదురని కేల్మోడ్చి వేఁడుచున్నాను. *"కవిత్వవేది" యనుట నాప్రచ్ఛన్ననామమే కాని నాబిరుదము కాదని నొక్కి చెప్పుచున్నాను.

L. T. పరీక్షార్థము రెండేండ్లముందు వచ్చియుండినప్పుడు నీప్రశాంతమనోహరతరంగములపై సాయంసంధ్యా

---

* ప్రథమముద్రణమున.

రవికిరణములు బంగారురంగులం దురంగలించుచు నుయ్యాల లూఁగినప్పుడు, ఇమ్మహానదీమతల్లిగాకున్న నీఁకెవ్వరు నన్నయ కుత్సాహ మిచ్చియుందు రని యువ్విళ్లూరినప్పుడు, పూర్వ చరిత్ర స్మృతి నభంబున మెఱసి దేహము పులకితమైనప్పుడు రాజమహేంద్రవరములో సంకల్పించిన యూహ—గౌతమీ గంగాభవానీ! నేఁటికి ఫలించినది. నవలలపై నారాటముఁ బొందుచున్న గ్రంథమాలలు విమర్శనమన్న వద్దనును. "శాస్త్రగ్రంథమండలి"కి దయరాదు. పోషకుల మర్జీల ననుసరించుట నాకు రానివిద్య. ఎటుఁదోఁచక, 1926 లోని వేసంగిసెలవు 40 దినములు వృథా చేసితినే యని గ్రంథానంతరముఁ దలంచుచు నెవరిని నమ్మక వీరే సరి యని కమ్మ వ్రాసిన తత్క్షణమే గ్రంథమును మేము ముద్రించుకొందుమని, యుదారభావముతో నానతిచ్చి, లాభమో, నష్టమో దీని భారమునంతయు వహింప నొప్పుకొని, గ్రంథప్రాచుర్యము గొదవించిన బ్రహ్మశ్రీ, శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల ారిని సర్వశక్తియగు భగవంతుఁ డాయురైశ్వర్యకీర్తు తో ననుగ్రహించును గాత! అకారణబంధువులగు వీరికి ందనములు. గ్రంథమున కుపోద్ఘాతమును వ్రాసినవారికి నఃపూర్వకాభివాదనము లర్పించుచున్నాను. గ్రంథగుణా ర్ణయభారము పాఠకుల కప్పగించుచున్నాను.

కే. వేంకటనారాయణరావు.

శ్రీ

# ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము

## ప్రథమఖండము - ప్రాచీనకవిత్వము

### క్రీ. పూ. 23—క్రీ. త. 1000.

---

### [1] ౧. ఆంధ్రులు - ఆంధ్రభాష.

తత్సమసంకలితమగుభాష నాంధ్రమనియు, శుద్ధదేశ్యములను సాధారణముగఁ దెలుఁగనియు సంప్ర. అయినను దేశ్యపదములను ప్రోడీకరించిన గ్రంథమున కాంధ్రనామసంగ్రహ మనియే పేరు. ఆంధ్రత్రిలింగపదములు పర్యాయవాచకము లని తేలినది. కాని, యాంధ్రవిశ్వవిద్యాలయ నిర్మా వసరమున గోదావరినుండి పెన్నదాఁక "తెలుఁగవా ధ్రులే" యనుగర్జనమాంధ్రపత్రికాపాఠకులందఱు విన్నా ఆవాక్యము వాద ప్రతిఫలము. వాదము భిన్నచరిత్ర కిం ప్రాయమువలన గల్గినది. అయినఁ దెలుఁగువా రెవ్వరు ?

---

1 ఆంధ్రుఁ డనురాజువలన నాంధ్రుల కా పేరని భాగవతః రామాయణము దేశపరముగా నాంధ్రశబ్దమును వాడినది. నామనిర్ణయమున దేశజాతులు పరస్పరాశ్రయములు.

[1]కర్నాటకము "కరినాడు" (నల్లసీమ) నుండి జనించిన దనిరి.

"సరసాస్తిలవద్ధావః యత్ర సంతి సహస్రశః
సదేశస్తిలగుర్నామ"

యని తెలుఁగునకు వ్యాఖ్యాన మొనర్చిరి. అటులనే 'తేనె అగు' 'త్రికళింగ' 'త్రినగ' 'తెల్ల అగు' 'తెన్' (దక్షిణము) మున్నగు నర్థవివరణము లున్నవి. జాతి పుట్టుకలో సమాజముగ కుటుంబమునుబట్టి వాడుకపై పేరందును గాని, సభఁగూర్చి యేనామము దగు నని సమాలోచనము చేసికొని ప్రకటించుకొని యుండదు గదా! కావునఁ బైవ్యాఖ్యలన్నియు నధునాతనములు; సనాతనములు గావు.

చరిత్ర కందని యాదికాలముననే తెలుఁగుజాతి యుండుండవలయును. మహారాష్ట్రులలోఁ గొందఱు 'తిలాంగు' పదమును వంశసూచనకుఁ జేర్చికొనుటయు, తెలిఘాణ్యు లని బ్రాహ్మణులలో నొక తెగయుండుటయు, తెల్గుచోడులు, తెలుఁగు నాయకులు మున్నగు మండలేశ్వరులు చరిత్ర కెక్కుటయు, శాసనాదులలోఁ దెలుఁగు, జాతి పరముగా వాడియుండుటయు, పై సిద్ధాంతమును స్థిరీకరించెడు. అటులైనచో "త్రిలింగ" శబ్దమునుబట్టి పిఠాపురమునుండి పెన్నదాఁక నను

1 పాండ్యరాజులనుండి దేశమును జయించి పాలించిన కర్ణరాజుల పేరే యాంధ్రదేశములోనికిఁ జొచ్చుకొని క్రమముగా నుత్తరదిగ్వ్యాప్త మైనందున కర్నాటకమను వ్యవహారము సిద్ధించినది. ఆంధ్రదేశీయులే కర్నాటకులైరి గాన కర్నాటకు లాంధ్రులే.—ఆంధ్రచరిత్రము, మూఁడవభాగము.

మాటయు, "త్రినగ" మునుబట్టి మహేంద్రగిరివఱకు ననుటయు దేశనిర్దేశమున కనుకూలపడవు.

తెలఁగలు, తెలఁగాణులు, తెల్గు నాయకులు ప్రధానముగా నెల్లూరు, నిజామురాజ్యాంగములోఁ గొంత,దత్తమండలము నాక్రమించి యుండిన వారగుటచే, మహారాష్ట్రకన్నడదేశముల నంటియున్న పశ్చిమదక్షిణాంధ్ర భాగమే తెలుఁగుసీమ. మొదటినుండియుఁ గర్నాటకులును దెలుఁగువారును నేకకుటుంబమువలె వసించియుండుటచే, కర్నాటకపదము కేవల రాజకీయవ్యవస్థలచే జన్మించినదగుటచే, విజయనగర సామ్రాజ్యమున నిర్వ్యవకు నవిచ్ఛిన్న బాంధవ్య ముండుటచే వీరిజాతీయతను గుఱించి వాదము లనావశ్యకము. నేఁటిపల్లెలలోఁ గన్నడాంధ్రములు రెండును సమముగా గృహభాషలు గలవా రెందఱో కలరు. కన్నడవాఙ్మయపైఁదమక్కువ మును గలవారు గలరు.

ఈవిషయమును గమనింపఁ దెలఁగాణము మొదట నితరనాడులవలె నొకనాడనియు, బ్రాహ్మణాది భేదము లెన్ని యున్నను, తెలఁగలందఱును పశ్చిమ దక్షిణాంధ్రవాసులే యనియు, వీరి ప్రాముఖ్యమునుబట్టియే తెలుఁగు నాపము భాషకు సిద్ధించినదనియు, [1]అసలు తెల్గుసీమ వీరిదే యనియు పూర్వోత్తరాంధ్రులు తెలుఁగువారు గానేకపోయినను, నేకభాషావలంబకు లగుటవలన, తెల్లంగు లాంధ్రగణములోఁ జేరినదానివలన నన్నదమ్ములే యనియుఁ దేలుచున్నది.

---

1 కీ. శే. కే. వి. లక్ష్మణరావుగారి యాంధ్రపరిశోధకమండలి పంచమవార్షికోత్సవాధ్యక్షోపన్యాసము. ఆంధ్రపత్రికానుబంధము.

కము ఈదేశములలో నెల్లెడలను బౌద్ధజైనమతప్రాచుర్యము నెలకొనినది.) ఆంధ్రు లుత్తరమునుండి చీలిపోయి సామంతులై రేమొ ! ఆఱవశతాబ్దమున [1] జయసింహవల్లభుఁడు వేంగినుండి పశ్చిమతీరమువఱకు స్వతంత్రరాజ్యమునుస్థాపించి ప్రథమ చళుక్యుఁ డయ్యెను. మొదటి పులకేశి (550) వాతాపిని రాజధానిగాఁ జేసికొనెను.

రెండవ పులకేశి దండెత్తివచ్చి (709) పిఠాపురము జయించి తమ్ముని పూర్వచాళుక్యప్రథమరాజగు కుబ్జవిష్ణువర్ధనుని ప్రతినిధిగా నచ్చో నియమించెను. అతఁడు రాజ్యమును స్థిరముచేసి పరమపదించెను. రెండవ పులకేశి పిదప పశ్చిమచాళుక్యరాజ్యము రాష్ట్రకూటుల బరువునకుఁ గ్రుంగిపోయినది. కాని పూర్వచాళుక్యుఁడు విజయాదిత్యుఁడు (799-836) దుర్జయుఁడై రాష్ట్రకూటుల నోర్చెను. సంధి జరిగినది. రాజ్యాశ సంధితో సమయునదిగాదు. గుణగ (గణక) విజయాదిత్యుఁడు (844-888) [2]పాండురంగఁడను (విప్ర) మంత్రి సాహాయ్యముతో, తమ్ములదర్పము త్రొక్కిపట్టి, రాష్ట్రకూ

1 చళుక్యజాతి. బ్రహ్మచళుకమునుండి చాళుక్యులు పుట్టిరఁట. అయోధ్యనుండి యరుదెంచిన విజయాదిత్యుఁడు పల్లవులచే నిహతుఁడయ్యె. గర్భిణియగు నతని భార్య విష్ణుభట్టుచేఁ బోషింపఁబడి జయసింహునిఁ గనె నని గాథ గలదు. ఆంధ్రభృత్య, కదంబ, చాళుక్యులకు మానవ్యసహారీతపుత్ర గోత్రములు సమానమగుటచే మొదట నిది సంకరజాతియై తర్వాత నాంధ్రభృత్యసంయోగము గల్గి బ్రాహ్మణమతానిష్టమై యుండనగు. (పట్టాభిషేక సంచిక).

2 కులప్రశంస. (పట్టాభిషేకసంచిక.)

టులను పరాభవించెను. విశేషకష్టములకు లోనైన చళుక్య భీముఁడు (888-918) ద్రాక్షారామభీమేశునిఁ బ్రతిష్ఠించెను. కాలము కదలిపోయినది.

[తైలపుఁడను పశ్చిమ చళుక్యరాజు రాష్ట్రకూటుల నిర్మూలించి స్వరాజ్యము నుద్ధరించుకొనెను. (923)]. పూర్వ చాళుక్యభీముని మనుమఁడు అమ్మరాజ విష్ణువర్ధనుని (918-925) పిమ్మట జైనులమూలమున రాజకుటుంబమున నంతఃకలహము లుదయించుటచే రాజు లనేకులు మాఱి 927 లో యుద్ధమల్లుఁడు సుస్థిరుఁడయ్యెను. 934 లో నితఁ డంతమొంది మరల రాజు లనేకులు 1000 వఱకు తలలు మార్చిరి. శక్తివర్మ (1000-1011) కాలమున సముద్రవ్యాపారమున నాంధ్ర కీర్తి పేరెములు వారినది. అనంతరము నాలుగేండ్ల కతని తమ్ముఁడు విమలాదిత్యుఁడు (1015-1022) దక్షిణదేశచక్రవర్తియైన రాజరాజచోళుని కుమార్తె కుండలీదేవిని (కుందవాంబను) పెండ్లాడి రాజయ్యెను. [1]పదిశతాబ్దముల చరిత్రము పూర్తియైనది. ఈకాలమందంతయును మతవైరుధ్యముచే దేశము సంక్షుభితమైనది. [2]మొత్తముపై చాళుక్యులు సామాన్య శైవమతస్థులనియే తేలుచున్నది. కుమారిలభట్టు వీరిచే మన్నింపఁబడి వైదిక మత (కర్మ) ప్రచారకుఁ డయ్యెను.

రాజకీయముగా శాతవాహనులది ప్రాకృతభాష. ఆంధ్రుల కుత్తరహిందూస్థానములోని రాజ్యాశ్రయ మడుగంటిన

1 పూర్వచాళుక్యులు. (శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు).

2 చాళుక్యరాజ్యాంగపరిస్థితి.

దాది, చళుక్యులు తలయెత్తినది మొదలు దేశ్యమే ప్రధానముగాఁదొడఁగినది. పాలనమునకే వాసము గోరువిదేశనృపతులకుఁ దప్ప దేశీయులతోఁగలిసి పాలితదేశమే నివాసముగ నుండిపోవుప్రభువులకెల్లను ఆపాలితదేశభాషయే శరణ్యమగుట పాశ్చాత్త్యులను, పూర్వము మహమ్మదీయులను బోల్చి చూచిన విశదపడును. పార్సీ, అరబ్బీ, టుర్కీయున్నగు భాషలను మాటలాడు తురకలు భారతదేశమునే వాసస్థలముగ నంగీకరించినవా రగుటవలనఁ దమభాషకుఁ బ్రాకృతము నూతగాఁగొని తుదకు రెండు భాషలకు వికృతియగు "ఉర్దు" అను క్రొత్తభాషను పెంపొందింపవలసివచ్చెను. అటులనే బ్రాహ్మణమతావలంబులై నిల్చిపోయిన చళుక్యులకుఁ బ్రాకృతమయమగు తెలుఁగు ముఖ్యమైనది. తెల్గుసీమలో "చాళుక్య పరిపాలనారంభకాలములోనే తూర్పుననుండువారికిని పశ్చిమమున నుండువారికిని భాషాభేదము లేర్పడి ముదిరిపోయినందున పశ్చిమమున నున్నవారిభాష హళగన్నడమనియు, తూర్పుననున్నవారి భాష తెళుగన్నడ (తెలుఁగు) మనియు వ్యవహార నామములఁ బొంది ప్రత్యేక సాహిత్యముల సృష్టికి హేతుభూతములై" యుండెను. ఈతెళుగన్నడము ప్రాచీనాంధ్రభృత్యవంశమునకుఁ జేరి సుప్రసిద్ధమై తూర్పునకుఁ బ్రసరించి వేంగి నతిక్రమించి నూత్న సంస్కారములకవకాశమిచ్చినదై యున్కి,[1] యాంధ్రభృత్యరక్తసంబంధముచే నాంధ్రులై యున్న చాళుక్యులకుఁ బ్రీతిపాత్రమైనది. క్రమక్రమముగా చాళుక్యపరిపాలనకాలములోఁ బ్రాకృత పదజాల

1 చాళుక్యుల ప్రశంస. చిలుకూరి వీరభద్రరావుగారు.

సంపర్కముచే వివిధ వైలక్షణ్యములంది ప్రస్తుతాంధ్రముగా పరిణతినొందె ననుట సత్యదూరము గానేరదు. సమంజసము గను ఉన్నది. ఉర్దూ, ఇంగ్లీషు, ఫ్రెంచి మున్నగుభాషలలోని పరిణామసాదృశ్యములను, చారిత్రకసంఘటనలచేఁ గలిగిన భాషావ్యత్యాసములను తిలకించినచో, నాంధ్రులయ్యును శాతవాహనులు [1]వేశ్యమగు ప్రాకృతమునే యుత్తరభారత వర్షమునఁ గైకొను టుదాహృతిగాఁ దలంచినచోఁ దెల్గులిపి యారవశతాబ్దియందే చూపట్టుటయు, కన్నడాంధ్రలిపు లొక్కరీతిగా నున్కియు నాలోచించినచోఁ బైయూహ నిరాధారము గానేరదు.

ఈయూహ ప్రమాదజన్య మనుట కాంధ్రసామ్రాజ్య కాలమునుండియే ఆంధ్రము ప్రత్యేక వ్యక్తిత్వమును వహించి యుండవలయును. లేదా [2]సూర్యానుగ్రహముచే నగ్నిమిత్రుఁ డనువానికి వాక్యము వాయుటవలన నాంధ్రభాష జనించిన దన్నట్లు మొదలగు నపూర్వకల్పనలును, ఆంధ్రాంధ్రీయకాది భాషానామములును గలసీసములను, శ్లోకములను నమ్ముటకు సిద్ధపడి యుండవలయును. కాని, ప్రాచీనాంధ్ర శాసనములలో నొక్కదానికిని 'ఆంధ్ర'భాషయేయన్నఁ బనికిరాక పోయినదా? ఆంధ్రుల తొలిభాష పైశాచికాది ప్రాకృతభేదముల నొక్క

1 పైశాచిప్రాకృతము తమిళమునకుమూలమందురు. ఈపైశాచిభాషలోనే సాతవాహనునిచే నుద్ధృతమగు విద్యాధరచరిత్ర మున్నదఁట. ఈపైశాచీ భాషకును తెల్గునకును సంబంధముండునా?

2 ఆంధ్రవాఙ్మయచరిత్రమున పండిత టి. సుబ్బరాయశాస్త్రిగారి 'భారతి కళానిధి' యనుపత్రికలోనివని విచిత్రవిషయము లున్నవి.

టియై యేయల్పసంఖ్యాకులలోనో యిమిడియుండెనందురా? తమిళాది దక్షిణభారతీయభాషలకే పైశాచిప్రాకృతమని పేరుండినఁదప్ప శాతవాహనులప్రాకృతము తెల్గుకాదుగదా? హాలునిసప్తశతిఁ బట్టి చూచినను ఆంధ్రరాజులది ప్రాకృతమనియేకదా చెప్పవలెను? తమిళకన్నడాది దక్షిణభారతీయభాషాభేదపర్యాయనామమై, పైశాచికప్రాకృతమే యాంధ్రులకు భాషగా నుండెనన్నచోఁ దెళుగన్నడ మందులో నొకభేదమే యగుటచే నింక వాదమేయుండదుగదా? ఎట్లయినను నేఁడాంధ్రమను జనపదమున చళుక్యాంధ్రులు నెలకొనువఱకు నేద్రావిడభేదమో యుండవలయు. ఏదో యనుటకన్న లిపిభాషా జాతివృత్తములచే నితరములకంటె నెక్కుడు సన్నిహితత్వముఁ జూపుచున్న కన్నడముంజూచి కర్నాటక, త్రిలింగభాషల కొకేమాతృక యనియు, నాయాదిభాష[1] హాలె, తెళుగన్నడములుగాఁ జీలి, అందు తెళుగన్నడమే తెలుఁగై పిదప నాంధ్రమయ్యె ననియు సిద్ధాంతపఱుచు టుచితము.

ప్రాచీనాంధ్ర సామ్రాజ్యచ్యుతికిఁ బిదప చిన్న చిన్న రాజ్యములుగా నాంధ్రులు చీలిపోయిరి. చళుక్యులు పాలకులైనది మొదలు వారుండు జనపద మాంధ్రమని వ్యవహరింపఁ

1 “కరణభాష యాంధ్ర ప్రాకృత భాషాభవం బగుటఁజేసి, బ్రాహ్మణక్షత్రియాంధ్రులు తెళుగన్నడమునకు సంస్కృతచ్ఛాయ నెక్కువ గల్పించి యాంధ్రభాషయని వ్యవహరించుచున్నారు. తెలుఁగు భాషకుఁ గరణభాషసంబంధము కర్ణకఠోరముగ నుండుటచేఁ గాఁబోలు త్రిలింగశబ్దభవము తెలుఁగని వ్యుత్పత్తిఁ గల్పించిరి.” చాళుక్య ప్రశంస. చి. వీరభద్రరావుగారు.

బడి, శాసనములు ప్రభుమతానుసారములు, రాజకీయములు గాన వానియందును నితరరాజులు దేశమును ఆంధ్రమనియే ప్రచురించిరి. దండికవీంద్రునివాక్కులలో వేంగినగర మాంధ్రనగర మైనది. చైనాయాత్రికుఁడు యువాన్చాంగు (Hieuntsang) ఆంధ్రమని, మహాంధ్రమని యష్టమశతాబ్దిని బేర్కొనెను. ఇంత జరుగునప్పటికి తెలుఁగులో ప్రాకృత పదములు వెల్లువెరిగి, సంస్కృతవాణికి పుత్త్రికయై పోయినది! ఎన్ని పదములు గీర్వాణజనితములని! ఉత్తరదక్షిణాదికలను దెల్పుటకు దేవభాష శరణ్యమైనది. వైకృత దీపికను జూడుఁడు. ఆంధ్రనామసంగ్రహములో ముక్కాలు మువ్వీసము పదములు తద్భవములే. బ్రాహ్మణవాసన సర్వవ్యాప్తమై పోయినది. కాని, క్రియలు, ముఖ్యవిశేషణములు, జీవితావశ్యకములైన గృహపదములు, సామాన్య విజ్ఞానబోధకములగు శబ్దములు నిల్చియున్నవి. ఇవన్నియు కేవలము సాదృశ్యములు. లెక్కింపఁగూడ దందురా? పామర జనభాషలో వినఁబడు మంచి, చెడ్డ, వచ్చితిని, పోయితిని, మునగ, బీరకాయ, గుమ్మడి మొదలగునవన్నియు సంస్కృతజన్యము లేనా? ఆర్యు లెక్కువగారు, ద్రావిడులు తక్కువగారు— ఎవరిమట్టుకు వారే ఎక్కుడు. ఇర్వురివి ప్రాచీననాగరకతలే. సత్యాన్వేషణమునకు దిగినప్పుడు, [1]ద్రావిడార్య సమ్మేళనము ఆంగ్లసాక్సనుల కలయికవలె నిబిడమై యవిభాజ్యమై పోయి నప్పుడు మననాళములలో నిప్పురిర క్తము నేకమై పవి

1 ద్రావిడాంధ్రులందఱు దస్యులలోఁ జేర్పఁబడియుండిరి- ద్రావిడ శబ్దము ప్రయోగింపఁబడినది.

శ్రమై ప్రవహించుచున్నప్పుడు యే [1] కాల్డ్వెల్లునో దూషించి దురభిమానావేశమునకు నిలయులమై, కక్షలు పెంచుకొనుట యసంగతము. మనము పూర్తిగా దాక్షిణాత్యులముగాని, యౌత్తరాహులముగాని కాక రెండునాగరకతలును సమన్వయము నొందినభరతఖండమధ్యపీఠభూమియందు, గోదావరి కృష్ణా పినాకినుల తీరములందు వసించువారమగుటచే మన జాతీయత కర్ణాటక మహారాష్ట్రములకు జన్మభూమియై యతి ప్రాచీనమైనందుచే మన కాతగవులు వలదు. నర్మద కుత్తరమున నార్యరక్త మెక్కువగను, కావేరీ తీరమునుండి ద్రావిడరక్త మెక్కువగను నుండవచ్చును. కాని, మనలో హెచ్చుతగ్గులు లేవు. ద్రావిడార్యజాతీయవిజ్ఞానవాహిను లెదుర్కొని, కేంద్రీకృతములై యొక్కటియై ప్రయాగనుండి పాఱు యమునాకలితగంగాతరంగిణిని బోలి ప్రవహించినది. శాతవాహనుల నుత్తరమున నాటితిమి. దక్షిణమున కులోత్తుంగచోళునిఁ బ్రసాదించితిమి. అట్టిమహోత్కృష్టాంధ్ర జాతికి నమస్కారములు. సంస్కృతప్రాకృతోషస్సు తెలుగన్నడాకాశమునఁ దోఁచి కాలగర్భమున నాంధ్రజాతీయ విజ్ఞానరవిబింబమవై, శైశవ పోషణస్నేహోపలబ్ధ మాతృదేవీమూర్తి గీర్వాణియు, చిరంతనసహవాసమాన్యయగు కన్నడవాణియు నిర్వంకల నలంకరింప వెలయునాంధ్రభారతీ, నీకు జయము ! జయము !

---

1 కాల్డ్వెల్లు వ్రాసిన "Comparative Dravidian Grammar" నాంధ్రీకరించినఁ గాని దాని మంచి చెడుగు లెల్లఱకుఁ దెలియనేరవు. (మానవుఁడు మొదట నేర్చుక్రియాపదములే సంస్కృతములు గానప్పుడు భాషను సంస్కృతజన్య మనుటెట్లని యతనివాదము.)

## ౨. కవి, కావ్యము, వాఙ్మయవిమర్శ

"ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞస్సంఖ్యావాన్ పండితః కవిః" అన్నాఁడమరసింహుఁడు. "కవతే సర్వం జానాతి, సర్వం వర్ణయతి, సర్వం సర్వతో గచ్ఛతి వా కవిః" అని శబ్దకల్పద్రుమకర్త నిర్వచించినాఁడు. "క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వదంతి" యని కఠోపనిషత్తు వర్ణించుచున్నది. "రససిద్ధాః కవీశ్వరాః" అని తజ్జ్ఞులు పొగడిరి. [illegible] కవి భావనాప్రపంచమునకు సృష్టికర్తయని ప్రాజ్ఞులు వక్కాణించిరి.

ఈ నిర్వచనములన్నియు నొకేవిషయమును ఘోషించుచుండలేదా? కవిత్వ పథము దుర్గమముగాన, కవి సర్వజ్ఞుఁడన్నమాట సిద్ధించినది. సర్వజ్ఞుఁడు గాక పోయినను కవియందుఁ దత్పరిస్థితికి వలయు బుద్ధివికాస మున్నది. ఈబుద్ధివికాసము ధీరులకు సామాన్యగుణము. యుద్ధరంగము[illegible]నై వీరరసాతిరేకమున విక్రమించుయోధుఁడును, లోకుల పాపములకు పశ్చాత్తాపము వహించి సర్వసంగపరిత్యాగియై మతోద్ధరణమున [illegible]కర్తయు ప్రజాసౌఖ్యమునే సౌఖ్యముగా నెంచి తదేకదీక్షతోఁ బాలించు నృపతియు, స్వానుభూతితో, సహజోద్రేకముతో, తనంతటనుప్పొంగి వెలువడు నిసర్గమధురభావతరంగిణీఘుమఘుమారవములతో [1]లౌకిక ప్రకృతిరంగములలోని వివిధ సాదృశ్యములను వర్ణించుకవియును, ప్రజ్ఞలోఁ దుల్యులు గారా? కార్యకాలరంగములు భిన్నములైనవి గాని బుద్ధియొక్కటియే గదా! యవనసేనానాశనముఁ జేసి ధర్మముద్ధరించిన విక్రమార్కునందు, రాజ్యత్యాగియైన బుద్ధునియందు, యశోవిశాలుఁడైన యశోకునందు, ఆదికావ్యకర్తయగు వాల్మీకియందు, సత్యమైన కవి పూజ్యుఁడైనాఁడు; లోకమాత వానిపై పూలసోనఁ గురిపించినది.

ప్రతిభావ్యుత్పత్తులు కవికావశ్యకములు. సమయస్ఫూర్తియే ప్రతిభ- నవీనకల్పనాపటుత్వమునకు ప్రతిభ మూలము. ప్రతిభ దైవదత్తము. బహు

1 Nature and Human Nature.

జ్ఞతయు, నుచితానుచితవివేకము వ్యుత్పత్తినాఁబడు. సందర్భశుద్ధికి, వస్త్వైక్యమునకు వ్యుత్పత్తిమూలము. వస్తుపరిశీలనచే వ్యుత్పత్తి లభించును. ప్రతిభావ్యుత్పత్తులు పరస్పరాశ్రితము లని తజ్జ్ఞుల యభిప్రాయము. రెండుఁగలవాఁడే కవి. సారాంశము ఏమనఁగా.—

"ప్రకృతికిఁ భాష్యప్రణేతల్ కవుల్"

1 కవులు మూఁడువిధములు: శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి. ఉభయకవికి మొదటియిర్వురకు నుపకార్యోపకారకసంబంధ మున్నది. వీరి నుత్తరోత్తరము శ్రేష్ఠులన నగును. అయిన నెవరిగుణములు వారివని విజ్ఞులందురేమో! కావ్యకవికవిత ఎన్మిదివిధములు. రచనా శబ్దార్థాలంకారోక్తిరసమార్గశాస్త్రార్థకములు. వీనిలోఁ మూఁడుగుణములు గలవాఁడు సాధారణుఁడనియు, నైదుగుణములుగలవాఁడు మధ్యముఁడనియు, నేడు (అన్ని) గుణములుగలవాఁడు మహాకవియనియు నిర్ణీతము.

బుద్ధి తదనుగుణక్రియారూపముగ పరిణమించుట కర్మ. కర్మ ననుసరించి కర్తకు మాన్యత గల్గును. సత్కర్మను ప్రజ లభినందింతురు. అసత్కర్మను నిందింతురు. వ్యక్తిజీవనము సంఘము నవలంబించినదిగాన, నొకనికర్మవు కనం

1 చూ. రాజశేఖర కవి కావ్యమీమాంస.

కవిభేదములు:—1 'కావ్యవిద్యాస్నాతకుఁడు' గురుకులవాసి. 2 కవితను రహస్యముగఁ జెప్పుకొనువాఁడు. 'హృదయకవి' 3 పండితభీతిచే మారుపేరు గలవాఁడు 'అన్యాపదేశి' 4 (పౌరస్త్య కవితా) మార్గము నవలంబించును 'సేవిత.' 5 శక్తియుండియు కవితఁ జెప్పఁడు 'ఘటమానుఁడు' 6 సకలవిధకవిత్వనిర్మాత 'మహాకవి.' 7 దేశీయములగు నన్యభాషలఁ దత్తదుచితరసోద్రేకముతో కవితచెప్పు ప్రౌఢ'కవిరాజు' 8 మంత్రాదిదైవిక బలాగతకవిత్వశక్తి'ఆవేశికుఁడు' 9 ఆశువుగాఁ దలఁచునప్పు డల్లువాఁ 'డవిచ్ఛేది'. 10 కన్యకాదులవిషయమై సంక్రమించు కవితగలవాఁడు 'సాంక్రామయిక'.

తఁబోక, పడినచోటనేకాక నూతిలోని నీటినంతయుఁ జలింపించు శిలాశక
లమువోలె సంఘమున కభివ్యాప్తమగుచున్నది. కాఁబట్టి ప్రజకు వ్యక్తిత్వ
నడ్డుపెట్టుటకు నవకాశము, నధికారము గల్గుచున్నది.

రాజుయొక్క కర్మాగారము రాజ్యము; కవియొక్క కృతి కావ్యము.
రాజ్యౌన్నత్యము రాజునకును, కావ్యపటిమ కవికిని గౌరవకారణములు. కావ్య
రూపమెఱుఁగుటకుఁ దల్లక్షణకథనము కర్తవ్యము. లక్ష్యమునుండియే లక్షణము
తెలియుచున్నది. తెలిసిన లక్షణప్రణాళికను జూచి మొదటి మానవుఁడు
ఋతుధర్మ మెఱిఁగినాఁడు. ఆఋతుధర్మములన్నివృక్షములకును నొకేరీతిగా
నన్వయింపవని విశేషలక్ష్యముల విమర్శచే నిర్ధరించినాఁడు. భాషాస్థితి నను
సరించి శబ్దానుశాసన మవతరించినది. శబ్దానుశాసనము భారతప్రయోగ
ములచే సంస్కరింపఁబడినది. తర్వాత ప్రయోగములచే నదియు సరిపడమి
నూతనవ్యాకృతినిర్మాణము గావలసివచ్చుచున్నది. కావున లక్ష్యలక్షణము
లన్యోన్యాశ్రయములని తేలినది. ధ్వన్యాలోకదశరూపకములు నిట్లు లక్ష్య
ములయాధారముపైననే యుదయించినవి. కాన కావ్యపరీక్ష దిఙ్మాత్రముగాఁ
జేసి లక్షణము లరయుదము.

ఆద్యులు మహాకవులు నగు వాల్మీకియు హోమరుఁడును (Homer)
మనకు నాదర్శప్రాయులు; ప్రాచ్య పాశ్చాత్త్య కవితాచార్యులు. వారికి
ప్రాచీనములు వేదములు. వాని నపౌరుషేయము లనిరి. ప్రభువుల భవ్యసందే
శములని వాని నట్లనిరేమొ! అది యట్లుండఁ గావ్యబీజము వేదములలో
మొలకెత్తినది; తిన్ననితీగ సాగినది; మొగ్గదొడిగినది. కాని యింకను పువ్వు
ప్రఫుల్లము గాలేదు; వలపులఁ గ్రమ్మరింపలేదు. జ్ఞానమహావట మింతలో
పెల్లుపెరిగి యుపనిషత్తులను నూడల కిరవైనది. ఆనీడలో, ఆతార్కిక ప్రసం
గములలో, ఆమనీషాగ్రీష్మాతపములో వానలేక వాడిపోవుచున్న కావ్యలతా
మతల్లిని వాల్మీకి వేఱుగాఁ దెచ్చి ప్రోదిసేయఁ దొడంగెను. ప్రకృతిచిత్ర

ములను, ప్రచండాతపమును, ప్రావృట్కాలపయోదములను, శరదృతువందలి తెలివెన్నెలలను, శిశిరమందలి పుష్పాడిని గమనించి సముద్రఘోషములను, ఉషస్సౌందర్యమును, హిమవదున్నతిని వీక్షించి వసంతకోకిలగానములతో మేళగించి వేదయుగములోని యార్యులు భీతితో, ఆశ్చర్యానందరసావేశముతో, పాడినపాటలే ఋక్కులై కావ్యోత్పత్తిని సూచించినవి. అఖండకావ్యములనే వాల్మీకి యఖండకావ్యముగ మార్చివైచెను.

వేదములో విషయానుభూతియుండుదనుక కవిత పరుగులు వారినది. విషయవిమర్శ మొదలిడుటలోఁ దర్కము తలయెత్తినది. ఆనందగానము దానిలో మాటుమణఁగినది. ఒకటి ప్రకృతిస్వభావప్రదర్శకము; మఱొకటి తద్విషయకజిజ్ఞాస. ఒకటి సృష్టికి ప్రతిబింబము, వ్యక్తిభావ సమ్మిశ్రితము; ఇంకొకటి సత్యతత్త్వాన్వేషణము, వస్తువిమర్శ, సాదృశ్యనిశ్చితము. కళ జన్మించినది. పిదప శాస్త్రము పుట్టినది. కళాశాస్త్రభాగములుగ విడిచి పాఱిన వేదసరస్సునుండి వాల్మీకి త్రవ్విన మార్గమువెంట కావ్యనది నడచినది.

కావ్యము కళామయమని తేలినది. వేలకొలఁది వత్సరముల కాలము గడచినను ఆర్యులనాగరకతను గంగాసింధుపరిసరములను మన మనశ్చక్షువుల యెదుటకుఁ గొనివచ్చు ఋక్కులను పరికించి ప్రజాప్రకృతిసమాలోకనము చేఁగల్గు నిసర్గపారవశ్యమును, ఆనందతత్త్వమును యథాస్థితిగా ప్రదర్శించి పాఠకుల కట్టియావేశమునే పుట్టించు చమత్కృతిని 'కళ' యందము. కావున తత్కృతి—కళ—యుండవలయుననియే లాక్షణికులు "రసాత్మకం వాక్య"మనియు, "కవిత్వశక్తిస్తు రసాత్మకవాక్యనిర్మాతృత్వ"మ్మనియుఁ బల్కిరి. ఆరసమును నిఘంటుకారులు "రస్యతీతి రసః, రస ఆస్వాదనే" యని నిర్వచించిరి. తద్రసము భావావేశమునఁగాని జనింపదు. వస్తుసందర్శనమునఁ మనోవికారమే భావము.

"సుఖదుఃఖాదికై ర్భావైః భావ స్తద్భావభావనమ్."

మును సజీవముగా సాకృతిగా సాక్షాత్కరింపఁజేయునది 'కళ'.

1 కళాధర్మము రసోత్పాదనమైనది. ప్రకృతిని జూచి యానందించి యా ఆనందమును ప్రదర్శించి తల్లీనతను ఘటించినది గాన, కళ మూలానుకరణప్రతిసృష్టియైనది. అట్లగుటవలన అనుభూతాననుభూతవిషయైక్యమునకు సాక్షాత్కారపరికరములతో నవకాశమిచ్చినది. "అనుకరణమునకు పరిశీలనము ముఖ్యము. భావనాబలము సృష్టికి ప్రధానము. భావనాబలపరిశీలనములు పరస్పరాశ్రితములు. ఇవి జీవికాప్రధానములగుచో ఫలితకళలకు నైత మావశ్యకములు. ప్రతిఫలము నిచ్చునది ఫలితకళ. అఫలప్రేప్సు కర్మకాస్పదమైనది లలితకళ. ఫలితకళ విహితవ్యాపారప్రయోజనమునకును, లలితకళ జీవితతత్త్వపరమఫలానుభవసౌందర్యానందమునకును నేర్పడినవి. కావ ఫలితలలితకళలు భుక్తి ముక్తి వరుసలో నున్నవి.

2. కొందఱు కళను ఆదర్శకమనియు, కాల్పనికమనియు, యథామాతృకమనియు విభజించిరి. ఈవిభజనను బట్టియే కళను అనుభూతాదర్శప్రదర్శకమనియు, సృష్టియనియు, ననుకరణమనియు నిర్వచించిరి. కవి దృశ్యమో అదృశ్యమో ఏదైనను సరే మూలభూతమగు భావమొకటిని గైకొనియే, 3 కార్యకారణశ్రేణీబద్ధమైన యూహతో పునస్సృష్టిగా మార్చుచున్నాడు. ఉత్తమకళయందు సత్యసౌందర్యములు (Truth and Beauty) రెండును ఇమిడియున్నవి. అనుకరణపరిశీలనములు లేక సత్యమును, ప్రతిసృష్టిభావనాబలములు లేక చిత్తవశీకరణప్రవణమగు సౌందర్యమును పుట్టవు. కవుల భావతారతమ్యములంబట్టి యథామాతృకకల్పనాదర్శము లుత్తరోత్తరము నుత్తమలగువానిలో పూర్వోక్తములు గర్భితములుగాన నుత్తరోత్తరములు శ్రేష్ఠములు.

---

1 ఆంధ్రపత్రికా సారస్వతానుబంధములో దుందుభి మొదలుగాని ప్రకటింపఁబడిన లలితకళలపై వ్యాసములు.

2 Ideal, Creative & Realistic arts.

3 Imagination disciplined by reason.

[I]రెండు మూఁడు నొక్కచోఁ గలియుట సహజము. కాన, నీవిధము

---

1 "నిన్న వలపులఁజిమ్మిన నేను నేఁడు
క్రొత్త విరిచేడియలరాక నొత్తిగిలితి
వనిని విచ్చిన పూవుగా పరిఢవిల్లి
ప్రబలకాలవశంబున పాడువడితి. ౧
సంజకెంజాయ నింగిలోఁ జాఱువేళ
జవ్వనులు నన్నుఁ గాంచి విచారగీత
ములను బాడుచుఁ బాతిరి భూమియందు—
లలితసౌందర్యరమణీయలయ్యు వీరు
నావలెనె పడుదు రని నవ్వుకొంటి! [?] ౨
నళినమిత్రుని యనురాగనవ్యకాంతి
చలువ సెలయేటి మర్మరస్వనము లుర్విఁ
బ్రసవనాళంబులను డించు ఫలరసంబు
నిప్పు డనుభూతవాసన స్మృతికిఁ దెచ్చె
కర్మఫలమొక్కటియె ఱక్కఁగాలధాటి
కితరములు నిల్వవేవియు నింతులార,
మీదు పరిణామ మిదె యని మిన్నకుంటి." ౩

ప్రథమభాగము యథామాత్రకము; ఉన్నదున్నట్లుచెప్పినది. ద్వితీయభాగమున భావనాప్రపంచములోని యొకానొక మరణసాదృశ్యమును బుష్పపతనముతో మేళవించి కవి యభూతకల్పనకుఁ బాల్పడియె. ప్రశాంతసాయంసమయము తోఁచినది. ఉపజ్ఞలేనికళ యసార్వరస్యముగదా! తృతీయములో అనుభూతావలోకనమైనది. ప్రసవనాళములో ఫలరసమెక్క ఫలోత్పత్తియే పుష్పాంతమై పరిణామతత్త్వము నిరూపితమై యాదర్శము వెల్వడినది. అనుకరణకల్పనాదర్శము లొక్కచోఁగూడ లేదా? ఇది వ్యక్తికావ్య పరంపరలోని కథనము.

మును విషయవిభజనముతో నైక్యమొనర్చి [1]నిర్గుణైకభావయుతమును స్వహృదయాందోళనమాత్ర ప్రదర్శకమును నగు భావగీతమును, లోకవృత్త ప్రదర్శనముచే సగుణమై వివిధభావసంఘర్షణపరిణామమును దెల్పుకావ్యమును, జాతీయాదర్శజీవితధర్మభావసర్వస్వసంయోజితంబగు మహాకావ్యమును, నుత్తరోత్తర ముత్తమంబులనవలయు. (ఘటకర్పరము, అభిజ్ఞానశాకుంతలము, రామాయణము దృష్టాంతములు.)

కావ్యకళ సుఖదుఃఖచక్రదర్శనానుభవభావపరిశీలనమునఁ జీవన విశ్వకల్యాణైకసత్యమును, తత్సత్యమందలి జీవితాభావుక మగు నానందమును సువ్యక్తపరచును. ఇతరులకుమఱుఁగైన ప్రకృతిసత్యముల వెల్వరించును.

"విశ్వశ్రేయః కావ్యమ్" అని కదా జనశ్రుతి.

క. "కలిమిగల లోభికన్నను, విలసితముగఁ బేద మేలు వితరణి యైనన్
జలచలమ మేలుగాదా, కులనిధి యంభోధికన్న గుహ్వలచెన్నా."

యను కందములోని భావ మెందఱకో సముద్రమును, చెలమను జూచిన వారికయినను స్ఫురించి యుండదుగదా! కాఁబట్టియే

"రవి గాంచనిచోఁ గవి గాంచునే కదా."

యనుచాటూక్తి కెడమైనది. అట్టిప్రకృతిరహస్యదర్శనదక్షత లేకున్నఁ గవియే కాఁడు.

ప్రకృతము ననుసరింతము. వాల్మీకి యొకరాజకుటుంబమునుగొని, విషయముఁ బెంచి, దానిలో భారతవర్ష జీవితమును బ్రతిఫలింపఁజేసెను. రామకథ విఖ్యాతము. కథన మవసరములేదు. సామాన్యగృహచిత్రములోఁ దలిదండ్రులు, భార్యాభర్తలు, అన్నదమ్ములు, ప్రభుసేవకులు ఎటులుండవలసినదియు, ప్రీతి భక్తి ధైర్య పరాక్రమాదిప్రవృత్తులను మహోజ్జ్వలముగా

[1] Essays in criticism—M. Arnold (Abstract and Subjective Lyric, Objective Poetry, Epic.)

నిమిడ్చినాఁడు. గృహధర్మ మార్యులకు మూలధర్మము—ఉద్దీప్తమైనది. శాంతరసాత్మకము, కరుణాశ్రుప్రవాహలలితము, సుప్రతిష్ఠితగృహసింహాసనమునైన రామాయణము వివిధప్రకృతివర్ణనలతో మేళగింపఁబడి, పాత్రల స్వభావానుగుణములతో నడచి, మానవనైసర్గికప్రకృతుల సత్యమును, దాని యందలి విశ్వకల్యాణైకానందమును భారతీయుల కొడఁగూర్చినది. కావుననే ఘటనాపరంపరలచరిత్రమువలె శిథిలమై భరతఖండ చిరంతనేతిహాసమైన రామాయణము విస్మరింపఁబడలేదు.

రామాయణమున భారతీయగృహధర్మము ధ్వనించుచున్నది. కావ్యము ధ్వనిప్రధానము. కావ్యమునకు ధ్వని జీవము. వ్యష్టికవితలో నుండి విశేషముచే ధ్వని గల్గుచున్నది. కాంతాసమ్మితము లగుటచే కావ్యములు, కళామాధుర్యముచే మఱపించి నీతిధర్మశిక్షను జేయుచున్నవి. (నీతి శిక్ష కళాస్ఫూర్తియే. కలకవితకు పరమోద్దేశ్యము గాదు. నీతిశిక్షయు నొకకావ్యాంగము.) ధ్వనిచే మన యూహాప్రపంచము వెలిగింపఁబడి యనుభూతములుం స్మృతికిఁ దట్టి ప్రకృతి నీతితత్త్వములు విస్పష్టము లగును. ధ్వనినిబట్టియే—

"చమత్కారజనకభావనావిషయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్."

అనిరి.

జగద్విహితకల్యాణ [1]సౌందర్యములను విశ్వభావనావిలాసమును ప్రజ విస్మరింపదు. విశ్వభావనము లేనిచో సత్యము స్ఫురింపదు. ప్రకృతిసత్య మెప్పుడును నొకేవిధముగ నున్నది. కాలదేశరూపములు మారవచ్చును కాని భక్తుఁడు ఆరాధించుచునే యున్నాఁడు. తల్లి శిశువును ప్రేమించుచునే యున్నది. కాలవశము గాక తక్కినేని యాకావ్యము బృహత్తర మైనదే! వాల్మీకి రామాయణము వోలె హోమరుని 'ఇలియడు' (Illiad), 'ఒడిస్సీ'

---

1 శుచియైనది సత్యము. సత్యసౌందర్యము లవిభాజ్యములు; నిత్యసంయుక్తములు.

(Odyssy) యనుకావ్యద్వయి పాశ్చాత్యహృదయాంతరాళములఁ బొంగి తజ్జాతిని బునీతము సేయుచున్నది.

పైచర్చనుండి కావ్యమునకు [1]కళ, ధ్వని, విశ్వమానవభావములను గల్గుస్థిరత, ప్రపంచకాంతికి సూర్యచంద్రప్రకాశములవలె నావశ్యకములని సూత్రింపవచ్చును.

కవికావ్యకళాశబ్దము లింతవఱకు నుత్తమకవికావ్యకళయందే ప్రయుక్తములైనవి. కావ్యములు రెండువిధములు: వ్యక్తిసంబంధములు; జాతిసంబంధములు. జాతిసంబంధములగు ఇతిహాసముల (Epics)లో వ్యక్తి గాన్పింపదు. రఘువంశాంధ్రభారతములలో కాళిదాస తిక్కనల సిద్ధహస్తములు గన్పడి నట్లు రామాయణభారతములలో వాల్మీకి వ్యాసులు మచ్చునకేని గాన్పింపరు. [2]అసంపూర్ణలక్షణములుపట్టిన కావ్యములను, గుణలోపములనుబట్టి విభజింప నగు. అప్పకవీయము ననుసరించి వివేకి, వాచిక, రాచి, శార్ధ, శిల్పి, ధూషణార్థి, మార్దవులను కవుల కావ్యములు ఏడువిధంబులయినను, దోషాధికతచే విలువ తగ్గుచున్నది. రసాపకర్షంబులన్నియు దోషములే. మిగిలిన కావ్య శిల్పపరీక్ష పాఠకులది.

. . కాలక్రమప్రవర్ధితమగు నిట్టికావ్యాదిగ్రంథపరంపర వాఙ్మయమగు చున్నది. వాఙ్మయము వాక్కులచే నిండినది. (వాక్కు లర్థవంతములు గావల యునని నుడువనక్కఱలేదు.) శాస్త్రములు, శ్రుతిస్మృతులు, చరిత్రము మున్న గునన్నిరచనలు వాఙ్మయములో నీయర్థము ననుసరించి చేరును. కనుక క్రిమి నల్ లా ప్రొసీజరును, గజేంద్రమోక్షణము టీకయును చేరవలసియుండును. వాక్కులన్నియు వాఙ్మయ మనుట నిరాకృతముగా నేరదు; కాని సమాదరణీ

---

1 Art, Suggestiveness and Permanence.

2 రామాయణభారతము, లేకకర్తృకములు గావని వాదములు గలవు. రామాయణముమాత్ర మొకనిదే యనవచ్చును. విషయము విమర్శనీయము.

యము గాదు. అర్థవత్తర మగు వాక్సముదాయ మన్నను గణిత వేదాంతములను విడుచుటకులేదు. విడువకున్న కళాశాస్త్ర విభాగమే యవసరము కాదు. కాన నించుక సంకుచితదృష్టి యవసరమగుచున్నది. కళాకాంతితోఁ జెలిమి యొనర్చి యున్నతభావసుమములతోఁ గై సేసిన గ్రంథకలాపమే వాఙ్మయమననగు. అది చరిత్రగాని, శాస్త్రముగాని, పద్యముగాని, గద్యముగాని కళాభిజ్ఞున కొక్కటే!

(కవులు సాధారణముగా పద్యమును వాడిరి. కవిత కదియే ఎక్కుడనుగుణమనియేమో ! అయినను బాణుని కాదంబరి నేమనవలయును? భావనాశక్తికాని పద్యరూపము గాదుకదా కవితను నిర్ణయించునది!) మహాకవికి మాటలే ఛందోబద్ధములై రానగును. రసహీనమైన రచన ఛందోబద్ధమైనచోఁ గావ్యమగునా? భావశూన్యత గల్గినప్పుడే పద్యగద్యముల గడబిడ. ఇండ్లన్నింటికి వాస్తుశాస్త్రావశ్యకత యున్నను భారతీయశిల్పమున కజంతాగుహాదికశిల్పములే ముఖ్యమై ధనికులవైనను నగరములలోనివి లెక్కింపఁబడనట్లు వాఙ్మయమున నుత్తమభావగ్రంథశ్రేణియే గణనీయమైనది.

విశ్వైక్యభావమును, సుశైలియు నుత్తమవాఙ్మయలక్షణములు. విశ్వైక్యభావ మున్ననేకాని సర్వమానవాంతఃప్రకృతిప్రకటీకరణ మలవడదు. వాఙ్మయమున విశ్వభావనము విషయ సామ్యమును జాటుచుండఁగా, శైలి ప్రత్యేకముగ వ్యక్తిప్రత్యేకతను సూచించుచున్నది. తిక్కన వ్రాసిన యభిమన్యుమరణసందర్భమును జదివి కన్నీరుగార్పని వీరప్రసువెవతె! "ఊహా కలంగి జీవనపుటోలమునం బడి" నతత్త్వజిజ్ఞాసు వెవఁడు గజేంద్రాక్రందనఘట్టమునందలి పోతన్నకవితను జదివి పారవశ్యమును వహింపఁడు! సుఖ దుఃఖ ప్రేమ ద్వేష మోహ తాపములు మొదలగు మనోవికృతులు సర్వసమములు. కాలనియమము లేక పాఠకుల నైక్యభావములు తారసిల్లిన కథానకములందు లీనులఁ జేయుట, వాఙ్మయపరమావధియందు ప్రత్యేక వ్యక్తుల

మనస్థితులు ప్రత్యేకములే కాన ననుభవములు వేఱుపడుచుండును. వారి యనుభవము లవ్యక్తముగాఁ బ్రతిఫలించుచుండును. ఆప్రత్యేకతను శైలి రూపించును. ఉక్తివిశేషమును శైలియనుట లెస్స. ఉక్తివిశేషమే కావ్యమను నిర్వచనముఁ దిలకించిన శైలి ప్రాముఖ్యము దెలియును. "శైలి భావప్రకాశకము. శైలి భావము. ఇవి వియోగములేని ద్వంద్వము." స్వభావము ననుసరించి యొకనిది యుపమాసక్తము; ఒకనిది స్వభావోక్తిప్రాచుర్యము. కాన రచనాసంవిధానమే శైలి. వివిధకవులశైలులను పరీక్షించియే యాలంకారికులు, ధ్వనిని, కైశిక్యాది వృత్తులను, వైదర్భీప్రభృతి రీతులను, పదసన్నివేశనిష్కంపతయే లక్షణముగాఁగల ద్రాక్షాది పాకములను, శ్లేషాదిగుణములను ఇద మిత్థమని శాసించిరి. లాక్షణికుల శాసనములనే తలఁదాల్చి వానికొఱకై కవితసేఁత రసాభాసము. రసావేశముతోఁ గూర్చుచు, దానికి తోడుగా మాత్రమే లక్షణములను పరిగ్రహింపవలెను.

భావవిస్పష్టతకై సాదృశ్యోద్దీపకము లగు నుపమాద్యలంకృతులు గావలయును. కాని, యలంకారముల గారడీని జూపుటకుఁ గృతి యేర్పడఁగూడదు. సందర్భౌచిత్యభంగముగూడ లక్షింపని "యలంకారము లనావశ్యకములు." కళాపుష్టిపైఁ గవిదృష్టి నిలిచినచో నలంకృతులు దమంత వచ్చియుండును. భావములను వీడి లక్షణములకు వెఱపడువ్రాఁత నేలవిడిచి చేసిన సాముపంటిది.

ప్రాచీనులు భావతత్త్వమును మథించి నవరసములను, దశావస్థలను, త్రయస్త్రింశద్భావములను కనుఁగొనిరి. కావ్యాలంకారగ్రంథము లన్నియు శైలి, భావము నను నీరెంటినే చర్చించినవి. కావ్యలక్ష్మికి శబ్దార్థములు తనువు, ధ్వని జీవము, అలంకారము లలంకారములు. ఏసొమ్మెపుడు వలయునో, యేగుణము నైసర్గికమో, యేవృత్తి యుచితమో, తెలిసి విషయానుగుణ్యముతో నడుపు రసాత్మకవాగ్విధానమే శైలి; భావమే వి

గాన నదియ కావ్యశరీరము. కవిత్వతారతమ్యనిర్ణయము శైలిపై నాధారపడి నది. గాన, నదియ కావ్యాత్మ.

కవిస్వభావసిద్ధమైనదగు శైలిని కావ్యాత్మ యంటిమి. కావ్యములో కవియున్నాఁడు. కవివెనుక జాతియున్నది. ఆజాతిని సాంఘిక ధార్మిక వాతావరణము లండఁగొని యున్నవి. కవిజీవితములో పాటు కవికాల దేశపరిస్థితులను గమనించినచో కావ్యసందేశము బయల్పడును. కవికృతి వ్యక్తిజీవికా ప్రతిబింబిత సంఘజీవనమే గదా !

'చరిత్రమున్నది గదా జీవికానిర్వహణమునకు! కావ్య మనావశ్యక' మనియందురు. ఇట్లనుట లోకవిరుద్ధము. ఏలనన, ద్వివిధమగు మానవస్వభావములో బాహ్యప్రకృతిని చరిత్ర విశదీకరించును కాని, యంతఃప్రకృతిని వర్ణించుటకు తనకుఁ దెలియకరయే సంఘశీలమును జిత్రించు కవియే దక్షుఁడు. అంతఃకరణములో నణఁగిన యాదర్శములే మానవచరిత్రలోఁ గ్రియారూపము నఁ బరిణతి నందినవి. ఉద్దేశము తర్వాత క్రియ. సంకల్పమునకు పూర్వము కర్మ మెక్కడిది? సంకల్పస్వప్నపరంపరలో మానవుని యర్థజీవిత మంతర్హిత మగుచున్నది. పడవపాటలు, పంటకోఁతపాటలు, పల్లెటూరి యక్షగానములు, రాత్రిళ్లఁ దండానపదములు—ఇవన్నియు నూహాగానములలో మానవునకుఁ గల మక్కువను దెల్పవా? కావుననే కావ్యములు చరిత్రకన్న నుత్కృష్టములు.

వాఙ్మయము కేవల మూహాగానమని దాని ప్రాముఖ్యమును గొంద ఱు నిరసింతురు. ఎంత యవివేకము? భారతీయరాజ్యభానుఁడు పశ్చిమదిశఁ జేరి వేయి సంవత్సరము లైనవి. ఋషులు లేరు; రాజులు లేరు; చక్రవర్తులు లేరు. కాలచక్రము గిఱ్ఱునఁ దిరిగి పోయినది. భారతీయ నాగరకతను వాఙ్మయ మొక్కటే వజ్రపేటికయై పదిలపఱచి యున్నది. ఉపనిషత్కర్తల యాధ్యాత్మికోన్నతి, చాణక్యుని రాజనీతి, శంకరుని ప్రజ్ఞా

తీవ్రత, భాస్కరుని గణితశాస్త్రపాండితి, అదియిది యననేల? భారతీయ విజ్ఞానకీర్తివాసనల వెదచల్లునది వాఙ్మయము గదా! ప్రాచీనార్యుల పవిత్ర సందేశములు, దివ్యాదర్శములు నుపనిషద్రామాయణములవలనఁ గదా నేటికిని వినఁబడుచున్నవి? ఒక్క ఆదర్శభావమే జగతిలో శాశ్వతమైనది. కాననే రామాయణోపనిషత్కళాజ్యోతి ధన్యమై సుసేవ్య మగుచున్నది.

వాఙ్మయీ సాక్షాత్కారసిద్ధికై సక్రమ విమర్శనాంజన ముండవలయును. కావ్యమువలె సత్యాన్వేషణ మూహాగానము గాదు. ఈ క్రిందివి లక్ష్యము లగుట సమంజసమేమో!

1. విమర్శనము కవియాదర్శనములనేకాక, కావ్యప్రతిబింబిత మగు సంఘచరిత్రమును వ్యక్తీకరింపవలయును.

2. పిల్లలజోలపాటలు నేఁటి విస్తృతగ్రంథజాలముగ నెట్లు పరిణమించెనో, వృద్ధిక్షయము లెయ్యవియో, యయ్యెయుగపరిస్థితులనుబట్టి స్పష్టపఱుపవలయును.

3. ముఖ్యముగా కావ్యవిమర్శనమునకు, పాఠకునిఁ దత్పఠనమునకుఁ బురికొల్పుట లక్ష్యముగాని విమర్శనమే ప్రధానము కాఁగూడదు.

౧ జాతీయోజ్జీవనమునకుఁ దోడ్పడిన చారిత్రకాంశములయొక్కయు, సాంఘికాదర్శములయొక్కయు సంగ్రహమును; ౨ వివిధయుగములు వాఙ్మయపరిణతికిఁ ద్రోవఁజూపిన విధమును; 3 ప్రతిప్రధానకవీంద్రునిజీవితమందలి ముఖ్యాంశములును; ౪ కవియుద్దేశ్యములను బట్టియుఁ, పైన నిర్వహించినకళాతత్త్వమును బట్టియు కృతి యెంతవఱకుఁ గృతార్థతఁ జెంది వాఙ్మయమున నేస్థాన మాక్రమించుకొన్న దన్న విషయము నావశ్యకములై యున్నవి.

ధీరోచిత బుద్ధిసంస్కారము గలరససిద్ధుఁడు కవి యనియుఁ, కావ్యము, కళా, ధ్వని విశ్వైక్యభావనాసముత్కర్షమనియుఁ, వాఙ్మయ

ప్రత్యేకవ్యక్తిత్వద్యోతకము లయ్యెను, మానవాంతఃప్రకృతి ప్రకటీకరణ సమర్థము లైనగ్రంథముల సముదాయ మనియు, సారస్వతంబున జాత్యున్నతికిఁ దోడ్పడు నాదర్శములును, విశ్వకల్యాణైకాశయములును నిమిడియుండుటచే నది పూజ్యమనియు, సంఘజీవితతత్త్వము ప్రతిబింబిత మగుటచే [1]చరిత్రకన్న నుత్కృష్టమనియు, వాఙ్మయసందేశమును మన మూఁకశ్యకముగ నాలకింప వలసినదనియుఁ దెలిసికొంటిమి. ఇఁకను నాచరిత్ర కారంభింపఁదే యని కన్గవ కెంపుగదుర నీయెడ కవలోకించుచున్న, నునుదియ్యని పలుకు బంగారముఁ గొంగునఁ గట్టుకొనియున్న మనతల్లి నాంధ్రవాఙ్మయిని దర్శింతముగాక !

---

## 3. అజ్ఞాతయుగము

### క్రీ. పూ. 28—క్రీ. శ. 500.

[2]క్రీస్తునకు 800 సంవత్సరములు పూర్వమే భారతభూమికిఁ బరిచితమైన బ్రాహ్మీలిపినుండి యాంధ్రలిపి జన్మించినదని చరిత్రశోధకుల యభిప్రాయము. జావాద్వీపమునకు సైత మీబ్రాహ్మీలిపి వ్యాప్తమైన దండ్రు. ఇదియే యశోకుని ప్రాకృతశాసనముల వర్ణస్వరూపము. వర్తమానాంధ్ర వర్ణవిన్యాసమునుబట్టి బిందుజనితమని కొంద ఱూహించుటకు సాధ్యమగుచున్నదిగాని, నందంపూడిశాసనము మున్నగువానిలోని యాకృతి పూర్వశాసనలిపికిఁ బోల్పఁగా సంధికాలము నది సూచించుచున్నట్లున్నది. ఆంధ్రలిపి రేఖాజన్యమని విజ్ఞుల యభిప్రాయము. దీనికిఁ జిత్రలిపి యాద్యమనియు

---

1 చరిత్రలు, శాస్త్రము లొక్కొక్కప్పుడు, శైలిప్రకృతి కావ్యగుణముల నేదైన నొకటి పట్టుటచేతనే వాఙ్మయములోఁ జేరుచున్నవి.

2 ఆంధ్రవాఙ్మయచరిత్రము.

వాదమున్నది. గ, మ, ప్రభృత్యక్షరసమూహమునకు సంస్కృతలిపికిని చాల సంబంధముండుటచే సంస్కృతాంధ్రలిపు లేకగర్భజనితములని చెప్పవచ్చును.

లిపికి ముందే సారస్వతముండవచ్చును గాని, యది కేవలము గ్రామ్య పదములో, వీరులపాటలో, యక్షగానములో, మోహపుంగాసటబీసట యల్లికలో నై శ్రుతిపరంపరాగతము లైయుండును. లిపిమూలమున వాఙ్మయము విస్తారముగా వర్ధిల్లుటకు వీలున్నది. అందునను దెనుఁగున వాఙ్మయము లిపి నిర్మాణానంతరమే యారంభమై యుండును.

"వృక్షములు పెరిగి యడవియైనట్లు మాటలు పెరిగి భాషయగును. ఆభాషయందే వన్యఫలములవలె వాఙ్మయము పుట్టును" అని వాఙ్మయచరిత్ర కారుఁడు వ్రాసెను. ఆవన్యఫలము లదృష్టములై యున్నవి. ప్రాచీనాంధ్ర వాఙ్మయము లేకపోయినను, ఆంధ్రులు మాత్రము చాలకాలమునుండి కవులుగా నుండిరనుట వారు కన్నడమున కొనర్చిన మహోపకృతిని దలంచినచో స్ఫురించుచున్నది. ఆంధ్రులగు పూజ్యపాదుఁడు, ఆదిపంపకవి, నాగార్జునుఁడు, మోళిగయ్య, భీమకవి మొదలగువారై దవశతాబ్దమునుండియుం గర్ణాటకమున కావ్యములను, లక్షణగ్రంథములను నిర్మించుచువచ్చిరి. స్వభాషనే విస్మరించి వీరు కన్నడులైపోయి రనుట సహజముగాఁ గన్పట్టదు. కాఁబట్టి వీరు స్వభాషాగ్రంథములను రచించిరేమో! గీర్వాణభాషాభిమానముచే స్వభాషను నిరసించిన ప్రాచీనపండితులవలె, స్వభాష యున్నత సంఘబహూకృతియు, రాజాదరణమును అందనికతంబునఁ గన్నడమును వారు గ్రహించిరేమో! ప్రాచీన కన్నడగ్రంథకర్త లాంధ్రులే యగుటవలన, బ్రాహ్మణ "భారతాదులు" దెనుఁగునంబుట్టిన తరువాతనే కన్నడములోనికి బరివర్తితములై యుండుటవలన, ఆంధ్రలిపియే కర్ణాటకులకు నైత మవలంబనీయమైనందున, ఇప్పటికి నబలా సచ్చరిత్ర రత్నమాల, కవిచరిత్రము మున్నగు కన్నడగ్రంథము లాంధ్రకవిత్వాదర్శములనే కన్నడు లనుసరించుచున్నట్లు

సూచించుచున్నందున మహోజ్జ్వల మగు నాంధ్రమున నేగ్రంథములుం నుండ లేదనుట యపోహగావచ్చును గదా!

అట్లయిన పూర్వగ్రంథము లేమైనవి? బౌద్ధమతవ్యాప్త్యనంతరముగాని దేశభాషాప్రాబల్యము వెలయలేదు. వేదవాఙ్మయగ్రీష్మభానుఁడు మధ్యాహ్నాంబరమున నుండినదాఁక దేశీయభాషాలతలు వాడువాఁటియే యుండినవి. దేశ్యముమూలముననే ప్రజాప్రబోధమగునని మొదటఁగనిపెట్టినవాఁడు బుద్ధభగవానుఁడు. బుద్ధావతారమునకుముందు ల్యాటిను, గ్రీకు, హీబ్రు, సంస్కృతములకే ప్రాశస్త్యమున్నట్టు లప్పటి నాగరకతాప్రపంచము చరిత్ర వలన గోచరము కాఁగలదు. కాన నాంధ్రభాష ప్రత్యేకముగా నుండి యున్నచో ప్రథమశతాబ్దికే మతగ్రంథములు పుట్టి "దేశీయకవిత" పైఁ బ్రీతి యుదయించియుండును గదా? అట్టియుత్సాహ మంకురించి యుండినచో సారస్వతమునకుఁ ద్రోవలు పడియుండవచ్చును. బౌద్ధులకంటె జైన రాజులే యెక్కువగఁ గన్పట్టుటచే, దక్షిణాపథంబులో బౌద్ధమత మంతగాఁ బెరుఁగనందున, జైనగ్రంథములే యనుజ్ఞాతములై యుండవలయు. శ్రావణ బెలగోల గాథలును, ఆపర్వతంబునందలి యుత్తుంగజైనవిగ్రహమును, నేఁటి పాక జేందేవుఁడును, మనదేశము జైనాక్రాంతమై యుండుటను సూచించు చున్నవి. నాలుగైదు శతాబ్దులలోనైనఁ బూజ్యపాదునికాలమునకు [1]రావణ కాణ్వ వ్యాకరణములు గల్గిన మనప్రాచీనాంధ్రములోఁ గృతులుండి యుండ నగు. 6-వ శతాబ్దమునుండి జైనులయదృష్టము మరలినది. కుమారిలభట్ట, శంక రాచార్యుల వాదపుష్పములవలపు లెల్లకెలఁకులకుఁ గ్రమ్మినవి. బౌద్ధజైనుల యౌన్నత్యము మాటుమణఁగినది. చెట్లనీడలువోలె రాజులు విముఖులైరి.

---

1 రావణుఁడు కానిష్కుఁడనియు ద్వితీయశతాబ్ది వాఁడనియు, కాణ్వుఁడు క్రీస్తు పూర్వము 29-వ సంవత్సరపు వాఁడనియు నాంధ్రుఁ డనియు పరిశోధకుల యభిప్రాయము.

బాహిరముగాఁ జోళరాజులచే జైనాలయములు నాశమునొందినవి. ఆది జినేంద్రపురాణములను జైనగ్రంథస్మృతియు, స్వప్నదృష్టముగనున్న యాంధ్రార్థకథావ్యయము మాత్రమునిలిచినవి. పరస్పర మతాసహనమే వాఙ్మయచ్యుతికి హేతువైనది. (పాశ్చాత్త్యులటులనే, విక్లిఫ్ (John Wycliffe) గ్రంథములను పరశురామప్రీతి చేయలేదా?) బౌద్ధజైనమతమేఘములు శంకరవాదఝుంఝామారుతమునకుఁ జెదరిపోఁగాఁ గురిసిన వైదిక గ్రీష్మాతపమునకు నెన్ని కావ్యసస్యములు వాడెనో? మతోద్రేకమునఁ గల్గినయకాలప్రళయములో నెన్నిమత గ్రంథములు నిర్నామములైనవో? లేకున్న భాషాభివృద్ధి యెంతయోయై కృతులుండి యుండవా? నన్నయ భారతమువంటి యుద్గ్రంథ మాకసమునుండి యూడిపడియుండు ననుట సత్యదూరము కాదా?

ఇంతదూర మిట్లు వాదించినను ఫలితమేమో గన్పడదు. ప్రాఁతయుంగపు కృతులు మందునకైన లేవు. కాన, పైవాదమునకు సమన్వయమే లేదా యన్నచో, నున్నదని ప్రత్యుత్తరము. ఏమన, ప్రథమ శతాబ్దికే, యనగా చాళుక్యులకుఁ బూర్వమే హళెగన్నడ తెళుగన్నడ భేదములు పుట్టి యుండనగు. ఆ తెళుగన్నడములోనిదే, యీ యూహావిజ్ఞాతమగు వాఙ్మయమై యుండనగు. (పురాతన త్రిలింగ కన్నడము లిదివరకే నిర్ధారణచేసిన శ్లోకమూలము లగుటచే నప్పటికున్న ఛందోలక్షణ సాహిత్య గ్రంథసమితి రెంటికిని సమమ యగును. ఒకటి రెండవదాని ననుసరించెననుటకు, ప్రాచీనార్వాచీన భేదములే లేనందున, వీలుపడదు.) ఏకభాష రెండుగా చీలి తెళుగన్నడము ప్రత్యేకించిన పిమ్మట కొంతసారస్వతము పైవాదమున కనుగుణముగ పెరిఁగి యుండవచ్చును. కాని, యుత్తరమునుండి వచ్చిన యాంధ్రులు మాటలాడుచున్న ప్రాకృతములోఁ దెళుగు (తెళుగన్నడము) బెరసి పోవుచున్న కొలఁదిని సహజమగు నూత్న మిశ్రభాషానిరసనముతో మొదట మిన్నకుండిన జైనులు, చాళుక్యప్రభుత్వారంభసూచనలు, బ్రాహ్మణమతా

ధిక్యము వర్ధిల్లినకొలఁది, నాలోచించుకొని, కర్నాటకము తమకు జన్మస్థానము వంటిదిగాన నక్కడకే వలసపోయియుండవచ్చును. వేఁగినాడు వీడి పోవుచున్న జైనులలో నప్పటికున్న జైనత్రిలింగసరస్వతియు నాంధ్రసీమను బూర్తిగా జయించి యుండవలయును. త్యజింపకున్న బ్రాహ్మణమతప్రవిష్టులు బలవంతపెట్టి వారిని వెళ్లఁగొట్టియుందు రనుట యనుభవవిరుద్ధముగాదు. బ్రాహ్మణులు దీనిచే నింద్యులుగారు. మతావేశ మెట్టి పనిసైనఁ గావించును.

హాళెగన్నడ మప్పటికి నిప్పటికి నిదే పేరున వ్యవహరింపఁబడుచున్నది. తెలుగుమాత్రము ప్రాకృతసంపర్కము కారణముగా, నయిదవశతాబ్ది కనగా చాళుక్య ప్రభుత్వారంభకాలమునకు, నాంధ్రముగా మాఱియుండ నగును గాన [1]చాళుక్యులకు పూర్వమున్న శుద్ధదేశీయపదప్రచురమగు [2]తెలుగాంధ్రము నాంధ్రమనియు వ్యవహరింతము.

ఆంధ్రములోఁ బరిణమించిన తెలుగు, బ్రాహ్మణులకు సంస్కృతమే ప్రధానము గావున మొదట జానపదులలోనే యుండి, క్రమక్రమముగా రాజపోషణ నందియుండును. గ్రామ్యములోనికి జారిపోయి యుండుటచే నూఱ్ఱసంస్కారములు జరిగి యుండవలయును. "ఆంగ్లోసాక్సను" 1000 నుండి 1500 వఱకు సంస్కారముల నందియుంది నేఁటి ఇంగ్లీషుగా మాఱినట్లే పూర్వాంధ్రము (తెలుగు) ను 500 నుండి 1000 వఱకును మార్పులను జెంది యుండవచ్చును.

---

1 పూర్వాంధ్రసీమలోఁ బుట్టినదియు, పూర్వకాలమున నుండినదియు కాఁబట్టి పూర్వాంధ్రమను టుచితము.

2 తెలుఁగు శబ్దములో బ్రాహ్మణవాసన, దేశనిర్ణయము గన్పడు చున్నది. కాన నర్వాచీనము. అందుచే తెలుఁగాంధ్రముగా ననంతరస్థితిని బేర్కొను టుచితము.

తెళుగన్నడ హాలెగన్నడము లేకమైయుండిన ప్రాచీనకాలపు గ్రంథములతో మన కవసరము లేదు. కాని, క్రీస్తుశకాదినుండి ప్రత్యేకించి 500 వఱకు నెగఁబారి, జైనసారస్వతమునకు నిలయమైన పూర్వాంధ్రము (తెళుగు)యొక్కచరిత్ర తెలియవలసియున్నది.

ఊహాకందిన పూర్వాంధ్రభాష (తెళుగు) లక్షణము లేవనఁగా:—

1. ఆర్యావర్తమున సామ్రాజ్యము స్థాపించి సప్తశతి మొదలగు గ్రంథములను సైతము వ్రాసి ప్రాకృతమునకుఁ జేయూతనొసంగిన కర్ణ తెల్లంగురాజుల మాతృభాషగావునఁ, బ్రాకృతపదములే ఎక్కువ యుండును గాని శుద్ధసంస్కృతసంబంధ మంతగా నుండదు. ఆప్రాకృతమైన నుత్తరము నుండి రాజ్యమునకై వలసవచ్చినవారికే కాని, అసలు తెల్గుసీమలో ముందు గనే వచ్చియున్నవారిమాటల కంతగా నంటి యుండదనియును,

2. అప్పటికి బౌద్ధజైన ప్రాబల్యమే తెనుఁగుసీమలోఁ గలదు గాన సారస్వతము వారిదే యై యుండవచ్చుననియుఁ జెప్పవచ్చును.

ఇట్టి పూర్వాంధ్రము నేఁటి యాంధ్రముగా మాఱునప్పటికి 14814 తత్సమములు వచ్చిచేరినవి. ఉన్న 12337 దేశ్యపదములలో తద్భవములు 2000. తురక ఇంగ్లీషు పదములు 1500. రూపములు మాఱి వికృతిఁజెంది దేశ్యములే యనిపించునట్టివి దాదాపు 4000. కాన శుద్ధ దేశ్యములు నాల్గు వేలకు మించవను, నైదింటి నతిక్రమింపదు. ఈనాల్గువేలును లోకవ్యవ హారమునకుఁ జాలును. ఈనాల్గువేలే పూర్వాంధ్రములోని పదజాలము గావచ్చును.

---

## లబ్ధసారస్వతము

(500 - 1000 క్రీ. శ.)

నూతన వైకృతములను, అంతకన్నను మించి యెక్కువ సాంస్కృతిక ములను, సంఘమునందలి యున్నతశాఖవారు ప్రవేశపెట్టుటచే తెనుగు

నవీనశైశవావస్థనొంది పూర్వవాఙ్మయవాసనను విస్మరించి తెలుఁగు కాఁగా పండితులు, వాడుకభాషకే, గ్రాంథికస్థితిని గల్పించుటకై, నూత్నవైలక్షణ్యములను సమన్వయము చేయుటకై లక్షణములను సూత్రించి శాసించి యుందురు. [1]నాల్గువేల వైకృతపదములు [తుదకు మూఁడవభాగము నేఁటి తత్సమపదజాలము నన్నయనాఁటికిఁ జేరి యుండెనన్నను] ఐదువేలు సాంస్కృతికములును గ్రొత్తగా సమ్మేళనమగునప్పటి కెన్ని తారుమారులు, నెన్ని వైలక్షణ్యములు గలిగి యుండవలయును? పైచర్చనుబట్టి 500 నుండి దాదాపు 1000 (క్రీ. శ.) వఱకు నైదువందలసంవత్సరములు పూర్వాంధ్రాంధ్రముల (తెనుగు తెలుంగుల) సంధికాల మగుచున్నది. ఈసంధికాలము నుత్తరభాగములోని దగు లబ్ధసారస్వత మెట్లుండెననుట నింక విచారింతము.

ఉన్నవి మూఁడుశాసనములు: గుణగవిజయాదిత్యుని (844—889) రెండుశాసనములలోని విషయము లివి:

౧

సీసపద్యము. 1. [1]శ్రీనిరవద్యుణ్డు సిత్తజాతసముణ్డు
శివపదవ (ర) రాజ్యసేవితుణ్డ

---

1 ఇంగ్లీషులో ముఖ్యముగా వచ్చు వాఙ్మయపదసామగ్రి 30 వేల కున్నది. విద్యావిషయమై అమెరికాలో, నింగ్లాండులోఁ జేసిన శోధనలవలన ప్రజాసామాన్యమునకు లోకవ్యవహారముకొఱకు నైదువేలపదములే యావశ్యకము లనియు, నవన్నియుఁ బ్రధానముగ నాంగ్లోసాక్సనునకుఁ జేరిన దేశీయములే యనియు, నుత్తమవక్తలని పేరుపడినవారికి 11 వేలపదము లించుమించుగా వచ్చుననియు, ఆంగ్లమహాకవియగు షేక్సుపియరు 18 వేల పదములు వాడె ననియు, నంతకంటె నెక్కు డెవరు వాడలే దనియుఁ దేలినది.

ఆధునికభాషాపద్ధతిని సంస్కరింపఁబడినవి కాని, లక్షణనిమిత్తము కొన్నిరూపము లటులనే యుంపఁబడినవి. సరియైన రూపమునకు చూ. Nellore Inscriptions Vol. II (8-1-1923 ఆంధ్ర. ప. అనుబం.

2. ఖిలుడు ననృతరిపు బలుడు సాహవరావ
రణ యోధ్య సిథూసను ద్దగణిత
3. దానమాన్యుణ్డు (దయాని) ల యుండును
భణ్డాన దణ్డాన బాండురంగు
4. వ్వి.........చ్చణియు గాన్ధికోలడిలేని
కొట్టంబు ల్వోడిచి గొణకెనల్లా
5. తనిపక్షపాతి 6 సలలిత......7......
పదగ..................8 వ తారాన్ను విభవ గౌరవేంద్ర.

౨

మూ ల ము.

౧. ... ... ... [పుర?]
౨. ... ... ... భూపాలకుణ్డు [॥]
3. [1]పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు బలగవ్వఁం బొ
౪. ప్పగ బైలేచి సేన పట్టంబు గట్టిఇచ్చి ప్రభుం
౫. బణ్డరంగు [౦] బ [ణ్చి]న సామ[౦]త్త పదువతో బోయ [।]
౬. కొట్టంబు లవ్వణ్డెణ్డుం గొణి వేంగినాణ్టిం గొఱల్చియ
౭. త్రిభువనాంకుశబాణ నిల్పి[।]కట్టెపు దుర్గఁంబు గడు
౮. బయల్సేసి కణ్డుకు బ్బేఁజవాడ గావిఞ్చె మెచ్చి [।]
౯. పణ్డరంగు పరమ మహేస్వరుణ్డు అదిత్యబటరని
౧౦. కి ఇచ్చిన భూమి ఎనుబొదివుణ్ల అణ్లు పట్టునేల[।]ద
౧౧. మ్మపురంబున దమ్మువులు[।]విని రక్షిఇచ్చినవారికి అస్వ
౧౨. మేదం[బు]న పలం[బు] [అ]గు[॥]

---

1 "నన్నయకు పూర్వపు తెలుగు-శిలాశాసనము" మల్లంపల్లి సోమశేఖర శర్మగారు-భారతి ప్రభవ ఫాల్గునమాసము. ౪౧౪. పు.

## 3

## యుద్ధమల్లునిశాసనములోని విషయము (927-934)?

### మధ్యాక్కరలు

స్వస్తిశ్రీ నృపాంకుశాత్యంత వత్సల సత్యత్రిణేత్ర
విస్తరశ్రీ యుద్ధమల్లు డనవద్యవిఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుండు, త్రిభువనాభరణుండు సకల
వస్తుసమేతుండు, రాజ సల్కిభూవల్లభుండర్థి— ౧
పరగంగ బెజవాడ కొమరసామికి భక్తుడై గుడియు
నిరుపమమతి నృపధాముడెత్తించె నెగిడీర్చిమఠము
గొరగల్గాకొరులిందు విడిసి బృందంబుగొని యుండువారు
పరిగాక యబ్బారనాసిప్రచ్చిన పాపంబుగొండ్రు— ౨
వెలయంగనియ్యెట్టు [1]డస్సి మలినులై విడిసినబ్రోల
గలతానపతులును రాజు పట్టంబుగట్టిన పతియు
నలియ బైవారల వెల్వరించిన నశ్వమేధంబు
ఫలము పేక్షించిన లింగమడసిన పాపంబు దమకు— ౩
జన(ను)తచేబ్రోలనుండి బెజవాడ జాత్రకువచ్చి
త్రిణయనుసుతుడుండుచోటు మెచ్చక తివిరియిన్నెలవ
యనఘుండు చేకొని యిందు ప్రత్యక్షమైయున్ననిచ్చ
గని మల్లడెత్తించె గుడియుమఠమును గార్తికేయునకు— ౪
రమణతో బెజవాడకెల్ల బెడగును రక్షయుంగాను
దమతాతమల్లపరాజు వేరడు దానుగట్టించె
గ్రమమునదా నిక కలశమిడ్డట్లుగా మొగమాడు
వమరంగ శ్రీ యుద్ధమల్లు డెత్తించె నమితతేజుండు— ౫
తనధర్మువొడబడికాచునృపులకుద

---

1 ఇది 'ట' అని యున్నది.

ఈశాసనములేకాక చోడుఁడగు పుణ్యకుమారుని (750 సం.) పద్య శాసనములున్నవనియు, బర్నెలుగారి "తమిళ సంస్కృతశాసనము" లను వానిలోఁ గొంత తెనుఁగు కొంత సంస్కృతము గలసిన విష్ణువర్ధనుని దనఁబడు ప్రాచీనశాసనమొకటి [1]గలదనియు చరిత్రకారులు చెప్పెదరు.

వీనిలోఁ దెలియనగు 1. భాషావిషయములు విచారింతము.

[2] (1) "ఱ" యను నక్షరమొకటి యఱవములోని "ఴ" వంటిది యనేకస్థలములలోఁగలదు. ఇది పదమూఁడవశతాబ్దినుండి యంతరించి కన్నడ

1. ప్రాచీనాంధ్రభాషాస్వరూపము. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు.

2. ఎ ఒ చే జే ఱ ఴ లనుబట్టియు, క్రియాసంఖ్యాపదాదిముఖ్య పదములు సంస్కృతాదులఁ గన్పడమిచేతను, ఔపవిభక్తికాది వ్యాకరణ వైలక్షణ్యములఁ జూచియు, తప్పకాంధ్రకన్నడము లొకేజాతిని జేరియుండు నట్లు చెప్పినను ఆమూలజాతిచేరిన జాతికే తమిళము పుట్టియుండనగును. ఇన్నిటికి ప్రాకృతమే తల్లి కావచ్చునుగాని, ఇవిమాత్రము పరస్పరము సోదరీ సతులనుట కేయాటంకమును గన్పట్టదు. Aryan Semetic అని పాశ్చాత్యు లన్నట్లే, పాణిని భాషలను పైశాచికాపభ్రంశాది భేదములుగా చెప్పియుండ నగు: విచారణీయము ! క్రియలనుండి పదములన్నిటికి మూలరూపముల నేర్పఱచుపద్ధతి మొదటపాణినియే కనిపెట్టెను. తమిళ కన్నడ త్రిలింగము లలో నున్న క్రియలన్నియు నేకమాతృకములనుట సిద్ధము; సత్యము. ప్రాచీన కాలముననే యమోఘవ్యాకృతిని గల్పించి పాశ్చాత్యుల కెన్నియోపాఠ ముల నేర్పి, ప్రాకృతభేదముల నిరూపించిన పాణిని కామాత్రము దెలియ కుండదుగదా! దేవభాషయే యెల్లభాషలకుఁ దల్లియైనను, కన్నడాంధ్రతమి ళము లన్యోన్యపురాతనసంబంధములు గలవనుట కది ప్రతిబంధము గానే రదు. కాన, వాఙ్మయచరిత్రకారుని యభిప్రాయములు తాత్కాలికభ్రమ జనకములేకాని విమర్శనీయములు.

ములో 'ళ' గను, తెనుఁగులో 'డ' గను మార్పుఁ జెందినది. (పూర్వధ్వని యఱవ లుచ్చరించిననే స్పష్టపడును. అది 'ళ,' 'డ,' 'ల,' మధ్య అకారధ్వనితో మేళగించినట్లుండును.) (2) ఔపవిభక్తికములోని రేఫము అ కారమై యుండెను. (3) హలన్త రూపానునాసికములు పరములగునక్షరంబులఁబట్టి వర్గములుమార్చుకొనుచుండెను. (4)కొన్ని పదములు రూపుమాసినవి: పంగము, పన్నన. కొన్ని రూపుమాఱినవి. ప్రువ్వులు(పుర్గులు), రట్టఖ్లు (రెడ్లు), కుట్రు(గుట్ట). (5) బహువచనము 'ళ' ప్రత్యయముచే నగుచుండెను. కొడుకళ్, సంవత్సరంబుళ్. (6) కొన్నిచోట్ల 'డు' 'ళు'గా మాఱుటచే బహువచన రూపద్వయము గల్గుచుండె. రట్టడ్లు, రట్టళ్లు, ఊర్లు, ఊళ్లు. (7) కొన్ని బహువచనములు 'ట్టు' తో నగుచుండె. మగట్టు, అచ్చువాట్టు. (8) నిండుసున్నలే కాని యరసున్నలు లేవు. (నెరసున్నల పైని యక్షరములకు జడ్డలు ప్రాప్తించెను. గడ్డండు.) ఇప్పుడరసున్నలు వచ్చుతావులలో నిండు సున్నలే వచ్చుచుండెను; గాని జడ్డలు రాకుండెను. (9) కొన్ని యపూర్వపదప్రయోగములు గలవు. రటకుట్టు (రాష్ట్రకూట)=రట్టగుడి=రెడ్డి; చంద్రాయత్త కాలము (ఆచంద్రార్కము); రేవశర్మకశ్యపగోత్రునికి(కశ్యపగోత్రుఁడగు రేవశర్మకు). తఱచుగ విసంధులే యున్నవి. ముచ్చింతల, పెంచెఱువు, మురెయ్యేల్లలనంటి సంధులుసైతము న్నవి.

[1] ఇఁక ఛందోవిషయములను గమనింతము. పదునొకండవ శతాబ్దికిఁ జేరిన 'యాప్పిరంగలం' అను తమిళ గ్రంథములో తత్కర్త 'వాంచియార్' అను జైనుని తెనుఁగు గ్రంథమును జూచి రచించితినని చెప్పియుండుటచే,

1 ఛందోవిషయములకు లేకుమళ్ల రాజగోపాలరావుగారి **"Comparative Prosody of Dravidian Languages"** మున్నగునవియును, 14-10-1925 ఆంధ్రపత్త్రికను, వేటూరు ప్రభాకరశాస్త్రిగారి "నన్నయకుఁ బూర్వము ఛందస్సు" అను వ్యాసమును చూడుఁడు.

నన్నయకుముందు లక్షణ గ్రంథముండెనా యని సంశయము పొడమును. ఈ 'వాంచియార్' రేచన కాదుగదా! రేచన 13-వ శతాబ్దివాఁడనిరి. పుష్పదంతకృతమనఁబడు 'సాహిత్యకౌముది' యు, 'హేమచంద్రీయము' సత్యములా, కల్పితములా? క్రింది లక్షణములను మాత్రము పేర్కొననగును.

(1) గణములు మొదట మాత్రాబద్ధములు. (2) ప్రాసయతులలో నేదైన నొకటి తప్పక యుండెడిది. (3) 'ము' విభక్తికయతి మున్నగునవి యప్పుడే పుట్టినవి. (4) యతి సంస్కృతములోవలె నూత్నపద ప్రథమాక్షరము గావలయునని లేదు. (5) ప్రధానముగ సంస్కృతమున లేని సీసము, తరువోజ, ద్విపద, అక్కరలు ప్రచురములై యుండినవి. (6) పాటలు, పదములు, 8, 7, 6½, 5, ఈవిధముగా తుదకు 3 గణములకుఁ దగ్గి సీసమువంటి పద్యములకు దారిచూపినవి. (7) తమిళ కన్నడములలో నీఛందస్సునకుఁ బోలికలున్నవి.

[1] ఈశాసనములే కాక నందంపూఁడి దీర్ఘాసిశాసనములు మున్నగునవి యున్నను, ఇవి భారతానంతరమువి గావున నిరాకృతములైనవి. దీనినిఁ బట్టి తెలియువిషయములు భాషాసంబంధములే యైనను నన్నయకుముందే పద్యరచన ముండెననియుం, కృతులుగూడ నుండవచ్చుననియుం స్పష్టమగుచున్నది.

పైశాచికాపభ్రంశ ప్రభృతులు వివిధ ప్రాకృతము లని యార్యులు వ్యవహరించిన యాదికాలభాషలలో నొకదానినే యాంధ్రదేశీయులు మాటలాడుచుండ వచ్చుననియు, నది సంస్కృతముతో నేకీభవించినది కాదనియు, తన్మూలమున 'కరణ' భాష యేర్పడియెననియు, నది క్రమముగా హా

1 ఈశాసనములలో, యుద్ధమల్లుని శాసనపు కాలమును గుఱించి వాదములున్నవి. (ఆంధ్రపత్రిక) దుర్మతి మార్గశిర సారస్వతానుబంధములను, క్రోధనసారస్వతానుబంధములోని కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి వ్యాసములను జూడుఁడు. వివిధవాఙ్మయ రత్నపేటిక లగు నాంధ్రసాహిత్య పరిషత్పుటము లవశ్యపఠనీయములు.

తెలుగన్నడములుగా ప్రథమశతాబ్దికే చీలిపోయెననియు, తెలుగన్నడమే పశ్చిమోత్తరముగఁ బ్రాఁకి యాంధ్రదేశమునంతయుఁ బ్రచారముఁ గాంచెననియు, హాళెగన్నడమందలి యాసక్తి, జైనమతాభిమానము, చాళుక్య బ్రాహ్మణాభిమానము మున్నగు కారణములచే తెలుగన్నడ వాఙ్మయము, కన్నడమునఁ జేరియో, యంతరించియో యదృశ్యమైనదనియు, 'తెలుగు' ప్రథమ పులకేశి కాలమందుండి నూతనసాంస్కృతిక వైకృతపద సంపర్కముచే మాఱఁజొచ్చి, రెండవపులకేశి సత్యాశ్రయుని (608—640) కాలమునకే తెలుఁగైనదనియు, హెచ్చుతగ్గుగా క్రీ. శ. 500—1000 సం. కాలము తెలుగాంధ్ర సంధికాలముగా నుండనగుననియు, కానఁ తత్కాల మింగ్లీషులోని మిడిలింగ్లీషు (Middle English) యుగమునందువలె, భాష ప్రస్తుత స్వరూపమం దుండెననియు నూహించి, కార్యకారణసంబంధముచే నిర్ణయించుకొంటిమి. [1]సుప్రసిద్ధవాఙ్మయ మింకను గన్పడలేదు. చిక్కని దానికై యంధకారములో తడవులాడుటకంటె, చెవులకింపుగాఁ దెలుఁగు భారతమును "శ్రీవాణీ" యని మొదలుపెట్టి గోదావరీతీరరాజమహేంద్రమున, రాజరాజు సన్నిధిని, పాడుచున్న ప్రసిద్ధాంధ్రప్రథమకావ్యకవిని "నన్నియభట్టు" [2]ను జూతముగాక రండు.

---

1 పాల్కురికి సోమనాథుఁడు తనపండితారాధ్యచరిత్రములోఁ జేర్కొన్న 'తుమ్మెదపదములు,' 'ప్రభాతపదములు,' 'వెన్నెలపదములు' మున్నగునవి యీకాలమున నుండవచ్చుననియు, వానికంటెఁ బ్రాచీనములు జక్కులపాటలు, (యక్షగానములు) అనియు, నవే ద్విపదగా మాఱె ననియు నొకప్రసిద్ధ విమర్శక మహాశయుని యభిప్రాయము. వాస్తవముగా నట్టి ఛందః పరిణామ మెద్దియో యుండనగు. [శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులవారి 'జక్కులపాటలు' అనువ్యాసము 12-వ ఉగాదిసంచిక.]

2 నందంపూఁడి శాసనము.

శ్రీః

# ఆంధ్ర వాఙ్మయచరిత్రసంగ్రహము

## ద్వితీయఖండము - పురాణకవిత్వము. (1001 - 1330)

### 1. చాళుక్యచోడయుగము 1001 - 1200.

### ౧. సంఘచరిత్ర.

విమలాదిత్యునకు రాజరాజచోళుని కూఁతురు కుందువాంబాదేవియందు రాజరాజచాళుక్యుఁడు పుట్టెను. ఈరాజరాజనరేంద్రుఁడు 1022 ఆగస్టు 16-వ తేదీ నాఁడు సింహాసనమెక్కెను. ఈతఁడు చీదమార్యుఁడను బ్రాహ్మణునకు కోరుమిల్లియగ్రహారము నొసంగెను; పశ్చిమచళుక్యులకు మంత్రియై యుండి, తర్వాత వార్ధక్యమున రాజరాజు నాశ్రయించి యాంధ్రభారతావతరణమునకుఁ దోడుపడిన నారాయణభట్టునకు నందంపూఁడిని దానమొసంగెను. పావులూరి మల్లన్నకు నవఖండవాడతో బహూకరించెను. ఈవిధముగ బ్రాహ్మమత, గణితశాస్త్ర, భాషాకోవిదుల నాదరించిన రాజు "నన్నియభట్టు" కులబ్రాహ్మణుఁడు; పైనపురోహితుఁడు. రాజచోళునికొడుకగు రాజేంద్రచోడునిపుత్త్రి "అమ్మదేవి" రాజరాజనరేంద్రునిభార్య. చాళుక్యచోళులరక్తము ఈవిధముగ ప్రేమపాశముతో బిగింపఁబడి రెండుతరములు గలసి పోయినవి. రాజరాజనరేంద్రునకు భోజుఁడు సమకాలికుఁడు. (1018-1060). "షానామా"ను వ్రాసినమహాకవి.

"ఫర్దూసి"ని పోషించిన గజినీమహమ్మదు సమకాలికుఁడు. గాంగులలోఁ బ్రసిద్ధుఁడగు కళింగరాజు వజ్రహస్తుఁడు సమకాలికుఁడు. పశ్చిమ చాళుక్యసార్వభౌములు జయసింహ సోమేశ్వరు లీతనిసమకాలికులు. శంకరాచార్యుని ప్రచ్ఛన్న బౌద్ధమతము, జైనబౌద్ధమతముల నూటాడించినది. అతి ప్రశాంతగోదావరీజలము లెప్పుడును సంక్షుభితములు కాలేదు. అప్పుడు మతకల్లోలము [1]వేఁగిలో లేదు. కృష్ణానదికీవల తుంగభద్రా పినాకినీతీరపరిసరగ్రామములే యొక్కొక్కప్పుడు, వీరఘట్టనములకు, మతోద్రేకములకు నల్లలనాడుచుండునది. [2]అట్టికాలమును దూరముగనే యుండెను. విశాఖపట్టణపుజిల్లా చీపురుపల్లెతాలూకా, నెల్లూరి మండలములోని కావలి, కర్నూలు భాగములోని మార్కాపురము, నిజాములోని [3]కుక్కనూరు సరిహద్దులుగా నుత్తరదక్షిణ పశ్చిమోత్తరములఁగల విశాలపూర్వచాళుక్య సామ్రాజ్యము ప్రశాంతముగనుండెను. [4]రాజ్యాంగపద్ధతులు సక్రమములైనవి. రాజరాజున కమ్మంగదేవియందు రాజేంద్రుఁడు పుట్టెను; యువరాజయ్యెను. కాని, ఆతనికి చోళసామ్రాజ్యము మీఁదనే కన్ను. మేనమామయగు రాజేంద్రదేవచోళుని కూఁతురు మధురాంతకను పెండ్లాడెను. ఎప్పుడును చోళ

1. వేఁగి పరరాజులచే నొకానొకప్పుడు దగ్ధము గావింపఁబడుటచే నా పేరు వచ్చినదండ్రు.

2. ఆంధ్రులచరిత్రము, రెండవభాగము.

3. చాళుక్యరాజ్యవిస్తీర్ణము, శ్రీ. లక్ష్మీనరసింహంగారు.

4. కీ. శే. కే. వి. లక్ష్మణరావుగారు. పట్టాభిషేకసంచిక.

మండలమున నున్నవాఁడగుట, నాతఁడు రాజరాజు (1063) మరణించినపుడు దగ్గఱలేఁడు. కాన, రాజ్యము పినతండ్రి యాక్రమించెను. అతనిని మన్నించి 1070 లో చోళసామ్రాజ్యము నధిష్ఠించి, పశ్చిమ చాళుక్యుల నోడించి రాజేంద్రుఁడు, కులోత్తుంగచోళదేవుఁడను బిరుదమును దాల్చెను. పినతండ్రి మరణానంతరము తనకొడుకులను వేంగికి ప్రతినిధులుగ నంపెను. తండ్రితాతలనాఁటిశైవము నవలంబించి యధికాభిమానముతోఁ గాపాడెను. అంతతోఁబోక యామునాదులతో నారంభమైన వైష్ణవమును, వీరవైష్ణవముగ మార్చి యద్భుత సంస్కరణమునకుఁ జొరకొనుచున్న రామానుజుని వెడలఁగొట్టెను. కావుననే శ్రీవైష్ణవులకు తిరునారాయణపురము (ఇదే ఇప్పటి మేలుకోట), ముసల్మానులకు 'హిజరా' తర్వాతి "మెడీనా" పట్టణమువలెఁ బూజ్యమైనది. ఈకులోత్తుంగుని కాలమునఁ గొంత అఱవవాఙ్మయము వచ్చియుండనగు. ఇతని కుమార్తెను కళింగరాజు వజ్రహస్తుని మనుమఁడైన [1] 'రాజరాజచోడగంగు' వివాహమాడెను. కులోత్తుంగుని ప్రతినిధిగా వేఁగిని పాలించిన విక్రమచోడుఁడు తండ్రితర్వాత చోళచక్రవర్తి యయ్యెను. విక్రమచోడుఁడు వేఁగిపైన నశ్రద్ధచూపుటచే నది 1120 లో పశ్చిమ చాళుక్యులవశమయ్యెను. 1127 లో మరల విక్రమచోడుఁడు దండెత్తివచ్చువఱకు వెలనాటి చోడులు వేఁగిలో పశ్చిమచాళుక్యుల ప్రతినిధులుగ నుండిరి. విక్రమాదిత్యుఁడు 1126 లో పరమపదించెను. ఆర్వేలనాటి కధిపతి యగు భద్రభూపతి

1 ఆంధ్రకవులచరిత్రము, ప్రథమభాగము.

యాపశ్చిమచాళుక్యులకు సామంతుఁడఁట. కాకతి ప్రోలరాజు గూడ సామంతుఁడే. భూలోకమల్లునితో పూర్వపశ్చిమ చాళుక్యకీర్తియు, విక్రమునితో దక్షిణచోళవైభవము నంతరించినవి.

[1]భూలోకమల్లునకుఁ దర్వాత యుద్ధమంత్రిగ నున్న [2]బిజ్జలుఁడు, కాకతిప్రోలరాజు సహాయముతో 1162 లో చాళుక్యసామ్రాజ్యము నాక్రమించుకొనెను. ఈతని కాలమున మండంగి మాదిరాజను బ్రాహ్మణునకు వీరశైవమత స్థాపనాచార్యుఁడగు బసవేశ్వరుఁడు పుట్టి బిజ్జలునకు మహామంత్రియై, అతనికి బంధువై తుద కతనిని జంపించెనఁట! ఈమహామతవిప్లవ మేరీతినయినను, వీరశైవ మీకాలమునఁ దలయెత్తి జైనమతమును నాశనము చేసిన దనుమాట సత్యము. ఈబసవేశ్వరుని యల్లుఁడైన చెన్నబసవఁ[3]డే మత గ్రంథములను రచించి శివాంశుఁడని పేరందినవాఁడు.

---

1 ఇతఁడు విక్రమాదిత్యుని కొడుకు. 'మానసోల్లాస'మను నుత్తమ గ్రంథమును వివిధశాస్త్రయుతంబుగ రచించినమనీషి.

2 ఆంధ్రులచరిత్రము, సంపుటము 2.

3 జైనులవ్రాఁతప్రకారము, బిజ్జలుని మంత్రి మాబలదేవుని సోదరి

మదాలాంబిక మాదిరాజును వివాహమాడెను.

బిజ్జలుఁడు పెండ్లాడినది పద్మావతి — బసవేశ్వరుఁడు — నాగలాంబిక.

1157-1167 — 1168 మృతి.

ఇమ్మడి బిజ్జలుఁడు మున్నగువారు 1167-1182 — చెన్నబసవఁడు.

వెలనాటిచోడులను వేంగిలో పశ్చిమచళుక్య విక్రమాదిత్యుఁడు ప్రతినిధులుగాఁ జేసినట్లు వ్రాసికొని యుంటిమి. వీరు కరికాలచోడుని వంశమువారఁట! (వీరినే వెలనాటి కులోత్తుంగచోడుఁడు తనప్రతినిధులుగాఁ జేసినట్లు మఱొక్కచోట నాంధ్రచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు.) చోడులనేక శాఖలుండిరి. ఈవెలనాటిచోడులుగాక పాకనాటి పొత్తపి చోడులనువారు కొందఱు వర్ధిల్లిరి. వీరికే యొరయూరుపురాధీశ్వరులనియును, వేంకణాదిత్యులనియును బిరుదులు గలవు. రాజరాజనరేంద్రుని మృతివెంటనే కల్గిన [1]గృహకల్లోలసమయములో దాసవర్మ యను నతఁడు రాజ్యము నాక్రమించి కొణిదెనరాజధానిగ నేలెనఁట. అతని తరువాత 1106 వఱకు నేమియుఁ దెలియదు. కాని, అప్పుడొక బల్లియచోడదేవమహారా జుండినట్లు తెలియుచున్నది. మన్నెపల్లిలో దొరకిన శాసనములో నితని వంశము.

"శ్రీమత్పొత్తపి నన్నెచోడతనయః శ్రీవేంకభూపాలకః,
తత్పుత్రోఽరిపదాచలాపహా పవిః కామక్షితీనాయకః,
సూనుః సూర్యకులాన్వయాంబుధి శశీ శ్రీబల్లిభూపాలకః
గౌరీనాథపదాబ్జవందితగణ స్సౌజన్యరత్నాకరః."

అని వర్ణింపఁబడినది. కొణిదెనశాసనము లీతని తర్వాత వంశమును వర్ణించిన చొప్పుననే, కామచోడదేవుఁడును అతనికి తనూజుఁడు నన్నెచోడమహారాజును పాలించిరి. బల్లియచోడుఁ డాదిగాఁగల నల్వురును క్రీ. 1100-1170 మధ్య

1 పట్టాభిషేకసంచిక.

నుండినవారగ శాసనములు దెల్పుచున్నవి. [1]ఇంక మన్నేపల్లి శాసనములో నుదాహరింపఁబడినట్టివారును బల్లియచోళు నకుఁ బూర్వులును నైన నన్నెచోడ వేంకభూపాల కామక్షితీశుల కాలములు దెలియవు. వాఙ్మయమునకుఁ జేరిన నన్నెచోడుఁడు పశ్చిమ చళుక్యయుద్ధములో నిహతుఁడైన విషయము శ్రుతపూర్వమగుటచేతను, రాజరాజనరేంద్రుఁడు మృతుఁడైన తోడనే విజయాదిత్యుఁడు రాజ్యము నాక్ర

1 కొణిదెన మన్నేపల్లిశాసనములవైరుధ్యము ఇట సమన్వయింపఁబడినది. కొణిదెనశాసనముల ప్రకారమే బల్లియచోడుని తర్వాతివారిశాసనములు సమర్థించుటవలన నది పశ్చాత్సంతతియనియు, మన్నేపల్లి శాసనకథనము పూర్వసంతతిలోని దనియుఁ దెలియవలసినది.

బల్లిచోడుఁడు ఇతనిభార్య శ్రీసతి

|

నన్నెచోడుఁడు

|

వేంకభూపతి

|

౧-వ కామభూపతి

|

౧-వ బల్లిభూపతి

|

౧-వ కామచోడుఁడు

|

త్రిభువనమల్లుఁడు ఇతనిభార్య (మాబల)

|

౨-వ నన్నెచోడుఁడు (1070—1023)

మించుకొన్న కాలములో నాఱవ పశ్చిమచాళుక్య [1] విక్రమాదిత్యుఁడు వేంగిపై దండెత్తివచ్చుటయు నాతనితో యుద్ధము చేసి కులోత్తుంగుఁ డాతనిని జయించుట చేతను, ఆకాలముననే యనఁగా) రాజరాజ నరేంద్రుని మృతికిని విక్రమచోడుని ప్రాతినిధ్యమునకును మధ్య 1063 పైన 1070 లోఁగా మరణించియుండవలయునని తేలుచున్నది. (కడపటి నన్నెచోడ మహారాజే కవిగాఁడా యన్న నతఁడు మాబలదేవీ మల్లదేవుల తనయుఁడు. 1106 లో నున్న బల్లియచోడుని కుమారుఁడు గాఁగూడదా యన్న నతనికోమలి శ్రీదేవియో కాదో! ఇంతకు నతనితనూజుఁడు కామచోడుఁడు ఇంకొక తనూజుఁడన్న నీతఁడు రాజ్యపరిపాలనము చేసినటు లెక్కడను లేదు. కావున శ్రీసతి కుమారుఁడును "అధిపతి" యునగు నన్నెచోడమహాకవి 1070 లోపలనే యుండినవాఁడును

---

1 విమలాదిత్యుఁడు (1015-1022)




విక్రమాదిత్యుఁడు రెండవసత్యాశ్రయుని మునిమనుమఁడు.

4

బల్లియదేవుని ముత్తాతయు నగును. యుద్ధనిహతుఁడుగాన నతి ప్రాయముననే వీరమరణశయ్య నందియుండును. తర్వాత 1065-1105 వఱకును వేంక, కామభూపతులు క్రమముగాఁ బాలించి యుందురు. ఈనన్నెచోడుఁడు మొదటి శ్రీబల్లి చోడునకు శ్రీసతియందు జన్మించి యుండనగు. ఆబల్లి చోడుఁడు చళుక్య, శక్తివర్మ,విమలాదిత్యుల సంధికాలమున 1011-1017 లో పాకనాటిరాష్ట్రమును స్థాపించి మండలేశ్వరుఁడై యుండవచ్చును. వీరరసోత్కర్షమైన పలనాటి వీరయుద్ధ మీకాలముననే జరిగినది. సంఘ సంస్కర్తయై తనరిన బ్రహ్మనాయఁ డీయుగముననే జీవించియుండినది. ధరణికోటను 12-వ శతాబ్దమున కోటకేతరాజు పాలించెను. ధరణికోటలో నింకను బౌద్ధమతలేశ మున్నట్లు బుద్ధదీపారాధననిమిత్తశాసన దానములు సెప్పుచున్నవి. చక్రకోట్యమండలము (బస్తరు రాజ్యములో) ధారావర్షుఁడు రాజరాజునకు సమకాలికుఁడు. అతనికొడుకు సోమేశ్వరుఁడు, వజ్రపురము (Wairagarh) నాక్రమించి, మధురాంతకునిఁ జంపి వేంగిని దహించెనఁట. ఈతనిరాజ్యములో దక్షిణభాగము దెల్లు సీమయై యుండెను. పొత్తపిచోడులుగాక నెల్లూరి తెలుఁగుచోడులని కొందఱుండిరి. వారు నెల్లూరు ప్రాంతమున సామంత మండలేశ్వరులై యుండిరి. 12-వ శతాబ్దికడచువఱకు వారిలోఁ బ్రసిద్ధు లెవరును గానరారు. 12-వ శతాబ్దారంభమునందుండియు కాకతి ప్రోలరాజు,పొరుగు మండలేశ్వరులగెల్చుచుపూర్వము పశ్చిమ చాళుక్యులకు సామంతుఁడుగా మహాప్రధానిగా నుండిన వాఁడైనను స్వతంత్రించి త్రిలింగసామ్రాజ్యమునకుఁ బునాది

వేసెను. 1140 నుండి 1196 వఱకుఁ బాలించిన యతనికొడుకు శ్రీరుద్రదేవమహారాజు కర్నాటకచోడులను, వర్ధమానపురచోడులను, తైలపుని జయించి, పూర్వచళుక్యచోడసామ్రాజ్య మంతమొందిన దాది సంపాద్యమగుచున్న పశ్చిమచళుక్యరాజ్యాంధ్రదేశము కంతటికి చక్రవర్తి యయ్యెను. కాకతీయాంధ్రభానూదయముతో సామంతస్వాతంత్ర్యరాజ్యాంధకారములు చెదరిపోయినవి. చాళుక్యచోడవిభవచంద్రికలడఁగిపోయినవి.

ఇఁక సూచింపఁదగిన దొక్కటియె. 1199 లో మధ్వాచార్యుఁడు జనించెను. ఇతనితోఁ బ్రస్థానత్రయభాష్యత్రయము సాంతమైనది. న్యాయధర్మశాస్త్రగ్రంథపరిశీలనము, నిబంధనగ్రంథరచనము లారంభములైనవి.

---

## ౨ వాఙ్మయచరిత్ర

ఈయుగమునందలి సారసత్వమును విషయముంబట్టి యైదుభాగములుగా విభజింపనగును: 1. బ్రాహ్మణశైవకవిత, 2. వీరశైవకవిత, 3. శాస్త్రకవిత, 4. కావ్యకవిత, 5. నీతికవిత అని. ఇట్లేర్పఱచుకొన్నచో, నన్నయభీమన లొకప్రక్కను, నన్నిచోడ సోమనాథు లొకవంకను, మల్లనయొకదిక్కునను, భాస్కరుఁడొకక్రేవను, భద్ర ప్రతాపరుద్రు లొక్కకడను నిల్తురు. కాలమును బట్టిచూచిన ఆదిభాగమునకు నన్నయ మల్లనలును, మధ్యభాగమునకు సోమన నన్నిచోడులును, అంత్యభాగమునకుఁ దక్కినవారును జేరుదురు.

చాళుక్యరాజులు సాధారణముగ మతోద్రేకమునకుఁ బాల్పడక సామాన్య స్మార్తశైవము నవలంబించి యుండిరి. తదాశ్రితుఁడగు నన్నయయు కేవల బ్రాహ్మణమతోద్ధృతికి దీక్షగొని నట్లున్నదిగాని, వీరశైవ మించుకేని లేదు. తెలుగు విభేద మేర్పడిన తర్వాత స్వాతంత్ర్యముగ మారినకొలఁది నూత్న వ్యావహారికభాషానిరసనముచే కవులు పెక్కురు పలుపోకడలనను, పుట్టినకొన్ని గ్రంథములును విమతమతగ్రంథములై, ప్రవర్ధమానమగు వైదిక మతమువలన నణఁపఁబడుటవలనను, వర్ణధర్మప్రాధాన్యము లగు నాగ్రంథ ములన్నియు సంస్కృతముననే రచింపఁబడు పద్ధతికి కలవగుటచేతను, దేశీయకవితలో గ్రంథములు, మతార్థమై యనివార్యమగుటచేత, భారత ముండినను మరల దానినే వ్రాసెననుటయు సమంజసముగాదనను. నన్న యకుముందు గొప్పకావ్యములు లేవనియు, స్వతంత్రగ్రంథరచనయందు నన్నయయే మొదటివాఁ డనుటయుఁ జెల్లుచున్నది. కాఁబట్టియే యితఁడు "విద్యాదయితుం" డైనాఁ డాంధ్రకవిజను. "అధ్వరవిధానపుణ్యసమృద్ధి" మున్నగు విశేషణములఁబట్టి ఆంధ్రుఁడగు "కుమారిలభట్టు" ప్రవచించిన పూర్వమీమాంస వైదిక పద్ధతియే నన్నయమతమును, సందేశమును నై యున్నది.

భీమేశ్వరభక్తుఁడగుటయే [1]భీమనకవిని శైవబ్రాహ్మణుఁడని చాటుచున్నది. ఈతఁడు 'రాఘవపాండవీయమును,' 'నృసింహపురాణము'ను రచించె నందురు. అవి గన్పడవు. చాటువులు మాత్రమే మిగిలినవి.

---

1. భీమునిచేఁ జెరొక్కఁబడినవారనఁబడు 'మారన, పోతరాజుల' విషయములు కాలవ్యత్యాసముఁబట్టి సందిగ్ధములు. ఆపద్యములలో "భీమన" యని లేదు. తరువాతి యేరామకవియో, పరకవియో చెప్పియుండనగు. కన్నడబసవపురాణకర్త తండ్రి వేఱు. ఇంతకు నతఁడు తెనుఁగులోఁగవిగాఁడు. నన్నయకాలమువాఁడను జనశ్రుతి కేవల మసంగతము కానేరదు. నన్నయ

ఈతనిచేఁ బేర్కొనఁబడి సంఘచరిత్రలో నుక్తుఁడై రాజకళింగగంగు 1077 లో రాజ్యపాలకుఁడయ్యెను. కాన నిర్వురును సమకాలికులు. ఈతఁడీక్రిందిపద్యమునఁ దనస్వభావమును, నాకాలమున జనులకుఁ గవిత్వమునెడఁ గలభయమును స్వకీయశైలిని గన్పఱచినాఁడు.

"ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ ద్రాక్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకటనానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితి కళింగాధీశ కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువులు వేగం దెచ్చి లాలింపురా."

సుప్రసిద్ధుఁడును నానారాజాస్థానపర్యటనశీలుండును నైన, ఈకవి కృతులు లేనందున చాటువులంబట్టి "యుద్దండలీలావిలసితముగ", సామాన్యముగ నీయుగమునకు లక్షణమగు సంస్కృతపదాధిక్యముగలిగి యీతని కవిత ప్రవహించుచున్నదని మిన్నకుండవలసి యున్నది. ఇతఁడు జ్యోతిష విద్యాపారంగతుఁడు, నవితథవచనుఁడునఁట.

1150 తర్వాత వీరశైవము పుట్టినది. అంతకుముందే [1]మల్లికార్జునుఁడను నైయోగికారాధ్య బ్రాహ్మణుఁడు (పూర్వము పశ్చిమ చళుక్యులకడ

---

దనఁబడుభీమునిస్తుతించు పద్యమొకటి కలదు. ఈభీమనకవిగాక నింకొకండు 'కవిజనాశ్రయ' కర్తగానోపు. (కవిజీవితములు, ప్రబంధరత్నావళి పీఠిక చూడుఁడు) ఆనుమానికములు నిజములగు వఱకు నీతనిని నన్నయకాలములో నుంచుట మంచిది.

1 ముందు చెప్పినయది నిజమగునేని సరియే. "మాబల" శబ్దమున కర్థభేదమును గల్పించిన కవిచరిత్రకారుని మాట నొప్పుకొన్న 1160-వ సం. వచ్చును. ఆంధ్రచరిత్రకారు ననుసరించి రెండవ బల్లిచోడుని కొడుకన్న 1120-వసంవత్సరపువాఁడగును. ఇదియుఁగావచ్చును. ఎట్లయినను దిక్కనకుఁ బూర్వుఁడు, సోమనాథునికాలపువాఁడు నగుట తప్పదు. కీ. శే. లక్ష్మణ

దండనాథుఁడుగా నుండి) సన్న్యసించి శ్రీశైలమునఁ దపస్సు గావించుచు ననేకశిష్యుల కుపదేశకర్తయై యుండెను. ఈతఁడు 1030 మొదలు 1140 ప్రాంతమువఱకు నుండి యుండును. యోగు లనేకవత్సరములు జీవించి యుండుట కనేక నిదర్శనములు గలవు. ఏలయన, 1060 ప్రాంతమున నున్న నన్నెచోడుఁడు ఈతనిని గురువుగాను, కృతికర్తఁగాను చెప్పుకొన్నాఁడు. 1130 ప్రాంతమున యౌవనదశయందున్న పాల్కురికి సోమనాథుఁ డితనికి శిష్యుఁడే. ఇతఁడు శివతత్త్వసారము అను కందపద్యగ్రంథమునకుఁ గర్త. అది ఇప్పుడు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమును వీడి ముద్రణగాంచుటకు శ్రీ. శే. కే. వి. లక్ష్మణరావుగారివలన నోచుకొనినది. ఈతనికవిత్వ మించుక యన్వయకాఠిన్యము గలదయినను అనేకులకు మార్గదర్శక మైనది. ఈబాగరు మల్లయ్యతో మండంగి మాదిరాజు సంభాషించినాఁడు. [1]బసవేశ్వరుఁ డితని బోధనామృతమును గ్రోలినాఁడు. ఇమ్మహాత్ముఁడు శైవవాఙ్మయమునకు బ్రహ్మ వంటివాఁడు. ఇమ్మహనీయుని ప్రథమ కవిశిష్యుఁడు నన్నిచోడుఁడు. నన్నిచోడునకు కర్ణాటకవిత యాదర్శమైన ట్లున్నది. పైన రాజకవి కావున కన్నడఛందోవైచిత్ర్యములును, వీరయువకుల బుద్ధివికాసమును, శృంగారరసోత్కర్షమును ఈతనికవితకుఁ బట్టినవి. ఇతనికి మతావేశము కన్న సాహితి ఎక్కుడు. బసవేశ్వరునకు ద్వితీయకవిశిష్యుఁడు పాల్కురికి సోమన. ఇతఁడు బాల్యయౌవనారంభముల మల్లికార్జునుని తత్త్వబోధను, ప్రౌఢవయఃపరిపాకములో బసవ చెన్నబసవయ్యల మతోద్రేకమహిమను విన్నాఁడు; మాది

---

రావుగారివాదము ననుసరించిన మల్లికార్జును లిద్ద రగుదురు. 'శివతత్త్వసార' గ్రంథకర్తయగు పండితారాధ్య మల్లికార్జునుఁడు, నన్నిచోడుని గురువు మల్లికార్జునయోగి వేఱ్వేరని యందురు. ఔ నేమో!

1 బసవపురాణమును (శతకకవులచరితలో) పండితారాధ్యచరితమును జదువుఁడు.

నాఁడు. ఇతనికి కన్నడ వైదుష్యము సహజము. కాననే కన్నడకవి సోమరాజు (1222) ఇతనిని "సముదంచద్వృషభస్తవామరమహీజారాముఁడు" అన్నాఁడు. ఇతఁడనేక గ్రంథములఁ జేయుచుండినవాఁడు. ప్రౌఢవయోంత్యము నుండి బసవపురాణాదుల రచించి గురువైనాఁడు. [1]సంస్కృతమునఁ బండితుఁడై, వేదవేదియై, "అన్యవాదకోలాహలము," "బసవపంచగద్య," "సోమనాథభాష్యము" నను వానిని రచించెను. "బసవపురాణ," "పండితారాధ్య చరిత్ర"ల ద్విపదగాను, "అనుభవసార"మును బద్యముగాను రచించెను. [2]ఇరువురికవితలకుఁ బోలిక లున్నవి.

"నెట్టన నేలకు నింగికి సూత్రపట్ట" నను దానితో నారంభమగు "సోమన్న" ద్విపదతో "నేలయు నింగియుఁ దాళము ల్వాయింప" నను "నన్నిచోడుని" సీసమును బోల్చి చూడుఁడు. ఇర్వురును కవిరాజులే. ఇర్వురును "భాషావ్యుత్పత్తిలో సమధికులే." 1180 ప్రాంతమునకు సోమన్న పరమపదించి యుండును.

మల్లన్న పావులూరికి కరణము. ఇతఁడు గోదావరీమండలమువాఁడు. బ్రాహ్మణుఁడు. "మహావీరాచార్యుల సంస్కృతగణితసారసంగ్రహమును" ఆంధ్రీకరించెను. పద్ధతులే పరివర్తితమై యుండునవి. లెక్కలన్నియు మల్లన్న కల్పించి వేసినవే. సంస్కృతశ్లోకముతో గ్రంథ మారంభమైనది. కవి స్తుతి లేదు. శాస్త్రగ్రంథమును బద్యములలో నిముడ్చుట కష్టమని తజ్జ్ఞు లెఱుంగుదురు. అట్టిదానిని సరసముగ రచించుట, వ్యర్థపదావళి లేమి ఘటించుట కష్టతరము. అట్లయ్యును మల్లన, సులభమును,

---

1 సోమనాథుని దీక్షాగురువు గురులింగార్యుఁడు; వేదగురువు వేమనారాధ్యుఁడు; కవిత్వగురువు కరస్థలము విశ్వనాథుఁడు.

2 ప్రబంధరత్నావళి పీఠికలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన కాలవిషయికచర్చఁ జూడుఁడు.

సుశ్రావ్యమును నగు శైలిని గన్పఱచినాఁడు. ఇతఁ డొక సాహిత్యకృతి నొనర్చియుండినచో విమర్శకు పాత్రుఁ డయ్యెడివాఁడే. శాస్త్రగ్రంథ మగుట నేమి యని చెప్పక కవిచరిత్రకారుఁ డుదాహరించిన పద్యమును పాఠకుల కందిచ్చెదను.

చ. చెలికి షడంశముం బ్రియకు శేషములోపలఁ బంచమాంశముం
బొలుపుగ దాని శేషమున బోదకు నాలవపాలు నిచ్చి యం
దులఁ దనపాలు దాఁ గొనియెఁ దొమ్మిది జేనలు రాజహంస మీ
నలిన మృణాల మెంత సుజనస్తుత మాకెఱుఁగంగఁ జెప్పవే.

భారతము పంచమవేద మని ప్రసిద్ధికెక్కినది. అది ఇతిహాసము. చతుః పురుషార్థదాయకమైనది గాన 'జయ' మనఁబరగినది. వేదతుల్యమైనది గాన 'సంహిత' యైనది. వేదములకంటె బరువు గాన భారతమైనది. రామాయణము పురాణముగాదు. క్రమక్రమాగతధర్మోపదేశము[1]గాదు. కేవలము కావ్యము; కవితాక్షీరసముద్రము; రసనందనోద్యానము. పౌరాణికమతావేశియగు 'నన్నయ' కది యంతగా నచ్చలేదు గావలయు. నన్నయచోదునికి భాషాంతరీకరణము వలనుపడదు. సోమనాథునికి మతవైరుద్ధ్యము. మల్లనకు శాస్త్రరుచియేకాని, కావ్యరుచి కాఁ బట్టలేదు. ప్రతాపరుద్రుఁడు "విద్యాభూషణుఁడే" కాని విరామము చాలదు. ఇంతకు నతనికి నీతిపైన దృష్టి. కావున, నియోగియు, ప్రభుత్వాధికారవిలసితుఁడు, సరసుఁడు బ్రాహ్మణుఁ డయ్యు క్షాత్రసంపద వెలయుచున్నది కాన, ప్రశాంతగభీర శృంగారరసాత్మక మగురామాయణము భాస్కరుని మానసము నాకర్షించినది. "శాపానుగ్రహశక్తియుక్తుఁ డమలాచారుండు సాహిత్యవిద్యాపారీణుఁడు" నైన భాస్కరమంత్రి తగినవాఁడు కాఁడా? "సారకవితాభిరాము గుంటూరి(కొట్టూరి?) విభుని, మంత్రి భాస్కరు మల్లితామహునిఁ

1 కవులచరిత్ర.

దలఁచి, యైన మన్నన మెయి లోక మాదరించు న''న్నని తిక్కన చెప్పుకొన వలయు నన్న నితఁడు సామాన్యుఁడై యుండునా? [1]మంత్రిభాస్కరుని తండ్రి కేతన; త్రిభువనమల్లచోడదేవుని (1155) ప్రెగ్గడ. నెల్లూరి తిక్కభూపతికి (1216) భాస్కరుని తృతీయ తనయుఁడు సిద్ధన యామాత్య సచివుఁడు. తండ్రి కొడుకులకు నిరువదేండ్లు భేదము చెప్పినను 1170-1200 లోనివాఁడై కన్పడు నితండు రామాయణము నంతయు రచించెనో లేదో కాని కవిత్వమును బట్టి (హుళక్కి భాస్కరాదు లెవ్వరి కవిత్వమునకుఁ బోలిక లేమిని, సాహిణిమారుని వనఁబడు పద్యములు ప్రక్షిప్తము లని చెప్పఁబడి కొన్నిప్రతులఁ గానరానందున, నాశ్వాసాంతపద్యములు, ప్రథమ ద్వితీయాంతములుగఁ గన్పట్టుటచేతను, గ్రంథాదిని సంస్కృతశ్లోకముండుటచేతను శైలి పూర్వకవులనే తలపించుటవలనను) యారణ్యకాండము నితండు రచించె ననుట సత్యము.

మిగిలినవాఁ డొక్కప్రతాపరుద్రుఁడు. ఇతఁడు (1140-1196) కాకతీయాంధ్ర ప్రథమచక్రవర్తి. (ఇతని తండ్రియగు ప్రోలరాజుకాలమున నింకను సామ్రాజ్యనిర్మాణము జరుగుచుండెను.) విద్యావిభూషణుఁ డను బిరుదముఁగలవాఁడు. సంస్కృత 'నీతిసారరచయిత' యని ప్రతీతి. తెనుఁగు నీతిసారము మనప్రస్తుతాంశములోనిది. ఇతని రాజకీయశీలమును గుఱించి పరిస్ఫుట మగుచున్న పద్యములోనిభావముఁ గనుండు.

" ఆజ్ఞ లేని నృపుఁడు నరయఁ జిత్తరువులో
నున్నరాజుఁ జూడ నొక్కరూప
యానఁ ద్రోయు సుతుని నైనను దండింప
కున్న రాజ్య మేల నుండుఁ జెడక ?''

---

1 ఆంధ్రులచరిత్ర. 66-69; 333-339 పేజీలు.

తంత్రజ్ఞతను గుఱించి

> "తోడులేక యధిపుఁ డొడరుట యంబుధిఁ
> గలము లేక యీఁద గడఁగినట్లు."

అన్నాఁడు. ప్రజలను గుఱించి చెప్పుచు

> "చేపట్టి విడువవలవదు, భూపతికి కుటుంబమన్న భూమియకాదే"

యనినాఁడు. ఎంత యుదారభావము! స్వకృతమే కృతముగాని భృత్యులపై విడచి సోమరి గాఁగూడదు రాజను భావముతో

> "నెంత వొదలియున్న నేరండములు జీలు
> గులును, దారుకృత్యములకు నగునె?"

యని ప్రశ్నించినాఁడు. దూతలను దలంచి కాఁబోలు

> "వైరము ప్రియవాదులకును వసుమతి గలదే?"

యని తేల్చినాఁడు. ప్రపంచానుభూతి కలవాఁడు గావుననే

> "ధనమును, బ్రాతశ్ఛాయయు,
> వనితాజనయౌవనంబు, వండినయన్నం
> బును, గడుమూర్ఖస్నేహం
> బును నిల నివి యల్పకాలభోగ్యము లరయన్.

అని తర్కించుకొని నిశ్చయించుకొన్నాఁడు. మనమును దానికిఁ దలయూఁప వలసినదే కదా! నీతి లోకానుభవ ప్రతిబింబము. లోకోక్తులే క్రమముగా నీతు లగుచున్నవి. వైశద్యము లోకోక్తిగుణము. సాదృశ్యభావము దానికిఁ దోడునీడ. కార్యకారణవిమర్శ దాని కాధారము. రాజ, కోశ, రాష్ట్ర, బల, దుర్గ, విద్వజ్జన, భృత్యాదిపద్ధతులను నిజానుభవముతో విమర్శించి తేల్చినఁగాని రాజనీతి వెలయదు. రాజు గాన సాధారణముగ నితని పద్యములు రాజనీతినే యండఁగొని యుండును. సహజము లగునుపమలతో భావములను బెంపొందించినాఁ డనుట యితని గ్రంథప్రాశస్త్యము. ఇతని

కవితతోఁబాటు కర్ణాట, కాంధ్ర సంస్కృతభాషలయం దితనికిఁ గల యభిమానమును, పాల్కురికి [1]సోమనాథుల కితఁ డిడిన యగ్రవారములను, నితని సామ్రాజ్యధౌరంధర్యసాహితీపటిమలను స్మరించి ధన్యుల మగుదుముఁ గాక !

ప్రతాపరుద్రునిఁ దడవుటలో మహామండలేశ్వరుబద్దె(భద్ర)భూపతి [2]స్మృతికిఁ దట్టినాఁడు. కాలమున నెట్లో కాని కవితలో నీయిరువురు నొకే శాఖలోనికిఁ జేరినవారు. (ఇతఁడు 12-వ శతాబ్దిని దాటి 13-వ శతాబ్దార్థము వఱకు జీవించి యున్నట్లు నిదర్శనము లుండుటచేఁ దిక్కనయుగమునకుఁ జేరినవాఁ డనవచ్చును. కాని, వాఙ్మయ సామాన్యలక్షణమునుబట్టి వాఙ్మయ యుగమేర్పడి ఖండితముగా నిన్నవ సంవత్సరమునుండి యింతవఱకే యని చెప్పుటకు వీలు లేనందున, రాజకవి యగుటవలన, ప్రతాపరుద్రుని ప్రక్కన నుండఁదగినవాఁడు.) బద్దెభూపతి,'పరభైరవ, నన్నెచోడ నరేంద్రా'

---

1 గణపతికాల మని కాసె సర్వప్పద్విపద చెప్పెదు. కాని సోమన కాలమునాఁడు ప్రథమ ప్రతాపరుద్రుఁడే.

2 "నన్నయగంధవారణంబునకు" నను నుపమాన్వితమగు పదంబు నన్నయవారణుఁ డని దేల్చి కవిచరిత్రకారుఁ డెట్లో 1240-50 కి బద్దెన నీడ్చెను. 1166 లో నున్న సూరన సోమయాజికి పౌత్రుఁడై నంతమాత్రమున సిద్ధయమంత్రి 1250 వాఁ డగునా? తాతమనుమలకు నూఱేండ్లు భేదమా? దీని నాధారముగఁగొని చర్చింపవలసినదే లేదు. శాసన మున్నది. దానిలో 1261లో బద్దెన యున్నట్లు నిశ్చితమైనది. బిరుదావళి సరిపోయినది. ఇది భద్రభూపతి యవసానకాలము గావచ్చును. కవిత్వము సహజముగ యౌవన ప్రౌఢవయస్సులలోని దగుట ప్రతాపరుద్రుని తర్వాత 13-వ శతాబ్ది యాదిని గ్రంథము రచితమై యుండ నగును. ఉదాహరణపద్యములు కవిచరిత్రలో చూడుఁడు.

నన్నునగంధవారణా' యను వివిధనామములతోఁ దన్నే సంబోధించుకొని 'నీతిశాస్త్రముక్తావళి' యను గ్రంథమని యాంధ్రలోకసర్వస్వమునకుఁ బరిచితమైన 'సుమతిశతకమును' రచించెను. ప్రతాపరుద్రుని నీతిసారములోని పద్యములకు 'నీతిశాస్త్రముక్తావళి' లోని వానికి దగ్గఱ పోలిక లున్నవి. తనగ్రంథమును బద్దెన నీతియనియు, ప్రతాపరుద్రుని గ్రంథము తోపాటు పఠింపఁదగినదనియుఁ జెప్పుకొనియె. ఇతని 'సుమతిశతకము' లోని పద్దెమొక్కటియైన నేర్చుకొనని యాంధ్రుఁ డొక్కఁడును నుండఁడనవచ్చును. ఇతఁడు వ్రాసిన రెండవగ్రంథము మిగుల సులభమైనను పేలవముగాని యల్లికతో నొప్పారును; వినుట కింపుగొల్పును. పదములమృదుత్వము భావరమ్యత వెలయుచున్నవి. మహామండలేశ్వరుఁడై, చోళచాళుక్యాస్తమయము, కాకతీయోదయము చూచినవాఁడు కావుననే యిట్లనియె:

"ఉ. ఎత్తినకాలకాని సిరికెన్నఁడు నిల్చినకాల; నిల్వఁగాఁ
జిత్తములేదు గాన సిరిఁ జెందిననాఁడ పరోపకారముల్
హత్తిఁ గడంగి చేయుఁ డెడరైనఁ బదంపడి వేఁడుకొంద మన్
చిత్తమె కాని యిత్తమను చిత్తము పుట్టునె యెట్టివారికిన్."
" కోఽతిభార స్సమర్థానాం, కిం దూరం వ్యవసాయినాం."

అను శ్లోకార్థమును

"దూరము వ్యవసాయకులకు,
భారంబు సమర్థులకును వసుమతిఁ గలదే."

యని 'మహారాజ ప్రతాపరుద్రుఁడురచింపఁగా దానిలో మొదటిచరణమునకు

"పటుత్వముగలవానికిన్ గొలువు తద్దకురంగట"

యని బద్దెన వ్రాసెను. "కిం దూరం వ్యవసాయినాం" అనుటకు

"దూరము వ్యవసాయకులకుఁ గలదే" యని వ్రాసినదానినిఁ బోల్చి చూచిన బద్దెన పలుకే యర్థ సులభమై యొలిచిన యరఁటిపండువలె నుండ లేదా? ప్రతాపరుద్రునికడ రాజనీతిలో బలె కవితలోను సంగ్రహరచన. బద్దెన కర్థపుష్టిపై దృష్టి. సంగ్రహరచనలోను సమర్థుఁడని 'సుమతిశతకము' చెప్పుచున్నది. ప్రతాపరుద్రునందు రాష్ట్రవిమర్శనము, బద్దెనలో రాష్ట్ర ప్రజావర్తనములు రెండును గలిసినవి. రాష్ట్రప్రజాతత్త్వములతో వేదాంత తత్త్వమును జేర్చి స్థిరకీర్తిఁ గనుట వేమనయోగికి లభించినది.

---

## 3. కావ్య విమర్శ

ఈయుగమునకుఁ జేరిన నన్నయ, మల్లన, నన్నెచోడ, భీమన, సోమనాథ, ప్రతాపరుద్ర, భాస్కర, భద్రభూపు లెన్మిదిమందియును నాంధ్రమహాగ్రంథప్రథమయుగమునం దనేకశతాబ్దములనుండి యణఁగి యణఁగి యొక్కసారిగ సాక్షాత్కరించిన యాంధ్రవాఙ్మయ రాష్ట్రమునకి అష్టప్రధానులు వోలె నున్నారు. నన్నయపురోహితుఁడు. మల్లన కోశాధికారి. ప్రతాపరుద్రుఁడు యువరాజు. భాస్కరుఁ డమాత్యుఁడు. నన్నెచోడుఁడు దండనాథుఁడు. భీమనకవి దేశాంగమంత్రి. బద్దెన నర్మసచివుఁడు సోమనాథుఁ డేమి? "శుక్రనీతిసారము" చొప్పునఁ బేర్లు పెట్టిన సరిపోవునేమో? పాఠకులు నిర్ణయింతురుగాక !

1 "ఛందోనిబంధనచాతురీధౌరేయుఁడు" ను, "వాకప్రితోషితదక్షవాటీమహాస్థాన భీముఁడును' నగు భీమనకృతులు దొరకలేదు. ప్రతాపరుద్ర భద్రులనుగురించి చర్చించుకొంటిమి. మల్లన శాస్త్రకవి. ఇఁక మిగిలినవారు నన్నయ, నన్నెచోడ, సోమనాథ, భాస్కరులు. వీరి కృతులనించుకఁ దిలకింతముగాక !

---

1 చూడు కవిరాక్షసుని విషయము.

"వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్,
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనమ్."

నాగ నుతింపఁబడిన నన్నయయొక్క కృతిని నేను విమర్శించుటయా! ఈతండువ్రాసిన వనఁబడునవి. [1]చాముండికావిలాసము, [2]ఇంద్రవిజయము, లక్షణసారము, [3]రాఘవాభ్యుదయము, [4]ఆంధ్రశబ్దచింతామణియు నై యున్నవి. ఇవేవియును నన్నయవి గావనుట వలన, నింతను కవితను బట్టి ఇవేవియు శ్లాఘింపఁబడనందున వీనిని స్మరింపనక్కరలేదు. నన్నయకృత భారతములో మూఁడుపర్వములు. (మూఁడవపర్వములో సగము ఎఱ్ఱనది. ఆభాగము తప్ప.)

" ఆమూఁడు పర్వములలో
సామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దామ రచించిరి తిక్కన
ధీమణి మొదలైనతొంటి తెలుఁగు కవీంద్రుల్."

ఆమూఁడుపర్వముల రచనకు [5]కవిభవజ్రాంకుశుఁడు, సంస్కృత, ప్రాకృత, పైశాచి, కాంధ్ర, కర్ణాటభాషా కవిరాజశేఖరుఁడు. [6]నారాయణభట్టు

---

1 ఈగ్రంథమున నన్నయయుఁగలక్షణములుగాక తద్విరుద్ధము లుండుటచేఁ బరిత్యాజ్యము. 2 ఇంద్రవిజయ లక్షణసారములు నన్నయరచితము లనఁబడుచున్నవి. 3 రాఘవాభ్యుదయము మృగ్యము. 4 దీనిని పూర్వలాక్షణికు లుదాహరింపక అప్పకవినుండి ఇటీవలివారే పేర్కొనుటచేత, నన్నయ తరువాతి లాక్షణికులం దుదాహరింపఁబడుటచేత, కొన్ని భారతప్రయోగ విరుద్ధము లుండుటచేత, నన్నయభట్టీయమును తనగ్రంథమునకు ముందటి దని కేతన పేర్కొనఁడు గావునను, నీవ్యాకరణము నన్నయది కా దనఁబడినది. (చూడుఁడు: కవులచరిత్ర.) 5 నందంపూడిశాసనము. 6 నారాయణభట్టు, మల్లికార్జునపండితుఁడు వానసవంశసంభవులు. ఇరువురకును బాంధవ్య ముండెనేమో!

" పాకశాసనికి భారతఘోరరణంబునందు నారాయణునట్టు
దన కిష్టుఁడుర్వి సహాధ్యాయియు నై"

భారతరచనకుం దోడ్పడినాఁడు. (కృతిలోఁ దోడ్పాటన్న సగము కష్ట
మని తజ్జ్ఞులు తప్పక యెఱిఁగియుందురు కాన, భారతమును స్మరించునప్పుడు
నారాయణభట్టును విడుచుట దోష మగుచున్నది.) నారాయణభట్టు మన
కృతజ్ఞతలో నెన్నవవంతున కర్హుఁడో చెప్పరాకున్నది.

కావ్య ముత్పాద్యము (Original) కాదు. కావున విషయసంబంధి
యగు భావములను గుఱించి తలపెట్టనక్కఱ లేదు. మిగిలినది శైలి.[1] శైలిసాహా
చర్యముచే భావము మాఱి, విషయము సొంతమైపోవుట మహాకవి లక్షణము.
కాళిదాసు 'నభిజ్ఞానశాకుంతలములో,' షేక్స్పియరు 'హ్యామ్లెట్' నాటక
ములో నిదియే పరిస్ఫుటమగుచున్నది. కాని, నన్నియలో నాచమత్కృతి
యంతగా లేదు. విషయము భాషాంతరీకరించిన ట్లుండమియే కదా సొంత
మైనట్లు! ఇది స్వవచనవ్యాఘాతము కదా యని శంకింపకుఁడు. స్వచిత్తవృ
త్త్యనుకృతియగు శైలీపాటవముచేఁ గల్గు సంస్కారమువలననే కాక, తాదా
త్మ్యమువలనను భావము, తదంగమగువిషయము మాఱును. ఆదిభాషభారత
రచన మనర్గళధారానిబిడమైనది; ప్రశాంతమనఃప్రదర్శకమైనది; నానా
విషయ విపులమైనది. బ్రాహ్మణుఁడయ్యు నుద్ధురరణభూమిని సందర్శించిన
వ్యాసుఁడు కవి. తెనుఁగుభారతరచన మవిచ్ఛిన్నవాక్ప్రవాహము గలది;
ప్రశాంతగోదావరీగర్భమున ప్రతిధ్వను లీనినది. వివిధభాగ్యాకరమైన రాజ
మహేంద్రునికాలము! విప్రుఁ డయ్యును, రాజకీయకార్యముల నెన్నిం
టినో పాల్గొన్న నన్నయ కవి! వ్యాసుఁడు నన్నయలో నైక్యమొంది
యుండె ననుట సాహసముగాదు. "సులభగ్రాహ్యమైన సాంస్కృతిక

1 ప్రథమఖండము (అ) శైలి నిర్వచనముం జూడుము.

శైలియు" దానిలో నతిమనోహరనిరర్గళవాగ్వేగము నన్నయదే. సముద్రుని వెన్నంటి

"అలఘు ఫణీంద్రలోక కుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా
వలిగలదాని, శశ్వదుదవాసమహావ్రతశీతపీడితా
చలముని సౌఖ్యహేతువిలసద్బడబాగ్నిశిఖాచయంబులన్
వెలిఁగెడు దాని," భార. ఆది. ౨. ౨౮.

నను సమాసము లెట్లు పరుగిడినవో చూడుఁడు. ఇట్లు పఱుగిడు ధారయే

"బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్. భార. ఆది. ౧. ౧౦౪.

అనుటలో నెంత గంభీరమైనది? ఆగాంభీర్యమే

1 "ఏల యమ్ముని నాకు నిచ్చె నిమ్మంత్ర మిమ్మంత్రశక్తి యే నెఱుఁ
గంగ వేఁడి, యేలఁపుత్రకుఁ గోరి యెంతయు భక్తి నినుఁ దలఁ
చితిఁ బ్రీతి నినుఁడును నాకు, నేల సద్యోగర్భ మిచ్చె?"

భార. ఆది. ౫. ౨౮

నను కుంతీవిలాపములో మితమై పాత్రోచితభావప్రకటనకు దొరకొన్నది. ఈపాత్రోచిత మితవాగ్విన్యాసమే శకుంతలకథలో "ఏచితలిర్చి"న లతాకుంజములలో దాఁగుడుమూఁతలాడినది. పిదప నలోపాఖ్యానములో "తలిరులపాన్పులన్, చందన చ్ఛారుచర్చలన్" బొంపిరివోయినది. అసభ్య

1. ఈకుంతీవిలాపమును నన్నయ యొకపద్యమున ముగింపఁగా నెఱ్ఱన యనేకపద్యములు చేసె. అవి యర్థపుష్టములైనను పదాడంబరముఁ జూపక మానదు.

శృంగారమునకుఁ దావే లేదు. "శుచి సౌందర్యములు నిత్యసంయోగ ములన్న" లాక్షణికోక్తి కితని శృంగారరస మాదర్శము. శృంగారవర్ణన మౌ చిత్యశోభితము. ఈశృంగారమే యొకచోటఁ "గలసి యాడుచున్న యెలుం కలుఁబిల్లులు నొండు సహజ, వైరివర్గంబులయు సహవాసము"ను "జూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది" యనుటలో నెంతశాంతిమయ మైనది! జనమేజయ సర్పయాగములోని సంభాషణానుకూల్యము, కథాగమనత్వరీకర ణము చూడుఁడు. ఇతని "ప్రసన్నకథాకలితార్థయుక్తి" కన్పడును. [1]దృశ్య లక్షణము లన్నియుఁ బట్టువడినవి. అటులనే శకుంతలాచరిత్రము, నలకథ, కిరాతార్జునీయము, సౌగంధికాపహరణము మున్నగుచోట్లలో 'ఇతివృత్తము' కన్నులకుఁ గానవై ప్రత్యక్షస్ఫూర్తి యొదవినది. కావునే భారతారంభము నన్నయవంటిప్రతిభాశాలిచే పడుట మన యదృష్టమనవలసియున్నది. ఇతని కవితాస్రవంతి కోటిలింగములనుండి ధవళేశ్వరమువఱకుఁ బాఱుచున్న గోదా వరియే. ఏల యన నాదిపర్వములో నతుకులు గొన్ని దిద్దుకొని, సభాపర్వ మున నిస్సారముల సరిచేసికొని రాజమహేంద్రమున నేపారి, కనుచూపు మేరలో నారణ్యకాండమున నిండుదనంబునొందియు నెట్లో మఱుగుపడి నది. తర్వాత ఎఱ్ఱన కట్టిన యానకట్ట గానవచ్చుచున్నది. శ్లేషానుప్రాణిత ములు గాని పూర్ణోపమలతో, మృదులములు నర్థపుష్టములు నగుగద్యలతో వెల్లివిరిసిన నానాపురాణవిజ్ఞాన నిరతుఁ డగు నితని కవితలు

"సుధాంశు వికీర్యమాణ కర్పూరపరాగ పాండురుచిపూరములఁ బరిపూరితము" లైనవి.[2]

---

1 బుఱ్ఱా శేషగిరిరావు పంతులు (13-వ సంవత్సరాది సంచికలో.)

2 నన్నయభారత మాగిన గాథ విచిత్రముగనున్నది. కొంద ఱన్న ట్లరణ్యములో క్షయసూచనలు గన్పడవు. నన్నయ నారాయణభట్ట రాజరాజనరేంద్రులమరణములలో నెద్దియో కారణ మని యూహించెదను.

నన్నెచోడుని కుమారసంభవము పండ్రెండాశ్వాసముల కావ్యము. కాళిదాసోద్భటుల కృతుల ననుసరించినది గాన నిదియు భారతమువలె ననుత్పాద్యమే. కాని, మూలానుకృతి నియమములేక స్వతంత్ర రచన యగుటవలన మిశ్రమ మనవలసి యున్నది. ఈతనిపద్యములలో "అగ్గొమ్మునం జేయిడి నిద్రవోయిరి." "అఱపొఱగు," "తొడి" యను ప్రయోగములు నన్నయ నీతఁ డెఱింగి యుండెనో, లేక తద్భారతము నీతఁడు చదివియుండు టనో సూచించుచున్నవి. ఈతనిపద్యములు భారతమునకన్నను సంస్కృతభూయిష్ఠము లనవలయును. కొంతకాఠిన్య మట్టిచోట్లనున్నను పదసారళ్యము వెలయుచున్నది. భారతప్రయోగము లున్నను, మొత్తము పైన కవి కర్ణాటకగ్రంథపఠనము మిక్కిలి గలవాఁడై తత్కవిత ననుసరించినట్లు స్పష్టమయ్యెడిని. [1]ఇతనిపోకలను సమకాలికులో తర్వాతివారో యగు కన్నడ కవులు కొందఱు నేర్చుకొనిరి. (1105 లో నున్న నాగచంద్రుఁ డట్టివార లలో నొకఁడు కావచ్చును.) వెంచెయొల్, కండపడము, కొలవెళ్లు, వెంచలు మున్నగుపదములు దొర్లినవి. ఎయిదనేరలి, పొండిగ, మూండు, ఉంగుటము ఉన్నాతఁడు మున్నగు చిత్రప్రయోగములు చిక్కుకొన్నవి. గణపతి

---

1 కవిచరిత్రలో వ్యత్యస్తముగాఁ జెప్పఁబడినది. త్రైలోక్యమల్లుని (1127) శాసనములోని పద్యము తద్వంశీయుఁడు కవియుఁ, పూర్వుఁడు నగు నన్నిచోడునిదనియే యేలచెప్పఁగూడదు? నాగచంద్రాదులు తెల్గురాని కవులని ఎవరు సెప్పిరి? కన్నడాంధ్రకవులు కలసి మెలసియే యుండి రని నన్నయనారాయణులు సాక్ష్యమిచ్చిరి గాదా? కొన్నిచోట్ల కన్నడపదములనుగూడ చొప్పించిన నన్నెచోడుని కవితనుండియే, భావముల నితరు లేల గ్రహించియుండరు? గ్రహించు టనుచితమైనచో నన్నెచోడుఁడు గ్రహించుటమాత్ర ముచితమా? ఇప్పటికిని కన్నడులు కొన్ని తెలుఁగుగ్రంథముల ననువదించుచున్కి వింతకాదు గదా?

జనన సతీదహనములతో రెండాశ్వాసములు ముగిసినవి; పశుపతి తపము, పార్వతీకృతశుశ్రూష మూఁడవయాశ్వాసము. వసంతాది పరివారసన్నాహము, రతి వలదని యుగ్రనిబలమును బ్రశంసించుట, పార్వతీసాన్నిధ్యము మిషగాఁ గల మదనాటోపము, కామదహనము, నాలు గయిదాశ్వాసముల నైనవి; పార్వతినడక సౌందర్యముతో ఆటవిక స్త్రీరూప సౌందర్యముతో ఋషికుమారికాలావణ్యముతో గౌరీవనగౌరీరూపసామ్యనిరూపణముతో జిగిమీఱిన షష్ఠసప్తమాశ్వాసములు పార్వతి తపస్సును వర్ణించినవి. తక్కిన యాశ్వాసములు పార్వతీవివాహ, కుమారోదయ, తారకాసురసంహార, విశ్వకల్యాణములతో నిండుకొన్నవి. ఇతని వర్ణనాదు లత్యద్భుతములు. "మెఱుఁగిచ్చి తీర్చిన" సజీవచిత్రములు. ఈమహాకవికవిత్వములో "పొలసి+ఆడు=పొలసాడు", తొడరి+ఆడు=తొడరాడు" ప్రభృతి క్త్వార్థక సంధులును, శస ప్రాసయు, "పుడమిపుఁడుక్" అను ప్రయోగమును "అచ్చరు" వను నపరూపమును బాటింపఁదగినవి కావు. విషయనివేదనమైనది.

శైలి ప్రబంధలక్షణ సామాన్యమైనది. ఒక్కచో "హారహాసాకాశగంగాత్యమల జలమరాళాబ్జనీహార"ములతో నర్థపుష్టమగు పదాడంబరమున తులఁదూఁగి, "ఒక్కతలకు మొగములు రెండైనపగిది," "ప్రియులగాఢాలింగనమునకుఁ జిక్కి", "పిఱిఁడిపాఱుఁడు వీఁడు సర్వవధ్యుండెడ సేయకుండు శివదూషకు నాలుకఁగోసి యుప్పు నింపుండని", మతోద్రేకమునకుఁ బాల్పడి, "ఏసియు వైచియుఁ బొడిచియుఁ గేశాకేశిఁ బెనఁగి," "యతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయి," నన్నరతిసాంత్వవచనంబులతో మెత్తనయి, "దొలఁకాడ మిన్నేరు వెలివిరిసెనో" యన్నట్లున్న వెన్నెలలో నోలలాడినది. కాన నీక్రిందిఫలితార్థము లిందు తేలినవి. భావి త్రిలింగకావ్యప్రబంధలక్షణము లన్నియు నించుమించుగా నీశైలియందుఁ గలసియున్నవి. అంత్యానుప్రాసలు, స్త్రీప్రత్యంగవర్ణనలు, విపులభావప్రకటనలు నిండు

కొన్నవి. నన్నయ పురాణకవితకు మార్గదర్శి యయ్యెను. తర్వాత తిక్కన, మారన, ఎఱ్ఱన, సూరన, ఘంటమల్లయ్య, నంది సింగనలు పురాణకవితాధోరణిని బెంపొందించిరి. నన్నెచోడుఁ డటులనే కావ్యప్రబంధకవితాఫక్కికి మార్గదర్శియయ్యె. దీనికిఁ జేరి శ్రీనాథుఁడు బెంపుఁగూర్చెను; పెద్దన విపులీకరించెను; తర్వాత భట్టుమూర్త్యాదులు శ్లేషను జేర్చి కూర్చిరి; మార్చిరి; ఇంకను నర్వాచీనులు చెఱచిరి.

పాల్కురికి సోమనాథుఁ "డప్రమాణ బసవద్విపద పురాణ"మని బ్రాహ్మణు లీసడించుకొన్నను విడువక ప్రతాపరుద్రునిఁ జూచి, శత్రులజయించి, యగ్రహారములు సంపాదించి, ద్విపదనే వృద్ధిచేసిన ఘనుండు. "ఆరూఢగద్య పద్యాదిప్రబంధ-పూరితసంస్కృతభూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబు గామి-జాను దెనుఁగు విశేషప్రసన్నతకు, నట్టులుగాక కావ్యప్రౌఢి పేర్మి-నెట్టన రచియింప నేర్చినఁ జాలు, నుపమింప గద్యపద్యోక్తదా త్తకృతులం ద్విపదయు సమము" అని యాకాలపు టూహను సంస్కరించినాఁడు. సమకాలికుల యభిప్రాయమున కెదు రీఁదినాఁడు. కవిత యేరూపమున వ్రాసినను ఒక్కటే యని యుద్ఘాటించినాఁడు. సమర్థులకు కార్యసిద్ధి సత్త్వమునం దుండునే కాని యుపకరణముల లేదుగదా? చంపువులకన్న ద్విపదలో నొకవిశేషమున్నది. ద్విపద పాటగాఁబాడుట కనుకూలమైనది. అనుష్టుప్పుతో నారంభమై వృత్తముతో మాఱి గద్యపద్యవిమిశ్రముగా చంపువులో పర్యవసించిన సంస్కృతసారస్వతము సన్నయాదు లవలంబించిరి గావునను, తెలుఁగుభాషయు, ప్రాసములు, ఛందము, చంపువులకుఁ బూర్తిగా నవకాశ మిచ్చినందునను, పురాణములు పఠనమున కుద్దేశింపఁబడి వ్యాఖ్యానముల కాస్పదములు గావునను, నాటకకళ చంపువులో నిమిడి యుండుటవలనను, చంపువులే ప్రధానముగానుండు నవసరమున సోమన్న ద్విపదలో రచించు టేమిబాగందురా? సోమన స్వతంత్రుఁడు; కర్ణాటక

భాషాభిజ్ఞతయం దసమానుఁడు; నూతనమతోద్రేకసంపూరితుఁడు; వైలక్షణ్యా మున్నఁగాని యాకర్షణము గలుగదని యెఱింగినవాఁడు. ఇంతకును మత వ్యాప్తి పామరజనానుకూల్యము. స్వమతచరిత్రరచనోత్సాహము ముప్పిరిఁ గొన, కార్యసిద్ధికై యాలోచించిన వివేకశాలి. గీర్వాణమున కనుష్టుప్పు వలె, తెల్గునకు ద్విపద యాది, యాధారము నని గ్రహించెను. కాన, ద్విప దలో 'పండితారాధ్యచరిత్రమును,' 'బసవపురాణమును,' రచించినాఁడు. సామర్థ్యనిరూపణనిమిత్తము కొంతోలు పద్యములలో 'ననుభవసారమును' వ్రాసెను. విపులవర్ణనావైశద్యపటిష్ఠమగు "చిత్ర" ప్రదర్శనకౌశలమును, తేటతెలుఁగులోని కులుకుందనమును, పాదములలో నర్థపటిమకుఁ జేసిన విఱుపులును, జాతీయములగు నుడికారములసొంపును, నేఁటికాలమున వేంకట పార్వతీశ్వరులరచనములఁ గాన్పించుచున్న ఏకపదపునఃపునరావృత్తియును నితనికవితలోఁ గుదురుకొనినవి. పాత్రముల కుచితము లగుభావములును, భావోద్దీపనమును జేయఁగల పదముల వన్నెచిన్నెలును, నితఁ డసమాన ప్రజ్ఞతోఁ బ్రదర్శించెను. ఆంధ్రమున నాద్యమైన యనుష్టుప్పువంటి ద్విపద గంగావాహిని యజ్ఞాతమగు ప్రాచీనాంధ్రసారస్వతాంబరంబున నెట డాగి యుండెనో మన మెఱుంగముగాని, శివజటాజూటమునుండి వెలువడినట్లు, సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రల ద్వారా, ననర్గళముగఁ బ్రవహించినది. ఆగడుసుపోకలను, ఆభావతరంగములను, ఆజాతీయముల మర్మరధ్వనులను, తర్వాతికవులలోఁ బెక్కురు సంగ్రహించికొని రనుట వాస్తవము. ఇతని ద్విపదలో

"తొలికోడి కనువిచ్చి నిలిచిమై వెంచి
జలజల ఱెక్కల సడలించి నీల్గి
గ్రక్కునఁ గాలార్చి కంఠంబు విచ్చి
ముక్కునఁ నీకలు చక్కాలిప్పి కడుపు

తెక్కించి మెడసాచి నిక్కి మిన్నూచి

కొక్కొరో కుర్”

అని కూఁతవెట్టి కవులను ప్రబోధించినది. చౌర్యద్యూత్యవిటత్వప్రభృతి వివిధ విషయములను, తనకాలములోని చండాల యాదవ (గొల్ల) ప్రముఖజాతి వేషములను నితండు వర్ణించియుండు విధానముం జూచిన నితని సర్వంకష ప్రజ్ఞ ఎవరికేని గోచరింపకపోదు. ద్విపదలోఁ బ్రాస యతిని జూపి స్వాతంత్ర్యమును గాన్పించిన దిట్ట. ద్విపదకవిత్వము నల్లువా రెల్లరు నితనికడ విద్య నభ్యసింపవలసినదే! శ్రీ సీతారామాచార్యులఫక్కి కితఁ డైదవతరగతిలోఁ జేరియున్నను, కవిసార్వభౌములలో నితఁడు సేరఁదగినవాఁడనియు, నీయుగంబున నీతఁ డొక్కరీతిగా నధ్యక్షుండనియుఁ దీర్మానింపనగు.

ఇతని కవిత “మధురోక్తులింపడర, మెచ్చులు దీటుకొనంగ, నర్థసంపద దళుకొత్త సాంగముగ పామరుల యుల్లములు బల్లవింప” నెగడినది. ఒక్కొకచో

“దానానేకమహాతపోనిచయ సద్ధర్మౌఘతీర్థాఖిల

స్థానస్తోమజపవ్రతప్రణుతయజ్ఞవ్రాతమంత్రోక్త ని

త్యానుష్ఠానవితాన”

నిరసనములలో దీర్ఘముగా సాగిపోయినను సాధారణముగా చిన్నచిన్నసులభ సాంస్కృతిక దేశీయసమాసములుగా నెడతెగని ధారాశుద్ధిగలది యీతని శైలి. “పెద్దలఱేఁడు, పెన్నుద్దుల మొదలు, బుద్ధులప్రోక, విబుధనిధానంబు, అమితవచోరాశి, సుమనోనురాగుఁ” డగు జంగమదేవర యితనికి గురుఁడు. “బసవ కింకరుఁ డ”గు నితనికావ్యములు సుప్రసిద్ధములై కన్నడింపఁబడినవి: తెలుఁగుపద్యములలోనికి మార్పఁబడినవి. ఇతఁడు గౌరన, కోనేరుకవి, రంగనాథుఁడు, తిమ్మకవి మొదలగువారి ద్విపదకావ్య ఫక్కికి విద్యాదయితుండు.

ఇంక నాచనసోమన, పోతన, మడికి సింగనాథు లేపక్కికిఁ జేరినా రను ప్రశ్న పుట్టకమానదు. వీరు భాస్కరునితో నారంభమైన విపులకావ్య కవితకుఁ జేరినవారు. భాస్కరుని కవిత్వము ప్రబంధముల తల్లి యిప్పుడు వర్ణనలకుఁ బోలేదుకాని, ప్రబంధములకు సంబంధించినయలంకృతులను మాత్రము గైకొన్న దనవలయు. ఇతని రచనలు ప్రబంధములలో వర్ణనల దలంపునకుఁ దెచ్చునేకాని, హద్దులేని కష్టలబ్ధధారాసహ్యాతకుఁ బాల్పడి సందర్భౌచితిని విడువలేదు. పురాణకవితలో నర్థగౌరవమును సందర్భౌచిత్య మును మేళగించినవి; విపులకావ్యకవితలో సందర్భౌచితియు, రసావేశమును బెనఁగొనినవి; రెండుగా చీలిపోయిన పిదప వస్తువిషయమే విస్తృతమై వర్ణనమే లక్ష్యమైపోయి, యష్టాదశవర్ణనలు శాసనములై శుద్ధప్రబంధముల సృష్టించినవి. అంతటితోఁ గవిత యాగి 19-వ శతాబ్దియందుఁ బూర్తిగా దృష్టి గద్యముపై నిగుడ్చినది. ఆగద్యమున కాది నన్నయభారతములోని సల లితవచనభాగములను చిన్నయసూరిగ్రంథముతోఁ బోల్చినవారి కీయుగము నందే యని తేటపడుచున్నది.

భాస్కరుఁడు వ్రాసిన యొక్క పద్యమును జూడుఁడు:

"పుణ్యచరిత్రుఁ డత్రిమునిపుంగవు వీడ్కొని రాముఁ డంచితా
గణ్యగుణాభిరాముఁ డుపకంఠమునం జని కాంచె దండకా
రణ్యము సిద్ధసంయమివిరాజితచారుతపోనుజాత స
త్పుణ్యము, నిర్మలాంబువరపుష్కరపూర్ణసరోవరేణ్యమున్."

ఆపోతన్న తలంపునఁ దట్టుటలేదా? పద్మపురాణకర్త మడికి సింగన్న స్మృతికి రాఁడా? ఇది కేవలశబ్దఛాయ. శ్రీరాముఁడు విరహవేదనాతురుఁ డైన సందర్భమును జదువుఁడు. మాయామృగకథనముం బఠింపుఁడు. [1]జిగిబిగి

---

1 "పాటితదుష్టసత్త్వవనవాటిక" మొదలగు పద్యము లుత్పన్నములై యివి యితని యితరకాండపద్యములా యనిపించును. సత్యము.

గల్గిన రసప్రవాహములు పాఱుచున్నవి. ఇట్టి పోలికలే కదా నాచన సోమునివి.

నాచనసోముని దివ్యమార్గమును మృదులముఁజేసి సాంగోపాంగము చేసినాఁడు పోతన్న. మువ్వురిధారలను బోల్చెఁడు. భాస్కరుని [1]కవికవి యన్న సాహసోక్తి కానేరదు. కావుననే భాస్కరుఁడు "సకలసుకవిజన వినుతయశస్కరుఁ" డైనాఁడు.

---

## ౪. యుగలక్షణసమన్వయము.

1. ఈకాలము కవులకు గ్రంథాదిని సంస్కృతశ్లోకమును వ్రాయుట యాచారము. (తర్వాతి కవులలో విన్నకోట పెద్దన ఈపద్ధతిని పాటించెను.)
2. మధ్యాక్కరలు విశేషము వాడుకలో నున్నవి.
3. సీసపద్యములు ప్రాసయతితో మొదలిడిన ప్రాసయతితోను, ఆద్యక్షరయతితోఁ బ్రారంభించిన నాద్యక్షరముతోను, పద్యాంతము వఱకు నుండును గాని మిశ్రిత మగుటలేదు. (చూ. నన్నయ సీసములు.)
4. ఆంధ్రవాఙ్మయములో నున్న నవవిధకవిత్వములో నాటింటికి నీయుగములో దిట్టము లగు పునాదు లేర్పడినవి.

---

1 'కవికవి' యనుట 'సకలసుకవిజనవినుతయశస్కరుఁ' డనుటలోనే సిద్ధించినది. 'రసవిస్ఫురకవితావిలాసము' గలవాఁ డనియే కాని నన్నయాదులకన్న ఘనుఁ డని తారతమ్యబుద్ధితో 'కవికవి' యని చెప్పలేదు.

'స్పెన్సర్' కవికవి యనఁబడెను గాని 'ఛాసర్' కంటె గొప్పవాఁ డందుమా? లేదు.

[1]పురాణ, విపులకావ్య, కావ్యప్రబంధ, ద్విపద, [2]శతక, గద్యకవితలు పేర్కొనఁబడినవి. వీరగీత, నాటక, గేయము లుండెనో లేదో మనకుఁ దెలియదు.

5. సాధారణముగాఁ బ్రతిభకన్న వ్యుత్పత్తి యెక్కువగాఁ గన్పడుచున్నది. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రాదులు దక్క స్వతంత్రపథంబును జాటుగ్రంథము లేవీ? గ్రంథములించుమించుగా నన్నియుం ననువాద్యములే.

6. సోమనాథ నన్నెచోడులు షష్ఠ్యంతముల నారంభించిరి.

7. వాఙ్మయరంగము గోదావరీతీరము, రాజమహేంద్రవరము.



1 పురాణ, విపులకావ్య, కావ్యప్రబంధములు వరుసగా Myth, Epic, Romance లను బోలియుండును. తెనుఁగులో లక్షణమిశ్రణమఁ ఘటిల్లినందున, నవియే ఇవి యనుటకు వలను పడదు; కాని, తత్తద్భావములు ప్రాధాన్యమును వహించి యుండును. జాతులు భిన్నములు; వాఙ్మయములు నటులే.

2 శతకకవితకు సుమతిశతక ముదాహరణము. ఈయుగమున నాధ్యాత్మికసంపద నగ్రగణ్యుఁడు, పండితేంద్రుఁడు నగు 'పండితారాధ్యుని' శివతత్త్వసారమును శతకమంద్రు. సోమనాథుని వృషాధిపశతకము చక్కని ధారతో నెసఁగుచున్నది. ద్విపదకవితకుఁ బలె శతకకవితకు (నొకే మకుటము గల నూఱుపద్యముల కృతిరచనకు) నితఁడే ముఖ్యుఁ డనవలసి యున్నది.

## ౨. కాకతీయయుగము: (1201.—1380.)

### ౧. సంఘచరిత్ర

ప్రథమప్రతాపరుద్రమహారాజు 1140 మొదలు 1196 వఱకు పాలించెను. అతనికి సంతానము లేనందునఁ గాఁబోలు, అతని తమ్ముఁడు మహాదేవరాజు (1196—1199) మూఁడేండ్లు రాజ్యమేలెను. ఇతఁడు జైత్రపాలుఁడను యాదవ రాజుచే వీరమరణము నొందింపఁబడిన తర్వాత నతనికొడుకును, చంద్రగుప్తాశోక, విక్రమాదిత్యపులకేసి, హర్షవర్ధన రాజరాజ (చోళ) ప్రభృతిచక్రవర్తుల వరుసలోఁ జేరిన వాఁడును, మహాకీర్తియు నగు శ్రీగణపతి దేవసార్వభౌముఁడు సింహాసన మెక్కెను. కరికాలవంశపువాఁడగు బేలు రాజు సంతతికిఁ జేరిన మనుమసిద్ధిరాజునకుఁ దనయుఁడగు తిక్కతెల్గుచోడభూపతిచే, పేరుమాత్రము చాళుక్యచోడ సామంతులని యున్నను, స్వతంత్రులై నెల్లూరు మొదలుకొని సింహాచలము దాఁక వేంగినాటి కధిపతులై యుండిన వెలనాటి భూపతులలోఁ గడపటివాఁ డగు పృథ్వీశ్వరమహారాజు పండ్రెండవశతాబ్దాంతమున, చాళుక్యరాజ్య మంతరించుట వలనఁ గాఁబోలు, బలహీనుఁడై యుండి నిహతుఁ డయ్యెను. ఆతిక్కభూపతి తనకు సార్వభౌముఁడై యుండిన రాజరాజ చోడుని పునఃస్థాపితుం జేసి కీర్తిగాంచెను. ఈతిక్కభూపతియే తిరుకాళుఁడనియుఁ బిల్వఁబడెడువాఁడు. ఇతని సభలోఁ బెద్దయ(జక్కనతాత) యాస్థానకవి. తిక్కనమహాకవి పెద్ద తండ్రి-సిద్ధనామాత్యుఁడు మంత్రిగానుండెను. తిక్కభూపతి

(1210—1245)కిఁ బిమ్మట నతనికొడుకు మన్మసిద్ధి నెల్లూరిలోఁ బట్టము కట్టికొనెను. కాని, యదృష్టశాలి కాకపోవుటచే పద భ్రష్టుఁ డయ్యెను. తిక్కనకవిద్వారా కాకతీయగణపతిచే రాజ్యము నొందెను. పసుల బీళ్లలో మేపుకొని పుల్లరి చెల్లిం పని కాటమరాజు ప్రజలవలన తగవుగలిగి, తన్మూలముగా కాటమరాజుతో పోరాటము గలిగి 1260 తర్వాత మన్మసిద్ధి మడిసె నని యందురు. ఆపోరితములో సిద్ధన కుమారుఁడు ఖడ్గతిక్కనశౌర్యము అపారముగ వర్ణింపఁబడినది. తెలుఁగు చోడులకును,గణపతిసేనానులకును పోరాటము లప్పుడప్పుడు కల్గియుండవచ్చును. ఎట్లయిన నేమి? గణపతికాలమున తెల్గు చోడులు లొంగిపోయిరి; అంత్యమున తద్రాజ్యమే గణపతికైవ సమయ్యెను.వెలనాటిచోడభూపతులు సమసినతోడనే చెదరి యున్న వెలనాటి మండలేశ్వరు లెల్లను లోఁబడిరి. ధరణికోట కేతరాజునకు గణపతిచెల్లెలు మేళాంబిక (కుండాంబ ?)యొక్క కూఁతురు బయ్యలుదేవి భార్యయగుటవలన, నతవాటిసీమ(నైజాములోనిదగు మధిరె జిల్లా)కు రాజగు రుద్రరాజునకు నై మేళాంబిక సతీమణి యగుట వలన వెలనాఁడు సులభముగా జయింపఁబడెను. కృష్ణామండలములోని తెనుఁగు నాయకుల వశులైరి. వెలనాటి చోడరాజుల సేనానులైన పిన్నచోడ దులను జయించి, పిన్నచోడుని కూఁతుండ్ర నారమ్మ పేరమ్మల పెండ్లాడి వారిసోదరుఁడగు జయపనాయకుని గజాధ్యక్షుని జేసెను. విశ్వేశ్వర శివదేశికుని (శివదేవయ్య) సచివాగ్రణిగాఁ బడసి శైవమతవ్యాప్తిఁ జేయుచు గోపరాజు రామయ్య (బ్రాహ్మణుఁడు) అనంతపురము బళ్లారి నెల్లూరు కర్నూలు

గుంటూరు ప్రాంతముల సర్వాధికారము నెఱపుచుండిన ప్రతి నిధి గంగయ సాహిణి, తనకు నగరపాలకుఁ డగు యేచమనాయఁడు మున్నగువారి నాదరించుచు రాజనీతిలో నద్వితీయపరాక్రమము, నౌదార్యము గలిపి గణపతి కృతార్థుఁడయ్యెను. గణపామాత్యుఁడు మున్నగు బ్రాహ్మణుల ననేకులఁ బోషించి యున్నతికిఁ దెచ్చిన దెట్లుండినను, జైనులను జంపించుటీతనికి గొప్ప కళంకముగా నున్నది. [1]అద్వైతవాది యైనవాని కిది చెల్లునా? అద్దంకి రాజధానిగా నేలినవాఁడును, గణపతి సామంతుఁడును నగు శారంగపాణిదేవుఁడును బ్రాహ్మణపక్షపాతియై యుండెను. వెలమపద్మనాయకు లితనికి సహాయులు, విధేయులు నై యుండిరి. (బాపట్ల తాలూకా మోటుపల్లి యగు) వేలాగరమును రేవుగా నుద్ధరించి విదేశవాణిజ్యమును బెంపొందించెను. మొత్తముపైన నితనిది ధర్మపాలన మని ప్రశస్తి గల్గినది.

ఇతని కూఁతురు రుద్రాంబ (1261-1295) గణపతికిఁ బిదప రాజ్ఞియయ్యెను. "చతురకులజు"లైన నాయకు లెల్లరును, రాజపరమేశ్వరుని చాతుర్యముచే నైకమత్యము గలవారుగఁ జేయఁబడియుండిరి. పృథ్వీశ్వరమరణానంతరము పూర్వము చాళుక్యవంశజుఁడై పిఠాపురమున నభిషిక్తుఁడైన మల్లపదేవున కీమె భార్యయై రుయ్యమ్మ, ముమ్మక్క యనువారలఁ గని యుండెనని ప్రతీతి. ఈమె సేనానులు ప్రసిద్ధులు. వారిలోఁ గోన గన్నారెడ్డి యొకఁడు; [అతని తమ్ముఁడు విఠలనాథుఁడు; అతనికొడుకు బుద్ధరాజు; అతని కొడుకు లచ్చన, విఠయ;

1 ఏనమదలలోని గణపాంబశాసనము.

కాటఁ(చ)యయ; కూఁతురు కుప్పాంబ, గుండదండాధీశుని భార్య] నెల్లూరుసీమను పాలించు నాగదేవమహారాజొకఁడు. (ఇతని కుమారుఁడు గన్నమంత్రి.) వీరశైవులగు త్రిపురాంతక అంబయ లప్రతిమానవిక్రములు...

ముమ్మడమ్మకు చాళుక్యవీరభద్రునకు జనించినరుద్రుఁడు ద్వితీయప్రతాపరుద్రుఁడై 1295 లో పట్టాభిషిక్తుఁ డయ్యెను. నవలక్షధనుర్ధరు లతనిక్రింద నుండిరి. నాగయ గన్నయ ఇతని మంత్రిగా నెగడెను. తక్కినమంత్రు లిందులూరి రుద్రరాజు, బెండపూఁడి యన్నామాత్యుఁడు (ఈతఁడు విప్రుఁడు). సాహిణిమారఁ డశ్వసైన్యాధ్యక్షుఁడు బుద్ధారెడ్డికిఁ గొడుకు. శ్రీశైలప్రాధాన్య మెడతెగకనే వచ్చుచుండెను. శైవమతాచార్యబాధ కనేకులు జైనులు వలస పోయిరి; కొందఱు వైష్ణవులైరి; కొంద ఱుత్కలమహారాజుతోఁ గుట్రచేసి ఢిల్లీచక్రవర్తుల దాడివెడలుటకుఁ బ్రోత్సహించిరి. మైలారుదేవుని పూజయు, ఏకవీరామహోత్సవమును, భైరవార్చనలు నాఁటిప్రజామతోద్రేకమునకు లక్షణములు. వీరపూజలు స్వర్గమున కేఁగినవీరుల ప్రతిమలకుఁ జేయఁబడుచుండెను.

దేశములోని జైను లింటిశత్రువులు. దేవగిరిరామదేవుఁడు సమకాలికుఁడు. మనస్స్పర్ధలు పెరుఁగుచుండెను. ఇంతలో నల్లాయుద్దీను దండయాత్రసాగినది. రామదేవుఁడు సామంతస్థితికి వచ్చెను; ఓడిపోయెను. రెండవయాత్ర సాగినది. రెండవసారి జయలక్ష్మి మహమ్మదీయలను వరించెను. అయినను రాజ్యము భగ్నము గాలేదు. నాల్గవసారి తుగ్లఖు కొడుకు అలూఫ్ ఖానుఁడు దండెత్తెను. మహమ్మదీయులకు

పరాజయము గల్గినది. అది యత్యంతము నవమానకరమైనది. ప్రతాపరుద్రుఁడు బంది యయ్యెను రేచర్ల సింగమనాయఁడొకవంకను, బుక్కరా జొకప్రక్కను, కంపభూపతి యొకదెసను, హరిహరభూపతి యొక క్రేవను, రాజ్యము లారంభించిరి. ఇరువదిసంవత్సరముల తర్వాత ఆరిపోనున్న దీపకళికలోని యుజ్జ్వలనమువోలె ప్రతాపరుద్రునికొడుకు ఓరుగల్లును జయించి రా జయ్యెను. కాని, యల్పకాలమే. ఇఁక రాచకొండ పద్మనాయఁకులను, కొండవీటిరెడ్లను విచారింతము.

కాకతీయయుగము న్యాయముగ 1321-వఱకే. ఓరుగల్లు పునస్సంపాదనము వఱకు నెత్తికొన్న 1341-వఱ కగును. సింగమనాయని కొడుకు అనపోతభూపాలుఁడు. (1344-1380) రాచకొండ రాజధానిగా, నోరుగల్లు ప్రాంతమున పాలింపఁ దొడంగెను. ఇతఁడు శైవమతావలంబి. ఇతని తమ్ముఁడు మాధవభూపాలుఁడు. పెద్దనమంత్రి కొడుకగు పోతరాజు (గౌరనకుఁబెద్దతండ్రి)సాహాయ్యముచే దక్షిణభాగమున దేవరకొండ రాజధానిగా యువరాజుగఁ బాలించెను. రెడ్లతో నీరాజులకు వైరము. దేసటి వేమారెడ్డి (1324—1350) కృష్ణానదీతీరమున పూగినాటి సీమలో రాజ్యము చేయుచుండెను. రాచకొండ ఏలిక అనపోత నాయఁడు; కొండవీటిరాజు వేమారెడ్డి. వీరుఁడగు నితఁడు, మాధవానపోతనాయళ్ళను, ధరణికోటపై దండెత్తినపుడు, గెల్చినిలువరించెను. కాకతీయ సామ్రాజ్యానంతర మేర్పడిన కటకసామ్రాజ్యమున కధిపతులు గజపతులు యుద్ధమునకు రాఁగా వారి నోడించెను. (రామా

ప్రెగ్గడ యితని మంత్రివర్యుఁడు.) అతని మునిమనుఁడు మల్లి నాథుఁడు తర్వాత మంత్రియయ్యెను. వేమారెడ్డి తమ్ములుసుప్ర సిద్ధసేనానులు 1 మల్లారెడ్డి, 2 అన్నారెడ్డి యనువారు. అవచి దేవయ శెట్టి యనుధనికుఁడు వేమారెడ్డికి ప్రాపుగానుండెను. శౌర్యయుతుఁ డగుమల్లారెడ్డికి ఎఱ్ఱాప్రెగ్గడ అమాత్యుఁడు. ప్రథమవేమారెడ్డి యనంతరము కొడుకగు ననపోతరెడ్డి (1350-1363) రాజ్యము గైకొనెను. ఇతనికాలమున సము ద్రవ్యాపారము చక్కఁగా జరిగినది. అనపోతరెడ్డి తర్వాత అనవేముఁడను నతని తమ్ముఁడు రాజ్యముఁ గైకొనెను. ఇతఁడు 1363 మొదలు 1380 చివరవఱకు 18 ఏండ్లు రాజ్యము నేలెను. తెల్గుసీమలో రాచకొండ (నిజాందగ్గఱ) దేవర కొండల నేలుచున్న అనపోతన మాధవనాయళ్లు మరల దండెత్తి వచ్చిరి. కాని, పరాజితు లైరి. అనవేమారెడ్డి రాజ ధానినికొండవీటికిమార్చెను. శ్రీశైలసింహాచలమధ్యాంధ్ర దేశమంతయు, నితని పాలనకు లోఁబడి యుండెను. ఇతఁడు విద్యాభిమాని; పండితులను బోషించెను.

సంగమరాజపుత్త్రులచే స్థాపింపఁబడిన విద్యానగర రాజ్య కర్ణాటక సామ్రాజ్యములలో, 1355 లో హొసపట్ట ణమువనుండి విజయనగరమునకు బుక్కరాజు రాజధానిని మార్చెనఁట. అంతకు ముందు నిద్యానగరము (అదే విజయ నగరము) రాజధాని గాదనియా? ఆంధ్ర చరిత్రములో నన్నియు సందేహములే? అది యట్లుండ ప్రథమహరిహర రాయలు 1336 నుండి 1355 వఱకుఁ బాలించెను. రాజ్య ములు పరస్పరము ప్రక్కలోని బల్లెములుగా నుండిన వని

తెలిసినవిషయమే! హరిహరబుక్కరాయల పిమ్మట వీరబుక్కరాయలు మాధవమంత్రిసహాయుఁడై 1377 వఱకుఁ బాలించెను. అతని కొడుకు కంపభూపతి గొప్పవీరుఁడు రాజ్యము నాలుఖండములుగా విభజించెను. ఉదయగిరి, పెనుగొండ, ఆరగమలె, ములువాయి, తుళు, రాజ గంభీరము లీమండలముల పేరులు.

కాకతీయసామ్రాజ్యోన్నతి పోయినతోడనే దాని యుగముమాఱినది 1341-80 చరిత్ర మిం దేల యనవచ్చును. కాని, ఈనలువదిసంవత్సరములును నశించిన యాంధ్రసామ్రాజ్యమేతీరున తలయెత్తినదియు నిందు ప్రదర్శింపఁబడుటచేతను, నూతనయుగాశయములు కావ్యపుష్పములలోఁ బరిణమించి పరిమళముల వెదచల్లినది దీని తర్వాతనే గ్రైనందునను, చాళుక్యచోడయుగములలో మొలకెత్తిన వాఙ్మయబీజములు, పంటపండి 1380 వఱకుఁ గోఁత పూర్తిగానందునను, ఇది నూతనరాజ్యములు యావనారంభము వఱకే నడచిన సంధికాల మగుటవలనను ఇది యావశ్యక మైనది

కాకతీయసామ్రాజ్య మస్తమించిన దాదిగా నీపదునాల్గవశతాబ్దాంతము వఱకు రెడ్డిరాజులు, పద్మనాయకులు, సంగమరాజపుత్రులు, మహమ్మదీయులు నాల్గురాజ్యముల నిర్మించిరి. ఇవి సుస్థిరములైనవి; కాని యుద్ధభేరియేదో యొకవంక మారుమ్రోగుచునే యుండెను. ఈనాల్గురాజ్యములును కాకతీయాంధ్రసామ్రాజ్యములోనివే. గణపతిమొదలుకొని ఇంతవఱకును పూర్వమువలెనే శైవమతప్రాబల్యము గన్పట్టుచున్నది. వీరకృత్యముల కాకరమగు నీకాలమున ననేక

బ్రాహ్మణమంత్రులు సేనానులుగా విరాజిల్లిరి. మూఁడవ విషయము ఈకాలమున గమనింపఁదగినది యుత్తరమునుండి మహమ్మదీయవాహిని దక్షిణాపథమును ముంచివేయుటకై యున్నది.

---

## ౨. వాఙ్మయచరిత్ర

"ఇదం బ్రాహ్మ మిదం క్షాత్ర" మను వీరమంత్రుల వాక్సింహాసనమును తెనుఁగుభారతి యెక్కినది. నన్నయవలె కేవలము రాజ్యతంత్రజ్ఞులే కాదు, రాజ్యతంత్రమును నడపుచుండెడువారును కవులైరి. విద్యావంతులు, విబుధజనమందారము లగుమహోద్యోగులు వాఙ్మయమునఁ బాల్గొనిరి. రాజకీయదేశీయైశ్వర్యవిజృంభణములతో భాషాభివృద్ధియు నొడఁగూడియుండు నందురు. దేశోన్నతి వాఙ్మయోన్నతి కాధారమని యర్థము. ఇట్లనుటకన్న దేశీయోద్రేకస్థితిపరిణామమగు ప్రశాంతభావమే కవితాదర్శమునఁ బ్రదర్శితమగుచుండు నను టెంకను సత్యమునకు సమీపము గావచ్చును. భావసముత్కర్షయేకదా కవితాబీజము! దేశమతి యాందోళనము గన్పఱచుచున్నను, నానందాతిశయమును వెలిపఱచుచున్నను, ప్రజాహృదయ ముద్రిక్తమగును. ప్రజానుభవము తన యనుభవముగాఁ జేసికొను మహాకవి బుద్ధియు నట్టియెడ నైశిత్యము వడయుట సహజము. సత్కావ్యసృష్టి కట్టి తీక్ష్ణానుభూతియే యాధారమగుచున్నది.

మొదటఁ బుట్టినది శివదేవయ్య యనునైయోగికారాధ్యబ్రాహ్మణుని "పురుషార్థసారము" అను నీతిగ్రంథము. ఈశివదేవయ్య గణపతి మంత్రి. ఇతఁ డాకాలమున యశోవంతులగు విశ్వేశ్వరశివదేశిక పరిపూర్ణ శివమహామును లను తండ్రి కొడుకులలో నొకఁడుగ నుండవలయును. వీ రీ తిక్కన

మహాయుగంబునకు నన్నయయుగపు మల్లికార్జునయోగివంటివారు. కావుననే తిక్కనసైత—

"...మీఁ దీశ్వరుఁడు గాని మనుజమాత్రుండు గాఁడు. పల్మాఱు నితని యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మినేలు" మని గణపతిచక్రవర్తితోఁ జెప్పినాఁడు. పై ద్విపదపాదములు కాసె సర్వప్ప యనునతఁ డొనర్చిన సిద్ధేశ్వరచరిత్రంబులోనివి. సిద్ధేశ్వరచరిత్రము ద్విపదకావ్యము; ప్రతాపరుద్రునిచరిత్రమును వర్ణించునది. కవులచరిత్రలోఁ గాలనిర్ణయము కాలేదు. కవిత్వము లాక్షణికసమ్మతము గాకపోయినను ధారాళముగానే యున్నది. ఇంతకు నిది చరిత్ర. కవి యీయుగమునకుఁ జెందినవాఁడే. యుగాంతభాగమునకుఁ జేరినవాఁ డందురా? కావచ్చును. యుగారంభము నీతిశాస్త్రముతో, యుగాంత్యము తచ్చరిత్రరచనతో విలసిల్లుటయుం శోభయే!

"ప్రజఁ జెఱిచి కూడఁ బెట్టిన
నిజ ధన మది వలయు వ్యయము నిచ్చలుఁ జేయక
బ్రజయును ధనమును బొలిసిన
భుజబలమున నిలువఁదలఁమె భూపుల కెందున్".

అని శాసించెను మహామంత్రి శివదేవయ్య. ద్వితీయప్రతాపరుద్రుని "ప్రధాన మంత్రి" శివదేవయ్య యనునాతఁ డింకొకఁడు. "శివ తత్త్వ రసాయనము" అను గ్రంథమును రచించెనఁట. [1]సర్వేశ్వరశతకమును హృద్యముగా రచించిన యథావాక్కుల అన్నమయ్య వీరశైవమతావలంబి. ఇతనిధార తర్వాతివారికి మార్గదర్శకమైనది.

శైవమతాధిక్యముఁ జూపిన యుగము గాన శివభక్తస్మరణఁ జేసితిని. కాలముంబట్టి నిర్ణయింపఁ దొరకొనినచో నాదిభాగమునకు [2] భాస్కరుని

---

1 ఇది యనేక శతకములకు మాతృకయనియు, కవి 1241 లోనుండు ననియు, శతకకవిచరిత్ర నుడువుచున్నది. 2 భాస్కరునికొడుకు, తిక్కన పెదతండ్రి.

కేతన, కవిభల్లటుండు, కవిరాక్షసుండు, భవ్యభారతి, బయ్యన, తిక్కనసోమ యాజి, కేతన, అథర్వణుండును జేరుదురు. మధ్యభాగమునఁ [1]గోనబుద్ధా రెడ్డి, భాస్కరుండు (హుళక్కి), కుమార రుద్రదేవుండు, అయ్యలార్యుండు, మల్లిఖార్జునభట్టు, మంచన, మారన గోల్వుండీకుదురు. అంత్యభాగమునందు బుద్ధారెడ్డికొడుకులు, ఎఱ్ఱాప్రెగ్గడ, విన్నకోట పెద్దన, నాచన సోమనా థుండు, చిమ్మపూండి యమరేశ్వరుండు, రావిపాటి తిప్పన్న సారస్వతము నలంకరించిరి.

సారస్వతవిభాగమును బట్టి చూచినచో శాస్త్రకవితకు కవిభల్ల టుండు, అథర్వణుండు, కవిరాక్షసుండు, విన్నకోట పెద్దనయుఁ జేరుదురు; ద్విపదశాఖకుఁ గోన బుద్ధారెడ్డియు నీతనికొడుకులును జేరుదురు; విపుల కావ్యభాగమునకు భాస్కరాదిరామాయణకవులును, నాచన సోమనాథుఁ డును, నమరేశ్వరుండును రామణీయకమును గూర్చిరి. ప్రాసయ కేతన, మంచన, భాస్కరునికేతన, తిప్పన లించుమించుగా ప్రబంధశాఖకుఁ జేరుచ నున్నను మిశ్రకవులనుగాఁ బరిణమింపఁజేయవలసియున్నది. ఇఁక పురాణ సారస్వతమునకుఁ దిక్కనయు, మారనయు, నెఱ్ఱనయుఁ జేసినవా రని చెప్ప నక్కఱలేదు గదా!

శైలినిబట్టి కవిచరిత్రలోఁ గాలనిర్ణయముగాని కవులలో [2]భోజ రాజకృత చారుచర్య నాంధ్రీకరించిన యప్పనమంత్రి యీ యుంగాంతర్య

---

1 1284 లోఁ గోన గన్నారెడ్డి యున్నాఁడు. ఆతనికొడుకు బుద్ధారెడ్డి. (పుత్రుండా? దత్తుండా? తమ్మునికొడు కగుటఁ బుత్రుండా?) బుద్ధారెడ్డికూంతురు శాసనము 1277 లో నున్నది.

2 శ్రీ ప్రభాకరశాస్త్రిగారి ప్రబంధరత్నావళిని జూడుఁడు. వీరే ఇతనిని మడికిసింగనికిఁ బూర్వుఁ డని వ్రాసిరి. (ఆంధ్రపత్రికానుబంధము- దుందుభి.)

భాగమునం దుండవచ్చును. ఎంద అప్పనమంత్రి గారి! ఈయనుమానము నిశ్చితమగునా? ఇంతకును శాస్త్ర (వైద్య) గ్రంథముగాన, కవికి నమున్న తికి కీడును జేయదు; తోడునుం జూపదు!

కాలనిర్ణయము తేలువఱకును బాలభారతమును రచించిన గంగాధరుఁడు (కాకమ్రాని) నందచరిత్ర కర్తయగు గంగరాజు చౌదప్ప, ప్రద్యుమ్నచరిత్రమును రచించిన పెమ్మనభావన, ఈ యుగాంతమునకుఁ జేరినవారని మాత్రము చెప్పనగును. ఇదియు స్థూలపట్టి ననుసరించిన మాటయేకాని నిశ్చయము గాదు. భావిపరిశోధనలపై నిర్ణయ మాధారపడియున్నది.

పద్మకవి జినేంద్రపురాణమును, సర్వదేవుని యాదిపురాణమును, ప్రాచీనాంధ్రులవాఙ్మయములోనివని వాఙ్మయచరిత్రకారుఁడు తలంచినట్లున్నది. కాని, పద్మకవి సీసపద్యము ప్రబంధశైలిని బోలినది. సర్వదేవుని యూహాలు ప్రబంధములోని యతిశయోక్తుల ననుసరించినవి. కాబట్టి ప్రాచీనాంధ్రజైనసారస్వతమున నాదిజినేంద్రపురాణము లుండియుండవగునుగాని, యవి యత్కృత్తృకములో? పద్మకవి సర్వదేవులు నదరు నన్నయకాలమువారుగూడ కారనియు, తిక్కన తర్వాతివారు కావచ్చుననియు విన్నవించుచున్నాను. (విజ్ఞులు పిన్నలగుణమును గ్రహించి దోసంగులున్న క్షమించి దిద్దుదురని నమ్మిన నాయూహాలకు గినియక సంస్కరింతురనియే తలంచుచున్నాను.)

ఇఁక నొక్కొక్కటిగా నీయుగసారస్వతశాఖలను బరిశీలింతము. అథర్వణుఁ డాద్యుఁడందురు. "క్వచిత్ సంస్కృతియోఽపి ప్రాణోఽన్యత్ర చ్యుతా భవేత్" యను సూత్రమును లక్షించినచో 1530 కి తర్వాతివాఁ డగును. కాని, యిట్టి సూత్రము లప్పటప్పటికి వికృతివివేకకారికావళిలోనికిఁ బ్రాకియుండవచ్చును. కాని, యహోబలపండితునికిఁ బూర్వ మెవ్వరును

గారికలను బ్రస్తాపించి యుండలేదు. అంతయుఁ జూడఁగాఁ గవిచరిత్ర కారుఁడు నుడివినట్లు తన కవిశిరోభూషణమునకు వన్నె దెచ్చుటకై [1]యహోబలపండితుఁడు వ్రాసినగాథ యిది.

నన్నయభట్టీయమును నిట్టిదియే. చిన్నయసూరినాఁటికి నిదేకథ మరల వచ్చినది. మిగిలిన వితని వనఁబడు. [2] త్రిలింగశబ్దానుశాసనము, అథర్వణ ఛందస్సు, భారతము. మొదటి రెండును లక్షణగ్రంథములనుట నామములే చెప్పుచున్నవి. ఇతని భారతకవిత్వము గీర్వాణపదజటిలంబుగా నున్నది.

''నతనానావనినాథయూథమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వలద్
ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాలివినీలకుంతలుఁ బ్రభారుద్ధాముఁ గేయూరశో
భితబాహాపరిఘుక్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనున్.''

అనుపద్యమును విరాటపర్వములోని తిక్కనకృత దుర్యోధనవర్ణన మున్నగు వానితోఁ బోల్చిచూచినఁ దిక్కనలోని తెనుఁగుఛాయలు లేవని బోధపడును.

''గంధర్వగంధర్వగంధర్వనగరంబు, నాగపున్నాగపున్నాగవనము''

ననుసమాసము ఫక్కిని, పద్మకవి జినేంద్రపురాణములోని

''హరినిలయంబును హరినిలయంబును విషధరాఢ్యంబును విషధరాఢ్య'' మను సీసపాదములతోఁ బోల్చి చూచిన నిర్వురును కన్నడకావ్యముల

---

1 కీ. శే. వీరేశలింగముగారు రొనర్చిన యపూర్వవ్యాఖ్యాన సిద్ధాంతము లథర్వణకారిక విషయమునను, శబ్దచింతామణి విషయమునను, కార్యకారణ తత్త్వజ్ఞు లెల్లరును, తప్పక సత్యమనియే చెప్పవలసి యున్నది.

2 త్రిలింగశబ్దానుశాసనము నన్నయకంటె ప్రాచీనమనియు, విరాటపర్వాదులను రచించిన యథర్వణుఁడు తత్కర్తగాదనియు కొందఱవాదము.

లోని ప్రబంధరీతుల నుపక్రమించిరన్నట్లు కానవచ్చుచున్నది. సర్వదేవుని యాదిపురాణములోని,

"హరినీలమణివిరాజిత
సురుచిరగోపురముఁజూచి (?) తమిస్రా
కరుఁడు విధుంతుదమండల
పరిశంకంజేసి పురముపైఁ జన నోడున్."

అనుకందము నన్నిచోడుని యతిశయభావములను దలఁపించుచున్నది. వీరుముప్వురును జైనులై యుందురనియుఁ, కన్నడరచనాసంవిధానముల ననుసరించిరనియు, తిక్కన కాలమునను, తర్వాతి కాకతీయరాజుల కాలమునను నోడఁగొట్టఁబడి [1]హింసితులైన జైనులలోఁ జేరినవారగుటచేత, వీరి కృతులు బహిష్కృతములై యుండవలయుననియు, లేక తిక్కన భారత ప్రభారాశిలో, చెలరేగుచుండిన శైవసాహిత్యోద్రేకములో నివి ప్రచ్ఛన్నములై పోయియుండుననియు, వీరు సమకాలికులో, లేక, నొకరొకరికి దగ్గఱి కాలమువారో యై యుందురనియు నూహించుట కెడముగల్గుచున్నది. ఎటులైన నగుఁగాక! వీరి ముప్వురి కవిత్వము మొత్తముపైన రసవంతమైనది. కవిభల్లటుఁడు శైవుఁడు. ఇతని దొక విక్రమార్కచరిత్ర మున్నదఁట. దీనిలో "నీవు చన్నవెనుక నిలువలేను" అని యొకగీతపాద మున్నట్లు విక్రమార్కచరిత్రమును గవి "చన్నవెనుక నిలువలే"ననినది. పైగా నితఁడు సంస్కృత నిఘంటుకర్త. కవిభల్లటునివలెనే కవిరాక్షసుఁడు ద్రాక్షారామ సీమవాఁడే. [2]ఇతఁడు కవిరాక్షసీయమునే కాక 'యాదినారా

---

1 ఆంధ్రులచరిత్రము, మధ్యయుగము.

2 కవిరాక్షసుఁడే వేములవాడ భీమనయని కొందఱందురు. వర్ధమానపుర (వద్దమని, వనపర్తిదగ్గర) చోడులలోనివాఁడగు భీముని సోదరుఁడు గోకర్ణుఁడు కవిజనాశ్రయము (కళ్యాణపురాధిపతి చళుక్యజగదేకమల్లునకు

యణ చరిత్రము'ను సైతము వ్రాసినట్లున్నది. "భానుమరీచివిస్ఫురత్తోయజ కాంతితోఁ దులఁదూగెడు" శైలియే ఇతనిది కావచ్చు. కాని, గ్రంథ మేదీ ? వీరివలెనే విన్నకోట పెద్దనను లాక్షణికుఁ డంటిమికదా ? 'పెద్దన' 1రాజమహేంద్రవరమువాఁడు; కావ్యాలంకారచూడామణిని రచించెను. ఛందోవ్యాకృతి గ్రంథములవలెఁగాక నలంకారగ్రంథము లుదాహరణ సమూపేతములగుటచే నేతత్కవులను కవు లనవలయునో లాక్షణికు లనవల యునో? ధార ధారాళముగ నున్నది. తెలుఁగుపదముల తీరుతీయములు కవికిఁ జక్కఁగఁ దెలిసినట్లున్నది. కాని, కావ్యము లేవియు లేనియెడ నుదా

సేనాపతియగు) రేచభూపతి కంకితముఁజేసెననియు, 'వాగీంద్రచూడామణి' యను జైనాచార్య శిష్యుఁడు గోకర్ణుఁడనియు, వాగీంద్రుఁడు తెల్గులో "నాది పురాణము" రచించెననియు, నాంధ్రచరిత్రకారుఁడు (165-వ పుట, మధ్య యుగము) చెప్పినాఁడు. ఇది 12-వ శతాబ్దిలోని కథ. చాగిపోతరాజు "హయమది" యనుపద్యములో నెన్నఁబడినవాఁడు, 12-13-వ శతాబ్ద ములసంధిలో నుండినవాఁ డఁట. కుమారసంభవపీఠికలో మానవల్లి రామ కృష్ణకవిగా రిచ్చిన "వాండిమి నల్లసిద్ధిరాజు" 12-వ శతాబ్దమున నుండుట వలన వేములవాడ భీమకవి యప్పటివాఁడగును. కవిజనాశ్రయములోని ప్రక్షిప్తపద్యములఁ దీసివైచిన దానిని భీమునదనవచ్చునని కొందఱు కవిజనా శ్రయము గోకర్ణఛందస్సులగాథ లెట్లున్నను, వేములవాడభీమకవి 12-వ శతాబ్దపువాఁడగుచున్నాఁడు. చాగిపోతరాజు, కళింగగంగు, నల్లసిద్ధి హెచ్చు తక్కువగా 12-వ శతాబ్దిలోని సమకాలికులగుచున్నారు. చాటువులు గూడ నదేవిషయమును జాటుచున్నవి. నన్నయయుగమువాఁడనుట కిది చాలదా?

1 కావ్యాలంకారచూడామణి నంకితముగొన్న కృతిభర్త విశ్వేశ్వర రాజు వాసస్థలముఁగుఱించి వాదము గలదు. విశాఖమండలములోని "పంచ ధార" యను గ్రామమని యొకరు స్పష్టపరచిరి. (16-వ సంవ. సంచిక.)

హరణపద్యములను జూచి యిట్లు వ్రాసియుండఁదగినవాఁడనియూహలుపన్ను టంతయుచితము గానేరదుకదా? రసాత్మకవాక్యమొక్కటే చాలునన్నచో పెద్దన యుత్తమకవికోటిలోఁ జేరఁదగినవాఁడే.

సాధారణముగ మానవస్వభావ మాత్మస్తుతిపరాయణము. కాన, బుద్ధారెడ్డి "కవిలోకభోజుండ" నని చెప్పుకొనుటలో నాశ్చర్యమేదియును లేదు. నన్నెచోడుఁడు, భద్రభూపతి తమ్ముఁదాము పొగడికొనలేదా! ఆత్మస్తుతుల కలరియేగదా భోజుఁడు వదాన్యచక్రవర్తియయ్యె. కాని, రంగనాథరామాయణ మనుపేరు సమసి పోలేదు. జనశ్రుతి పరంపరలో సాగివచ్చుచున్న ఈపేరున కొకకారణ ముండి తీరును. రంగనాథరామాయణ మంతయు నుత్తరభాగముతోకలిసి నొకేరీతిగ నున్నది. రంగనాథుఁడను కవియే రచించి వారిపేర పెట్టకై వ్రాసెనో, లేక, "రాముపావనచరిత్రము దివ్యభాష, లోకానురంజనశ్లోకబంధములఁ, జేకొని వాల్మీకి చెప్పిన జాడ" రంగనాథుఁడను పండితుఁడు వ్యాఖ్యానముఁ జేయుచుండఁగా వీరు వ్రాసిరో, లేక వీరిచే వ్రాయించుచు రంగనాథుఁడు దిద్దుచుండెనో యథార్థము మాత్రము మృగ్యమైనది. [ముందువచ్చువిమర్శకులకు కష్టమగునని కవులకుఁ దెలియదు. లేకున్న సింగన లెందఱో యుండినను తమ సింగనయే సింగనగాఁ దలఁపఁబడునని "సింగనాత్మజుఁడ" నను విశేషణముల వ్రాయుదురా? 'వర్తమానకవుల బహూకరించి' యనుచో వర్తమానకవులు వారికి దెలిసియున్న నంతియ సరి. మనకుఁ దెలియుటతో వారికేమి పని? 20-వ శతాబ్దిలో తమ్మునుగుఱించి చర్చింతురని యేరికైన స్వప్నమునఁ దట్టియుండరాదా?] పాల్కురికి సోమన్న చూపిన రాజమార్గమును బుద్ధారెడ్డియు, రంగనాథుఁడు, [1]నతనికొడుకులు భద్రపఱిచిరి. నీడలకై చెట్లునాటిరి. వాల్మీ

---

1 ఆంధ్రులచరిత్రము. మధ్యమయుగము. కోన బుద్ధారెడ్డికి మల్లయ బుద్ధయ, కాటయ(కాచయ), పిడుగుగుండయ యనువార్లు కొడుకులు.

సుతో గట్టిచేసిరి. ఏమి యామధురగానము! చంపుకావ్యములో నింత మాధుర్యము గన్పడదు. వాస్తవముగా ద్విపద క్షీరవారాశిలో

"పాలుపొందు కలువల పోరానివిందు
కలసిన జక్కవ కవఁ బాపుమందు
పాలవెల్లిని ద్రచ్చి పడసిన వెన్న
శూలి యాదలపువ్వు చుక్కలనవ్వు
నెఱి చకోరములకు నెలనెలపంట
యుఱవేది విరహుల నుడికించుమంట
హరిహరబ్రహ్మల యానందదృష్టి
సరసిజరిపుఁడైన చంద్రుండు పొడిచె"

వీరి సందర్భోచిత వర్ణనావైశద్యముంజూచి

"చలియింపకున్నవి సకలవృక్షములు
మెలఁగవు వనభూమి మృగసమూహములు
నెఱి విహంగంబులు నీడముల్ చేరి
మఱచియున్నవి తమ మంజులధ్వనులు"

వీరిపదములు రసానుగుణముగ మాఱుచు పాదము లెక్కడికక్కడ బాడిసెతోఁ జెక్కినట్లు కుదురుకొనుచున్నవి. ప్రాసానుప్రాసములు మెండుకొని, శబ్దసరణి నుద్దీపనము చేయుచున్నను, నర్థవంతములగు పదంబులగుటచే, కథపైననే దృష్టి నెట్లు నిమగ్నము చేయుచున్నవో!

"కపటవృత్తులఁజిక్కి కడముట్ట స్రుక్కి
జీవంబుపై రోసి చెలువంబుఁ బాసి

---

కాచయ, విఠయ లుత్తరకాండకర్తలు గ్రంథస్థమైనది. వారిసోదరుఁడు బుద్ధయయే సాహిణిమారని తండ్రి బుద్ధారెడ్డి యగునేమో? అటులైన రామాయణ(ద్విపద) కర్తయైన బుద్ధారెడ్డికి మారన మనుమఁ డగును.

పులులలో నావును బోలె దుర్వార
ఘోరరాక్షసవధూకోటిలో నున్న
నారీశిరోమణి నలినాయతాక్షి
హస్తము ల్మోగిచి
నడుకుచు నాపల్కు నాల్కకురాక
కడుదూలి గద్గదకంఠియై పలికె."

నను నివి మొదలగు ద్విపదలను జదివి వాల్మీకిసుధామధురకవితయందలి తేటం గొంతవఱకైన తెల్గులోం దెల్చినవా రెవరన్న రంగనాథుండు (బుద్ధరాజు?) మంత్రిభాస్కరుండే యనిన యతిశయోక్తి, లేక, సాహసోక్తి గానేరదు. బుద్ధారెడ్డికొడుకులు కాచయ, విఠ్ఠలయలకృతమనునది యుత్తరకాండము మాత్రమే.

విపులకావ్యకవితాప్రపంచమునకుం జేరిన రామాయణము ననేకులు పూరించిరి. ఆరణ్యకాండము దక్కం దక్కినభాగము లుత్పన్నము లయ్యె ననిరి. కావచ్చును. సాహిణిమారన దాని పునరుద్ధరణమునకుం బూనుకొనెను. సుప్రసిద్ధకవి హుళక్కి భాస్కరుండు చేపట్టెను. అతనిమిత్రుం డయ్య లార్యుండు, కొడుకు మల్లికార్జునభట్టు, ప్రభుసుతుండు, తనశిష్యుండు నగు కుమారరుద్రదేవుండు దోడుసూపిరి. కోనబుద్ధారెడ్డికొడుకులకు దాయాది వంశములోనికిం జేరిన సాహిణిమారన అశ్వాధ్యక్షపదవి నుండినవాం డగుటం దనపేర నొక రామాయణమును గల్గించుకొనుట వింతగాదు. కీర్తి మత్సరము ప్రభువులకు సహజము గదా! తనకొడుకే యొకభాగము వ్రాయు టకు దొడంగినప్పుడు తండ్రి యుత్సాహ మేమనవలయును? కొడుకునే పూర్తిగ వ్రాయుమనుట కెంతకాలము పట్టునో? కాననే యందఱును జేరిరి. ఉత్పన్నమగు [1]ఆరణ్యకాండభాగమును భాస్కరుండు మొదలిడెను. బాల

1 ఈవిధానమును గుఱించిన యూహయంతయుం గవిచరిత్రకారు నిది సమంజసముగ నున్నందున వివరించితిని.

కాండను మల్లికార్జునుఁడు గైకొనెను. బాలకాండను వ్రాసి ముగించిన మల్లికార్జునుఁడు కిష్కింధను మొదలుపెట్టెను. ఇంతలో భాస్కరుఁడు దానిని తాన గైకొనియె. సుందరకాండము వ్రాయుచుండినప్పుడు పనిలేమిఁ దానిని రచియించుట కుద్యుక్తుఁడై, శేషమును కొడుకు రచింపఁగా భాస్కరుఁడు యుద్ధకాండమును రచింపఁ దొడంగెను. మధ్యను అయ్యలార్యుఁ డారంభించి యుద్ధకాండమును బూర్తిచేసెను. హుళక్కిభాస్కరునిశైలి సులభము. అర్థము ననుసరించి కఠినముగా మాఱినను సౌలభ్యమును విడనాడదు. "మనోహరముగా" నుండును. ప్రతాపరుద్రునాస్థానములో భాస్కరకవితో సమముగా నాస్థానపండితుఁడైన శాకల్యమల్లుభట్టునకు సంబంధించిన యయ్యలార్యుని సరణి కొంచెము బిరుసువారి వైశద్యగుణము చేఁ లయించుచున్నది. కుమారరుద్రదేవునిఫక్కి యెడతెగనిధారగాక, విఱిచి విఱిచి సులభగ్రాహ్యపదములతోఁ జేర్పఁబడియున్నది. ప్రశాంతసరోవరముం బురుడించును. మల్లికార్జునభట్టారకుని పదరీతి హనుమంతునివేగోల్లంఘనముతో నుద్దులుగట్టినది; శరధాటిని దూఁకులువేయుచున్నది; ప్రౌఢమై రసోదంచితమై యెట్టన్నను దలఁపించుచున్నది. విపులకావ్యపరంపరలో మొదటిదైన రామాయణానువాదము కవిపంచక మొనగూర్చినది.

తర్వాతిది హరివంశము. దీని నిర్వురు రచించిరి. యథామాతృకముగా తనవ్యక్తిత్వమును విడువక నన్నయతిక్కనలవలె కొన్నికొన్నిమార్పులతో నెఱ్ఱాప్రెగ్గడ రచించెను. అతనిని బురాణకవితలో నందుకొందము. అతని తరువాత నిరువదేండ్లపైనున్న నాచనసోమనాథుఁడు (1370) మాతృకను నూతనాంశములతో "నధికప్రసంగములతో" రసానుగుణ్యాముగ మార్చి, కథాప్రణాళిక నేర్పఱచుకొని యద్భుతకవితావిలాసముతో నుత్తరహరివంశమును రచించి నెల్లూరునందలి హరిహరనాథున కంకితమొనర్చెను. [1]ఇతఁ డష్టభాషాకవిత్వవిశారదుఁడఁట! అష్టాదశపురాణార్థవిదుఁడఁట! ఇత

1 తామ్రశాసనము.

నికి సర్వజ్ఞుఁడను బిరుదము కలదు. ఇవియన్నియు నుండనిండు! కవులలో నితండు సర్వోత్కృష్టుఁడని శబ్దరత్నాకరనిఘంటుకారుని నమ్మకము. (చిన్నయసూరి దాని నారంభించెను. వీరేశలింగము దానిని బలపఱచెను. శ్రీ అనంతకృష్ణశర్మ దానిని సమూలముగాఁ బెఱికివైచుటకు యత్నించెను. సత్యమేది? కాని, "లోకో భిన్నరుచిః" అన్నారు పెద్దలు! అతఁ డాంధ్రకవిరాజపఙ్క్తిలోనివాఁడని మాత్ర మొప్పుకొనక తప్పదు. కాని, తిక్కనకన్న నధికుఁడనుట పాడిగాదు. (కళా, ధ్వని, స్థిరత లనులక్షణత్రయమును, విశ్వమానవైక్యభావశైలులను నుపలక్షణద్వయమును జూచుకొన్నప్పుడు తిక్కనవన్నియును సరియేకాని, విశ్వకల్యాణైకాశయసముద్దిష్టమగు ధ్వనియుం, విపులప్రచారమూలమగు స్థిరతయు సోమునికనితయం దేవి? భారతములోని నైతికశిక్షగాని, భాగవతమునకున్న ప్రచారముగాని యున్నదా? ఎందులకు మీరందఱును పఠింపరని ప్రజలనడుగుటకు మనకు హక్కులేదు. ప్రజాభిప్రాయమే, ప్రజానందమే కావ్యస్థిరతకు హేతువు. మంచిని; చెనువుఁ జని హెచ్చరించుట మాత్రమే విద్వాంసుల పని. తారతమ్యచర్చ మన కవసరము గానిపని. నాచనసోమన పండితాగ్రేసరుఁడు; సాహితీసునుఁడు. కవితావాసిక యందు మిన్న. సమయోచితధార, రసోచితమగు వాక్ప్రౌఢిమ. ప్రకృతానుభూతికిఁ బ్రతిబింబములైన సమగ్రభావములు గలవు. కొలఁది తేటమాటలతో లలితోక్తులతో మృదుమధురశబ్దవిన్యాసముతో విషయమును వ్యక్తీకరించు సామర్థ్య మీతనికిఁ జక్కఁగఁ గలదు. కాని, తిక్కనలోని విషయబాహుళ్యము, సర్వంకషప్రజ్ఞ: సందర్భోచితగాంభీర్యము, తెలుఁగుపలుకుల: ప్రయోగించుటయందు మార్గదర్శకములగు ప్రసాదప్రాగల్భ్యము లంత లేవు. ప్రబంధముల త్రిప్పట, రసావేశముచే నొడలు మఱచుట ఇతనియందు యౌవనముఁ దాల్చినవి. కావుననే నిసర్గధార పోయినది. ధార యలంకార

ముల బరువుతో గలుగల్లు మనుచున్నది. [1]కవిబ్రహ్మ కొకతెరువు; సర్వజ్ఞున కొకదోవ. (ఎఱ్ఱన పదంబులకుఁ గొన్నిచోట్ల వన్నె వేసినాఁడు. తత్సాంకేతిక పదంబులకు నైఘంటుకంబుల నుడివినాఁ డని కవితకు గొప్పకాదు. పూర్వాపరముల గుత్తైయుంగలేదు. అనతిగూఢార్థశైలి, సల్లాపసౌమనస్యములేమి ఇతనిదోషములు. కవితామాధుర్యము మంచిదేకాని అవసరములేని కవిశక్తి ప్రదర్శనము మంచిదెట్లగును? ఇట్లని కొందఱు వాదించిరి.) ఎఱ్ఱనతోఁబోల్చుటకు వలనుపడదు. ఒకరిది పురాణకవిత; ఇంకొకరిది కావ్యకవిత. ఎటులైన నేమి? ఆంధ్రకవిసార్వభౌములలో నితఁ డొకఁడు. ఇతని రెండవకృతి 'వసంతవిలాసము'గూడ నతిప్రౌఢమై యున్నది. గడుసుపోక లల్లిబిల్లిగ నల్లుకొనియున్నవి.

ఇతనికాలమువాఁడే, యిట్టివాఁడే [2]చిమ్మపూఁడి యమరేశ్వరుఁడు. "పేరెన్నిక కెక్కినట్టి" యమరేశ్వరుని "వచఃప్రభావసంసిద్ధుఁ" డని కవులు వర్ణించిరి. సోముని "సుకవిసోముని" గాను, "బుధసన్నుతుని"గాను కవులు పొగడిరి.

"చరమాచరమాద్రులపైఁ
సరిపున్నమఁ దోఁచుసూర్యచంద్రులభంగిని."

కాకతీయమహాయుగాంత్యదినంబున బుధసన్నుతుం డొకవంకను, వచస్సిద్ధుఁడొకవంకను వెలుఁగుచుండిరి. అమరేశ్వరుఁడు తెనుఁగునకు హర్షుని (నైషధకావ్యకర్త) వంటివాఁడు. వ్రాసినది, చూచినది, తలఁచినది, సంతోషించి

---

1 శ్రీ నడకుదుటి వీరరాజు, అనంత కృష్ణశర్మ మున్నగువారి వ్యాసము లాంధ్రసంచికలోను, పరిషత్సంచికలోను చూడుఁడు.

2 ప్రబంధరత్నావళిలోని పద్యములు, చాటుపద్యమణిమంజరి 2-వ భాగములోని పద్యములు చూడుఁడు.

నది, సర్వమును శృంగారమయమే! తెలుఁగుగ్రంథములందలి శృంగారరస సర్వస్వమును దులఁదూఁచిన, నమశేశ్వరుఁ డొక్కఁడే తన విక్రమసేనముతో బరువుగాఁ దోఁచునేమో! నవరసములలో శృంగారరసస్థానము నిరుపమాన మైనది. కాని యితరరససాన్నిధ్యముననే దాని సౌభాగ్యము అనుభవ నీయము. రమణీయతను గేవలతాదాత్మ్యమును బొందిన శృంగారరసాధిదేవత యగు నితనికవిత చక్కెరవలె చాల వెక్కసమై విసుగునకు దారితీయు నేమో కాని యీయనసర్గళమంజులపదధారామార్దవమాధుర్యముల కెట్టి వాఁడు ముగ్ధుఁడుకాఁడు? మంచిదృశ్యములఁ జిత్రించినాఁడు!

"పూవులప్రోవులై చిలుకబోదలు కోయిలపిందుమందలై
తావులక్రోవులై యలివితానముగానము తానకంబులై

కావను బండఁజాలుట త్రికాలముగల్గ వరంబు గన్నయ" ట్లున్న వనరా? ఎవనికింపుగాదు?" చేలలోపలన్ దిరిగి యొకింతవంత పడఁ దేఱెడు మోములఁ జెన్ను సేయుచున్, బిగిగొని క్రాలుదృగ్రుచుల పెల్లునఁ జీఁకటి సెల్లఁ జూచినన్, దెరువరు లర్థిఁగూడఁ బరతేరగ మాపఘనంజను" మఱలు పావన భూమి నీజను లెవరికి దర్శనీయులుగారు? "వెలఁదులు మునమున విహరించుచో, సోయగంబున వీథుల వ్రాలి వ్రాలి, పవలు రేయును సుమగంక తవిలి తిరుగు మిండఁడునుబోలె" నుండు మందానిలు నేమందురు?

'తరుణుండగు శీతలకరు, మరగి వియల్లక్ష్మి తన్నుఁజూచి ముదకఁదున్
ఖరకరుఁడును నని ద్రొబ్బిన, కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకెన్.'

గాన మనము ఇఁక నతనికవిత శ్లేషాదిప్రబంధలక్షణములకుఁ బట్టుగొమ్మయ నియు, కథాసంవిధానమునకు బదులుగ, వర్ణనావైచిత్ర్యమే లక్ష్యమై పోయినదనియు, కావ్యప్రబంధయుగంబు రాకను దెల్పు తంజావూరివికృతి సిద్ధమగు మేళమనియుఁ దీర్మానించుకొని చాలింతము.

విపులకావ్యభాగ మైనది. [1]మంత్రిభాస్కరుని కుటుంబములో ముప్వురు కవులు జన్మించిరి. ఈభాస్కరుని తనయుఁడు కేతన, కాదంబరి నను వదించెను. నవరసభావకుండనియును, కవితకు ముఖ్యుఁడనియు, నీకేతన పెగ్గడ మ్రానయకేతనచే వర్ణింపఁబడియెను. తెనుఁగు పదములపైఁ బ్రీతిఁ జూపుచు, సన్నసన్న సంస్కృతసమాసములతో నింపుఁగూర్చు పద్యము లల్లఁ గలవాఁడై కాదంబరిని, కువలయాశ్వచరిత్రమును రచించెను. తిక్కనసోమ యాజి ఇతని సోదరునికొడుకు గాన కుమారుఁడగును. తిక్కన్నకు దశకు మారచరిత్రము నంకితముగా మ్రానయకేతన రచించెను. తిక్కన మెచ్చుకొన్న కవిత సామాన్యమా? అట్టి కవితగల కేతనతండ్రి మ్రానయ్య. ఇంటిపేరు మూలఘుటికవారు. దశకుమారచరిత్రమును[2], విజ్ఞానేశ్వరీయమను యాజ్ఞవ ల్క్యధర్మశాస్త్రమును తెన్గించెను. ఆంధ్రభాషాభూషణమను చిన్నవ్యాకృతిని సంగ్రహించెను. అభినవదండి ఇతనిబిరుదము. "అంచితభావరసోదయము" గా రచించుట కవియొక్కయుద్దేశ్యము. ఆతనికి భావములను యథా మూలముగా చిత్రించు నైపుణ్యముగలదు. తొట్రుపడక నెమ్మదిగా నడచు నట్టి ధారాశుద్ధి స్వభావవర్ణన యధికము. ఇతని రాజహంసుఁడు,"

"నిర్మలమణిమండనద్యుతినిరాకృత హంసుఁడు.

ఇతని నిదాఘువేళలో

"వడవడగా నీళులుడికిన జలచరుల్
వనచరవృత్తి మే లని తలంప
వాత్యాభిహతి లగ్గవాడి వియచ్చరు
లవనిపై జనుల మే లనితలం" చిరి.

---

1 ఒకకోయుంగమునకుఁ జేరిన 1. Spencer, 2. Sydney, 3. Shakespeare లనఁబె నీ 1 మంత్రిభాస్కర, 2 కేతన, 3 తిక్కన లేక కుటుంబమునకుఁ జేరినవారై యాంధ్రసారస్వతము నలంకరించినారు.

2 పుష్పోద్భవ, సోమదత్త, అపహారవర్మ చరిత్ర జదువుఁడు.

అట్టి నిదాఘములో "సురగాడ్పులెసఁగె నిఁక నిలువరాదు." నెల్లూరి నుండి బయలుదేరిన భారతి రాజమహేంద్రమువంకఁ జూచినది. కొంతవడి మంచన కేయూరబాహుచరిత్రకు చెవి యొగ్గినది. నన్నయ పెద్దనలతో పాటు మంచన రాజమహేంద్రవరము వాఁడే. నందూరి గండనమంత్రి యాతనినిఁ బోషించువాఁడు, 1300 ప్రాంతమున నున్నాఁడు.

"దలముగ నెల్లప్రొద్దును లతానివహంబుల రాలు పుష్పాడుల్
పులినతలంబులై చెలువుపూనఁగ మీఁదటఁ దేలు కేతకీ
దళముల మొత్తమో డల విధంబు నటింపఁగఁ బాఱుఁ బెద్దలై
ఫలరసవాహిను ల్పరియుపాంతవనంబుల."

ఇంకేమి గావలయును?

"ఇంటిదెసఁ బోవుట మాని విభుండు మున్ను జే
సినయుపకారము ల్మఱచి చేడియ చింతయొనర్చి"

నాఁడు. ఇట్టిసంఘటనములకుఁ బుట్టినిల్లగు కేయూరబాహుచరిత్రమును నాలుగాశ్వాసముల గ్రంథమును దెలుఁగుపదముల యరవిరివలపులు గ్రమ్ము దేర, సరసుల కింపుఁ బెంప రచించినాఁడు; చరిత్ర కెక్కినాఁడు. భారతి నవ్వి వెనుదిరిగినది. రావిపాటి త్రిపురాంతకుఁడు (తిప్పన్న) "అంబికాశతకము" తో స్తుతించినాఁడు. చంద్రతారావళి, మదనవిజయములను వినిపించి నాఁడు. 1380 ప్రాంతముల నున్న యీకవిరాయనభాస్కరునిదర్శించి నాఁడు. అతని దాతృత యభినందించినది. కళికోత్కళికలతో నింపినాఁడు. గ్రంథమును. పండితులు మెచ్చలేదు. దానిచేత నుదాహరణముల వీడి

"సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్వాణధురీణ కుంచికయొ నాఁగన్ బెంపుపహించు చంద్రుని"

కళారమణీయత్వము నభినందించినాఁడు. సరిపోలేదు.

"ఱెప్పలబోరుఁ దల్పు లిసిరింతలు వాఱెడు చూపుగుంచియం
ద్రిప్పి తళుక్కనం దెఱచి తిన్ననిమోమునఁ గాయు వెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూగినసిగ్గసియాడఁ బ్రీతితో
నప్పరమేశుఁ జూచి తనువర్ధముగొన్న"

యంబికబాల్యము.

"క్రొమ్మొలక చన్నులు మించుదొలంక సిగ్గునం
జూడఁగ నేరము ల్మెఱుఁగుఁజూపుల నీన హిమాద్రి యింటిలో
నాడుట శూలికిన్ మనము నాడుట"

యని యూహించినాఁ డంబికాశతకమునందు; తుదకాంధ్రము గా దని గీర్వాణములోఁ గ్రీడాభిరామములోఁ దనశృంగారచిత్తవృత్తిం బ్రదర్శించినాఁడు. అయిన నంత్యమునకు

"ధర్మభూషణమున్ గల్గి బతివ్రతామహిమ మించన్
గల్గెనేఁ దత్సతీమణి, చింతామణి"

యని మదనవిజయములోఁ దీర్మానించుకొన్నాఁడు. యథాదృష్టముగాఁ జిత్రించు నేర్పుగలదు. శృంగారరసమున మక్కువవలన భావోన్నతికి తావు లేదో? అంగాంగవర్ణనములో చంచలమైన మనస్సు మన మెక్కడ చలింతుమో యనిపించుచున్నది. వాస్తవముగా నిది కళయే, కాని ధర్మదూరమై పోయినది.

నన్నెచోడుని శృంగారమునుండి వెనుదిరిగి తిక్కనకావ్యసూక్తి సముద్రపుటలలలో నలయై యాంధ్రభారతి జీగిదేలియుండినది. త్రిపురాంతకునకు నూటేండ్లకు ముందు తా నుత్తమభావములలో నుయ్యేల లూఁగిన వైభవము స్మృతికిఁ దట్టినది. మేను జల్దరించినది. అహో, తిక్కన యెట్టివాఁడు!

"అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్".

అంతియే కాదు. "సకలవిద్యాకళావిచక్షణుఁ డెవ్వఁడనినఁ జూపుటకు గుఱియైనవాఁడు, మనుమసిద్ధి మహీశసమస్తరాజ్య, భారధౌరేయుఁడు"—"పరమేశ్వరుంబోలె లీలావినిర్జితకుసుమసాయకుండు"— "వితరణశ్రీయుతుఁడు"—తుదకు

"తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నా సమ్ముఖం
బునఁ దాఁ బల్కిన పల్కులాగమము లై పొల్పొ కవిబ్రహ్మ"

యైనాఁడు. కవిబ్రహ్మను గుఱించి యెట్లు పల్కినఁ బొసఁగునో!

ఈకవిబ్రహ్మకు శిష్యుఁడు మారన. మారన మార్కండేయపురాణమును రచించినాఁడు. ద్వితీయప్రతాపరుద్రుని సేనాని నాగయ గన్నయకు కృతి నిచ్చెను. ఇతనికవిత్వము మృదులము. నిదానముగ సాగిపోవుచుండును. విషయనివేదనమాత్రవ్యాప్తముగాని, రసోద్దీపనంబునకు నొంటిపడిఁ తల పెట్టదు. పురాణమునకుఁ గావలసిన యన్వయసౌలభ్యము, ఆశుధార గలవు. అక్కడక్కడ శబ్దాలంకృతులు శ్రవణపేయము లైనవి. మొత్తముమీఁదఁ గావ్యము విషయప్రధానమై వస్తుపరిశీలనానుచితంబై తనరినది. భావోద్ధతవాతములు మందములై రాత్రిళ్లు వెన్నెలలో పురాణాకర్ణనమున కనుకూలించినవి. శైలి తదనుగుణముగ నున్నది. మనుచరిత్రమును మనస్సులో నుంచుకొని ఈక్రిందిపద్యమును జదువుఁడు.

"ఎక్కడనుండి వచ్చె నతఁ డీతుహినాద్రికి వేడ్క నూని యే
నక్కడ నక్కుమారు రుచిరాకృతి యాడట నేల చూచితిన్
మక్కువ నేల నాదుమది మన్మథుఁ డేచఁ దొడంగె నాకయో
దిక్కిక నెవ్వ రిచ్చుట మదీయులటంచు దురాశ యేటికిన్."

హరిశ్చంద్రోపాఖ్యానము (గౌరన శంకరకవుల ద్విపద పద్యకావ్యముల) జ్ఞాపకముంచుకొని యీపద్యమును జదువుఁడు.

"ఉరగముచేతఁ జచ్చిన తనూభవునిన్ గని శోకవేదనా
భరవశయు న్వికీర్ణ కచభారయు, నుద్గతబాష్పపూరయున్
కరతలతాడితాస్యయును గద్గదికావికలార్తనాదయున్
జరణ విపర్యయాపగత సత్వరయానయు నై పొరింబొరిన్."

ఎటులున్నను పురాణకవులయౌచితియు, స్వభావవర్ణనములును, కావ్యప్రబంధకవులకన్న నుత్కృష్టములని కొందఱందురు; పాఠకులు పరిశీలించి తీర్మానించుకొందురు గాక.

నెల్లూరిమండలములోనివాఁడే ఎఱ్ఱాప్రెగ్గడ. ఇతనిభావకవితారీతులు

"స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారస మధువ్రతనిస్వనము ల్చెలంగఁగాఁ
గరము వెలుంగువాసరముఖంబు..."

లను బోలినవి. నన్నయకోకిలము రాజరాజరాజ్యవసంతమాకందము చివుళ్లకు వాడినది. చోడాదులు గానమునందుకొనిరి. అంతలో కవిబ్రహ్మ గ్రీష్మాతపముతో కవితాప్రపంచమును మిలమిలనాడించినాఁడు. ఆదుస్సహతేజస్సంపదలో నితరులు వాడిపోయిరి. కాని, యాషాఢమాసపుజడివానలు రంగనాథరామాయణముతోఁ గురిసినవి. ఎఱ్ఱనతో శరదృతువాసరముఖంబులారంభము లైనవి. సోమునియందు శరద్రాత్రిపూర్వభాగము జనులకు వెన్నెలలఁ బంచిపెట్టినవి. సౌందర్యలహరియైన యాశ్వయుజపుఁ బున్నమనాఁటి యఱరేయి యమరేశ్వరునియందు వ్యక్తమైనది. నన్నయతోఁ బ్రారంభమైన భారత మెఱ్ఱనతో నంత్యమైనది. ఎఱ్ఱనకవిత్వము సోమయాజులను వెలుఁగు పోకలలోఁ దలంపునకుఁ గొనివచ్చుచు, సంస్కృతసమాసములలో

నన్నయను బోలుచుఁ గదళీపాకమునకుఁ దిగినది. తిక్కన యిర్వురిశైలినే యితని భాషాంతరీకరణముకూడా [1]మూలానుసరణముగాదు. సాధారణముగ సమాసము లస్థానపతితములు గావు. ఏకార్థపదంబుల ప్రాసాడంబరమునకు మొదలిడలేదు. కథాగుంభనమున పాఠకునిమనస్సు మఱపించుటలో నితఁడును మంచి వివేకశాలియే. అయినను నన్నయ తిక్కనలతో సమఁ డందమన్న కొందఱు విమర్శకులకుఁ గంటగింపు. ఎటులున్నను, భారతములోని యితనియతుకు "కనఁజాలనంతటి పనివానితనము" గన్పఱచుచునికి సత్యము. ఇతఁడు కొండవీటిని పాలించిన ప్రథమ వేమారెడ్డియాస్థానములోని కవి. (ఈవేమారెడ్డి ఇంటిపేరు దేసటియని తెలిసియుంటిమి గదా!) కాన, ఎఱ్ఱన పదునాల్గవశతాబ్దిని బూర్వభాగమునయుండినవాఁడు. ఎఱ్ఱన "నిత్యసౌమ్యమతి, సాధుసమ్మతుఁడు". పైన సకలభాషాకవిత్వవిశారదుఁడు. వ్రాసినగ్రంథములు, భారతపరాంశమగు హరివంశము వేమారెడ్డి కంకిత మైనది. భారతరచన ప్రజాగౌరవమునకుఁ బాల్పడినది. నృసింహపురాణ మహోబలనరసింహుని పాదముల కెరఁగినది.

ఇతఁడు చెదల్వాడనిలయుఁడు; శంభుదాసుఁడు. లాక్షణికులగు పండితాగ్రణు లెట్టి గ్రంథమునైనను తెలిసికొందురు; అభినందింతురు. పామరులకట్టి వారి సన్నిధి లభింపదు. ఇర్వురకును రాయబారము నడపువాఁడు రసజ్ఞుఁడును, అల్పాధికతలులేని సమపాండిత్యముగలవాఁడును నగుపాఠకుఁడు. పామరశ్రోతలకు పండితలాక్షణికునికి సమన్వయముఁగూర్చు చదువరి, అత్యవేది. రంధ్రాన్వేషణ మాతనిదిగాదు; రసానుభూతి యతని పని. కాన కథయందే చిత్తవ్యగ్రత, కథను, రసమును జారగొను నితనికి కథలో జతపడిన యలంకృతులు తప్పఁ దక్కినవి దవ్వు; తత్కాలవిచార్యములు గావు. కాననే యుత్తరహరివంశ వసుచరిత్ర లాతనికడఁ జాలకాల ముండ నేరవు.

---

1 కవులచరిత్రము.

ఉత్తరరామాయణ, భాగవత, భారతములయెడఁగల మక్కువ; ప్రేమ వాని యెడఁజూపఁడు. గౌరవభావ ముండవచ్చును. కాని, గౌరవప్రేమలు భిన్న భావములు. భార్యయందున్న ప్రేమయు గురువునెడ నుంచిన గౌరవము నొక్కటియగునా? కావు. ఈతత్త్వమును భారతకవులు చక్కఁగ గమనించిరి. కాననే వారతిశయోక్తులు, శబ్దచిత్రములు, అర్థాంతరములు గల్గియున్న ప్రబంధఫక్కికి దూరులైరి. కొన్ని మిక్కిలి సాధారణములైన భావములు తటస్థించినను వానిని వేషాడంబరములోఁ గప్పిపుచ్చుటకై యుంకింపలేదు: వైశద్యమును బాడుచేసికొనలేదు. ఎఱ్ఱన నన్నయ తిక్కనల పాదచ్ఛాయల ననుసరించెను; కృతార్థుఁ డయ్యెను. పూర్వభారతకవీంద్రుల యశ్లేషోపమ లీతని యందును దక్కు లీనినవి. చూడుఁడు మొదటిదగు రామాయణములో:

"కోఱలు నుగ్గునుగ్గయిన క్రూరఫణీంద్రు గతిన్ దరంగముల్
మాఱిన భూరివారిధి క్రమంబున రాహుకరాళవక్త్రముల్
దూఱిన తీవ్రభానుక్రియ దుర్బలసైన్యతఁ బుత్త్రహీనతన్
గీఱి పరాభవాధిగతిఁ గీడ్పడి భూపతి నెమ్మనంబునన్."

రెండవగ్రంథమగు హరివంశమున విషయనివేదన చమత్కృతిని గఱచెను. మూఁడవదగు భారతారణ్యపర్వశేషమున సులభసాంస్కృతికసమాసగాంభీర్యము నేర్చెను. నాల్గవదగు నృసింహపురాణమున నన్నింటిని జతపఱచి స్వతంత్రపథము నవలంబించి ధన్యుఁ డయ్యెను. కవిత తక్కినయన్నిగ్రంథములలోకంటె నృసింహపురాణమున నుత్కృష్టతఁగాంచి రసోదంచితమైన దనవలయును. చదువుఁడు:

"ఇదె చనుదెంచెఁ జైత్రుఁ డని యెల్లవనంబులకున్ బ్రమోదముల్
పొదలగ మేలివార్త గొని పోరనవచ్చిన దాడికాఁడనన్

మృదువనదేవతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె నిం
పొదవగ దక్షిణానిలమనూనమనోహరఖేలనంబునన్."

పూర్వసంస్కృతపదజటిలత దగ్గినది.

"పొగడమ్రాకుల మొదలను బువ్వురసము
తొఱఁగి నెత్తావియందున నెఱయ నొప్పె!
బూచుకొఱకు మున్ను నింపులు దలిర్ప
గడఁగి వనలక్ష్మి యుమిసిన కళ్లె యనఁగ"

"అదరిపాటున వేసవి పొదలి కొనిన
కలఁగి కదలిపోనేరక మలయపవనుఁ
డిందుఁ దలదూర్చుకొనియెనో యిప్పు డనఁగ
నమరు దాళవృంతముల మందానిలంబు."

ధారాకాఠిన్యము సమసిసమసి తేలికయై

"పరమాత్మపదములఁ దొరఁగిపారెడు నేటితరగలపై లీలదాటిదాటి"

నిగ్గుదేఱినది కాని, యప్పుడప్పుడు మాత్రము రవడి గానవచ్చుచునే

"శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభనూతనార్కరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుఁ దలంచు సుకృతాత్ములపాస్తసమస్తకిల్బిషుల్"

అనియుఁ బల్కించెడి.

కాలము తెలియని కవుల నించుక స్మరింతము.

1. కాకమానిగంగాధరునిశైలి సమగ్రసాహిత్యపటిమను సూచించు చున్నది. సంస్కృతపదములతో మెండుకొని యున్నది. 2. గంగరాజు చొడప్పకుఁ దెలుఁగు నుడికారములు బాగుగాఁ బరిచితములైన ట్లున్నవి.

3. పొన్నాడ పెద్దిరాజుకవిత పూర్ణముగా విరాటపర్వమును దఱచి, దానిలోని వాక్సరణిని గొనినట్లు తనరుచున్నది. ఇతఁడు సుకవిసుమంబులఁ జేరఁదగువాఁడు.

"గజయాన మెలఁగిన గతియైనఁబైపడ
గద్దించి తర్కించి కలఁకనొందు"
"నెలఁతుక చూడ్కి వెన్నెల గాసినఁ గుమారుఁ
వీక్షణాంభోనిధి వెల్లివిరియు"

నను పాదము లేమనుచున్నవి?

"వేగిరింపకు నీకు వెలఁదివెన్నెలక్రొవ్వు
గుడిపింతుఁ జిన్నారికడుపునిండ."

యని యొకతల్లి యనుచున్నది.

"పర్జన్యసత్కృతిఁ బసిఁడి బండెడిచేల
నంగఁ జేర్చినరాజనంబులకును"

కవిదృష్టి పారినది. స్వభావవర్ణనలు ఇతనికి నచ్చినట్లున్నది. 4. [1]పెమ్మైన భావన నాచనసోముని తర్వాతివాఁడైనట్టు లితని పోకడలు నుడువుచున్నవి.

"అర్జునప్రీతియు నర్జునఖ్యాతియు, నిగుడింప మగుడింప నేర్పుగలిగి
కుబ్జావలేపంబుకుబ్జావరూపంబు, ధరియింప విరియింప వెరవుగలిగి".

యను సీసపాదము లేమనుచున్నవి? వసుచరిత్రకు పుత్రిక లుదయమైనట్లే యుత్తర హరివంశానుకృతు లెన్నియో పుట్టియుండు టాశ్చర్యము కాదు. ప్రతిభ లేనిచో ననుకరణమే శరణ్య మగుచున్నది.

---

1 ఇతని యనిరుద్ధచరిత్ర మతిప్రౌఢకవితావిలసితమై యున్నది. సోమునిది చదివి దీనిని జదువుటచే విపరీతము చక్కెరవిసుగెత్తించినట్లయినది. పెమ్మన యనునది పెమ్మయ యై యుండునా?

"చెలువము లొప్ప రాజనపుఁజేలకుఁ గావలియున్న కాఁపుఁగూఁ
తులనిడువాలుఁగన్నులను దోరపుఁజన్నులుఁ జూచి ధైర్యము, ల్వలపల"
'నైనవఁట! పోనిం డట్టివానితో నేమి? ఇఁక మిగిలినవాఁడు త్రిలింగ "కవితా
ప్రపంచ రవి దిక్కవరేణ్యుఁడు."

## 3 కావ్యవిమర్శ

ఒక్కసారి కావ్యజాలముం దడవితిమి. మిన్నలైనవారే యెల్లవారును కాని, వారెల్లరలోను తిక్కన్న (తిగ+కన్న) యుత్కృష్టుఁ డని యెల్లరు నొప్పుకొనిన విషయము. తిక్కన్న ప్రాశస్త్యము మూఁడుత్రోవల ప్రశస్త మైనది. సంక్షేపవిక్షేపసాహాయ్యములఁగొని మాతృకలోనుండు నసందర్భ ప్రయోజనములఁ దీసివైచి కవిత నాంధ్రదేశీయముగ నుద్ధరించుటయందును, స్వభావోక్తి ప్రభృతిగుణసంబద్ధమగు నమోఘ ప్రపంచానుభూతి(వ్యుత్పత్తి) తో భాషాంతరీకృతి యనుమాట మఱపించి, స్వకపోలకల్పితకావ్యమువలె భారతమును నిరుపమాననిరర్గళధారామహిమచేత తెనుఁగువారి సొంత నగా మార్చివైచుటయందును, మహాకవిత్వమును నెరపిన దొకటి; తెనుంగు పదములను, నందులో వాడుకలోనున్నవానిని, చేపట్టి భాషను విపులము చేసి పదప్రయోగవైచిత్ర్యములకు మార్గదర్శియగుట రెండవది; విజయసేన మందును, కీచకకథయందును భవిష్యచ్ఛృంగారకావ్యసృష్టికి హేతు భూతుఁడైనది మూఁడవది. ఈ మార్గదర్శిత్వమును బట్టియే నాచనసోముఁడు తిక్కన్నను వెన్నంటియున్నాఁడు. శబ్దార్థాలంకారగతులను, తీరుతీయ ములు గలిగిన సొగసు నుడికారములను, శ్లేషానుప్రాణితమైన ప్రౌఢకవితా ఫక్కియునుఁ జూపి ఇంతవఱకును కథాసరస్సులో లీనమై యుండిన కవి శక్తిని ప్రధానముగా మార్చి కథను (లేక, వస్తువునందలి స్వారస్యము,

ఐక్యము మున్నగువాని) అప్రాధాన్యముగఁ జేసినందుచే వానిని తర్వాతి యుగములోని కవు లనుసరించుటచేత సోమనాథుఁ డొకవిధముగా, నితర కవులకన్న విలక్షణుఁడై వేఱుపడినాఁడు. ఇతనిపక్కి మంచిదేనా? కాదా? యని వితర్కింప నక్కఱలేదు. ఏలయన నితని సామర్థ్యమే యందఱకున్న నదొక్కటీరు. అట్లు లేమిచే నితఁడు చూపిన యాదర్శము మంచిదిగాదేమో! ఎటులైనను వాఙ్మయతత్త్వము ననుసరించి వైలక్షణ్యముచే సోముఁడును, ప్రతి భావ్యుత్పత్త్యాధిక్యముచేఁ దిక్కనయు నీయుగమున యుగలక్షణ సమన్వయ మునకై ముఖ్య విమర్శనీయు లగుచున్నారు.

తిక్కన్నను కాలమునుబట్టి, గుణమునుబట్టి మొదట స్మరింతము.— భావగీత మొకండేమి చెప్పుచున్నది? వినుఁడు:

'పూజాతిసాంద్ర కర్పూరమ్ములందు
ప్రాజ్ఞపాథోలవమ్ములయందు
మడుగు సన్నని పాట
పాడుచు వెన్నెల లేట
కలపు తిక్కన పలుకు తెలుగు పల్కులకు.'

ఘను లెందఱో విమర్శించియుండ వారిదిగాదని నాకుఁ జెప్పుటకేమియును నెక్కువ తోఁచదు. కావున వారి విమర్శనముల నిట నందిచ్చువాఁడను.

I

"వినసొంపగు పలుకుబడులు, భావార్థబోధకమగు పదప్రయోగము పద్యముల చిక్కఁదనము, గడుసుపోకడలు, జిగిమెఱయు శైలీసౌకుమార్యమునందు నీతని కీతఁడే సాటి. రాజనీతి యుద్ధవర్ణనము మున్నగుచోట్ల మంత్రియగుట నతినేర్పుతోఁ జెప్పును......... నన్నయవలె సంస్కృత వాక్యక్రముననే స్వీకరింపలేదు. తెలుఁగు భాష ప్రాణమును సచలనమగు భాషలో వ్రాసిచూపినాఁడు."

(వాఙ్మయచరిత్ర.)

## II

"తిక్కన కవిత్వము ద్రాక్షాపాకమై మిక్కిలి రసవంతముగానుండును. ఈతని కవిత్వమునందు పాదపూరణమునకై తెచ్చిపెట్టుకొనెడు వ్యర్థపదము లంతగా నుండవు. పదముల కూర్పుమాత్రమే గాక యర్థసందర్భమును మిక్కిలి పొందికగా నుండును. ఏవిషయమును జెప్పినను యుక్తియుక్తముగా ప్రౌఢముగా నుండును. కవిత్వము లోకోక్తులతోఁ గూడి జాతీయముగా నుండును. ఈయన పదలాలిత్యమును, యుక్తిబాహుళ్యమును, అర్థగౌరవమును, రచనాచమత్కృతియు శయ్యావిశేషమును, సందర్భశుద్ధియు, కల్పనాకౌశలమును అన్యులకు రావు......ఒకవంతు సంస్కృతపదంబులును, రెండువంతులు తెలుఁగు పదములు నుండును...మూలమునకు సరిగాఁ దెనిఁగింపలేదు."

(ఆంధ్రకవులచరిత్ర.)

## III

"ఈ మహాకవి గ్రంథమును జూచి నేర్చుకొనవలసిన విషయము లెన్నియేని గలవు. ఆంధ్రభాషాకవిత్వమర్మ మాతనికిఁ దెలిసినట్లు మఱియే యాంధ్రకవికి నిప్పటికిఁ దెలియదు."

(శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రులు.)

## IV

"ఆంధ్రమహాభారతము సంస్కృతభారతములోనుండి కథమాత్రము గ్రహించి దానికంటె వేయిరెట్లధిక మనోహరముగా రచించిన స్వతంత్రమహాకావ్యమని చెప్పక తప్పదు. మూలములో లేని యర్థాలంకారములును, రసభావములును, మానవస్వభావ వర్ణనములును, దెలుఁగుభారతమునం దెచ్చటఁ జూచిన విచ్చలవిడిగాఁ గానవచ్చును.

మూలములోని విసుగుపుట్టించెడి యనేక దీర్ఘకథానకములును, వర్ణనలును, వేదాంతఘట్టములును తెలుఁగునందు లేనేలేవు. తిక్కన నిజమైన కవి యగుటచే నిరంకుశుఁడై మూలములోని ముఖ్యకథను మాత్రముఁ దీసికొని కడమభాగము నిష్టమువచ్చినటులఁ దగ్గించి, పెంచి, మార్చి వ్రాసెను.

సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆంధ్రభారత మాముద్దలోనుండి వలయునంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కని సువర్ణకమలమువంటిది.''

(తిక్కనభారతమునుగురించి కీ. శే. కే. వి. లక్ష్మణరావుగారు.)

V

''అవతారపురుషుఁడుకాని కేవలమర్త్యుఁడా! యని యాశ్చర్యపడవలసినంత ఘనుఁడు... పాత్రముల సహజప్రకృతుల నుద్ధరించుటయందు భారతమును మించిన గ్రంథ మీప్రపంచమునం దెక్కడను లేదు. విచిత్రచిత్రభంగులు గలసి భావార్ద్రములై స్వాభావికములై మెఱుంగుబెట్టఁబడినవి. భారతపాత్రములు.....తిక్కన ప్రభావంబు అజేయంబు; అద్వితీయంబు. విరాటపర్వములోని తిక్కనవ్రాసిన శృంగారవర్ణన మనన్యసాధ్యము; ఔచిత్యశోభితము.

(కవిత్వ తత్త్వవిచారము. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు.)

VI

''అద్వైతమతబోధ మాంధ్రభాషలోఁ జేసిన యాచార్యులలో సోమయాజి మొదటివాఁడని చెప్పవలసియున్నది. ఆంధ్రులలోఁ దత్త్వరహస్యమఱయఁగోరెడు [1]నాంధ్రభాషాపండితు లందఱును

1 అనగా పండితులుగానివారికెల్లను భాగవత, సీతారామాంజనేయములు ప్రాముఖ్యము లనియా భావము?

సోమయాజి మార్గముం దెలిసికొనకయే యితరగ్రంథము లభ్య
సింపరు."
(శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు.)

## VII

"తిక్కన ఆంధ్రమహాపురుషుఁడు. కూలంకషప్రజ్ఞాధురీణుఁడు.
శ్రీమంతుఁడు.........ఆముష్యాయణుఁడు...... కావ్యకళాజని
భూమి; అన్వయోద్ధారుఁడు. నిరతిశయవివేకోన్నిద్రుఁడు......
సోమయాజి బ్రహ్మవేత్త; కృత్తిభర్త. మంత్రిమాణిక్యుఁడు; దండా
ధీశుఁడు; సర్వాంధ్రలోకపూజనీయుఁడు."

(శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు, 16-వ ఉగాదిసంచిక.)

విపులగ్రంథమగుటచే నొక చోటిపద్యమే మఱొక్కచోటను, తన యితరగ్రంథరచనల భారతములోఁ జొప్పించుటయుఁ దటస్థించినది. ఉద్యోగ పర్వమునందలి సనత్కుమారోపదేశమును సంగ్రహించెను. ఉత్తరగీతలు మున్నగునవి పరిత్యక్తములైనవి. భగవద్గీత యసలేలేదు. కావ్యదృష్టియే కాని పాండిత్యప్రకటనమునకుఁ దొడంగలేదు. కథ వేగముగ నుండ వలసిన చోట్లలో నలంకృతులకు పోలేదు. సాదృశ్యము భావమున కుద్దీపనము నిచ్చునట్లుండినచో, మూలము లేకున్నను గల్పించినాఁడు. "సింగం బున్న" యనుపద్యమును, "ఎలదీఁగె" యను సీసమును (విరాటపర్వము చూడుఁడు) అర్థపుష్టికై తనకుఁ దోఁచినట్లు వ్రాసెను. "వలలుం డెక్కడఁ జూచె" యను వృత్తము! ఇది ఇతని భాషాంతరీకరణ పద్ధతి. "భావములఁ బ్రసిద్ధిననుసరించి విక్షేపమునుఁ దాల్చినవాని నధికముగను సంక్షిప్తములగు గుణములఁ గొలఁదిగను వర్ణించి, నిక్షిప్తములగువానినిఁ జేర్కొనక విడుచుట కళకు శోభ." తిక్కన దీని తత్త్వమును చక్కఁగ గ్రహించినవాఁడు. కథకు భంగముఁ గలిగించి వర్ణనపై పాఠకుని దృష్టిని మరల్చుటకు నితండు పూనుకొనక తనసందర్భశుద్ధినిఁ బ్రకటించెను. రసోదయ

మునకై యితండు చేసిన చిత్రపదప్రయోగము లుచితములు. ఒక్కసుదేష్ణ నవ్వును వర్ణించిన వృత్తమును గనుఁడు. ఇతని సంభాషణావైఖరి పాత్రోచితము; సమయోచితము; రసోదంచితము; సహజము. భీష్మాది యుద్ధపంచకములో నొకరినొకరు నిందించుకొనినమాటలు, కలహములు, పన్నుయుక్తులు విమర్శింపుఁడు. భీష్ముని నిష్కాపట్యము, ద్రోణుని పాండవాభిమానము, కర్ణునిరాజభక్తి, శకుని కుతంత్రము, కిరీటివిక్రమము, అభిమన్యుని యుద్ధ్యమశక్తి, మనకన్నులకుఁ గట్టినట్లున్నవి. క్రోధమూర్ఛితయు, మహామతియు నగు ద్రోవదిపట్టుదల, స్త్రీశీలములోని మార్దవమునకు వినమ్రతకు భంగము లేకుండ నెట్లు వర్ణింపఁబడినది ? అంతయు యుద్ధమయమే కదా ? ఎక్కడనైనఁగాని విసుకుపుట్టదుగదా? కొంచెముపాటియుద్ధవర్ణన కితరకృతులలో మనకసహ్యము గల్గుచుండును. కాని, తిక్కనవర్ణనము లెప్పటికప్పటికి నూత్నములుగాఁ గన్పడును. మనకంటికి గట్టినట్లున్నదిగదా భారతయుద్ధానంతరము చూపిన వీరశ్మశానభూమి! మనమే ప్రత్యక్షముగాఁ జూచుచున్నట్లుండునే? ఒకగ్రంథమును భాషాంతరీకరించి మూలములో నున్నంత రససమృద్ధియే, కళయే కన్పఱుపవలెనన్న తొలికవి యంతటివాఁడు నూత్నకవియుఁగాక తప్పదుగదా ! ఇంకఁ దిక్కన్నను ఆంధ్రవ్యాసుఁ డనుటకేమి యాటంకమున్నది? మొదలిడినది మధ్యవిడుచుటకు బుద్ధిపుట్టింపక తన్మయత్వమునొందఁ జేయఁజాలిన తిక్కనకవి ధన్యుఁడు. భారతరచనకు అట్టి మహాకవియే యుదయించుట నాంధ్రభాషయు ధన్యతఁగాంచినది.

విరాటపర్వములో శృంగారరసము పోషింపఁబడినది. (ఉన్నతభావసమన్వితము నుచితసందర్భశోభితముగాని శృంగార మసభ్యము, అనుచితము. అంగాంగవర్ణన లున్నవిగాని హృదయాందోళనావేశవేగములో మునిఁగిపోయినవి. "సుదతినీమై చక్కఁజూచుట కోడెద" నని సహస్రభామినీకందర్పుఁడగు కీచకుఁడే పల్కినపుడు ద్రౌపదీ సౌందర్యము స్ఫుటము కాలేదా? అమెబెట్టి సౌందర్యమో?

"లీల నామ్ముందట నాలేమ యొలసినఁ జూడ్కికిఁ జుబ్బనచూఱగాదె" అని యనుకొన్న కీచకుని యుత్కంఠాతిశయ మెట్టిదో! (ప్రబంధకవుల చంద్రమలయానిలదూషణలేవీ?) "నీసిగ్గు దెరయోల మేలనీకు?" అని కీచకుఁ డన్నప్పటి మోహాంధకార మెట్టిదో? పాఠకుల కెట్టిభావము జనించునో?

"ఇంపైన ప్రియ కాననిచ్చి నిల్చినమధు, వాదట నానుమత్తాళి విభుని" మనము చూచుచునే యున్నాము! ఏమి యీయపూర్వకల్పనా గరిమ! నీచవర్ణన లేనే లేదుకదా?

ఉద్యోగపర్వములోని తిక్కన్న వేఱు. మన్మసిద్ధీశతమాచక్రమఱ చేతఁ ద్రిప్పిన మంత్రిశిఖామణి కృష్ణునిలో లీనమై రాయబారము నడపు చున్నాఁడు. అహో! ఆ కౌరవసభలో నతఁ డాడినమాటలు హృదయమున ప్రతిధ్వనితములగుచునే యున్నవి. ధృతరాష్ట్రునికౌటిల్యము, సుయోధను నుద్ధతి స్పష్టములుగఁ జూచుచున్నాము. తెరపడినది.

భీష్మావేశముతో భీష్ముఁడు యుద్ధభూమిని సంచరించుచున్నప్పుడు తిక్కనదేహ మెట్టి వీరరసాతిరేకమున వడదేఱుచుండెనో! కృష్ణసారథ్యము మెఱసిపోవుచున్నది. రంగములు దాటినవి. ద్రోణుని వాగ్దానఘట్టమున విషా దాశ్చర్యములు పుట్టినవి. అభిమన్యువధలో ఫలించినవి. యుద్ధపంచకము నట్లు రచించుకవి యేడీ? భావములు నెమ్మదిపడినవి. పాండిత్యప్రకర్ష కవకాశము గల్గినది. స్త్రీపర్వములో ఛందోభేదములను జూపినాఁడు. మరల తెనుఁగు పదములు విసరుపాటునవచ్చినవి. తుదిపద్యములు శరవేగముతో దాటిపోయి నవి. చెప్పవలసినదేమన తిక్కనజీవితము భారతకథలోఁ దాదాత్మ్యమొందిన దనియే! అందునకే తిక్కన చిరకీర్తిని గడించినాఁడు.

చంపువు దృశ్యకావ్యరామణీయకము నిచ్చునని యనుకొంటిమి. కీచక వధ విషాదనాటకముగను, శ్రీకృష్ణరాయబారము రాజకీయనాటకముగను, అభిమన్యువధ శృంగారవిషాదపూరితరూపకముగను, కర్ణఘటోత్కచమృతులు

వీరదృశ్యములుగను, అశ్వత్థామప్రవర్తనము ఈర్ష్యాలవాలముగను గాని కరుణాబీభత్సరస సమ్మిశ్రనాటికగను, భీమవిక్రమము వ్యాయోగముగను, తిక్కన ఘట్టములను దశవిధరూపకములలో నేరూపకముగనో మార్పవచ్చును. ఆయాభాగములను వేఱ్వేఱుగా విమర్శించి యందలి నాటకగుణదోషములఁ దిలకించుచోఁ దిక్కన షేక్స్పియరున కేవిధమునను దీసిపోఁడని నిరాటంకముగ నుడువవచ్చును. షేక్స్పియరు వ్రాసిన శృంగారకృతులును, సానెట్లును ఆంగ్లేయుల కెట్లో తిక్కనవిజయసేనము మన కట్టిది. తనకవిత్వరీతులను దిక్కనయే "అమలోదాత్తమనీష" "ఇంపారెడుపల్కులన్" "లలితపదహృద్యపద్యంబులు" "సరసమధురవచోగుంభన" "ఉభయకావ్యప్రౌఢి పాటించుశిల్పము" "నిరతిశయానుభవానందము" "కవితావేశుండు" నను పదంబులలో నుద్ఘోషించినాఁడు. నన్నయ "అక్షరరమ్యత" "ప్రసన్నకథాకలితార్థయుక్తి" వెలయ రచించెను. తిక్కన "కావ్యప్రౌఢిశిల్పమును" సంతరించెను. "కథాకలితార్థయుక్తి" కిఁ దగిన మితభాషణము నన్నయకుఁ గుదిరినది. శిల్పానుకూలభావవిస్తృతి తిక్కన్నకు వచ్చినది. ఎఱ్ఱన్న ఈభావవిస్తృతిని సందర్భము గోరునంతటికంటె నెక్కుడు చేసెను. భావక్లప్తతలో కవిత్రయమునఁ బ్రథముఁడే ప్రథముఁ డనవలసి యున్నది

తిక్కన యసాధారణపురుషపుంగవుఁడని యతని జీవితము, ముందుగ చరిత్రభాగమున పర్ణితములైన యతనిగుణములును స్థిరపరచుచున్నవి. అతని జీవితమునాఁటి సాంఘికస్థితిలోని యౌన్నత్య మాతనికి సంక్రమించినది. అప్పటి శృంగారములోని పవిత్రత యాతనియందు ప్రతిఫలించినది. ప్రథమప్రతాపరుద్రుని శౌర్యము, గణపతిదేవుని రాజనీతి, విశ్వేశ్వర శివదేశికుని యాధ్యాత్మికసంపద, తనవంశములోని ఖడ్గ తిక్కనసాహసము, తన తాతలోని కవితారామణీయకము కవితిక్కనలోఁ గలసినవి; పూచినవి; భారతాంధ్రీకరణమున ఫలించినవి.

ఇతని ఇతరకృతులు విజయసేనము, కవివాగ్బంధము, నిర్వచనోత్తర రామాయణము. విజయసేనము ప్రౌఢశృంగారరసాత్మకమైనది. దీనిని వ్రాయకుండిన బాగుండునేమో! కవితయేమో నవయౌవనమాధుర్యమును పాడుకొనుచున్నది. 'మదనవశీకారమంత్రదేవతను' సాక్షాత్కరింపించుకొనుచున్నాడు. 'సాక్షాత్కరింపించు' శబ్దమువలెనే యతివేలశృంగారమునకుఁ బోయిన సూచనలున్నవి. గ్రంథము అసమగ్రముగా దొరకినది. ఆరెండుమూఁడుపద్యములపోలిక లనేకములు తర్వాతిగ్రంథములలోఁ గన్పడుచున్నవి. మహాకవి వ్రాసినవ్రాఁతలెట్లున్నను, స్వశక్తి ఎట్లున్నను అనుకరించుటాచారముగదా! తిక్కనశృంగారరసమున్నతి నందనేరక యీవలివారు 'చిల్లరశృంగారము' నకు మొదలువెట్టిరి. 'కవివాగ్బంధము' విచార్యముగాదు. 'నిర్వచనోత్తర రామాయణము' తిక్కనకు విలువరాయిగాదు.

నాచనసోమనకాలమునకు యుగము మాఱినది. ద్వితీయప్రతాపరుద్రుని కొలువుకూటము జనులమనస్సులో నున్నది. మాచల్దేవి వారాంగన గాథలు విశ్రుతములైనవి. పూటకూళ్ల పొగరుపోతుతనము త్రిపురాంతకుని (తిప్పన) క్రీడాభిరామములో రూపుదాల్చినది. నూతనకర్ణాటకరాజ్యోన్నతి యనఁదగు కృష్ణరాయని కాలము దవ్వున నున్నది. విద్యానాథుని యలంకారశాస్త్రము సోమనచెవులలోఁ గింగురుమనుచున్నది. అందులో సప్తభాషాప్రవీణుఁడు నవీనగుణసనాథుఁడునై తుంగభద్రను డగ్గరినాఁడు; అగ్రహారములు వీరబుక్కరాయలచే నందినాఁడు. 'నాకపురంబులో మెఱసి, నందనకేళిఁజరించి' యనునొకపద్యములో నెట్టినకవితయంతయును తులఁదూఁగునా యను సందేహమును కలుగఁజేసినాఁడు. 'ప్రకరణోచితమై, ప్రౌఢమై, యూహాతీతమై' యుండు 'తొలుకాఱు మెఱుఁగులతోఁటల'ను సృష్టించినాఁడు. గ్రంథపఠనానుభవము దూరదృష్టి శేముషీవిశేషము విశేషము లేని విమర్శకులకేమి, చదువరులకేమి దురవగాహముగా రచించి

నాఁడు. 'ఇతఁ డొక్కఁడే పదవాక్యప్రమాణజ్ఞుఁడు; పుట్టుకవి' యనిపించి నాఁడు. 'ఎఱ్ఱనయే అశ్లీలముగ నున్నాఁడు. చిత్రకళాకౌశలము లేదేమో' యను విమర్శనను బుట్టించినాఁడు. చూచి కవులన్నారు గదా, 'ఔరా, హారిరసస్థితి ! యహాహా, శబ్దదాంపత్యము! అయ్యారే, పాదబుజుక్రమంబు భళి, శయ్యారీతు! లోహో, చమత్కారం! బద్దిర, జాతివార్తలు! పురే, ధారాసమారూఢిమ! మ్మారా, రాజదలంకృతుల్! కవులలో మాన్యుండ వీవన్నిటన్.' సహజభావపోషణ మెఱ్ఱనలో నున్నది. కాని "యతఁడు రత్నఖని. సోమన్న రత్ననిధి" యని తీర్మానించినారు విమర్శకులు.

ఈ తీర్మానము సరియైన తీర్మానమే. ప్రజలకుఁ గావలసినది రత్నఖని గాని రత్ననిధిగాదు. పాఠకుఁడు సామాన్యవిజ్ఞాని గాని, లక్ష్యలక్షణవేది యగు పండితాగ్రణిగాఁడని ముందే విన్నవించుకొంటిని. అట్టిచో పరిశ్రమ చేసి ఎవని కే రత్నము వలయునో యా రత్నమును పరిశ్రమకు ఫలముగాఁ జదువరి తీసికొని సంతోషించును. రత్ననిధికడ లక్ష్యలక్షణవేత్తయగు పండితుఁడే పనికివచ్చును. వానికే విలువ దెలియును. కాన, సామాన్యున కతం డనావశ్యకము. రత్ననిధితోఁ బనియేమి? జీవితమున కావశ్యకము కళానందము; దాని నవలీలగాఁ బొందు త్రోవ యుండఁగా కష్టపడుటేల? సులభమగు దానిని విడిచి కష్టమునకు కుంకించుట సామాన్యమానవప్రకృతిగాదు. ఇంకొక సాదృశ్యముఁ జూడుఁడు; మనుచరిత్ర రత్నహారము, వసుచరిత్ర రత్నముల రాశి; రత్నఖని యొకటి, రత్ననిధి యొకటి. మనుచరిత్రయెడనున్న ప్రజాప్రీతి వసుచరిత్రయెడ లేదు గదా? [1]సోమన యధికుఁడే యగును.

---

1 ఉగాదిసంచిక (1918); శ్రీనడకుదుటి వీరరాజుగారు. ఎఱ్ఱన యశ్లీల మట్టిదే యొకవేళ నైనను, పురాణకథానిమగ్నతఁ జెందిన చదువరికిఁ గన్పింపదు. సోమనలో కవిశక్తియే మఱిగించునది కాన నశ్లీలము శీఘ్రముగా బయల్పడును. సోమన యెఱ్ఱనలఁ బోల్చి యెఱ్ఱన పిన్నయనుట యన్యాయ్యము. పురాణకావ్యఫక్కులు వేఱు. కాన, వారియాదర్శములును వేఱు.

కాని, ఎట్టిన ప్రజాప్రీతిపాత్రుఁడు. ప్రజాలక్ష్యమేమి, పండితులులేరా? యనుకొన్నచో పండితులకే పనికివచ్చు వాఙ్మయముండుఁగాక! అది కళా పరమధర్మమగు నానందమునొసంగి, ప్రాచుర్యముఁ గాంచక యడవిమల్లె యగుచున్నది. దానంజేసి కళాధర్మముతో విశ్వహృదయమును మేళగించి ప్రజాసామాన్యమునకు (పండితులకేకాని పామరులకేకాని ప్రత్యేకించి రచింపక) సుబోధమగునట్లు కవితఁ జెప్పినవాఁడే ధన్యుఁడు. ఇక్కడికే పునరుక్తిదోషము పొసఁగినదేమో. కాన నిఁక యుగలక్షణసమన్వయమునకుఁ బనివిందముగాక!

---

## ౮. యుగలక్షణ సమన్వయము

1. నన్నయయుగములోఁ నాటిన వివిధకవితాబీజములు సంపూర్ణ పరిణతి నొందినవి. (తిక్కన భారతము, రంగనాథరామాయణము, ఉత్తర హరివంశము.)

2. గ్రంథము లింకను ననుత్పాద్యములేకాని, కవులవ్యుత్పత్తి ప్రతిభావికాసములకు ననువాదము లవకాశ మొసంగినమార్గములు మాత్రమే యగుటవలన, స్వకపోలకల్పితములువలె నున్నవి.

3. అలంకారలక్షణగ్రంథము లనేకములు పుట్టినవి. (సంస్కృతమున విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమును రచించెను.

4. శృంగారరసౌచిత్యము తన్మయతఁ గాంచి, క్రమముగా చిల్లర శృంగారమునకు దిగునట్టి స్త్రైణ్యాసూచనలు గానవచ్చినవి.

5. ప్రబంధకావ్యరీతి ప్రబలమగున ట్లున్నది. కథాసంవిధానము పైనుండి కవితాశక్తి ప్రదర్శనముపై దృష్టిపాఱి, భావమప్రధానమై శైలి ప్రాముఖ్యమునకు దారి సాగుచున్నది.

6. పురాణఖండములు ప్రత్యేకకావ్యములుగా మాఱుట కారంభించినవి.

7. వస్తుకృతములు, స్వప్నవృత్తాంతములు విశేషప్రచారము లోనికి వచ్చినవి.

8. కవులమాహాత్మ్యము, రాజాదరణము హెచ్చుచున్నది. కవిత వృత్తిగా మాఱిపోనున్నది.

9.[1]ఆంధ్రసారస్వతములో నీయుగ ముత్తమోత్తమ మనఁదగియున్నది.

10. వాఙ్మయరంగములలోఁ బినాకినీతీరమున నెల్లూరు (విక్రమ సింహపురము) ప్రధానపీఠము. (రాజమహేంద్రవరము, ఓరుగల్లు, అద్దంకి, విద్యానగరము ఇవి యితరములు).

---

1 ప్రతిభాషకు నేదో యొక కాలమున నత్యధికరాజాదరణము లేక గ్రంథరచనము తటస్థించుచున్నది. అట్టిమహాయుగముతోనే యుత్తమోత్తమ సారస్వతయుగము ఒకానొకప్పు డేకీభవించుట గలదు. రోముసామ్రాజ్యము నకుఁ జెందిన లాటినుభాషలో Augustus చక్రవర్తికాలమున నట్టి సమన్వ యము గుదిరి సుప్రసిద్ధమైనది. సంస్కృతములో కాళిదాసుని విక్రమాదిత్య యుగమట్టిది. కాని, ఇంగ్లీషులో Augustan Age అనునదొకటి. ఉత్త మోత్తమసారస్వతయుగమగు షేక్స్పియరుకాల మింకొకటియైనది. తెలుఁగున నట్లేయైనది. ఉత్తమోత్తమయుగము తిక్కనదైనది; మహాయుగము శ్రీకృష్ణ దేవరాయలదైనది. కాలసామీప్యము ప్రభుత్వలక్షణైక్యమునుబట్టి రెడ్డియు గము కాకతీయములోఁ జేర్చిన (షేక్స్పియర్, మిల్టనులవలె) తిక్కన పోతన లొక్కచోఁ గూడుదురు. కాని, యుగనిర్ణయమున కంత విచారణయేల? నీటిపైని గీఁతలవంటివి సారస్వతవిభాగములు. ఇంగ్లీషుతో మనభాషను బోల్చ నావశ్యకతలేదు. ఉభయభాషావేదుల కట్టి జిజ్ఞాసలకు వీలున్నది. కాన మన తిక్కన్న, పోతన్న లింగ్లీషువారి షేక్స్పియరు, మిల్టన్లవలె నని మనవిచేసికొనుచున్నాఁడ.

11. శతకకవిత నన్నయయుగములోనే పాల్కురికి సోమనాథుని 'వృషాధిప' శతకముతో, యథావాక్కుల అన్నమయ్యగారి సర్వేశ్వరశతకముతో నారంభమయ్యెనందురు. త్రిపురాంతకునిలో నది స్ఫుటమై భావరంగము విస్తృతమైనది. అతని తారావళియు, నంబికాశతకమును శతకముల యొక్క భక్తికేకాక శృంగారమునకు సైతము దావలమైనవని వెల్లడియైనది. పుట్టుకలో శతకము నీతి, భక్తి, వైరాగ్య, దేవతాస్తుతులకై ఏర్పడె ననవలయు.

12. విషయప్రధానములగు శాస్త్రగ్రంథములు, తదనుకూలమగు గద్యయందుఁగాక యింకను పద్యములోనే వ్రాయఁబడుచున్నవి. అప్పన కవి చారుచర్యాశైలి శాస్త్రకవిత కాదర్శకమై పటికపుఁదేటను బురుడించుచున్నది. ఈగ్రంథ మిప్పుడు ముద్రితమైనది.



శ్రీ

# ఆంధ్ర వాఙ్మయచరిత్రసంగ్రహము

## తృతీయఖండము - కావ్యప్రబంధకవిత్వము. (1381 - 1650)



## రెడ్డి, నాయక, కర్ణాటయుగము: కావ్యము (1380 - 1500.)

### ౧. సంఘచరిత్రము

ఆంధ్రసామ్రాజ్యస్రవంతి యోరుగల్లు పడినతోడనే చీలి తుంగభద్రాతీరమున నున్న విద్యానగరము వైపునను, ఉత్కళములోని కటకమువైపునను, కృష్ణాతీరములోని యద్దంకివైపునను, పశ్చిమోత్తరముగ రాచకొండవైపునను నాలుగుపాయలుగా ప్రవహించి, కర్ణాటకులచెంతను, గజపతులప్రక్కను, రెడ్లపొంతను, పద్మనాయకుల సన్నిధిని వెలసి కాలగతి ననుగమించుచుండెనని తెలిసికొంటిమి. [1]రేచర్ల సింగమనాయఁడు ఏకశిలానగరము (ఓరుగల్లు) మొదలుకొని శ్రీశైలముపఱకు రాచకొండ రాజధానిగా జయించిన వెనుక

---

1 సర్వజ్ఞబిరుదము విషయమై గాథ లనేకము లున్నవి. వేదాంతదేశికుఁ డీ (1270—1370) మాధవామాత్యునికి గ్రంథముల రచించెను. సర్వజ్ఞకృతమగు రసార్ణవసుధాకరము 14-వ శతాబ్దపు నుత్తరభాగమునఁ బుట్టినదఁట! అటులైన దేశికుని యపరవయస్సులో నీతఁ డుండియుండనగు. ఇది విచార్యము! ఎటులయినను నాకేమో ఇతఁడే సర్వజ్ఞుఁ డనిపించుచున్నది.

నతని జ్యేష్ఠపుత్త్రుఁడనపోతనాయఁడు (1340-1380) తమ్ముఁడగు మాధవభూపతితోఁ గూడ, యాంధ్రదేశాధీశుఁడై యుండి యద్దంకికధీశ్వరుఁడై కొండవీటిసీమను బాలించియున్న ప్రోలయ వేమారెడ్డికొడుకు లనపోతభూపాలుని(1350-1362) తోను, అనవేముని (1362-1383) తోను పోరాడుచుండె ననియు,అనవేమునిచే రాజధాని కొండవీడుకు మాఱెననియు, నీయనవేముని విద్వద్గోష్ఠి విఖ్యాతమైనదనియుఁ గన్గొని యుంటిమి. గోదావరిసీమ కోరుకొండ రెడ్లచేతను, విద్యానగరము మొదట హరియప్ప, బుక్కప్పగారిచే రాజ్య మారంభమై మాధవవిద్యారణ్యమహిమవలనఁ బెంపువడసి ప్రథమ హరిహరరాయలు, (1336—1355) వీరబుక్కరాయలు (1355—1377) అనువారిచేతను బాలింపఁబడె ననియు, వీరిచే సోమన బహూకరింపఁబడె ననియు వ్రాసుకొనియుంటిమి. ఈకాలమునఁ దురుష్కసామ్రాజ్య మొకవంకఁ బెరుఁగుచుండెను.

అనపోతనాయని తర్వాత రెండవసింగమనాయఁడు (1380—1400) పితృవ్యపుత్త్రుఁడగు పెదవేదగిరినాయని సాహాయ్యముతో శత్త్రులను గెల్చి రాజ్యము పాలించెను. ఇంతవఱకు నీరేచెర్లవంశము శైవమతప్రవిష్టమై యుండునది. ఇతనికి [1]సర్వజ్ఞబిరుదము లభించినది. ఇతనిపుత్త్రు లనపోతీ మాధవభూపాలు (1400—1430) రితని తర్వాత పాలించిరి. వీరిలోని మాధవభూపతిరావు మాధవరాయఁ డనఁబడెను (1417—1430). ఇతఁడు శ్రీమద్రామాయణమునకు "సమీచీ

1 శ్రీసదాశివశాస్త్రి, చి. వీరభద్రరావుగార్ల రచనలు.

నముగ నర్థబోధక్షమమగు 'రాఘవీయ'మను వ్యాఖ్యాన మొనర్చెను." (పైన సర్వజ్ఞుఁడని పేర్కొనఁబడిన సింగమనాయనికి రావుసింగక్షమానాథుఁ డనుపుత్త్రుఁ డుండి మెదకుసీమను బాలించి రాజమహేంద్రవరమును జయించెననియు, నతనికి జ్యేష్ఠతనయుఁడు సింగమనాయఁడనియు నందురు.) ఈపద్మనాయకరాజులలో పెదవేదగిరి మనుమఁడు సింగమనాయఁడు బహుపరాక్రమశాలిగాఁ గన్పడుచున్నాఁడు. ఇతనిపై చాటువులు వెలసినవి. ఈవిధముగా నోరుగల్లు నాశనము మొదల్కొని నూఱేండ్లకాలము రాచకొండ వృద్ధినొంది తర్వాత గజపతులకు లొంగిపోయినది.

అనవేమారెడ్డికిఁ బిమ్మట, నతనికిఁ బూర్వము పాలించిన యనపోతారెడ్డికొడుకు (అన్నకొడుకు) కుమారగిరి భూపాలుఁడు (1383—1400) పాలించెను. ఇతఁడు ప్రమత్తుఁడు గాన నితనితోఁబుట్టువు మల్లాంబికకు మగఁడైన కాటయవేమారెడ్డి యథార్థమైన పాలకుఁడై యుండెను. వసంతోత్సవము లప్పటి కాలమున మెండై యుండెను. వానియందు పరమానురాగము గలవాఁడు గాన కుమారగిరి వసంతరా జనఁబడియె.

ఈవసంతరాజునకుఁ బ్రాపు అవచిదేవయసెట్టి. ఈసెట్టి కొడుకు చామిసెట్టి సముద్రాంతరముపోయి ఓడవ్యాపారముఁ జేయుచుండెను. అవచి దేవయ పెద్దకొడుకు, నింటియజమానుఁడు తిప్పయసెట్టి. కాటయ వేమారెడ్డి మిక్కిలి సహాయముచేసినవాఁ డగుటచే

"ప్రాదాత్ప్రాచీభువం రాజమహేంద్రనగర ముఖాన్"

అను మల్లాంబశాసనములోని శ్లోకము ననుసరించి రాజ

మహేంద్రవరరాజ్యముతో సత్కరింపఁబడియె. ఈకుమారగిరి విద్వాంసుఁడై వసంతరాజీయ మనఁబడు నాట్యశాస్త్రమును రచించెను. ఈతనితర్వాత రాజమహేంద్రవరప్రాంతము బావమఱఁదియగు కాటయ వేమారెడ్డికిని, తక్కినభాగమితని పెదతాత (ప్రోలయ వేమారెడ్డియన్న) మనుమఁడగు కోమటి వేమారెడ్డికినిఁ జెంది రాజ్యము రెండుగాఁ జీలినది. కాటయ వేమారెడ్డికొడుకగు కాటయ రెండవహరిహరరాయలకూఁతును బెండ్లాడెను.

కోమటి వేమారెడ్డి బలాత్కారముగ రాజ్యము గ్రహించెనని తోఁచుచున్నది. ఇతనికి నవవేమారెడ్డి మంత్రిగాయుండిన పెద్దనకొడుకైన మామిడిసింగన ప్రధానిగా నుండెను. కోమటి వేమారెడ్డికి పెదకోమటివేముఁడనియుఁ బేరు. ఇతఁడు విక్రమశాలియు, విద్వాంసుఁడు నై రాజ్యమును గాపాడుకొనుచు 'శృంగారదీపిక' యను "యమరు" కావ్యమునకు వ్యాఖ్యరచించెను. ఇతనికాలమున(1400-1420) నున్న వామనభట్టు, వీరనారాయణచరిత్రమను నితనిచరిత్రను గీర్వాణమున వ్రాసెను. ఇట్టి పూజ్యుఁడైన నృపతికిఁ బుట్టిన యపూజ్యుఁడైనకొడుకు రాచవేమారెడ్డి(1420-1424) నాలుగేండ్లుపాలించి మృత్యువువాతఁబడెను. ఇప్పటినుండి యస్వాతంత్ర్య మేర్పడినది. ఈవంశపురాజులలో మొదటివాఁడగు ప్రోలయవేమారెడ్డియన్నవంశములోని పెదకోమటివృత్తము పైన వింటిమి. తమ్ముఁడు మల్లారెడ్డివంశములోనివాఁడును, కందుకూరు దుర్గము రాజధానిగా పూంగినాటిసీమను బాలించుచుండినవాఁడును నగు శ్రీగిరి కోమటిరెడ్డి రాచవేముని

తర్వాత ప్రభుత్వభారము వహించెను. ఇతనికి కొమ్మనామాత్యుఁడను సోమయాజి మంత్రి యయ్యెను. వీరు విద్యానగర రాజులకు లొంగి వశంవదులై పోయిరి.

రాజమహేంద్రవరముఁ జేరిన కాటయవేముఁడు శత్రుభీకరుఁడై, అనవేమారెడ్డి మనుమరాలి భర్తయగు నల్లాడ రెడ్డి సహాయముగల్గి 1415 వఱకుఁ బాలించెను. తర్వాత నల్లాడ రెడ్డి రాజ్యము నాక్రమించుకొని, కాటయవేముని కూఁతురు 'అనితల్లిని' తనరెండవకొడుకు వీరభద్రారెడ్డికి భార్యగాఁ గైకొనెను. (కాటయ వేమనకొడు కేమయ్యెనో?) బెండపూఁడి లింగనామాత్యుఁ డీతనిమంత్రి. ఈమంత్రి నిరుపమానశౌర్య రాజనీతి ధురంధరుఁడు. అల్లాడభూపతి 1426 లో మరణించఁగా నాతని జ్యేష్ఠపుత్త్రుఁడు వేమారెడ్డి రక్షకుం డయ్యెను. కాటయవేముని యల్లుఁడు వీరభద్రారెడ్డి రా జయ్యెను. రాజమహేంద్రవరమునకు మరల మునుపటిదినములు ప్రాప్తించినవి. వీరభద్రారెడ్డి ఇతరసోదరులును, దొడ్డనృపతి, అన్నృపతి సేనానులుగ నుండువారు. లింగనామాత్యుని తమ్ముఁడు అన్నామాత్యుఁడు వీరికి మంత్రి. ఈతఁడు శ్రీనాథ కవికి బంధువు. ఈరాజమహేంద్రరాజ్యము గోదావరినుండి మహానదిదాఁక వ్యాపించియుండెను. కావుననే గజపతులకు ప్రక్కబల్లెమైయుండునది. వేమారెడ్డి,దొడ్డభూపుఁడు వీరులై కాచియుండ నేమిభయము? కాని, కాలగతికేమి యడ్డము? దురాగతములైన రాజసంపదలు చంచలములు గావా?

1435 లో కటకపురమున విప్లవముజరిగినది. ఆవిప్లవములో కళింగగాంగవంశ మంతరించఁగా, మంత్రిగానుండిన

కపిలేంద్రగజపతి రాజ్యాధిపతి యయ్యెను. ఇతఁడు మహాపరాక్రమవంతుఁడు, రాజ్యతంత్రజ్ఞుఁడు గాన, కర్ణాటకరాజ్యమునకుఁ దనరాజ్యమునకు మధ్యనున్న ఈరాజమహేంద్రపురరెడ్డిరాజ్యమును కబళింపఁ దలఁచి వేచియుండెను; 1444 లో దండెత్తెను. కాని, కర్ణాటకుల బలిమిచే రెడ్డిరాజులు నిల్వఁగల్గిరి. 1446 లో ప్రతాపదేవరాయలు గతించెను. ఇదే సమయమని మరల దండెత్తివచ్చెను. ఈమధ్యలో చోడవంశ్యుఁడగు అన్నదేవుఁ డనువాఁడు, మహావీరుఁడై తురుష్కసేనాసహాయమున రెడ్డిరాజ్యములోఁ గొంత యాక్రమించెను. ఇంతలో కర్ణాటకసామంతులు, పద్మనాయకులు సమరమునకు వచ్చెసిరి. పూర్వవైరులగు పద్మనాయకులును, కటకపతియును, యవనసేనయును జుట్టుముట్టుకొనగా వేమ, దొడ్డ వీరభద్రభూపులు పోరాడి స్వర్గము నలంకరించిరి. కొంత కాలమువఱకు నన్నదేవచోడునివంశమునందుండి, తుదకు గజపతులకు రాజమహేంద్రవరము లొంగిపోయెను.

వీరబుక్కభూపాలుని తర్వాత రెండవహరిహరరాయలు విద్యానగరములో (1377-1404) నిర్వదెనిమిదేఁడులు పాలించెను. గోవానగరము తురుష్కులచే గెల్వఁబడెను. కొండవీటిరాజులతో నతఁడు మైత్రి నెఱపెను. విద్యారణ్యభాష్య మప్పుడు ముగింపఁబడెను. ఇతనికొడుకు దేవరాయలుదయగిరిని పాలించుచుండెను. 1404 ఆగష్టు 31-వ తేది హరిహరరాయలు దివంగతుఁ డయ్యెను. దేవరాయ లితనియనంతరము విద్యానగర రాజ్యమేలెను(1404-1422). ఇతఁడు కవులను బోషించెను. అతని మనుమఁడు ప్రౌఢదేవరాయలు 1423

మొదలు, 1447 వఱకుఁ బాలించెను. ఇతనికే ప్రతాపదేవరాయ లని పేరు. ఇతనికాలమున కొండవీడు వినుకొండ రాజ్యములు, పద్మనాయకులు, కందుకూరి రెడ్లు లోఁబడిరి. కృష్ణానదీపర్యంతము రాజ్యము పెరిఁగినది. తెలుఁగురాయఁడును, మైలారెడ్డియు నితని రెండుభుజము లైయుండిరి. ఇమ్మహారాజునొద్ద 225 కోట్లరూపాయలు నిలువయుండెను; కన్యాశుల్కాదిదురాచారముల మాన్పి సేనను వృద్ధిచేసెను. తరువాత నితనికి పొన్నలదేవియందు జన్మించిన మల్లికార్జునరాయలు 1465 వఱకును, సింహాళదేవియందు జన్మించిన విరూపాక్షరాయలు 1465 మొదలు, 1478 వఱకును బాలించిరి. వీరిరువురికాలములో రాజ్యము చాలవఱ కన్యాక్రాంతమయ్యెను. 1478 లో విరూపాక్షరాయలు పెద్దకొడుకగు రాజశేఖరునిచేఁ జంపఁబడెను. ఈసంక్షోభములో సంగమరాజవంశ మంతరించి దండనాథాగ్రణియై యుండిన సాళువ నరసింహరాజుచే సింహాసన మాక్రాంత మయ్యెను.

గజపతులకథ నించుక చూతము. రాజమహేంద్రవరమును జయించి కపిలేంద్రగజపతి యుదయగిరి వఱకు నరిగి యక్కడివఱకుఁగల కర్నాటకరాజ్య మాక్రమించి పద్మనాయకుల రాజ్యమున తన ప్రతినిధుల నిలిపి, వినుకొండను లోఁబఱుచుకొని, 1460 లోపల మూఁడువంతు లాంధ్రదేశమునకు సార్వభౌముఁ డయ్యెను. తర్వాత విజయనగరమునే తాఁకెను.

కాని, మల్లికార్జునుచే నోడఁగొట్టఁబడెను. ఇంకను దక్షిణముగా నేగుటకుఁ గాలెత్తునంతలో విజయనగర సామ్రాజ్య ప్రాచీఖండము నేలుచుండిన సాళువ నరసింహదండనాథుఁడు మిక్కిలి బలవంతుఁడు గాన నాతని నిలువరించెను. 1467 లో కపిలేంద్రుఁడు దివంగతుఁడు కాఁగా నతనికొడుకు పురుషోత్తముఁడు, ఉదయగిరిని బాలించుచుఁ దనకుఁ జేయూఁతగానున్న బసవభూపుఁడు తోడుచూప, కాంచిని జయించి, ఒకానొక సమయమున విరూపాక్షరాయల విద్యానగరమును దోఁచుకొని పోయె నఁట! కాని, సాళువ నరసింహుఁడు విద్యానగరసామ్రాజ్యాధినాథుఁ డైనవెనుక నుదయగిరి, రాయచూరు, కొండవీడు దుర్గము తప్ప తక్కినభాగములను జాలవఱకు సంపాదించుకొనెను. కాని, ఈతఁడు రాజేంద్రుఁడుగా జీవించినది స్వల్పకాలమే.

తుద కుద్ది నిల్చినవి నాల్గింటికి రెండు. పద్మనాయక రెడ్డి రాజ్యము లిర్వురికిని పంపకము లైనవి. కటకవిద్యానగరముల రెంటను కటకమువైపు మొలుసూపుచున్నది. కటకములోని ప్రథమరాజవంశము 1435 లో మాఱినది. విద్యానగరములో ప్రథమరాజవంశము 1487 లో నంతరించినది. హరిహరరాయాదివీరులును, కపిలేంద్రునివంటిచక్రవర్తులును, సర్వజ్ఞుని వంటి భూపతులును, నిరుపమానవిద్యావిభవయుతుం డగు విద్యారణ్యయతీంద్రుఁడును ఈమిశ్రయుగంబున జన్మించిరి. వీనినన్నింటినిఁ జూచుచు తురుష్కసామ్రాజ్యచంద్రుఁడు కాలాంబరమునందు మెల్లఁగా జరిగిపోవుచున్నాఁడు.

## ౨. వాఙ్మయచరిత్ర

కాటయ వేమారెడ్డి కాళిదాసనాటకత్రయమునకు వ్యాఖ్యానకర్త. సర్వజ్ఞ సింగమభూపతి యమూల్యగ్రంథరాజంబగు రసార్ణవసుధాకరమునకుఁ దండ్రి. మాధవరాయఁడు "రాఘవీయ" వ్యాఖ్యానకారుఁడు. పెదకోమటి వేమారెడ్డి సాహిత్యచింతామణిని రచించినాఁడు. అనవేమ, హరిహరరాయలు రసజ్ఞులు. సాళువనరసింహరాజు రామాభ్యుదయమును వ్రాసిన కవి. కోలచల మల్లినాథసూరి, వామనభట్టు నిమ్మహాయుగంబుననే ప్రకాశించిరి. ఈనూటయిర్వదేండ్లలో సుప్రసిద్ధాంధ్రనాయకు లనేకుల తలలు మాఱినవి. విఖ్యాతాంధ్రసభలు తటిల్లతవలె నిరంతరయుద్ధజీమూతములలో మెఱసిపోయినవి. పరస్పరమారణప్రయత్నాంధకారమధ్యమున, భవ్యగ్రంథకరదీపికాసహస్రములు పరిఢవిల్లినవి. ఒడ్డెరాజులపరాక్రమ హాలాహలము లుర్విపైఁ బర్వుకాలముననే సాళువనృసింహపరమేశ్వరుఁడు దాని నడ్డుకొనఁగా దానినుండియే విజయనగరసామ్రాజ్యద్వితీయవంశామృత ముదయించుచున్నది. అమృతాంశుఁ డుదయించునప్పటి కీయుగ మంతరించి నవీనయుగముద్భవించి యారంభమైనది. ఆదినుండి కొనవఱకు నన్నిటియందు నారితేరిన శ్రీనాథుఁడు నిలిచి చూచుచునే యున్నాఁడు.

[1]పాల్కురికి సోమనాథుఁడు ప్రథమయుగమునకుఁ బ్రతినిధి. ద్వితీయయుగంబున నాచన సోమనాథుఁడు, సర్వాధ్యక్షుఁడు. ఈతృతీయయుగంబునకు శ్రీనాథుఁడు ప్రతిబింబము. మువ్వురును వరుసగా కవిసార్వభౌములైరి. కావుననే తద్గుణతత్త్వనిర్ణేత లొకరు[2]

---

1 10-వ సంవత్సరాదిసంచికలోని శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి "ద్విపద" అనువ్యాసము.

2 13-వ సంవత్సరాదిసంచికలో శ్రీబండారు తమ్మయ్యగారి సోమనాథుఁడు.

"కమ్మని తెల్గుబాసనుడికారపుసొంపు, రసంబుపెంపు, పా
త్రమ్ముల రూపవర్ణన, సుధామయసంస్కృతమంజువాక్ప్రపూ
రమ్ములధాటి, భావముల రమ్యతయుం గవిసార్వభౌమ! నీ
సొమ్ములు"

అని స్తుతించినారు. ఇతఁ డించుమించుగా యుగారంభమునందుండి 1460 వఱకు ననఁగా నంత్యభాగములో వఱకు జీవించియుండి యాంధ్రవాఙ్మయిని తెల్గుసీమలో నంతట నూరేగించి కనకాభిషేకముతో బహూకరించినాఁడు. "సర్వాంతర్యామి" యగు శ్రీనాథు నటుంచి ఇతరుల నరయుదము.

కవిచరిత్రకుఁ దెలిసినవా రగుట ముఖ్యులైన మడికి సింగన, బమ్మెర పోతన, గౌరనమంత్రి, జక్కనకవి యుగాదిభాగమునకు; భైరవ, నిశ్శంకకొమ్మన, అనంతామాత్యుఁడు, వినుకొండ వల్లభరాయఁడు మధ్యభాగమునకు; నందిమల్లయఘంటసింగనలు, దగ్గుబల్లి దుగ్గనకవి, [1]నాగనాథుని పశుపతి, దూబగుంట నారాయణకవి, [2]తాళ్ళపాక అన్నమయ్యంగారు, మనుమంచి భట్టు, పిల్లలమఱ్ఱి పినవీరన్న, ఫణిభట్టు, పెదపాటిసోమయ, యంత్యభాగమునకుఁ జేరుదురు. వెన్నెలకంటి సూరన 1520 ప్రాంతమువాఁడైనను నీయుగశిల్పశేష మవతలిదాని కెందు కెక్కింపవలయు నని యిందే చేర్చినాఁడను. ప్రథమభాగములోని నల్వురును, మధ్యభాగములోని యైదుగురును, అంత్యభాగములోని పదునొకండుగురును గాక కవులచరిత్ర కెక్కనివారనేకు లిందు చేరవలసియున్నారు. ఇట్టికవులనామముల నుద్ధరించిన ప్రబంధరత్నావళీ (శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి యాంధ్రలోకమునకుఁ

1 వా రుదాహరించిన గ్రంథకర్తలను బట్టి నిర్ణీతము. ఉదాహృత గ్రంథకర్తలలో తెనాలి రామలింగయ్య తుదివాఁడు.

2 ప్రబంధరత్నావళిపీఠికను జమవుఁడు.

జేసిన మహోపకృతి) గ్రంథసంధాత క్రీ. శ. 1600-సంవత్సరమునకుఁ దరువాతివాఁడు గానందున నందలికవులెల్లరు నప్పటికిఁ బూర్వులై యుందురు గదా? అట్టివారిలో పెదపాటి సోమయ "నవ్యకవితాసనాథు శ్రీనాథుఁ దలఁచి" యన్నాఁడు గాన నతని తరువాతివాఁ డగును. (శ్రీనాథు తరువాతివారినిఁ దడవలేదు. తరువాతివారిలో నిన్నిగ్రంథములు రచించినవారు హరిభట్టు, తిమ్మన కొందరు తప్ప నరుదు.) కొందఱ నెట్లో పూర్వయుగమున నిలిపితిని. వారిస్థిరత ఇంకను నిశ్చితము కాలేదు. ఇఁకఁ గొందఱ నిచ్చటికి రప్పించెదను.

అమరుకము వ్రాసిన కానుకొలను అన్నమరాజు, కుమారనైషధము, మల్హణచరిత్రము వ్రాసిన పెదపాటి ఎఱ్ఱాప్రెగ్గడ, నాసికేతూపాఖ్యానము వ్రాసిన చందలూరి చిక్కయ, కాంచీమాహాత్మ్యకర్తయగు తిప్పరాజు, శైవాచారసంగ్రహమును రచించిన కుంటముక్కల తిమ్మయ, అనంతమహత్త్వము, సూర్యశతకము,పద్మినీవల్లభము, శంకరవిజయము, మంగళగిరివిలాసమురచించిన బొడ్డపాటి పేరయ్య, పర్వతపురాణముల వేఱ్వేఱుగా రచించిన పోలమరాజ శేషనాథులు, ఇందుమతీకల్యాణకర్త యగు నంగదబసువయ, సావిత్రీకథవ్రాసిన తులసిబసువయ్య, హరిదత్తోపాఖ్యానకర్తయగు నందూరి మల్లయ, విష్ణుకథానిధానమునకుఁ గర్తయైన ముమ్మయ భైతరాజు, బృహన్నారదీయము రచించిన వాసిరాజు రామయ్య, విష్ణుకాంచీమాహాత్మ్యరచయిత యగు నాంధ్రకవిరామయ్య, త్రిపురవిజయగ్రంథకారుఁడగు పోతరాజు వీరయ్య, శ్రీరంగమాహాత్మ్యకర్త యగు చెనమల్లు శ్రీగిరన్న, (కువలయాశ్వచరిత్ర రచించిన) ఏర్చూరి సింగయ్య, శాకుంతలకర్త సిద్ధనమంత్రి,-భరతమును రచించిన దామరాజు సోమయ్య యనువార లీకాలమునకుఁ జేసిన వారేమో! ఏకోనవింశతిసంఖ్యాకులగు నీకవుల కాలము సరియైన దిదియే యని బయలుపడు టెప్పుడో!

సారస్వతుల భాగమును ననుసరించి విచారించుచో విపులకావ్యభాగమునకు సింగన పోతనలును, పురాణకవితాశాఖకు వెన్నెలకంటి సూరనయును, శుద్ధకావ్యభాగమునకు శ్రీనాథ, కొమ్మన, జక్కన, అనంతామాత్య, నందిమల్ల, ఘంటసింగ, పినవీరభద్ర, సోమ, దగ్గుబల్లి దుగ్గనలును; నీతికవితకు దూబగుంట నారాయణకవియు, శతకకవితకు తాళ్లపాక అన్నమయ్య, మొదటిదేవరాయలకు మంత్రియై యుండిన సిద్ధనయుఁ జేరుదురు. ద్విపదకవితకు గౌరన పట్టుకొమ్మ. భైరన మిశ్రకావ్యకవితకుఁ జేరినవాఁడు.

కాలము తెలియనికవులలో పెదపాటి యెఱ్ఱాప్రెగ్గడ, అన్నమరాజు, చందలూరి చిక్కయ్య, పేరయ, అంగదబసువయ, తులసి బసువయ్య, మల్లయ, చైతరాజు, వీరయ్య, సింగయ, యనువారు కావ్యకవితకును సోమయ్య శాస్త్రకవితకును, మాహాత్మ్యాదులు రచించిన తక్కినవారు మిశ్రకావ్యకవితకును జేరినవారు.

మిశ్రకావ్యమని, విపులకావ్యమని, కావ్యప్రబంధమని పదములను వాడుచుంటిమి. విపులమై నానాకథాకావ్యముల కాకరమై, కావ్యశిల్పమును జిత్రించునది విపులకావ్యము అని యుదాహరణములఁబట్టి తెలిసినది. పురాణమునకును విపులకావ్యమునకును విషయాధిక్యము మొదటిదానిలో నుంటయు, రసమునకన్న అర్థపుష్టి యెక్కువ గావలసివచ్చుటయును భేదములు. (ఇంచుమించుగా రెండు నీవైలక్షణ్యములఁ దప్ప సమము లనఁదగును). ఆంధ్రసారస్వతములో పురాణకవిత తిక్కనయందును, విపులకావ్యకవిత పోతనయందును పరమావధిని గాంచినవి. భారతరచనమునకు రెండున్నర శతాబ్దములు పట్టినది. ఒక్కకవి పూర్తిగా పురాణములను తెనిగించుట కష్టమనిపించినది. భారతపాత్రలగుణవిశేషధర్మశిక్షణలు తెలుఁగుప్రభువుల ప్రేవులకంటుకొని పోయినవి. ఇతిహాసమును తెనుఁగువారికిఁ బురాణపఠనమున కుపకరించున దగుటచే పురాణమును దిక్కనచే ననేకపుట్టములు ప్రత్యేక

కావ్యములవలె స్వరూపమందుటచే విపుల కావ్యమును నై పురాణేతిహాస కావ్యరూపత్రయ మొక్కచోఁ బొందుగుదిరిన భారతామ్నాయము ముగింపునకు వచ్చినదాదిగా కాలవిలంబమునకు లోఁగి కాఁబోలు, ఖండములుగా రచింపఁదొడంగిరి. కమలనాభామాత్యకవి పూర్వఖండమును రచించుటను బట్టియో, లేక, ప్రజాప్రీతికి పాత్రములుగా ఖండములు వ్రాలుటంబట్టియో మడికి సింగన యుత్తరఖండమును మాత్రము పద్మపురాణమును రచించెను. ఈఖండపురాణరచన నాచనసోముని 'యుత్తరహరివంశముతో' నారబ్ధమైనది. స్కాందపురాణ మతివిశాలమైనదియును భరతఖండములో నున్న మాహాత్మ్యకథానకము లన్నియు నందే తలదూర్చుకొని యుండుటచే నపరిమితమును నగుట, భాగములుగాఁ జీల్చి శ్రీనాథుండు మున్నగువారు రచించిరి. శ్రీనాథుఁడు ఖండములఁ జెనింగించుటకు ముఖ్యకారణము అతని దేశాటనమును, కుటుంబభారమును నై యున్నవి. శ్రీనాథునియందు కవిత యుదరపోషణవృత్తికింద పరిణమించినదని ముందే కనుఁగొనియుంటిమి. కాఁబట్టియే పొట్ట ననుసరించి, ప్రభువులమనస్సరణి వెన్నంటి సంఘమునకు దాసుఁడై కాలమునకు లోఁబడెను. తుదకుఁ దేలినది విపులముకానిదగు కావ్యరచన-కావ్యకవిత యనుట. ఈకావ్యకవితకు ప్రబంధపరమేశ్వరబిరుద విభ్రాజియగు శంభుదాసుని వచస్సరణి యాధారమై, నాచనసోముని పోకడలు కలిపికొలునకుఁ బనికి వచ్చినవి. సంస్కృతమున వస్తుశ్రీరమున్నది. (అన్నికావ్యములకు ఇతివృత్తము, పురాణేతిహాసోద్భవము.) దానిని స్వకీయోహాగ్నిచే నుడికించిరి. దానిలో ప్రబంధపరమేశ్వరుని సంస్కృతపద గుంభనమను కాఫీపొడిని గల్పిరి. అందు పాల్కురికి నాచన సోమనాథుల గడుసుపోక లను ఖండశర్కర నలగఁగొట్టి పడవేసిరి. సాంఘిక వాతావరణములో నుడుకుఁ జల్లాగుచ్చుకొనిరి. కవితామధురిమతో పాండిత్యము గలుసుకొన్నది. కాననే చేఁదు తీపువంటి మిశ్రమమగు కాఫీరుచి యొకటి పుట్టినది. ఈ మిశ్రమరుచి నంటియుండంటక శ్రీనాథుఁడు నిగ్రహించుకొనెను. తక్కినవా

రట్లు చేయఁజాలరైరి. సంస్కృతపదప్రాచుర్యమునకుఁ దగిన యర్థపుష్టి కఱవైనది. అర్థపుష్టిపోయి యలంకారవృష్టి కురియఁదొడంగినది. అంతటితో ప్రబంధము మొదలైనది. కాఁబట్టి పురాణవిపులకావ్యకవితకును ప్రబంధకవితకును మధ్యకాలము కావ్యమిశ్రకావ్యఫక్కి యని తేలినది. మిశ్రకావ్యపరిణతికి కేతనయును, ముఖ్యముగా త్రిపురాంతకుఁడును మూలమైరి. మదనవిజయ దశకుమారచరిత్రలు శృంగారవర్ణనకు, నుపాఖ్యానసంఘుసంబద్ధములగునవి మాహాత్మ్యకథానకములకు దారితీసినవి. వివిధకావ్యలక్షణము లించుమించుగా నీమాహాత్మ్యములలోఁ జేరినవి. అష్టాదశవర్ణనలకుఁ జేయొగ్గిన దీమిశ్రకవితయే. దీనిపరిణామమే ప్రబంధము.

ఈయుగముననే అయ్యలరాజు త్రిపురాంతకుఁడు ఒంటిమెట్ట రఘువీరజానకీపతిశతకమును పోతన్న నారాయణశతకచ్ఛాయల ననుసరించి రచించెను.

పూర్వయుగమునకుఁ దిక్కన, యెఱ్ఱన, సోమనలు క్రమముగా నధీశ్వర మహామంత్రి సార్వభౌము లైనట్లే యీకావ్యమునకుఁ బోతన, పినవీరన, శ్రీనాథులు నెగడియున్నారు. పోతన్న నటుంచి తక్కినవారిని గుఱించి ముచ్చటించుకొందము. "అధీశ్వర" శబ్దమును కావ్యవిమర్శలోఁ వితర్కించుకొందము.

విపులకావ్యకవిత పూర్వయుగకవితాశిల్ప శేషము. వాసిష్ఠరామాయణమును, పద్మపురాణోత్తరఖండమును, రచించిన మడికి సింగన, తిక్కన సోమయాజికుమారుఁడైన కొమ్మనకు దౌహిత్రుని పుత్రుఁడు (తిక్కనకుటుంబములోనివాఁ డీతఁడే తుదివాఁడేమో కవిత్వరచనకు!) బాంధవ్యము స్పష్టము కాలేదనిన, తిక్కన మనుమరాలి మనుమఁడని చెప్పుకొందము గాక. క్రీ. శ. 1420 వ శార్వరి మార్గశిర శుద్ధ పంచమీ బుధవారము నాఁడు పద్మపురాణమును ముగించెను. తర్వాత వాసిష్ఠరామాయణము చేయఁబడినది. వీనికి

మధ్యకాలములోఁ గాఁబోలు భాగవత దశమస్కంధము రచితమైనది. తన కవితోత్కృష్టతయందు కవికి పూర్ణముగ నమ్మకమున్నది. కాఁబట్టియే, "పరమేశ్వరమకుటవ్యాపితగంగాప్రవాహవరకవితాసల్లాపుఁడ" నని చెప్పుకొని, "శునకమార్గమునం జరియించుచున్న సత్పదకవులార! మత్కవితఁ దప్పులు పట్టక యూరకుండుఁడీ" అని హెచ్చరించినాఁడు. రెండు, మూఁడుసారు లొకేయంశమును ఛాందసవృత్తితోఁ జెప్పుపురాణమును సంగ్రహించి కవిత్రయము ననుసరించెను. వాసిష్ఠరామాయణము "యథా వాల్మీకీయ" మని రచించినయర్వాచీనకవి, యిలచనాఁడు వేంకటరమణ కవివ్రాసిన

"గురుని నేకతమునఁ గూర్చున్న వాల్మీకి
నఖిల దర్శనములు నపుడు గాంచి
ప్రణుతిసల్పి యాభరద్వాజుఁ డిటు మృదు
స్వరము గరము వెలయ సరగ నడిగె."

అనుదానిని సింగన వ్రాసిన

"అతుల తపస్స్వాధ్యాయ
వ్రతశీలుఁడు బోధనిధి భరద్వాజుఁడు వి
శ్రుతకీర్తి యొక్కనాఁ డే
కతమున వాల్మీకిమౌనిఁ గని సంప్రీతిన్."

అను పద్యముతోఁ బోల్చిచూచిన యథామాతృకము అనఁబడు నధునాతన ఫక్కికిని పురాతనానువాద కవితాపటిమకును, హస్తిమశకాంతర మని చెప్పఁగూడదా? కవిజీవితకర్త ఇతనిని రామగిరి సింగనగాఁ బేర్కొని నాఁడు. సమకాలికుఁడగు పోతన్నకవిత నితఁ డెఱింగి యుండెనో! లేక యితనికవితనే ఆతఁడు మెఱుఁగు దిద్దెనో! శబ్దరీతిసామ్యమునకు మచ్చు

"ఆతరుణీలలామకుఁ బ్రియంబుగ వేచని కాంచె నాజగత్పూతము,
నక్షయార్తిపరిభూతి విధానసమర్థసత్ఫలవ్రాతము,
నవ్యపుష్ప మకరందవిలోలుపమత్తషట్పదోపేతము,
దత్తనిర్జరసమీహితజాతముఁ బారిజాతమున్."

పద్మపురాణకవిత యించించుక భాస్కరునిమార్గమును సూచింపఁగా నితని రామాయణధారావేగము భారతమును దలఁపించుచున్నది.

"ఆరాజన్యు లుదగ్రు లుగ్రగతి నన్యోన్యప్రహారార్థులై
వీరానీకము పిచ్చలింపఁగ భుజావీర్యం బవార్యంబుగాఁ [చున్,
గ్రూరాస్త్రంబుల నొండొరుం బొదివి దిక్కుల్ వ్రయ్యఁ బెల్లార్చు
బోరాడంగ."

మనకు భయము గదురుచున్నది గాన సంగ్రహానైపుణియు, పోతనయందు పదధారారససమ్మేళనము సూచించుచాతురియుఁ, గల యితనిశైలి నభినందించి, సూరన విష్ణుపురాణ మింక నాలింతము.

వెన్నెలకంటి సూరనార్యునితో నీయుగాంత్యము. సింగనతో నాది. వీరాద్యంతకవులు. ఈకవికవిత పోతననుండి పదసారళ్యము నేర్చినది; శ్రీనాథునికడనుండి "యుయ్యాలలో నూగు నప్పటి" వలె నూఁగు తూఁగుఁగఱచినది; విశేషపదప్రాసముల విడనాడినది; ప్రౌఢాతిదీర్ఘసమాసముల ప్రకాంక్షించుట మానినది; భారతకవులలోని పూర్ణోపమలకుఁ బ్రతిగా నలవాటులోనికి వచ్చుచున్న రూపకాలంకృతులను జేపట్టినది. "అలఁతియలఁతితునియ" లని యెట్టనవిషయమై యభిమానావేశముతో నున్న యొకరివిమర్శన మితనికి "సన్నన" సరిపోవుచున్నది. కాననే, ఇతని వాగ్రంగమునకు

"కారుమెఱుంగులో మెలపుఁ గైకొననేర్చిన పైఁడిబొమ్మలో
మారునిదీములో కలికిమాటల చంద్రికలోఁ జెలంగు శ్రీం

గారరసాధిదేవతలో కమ్మని క్రొవ్విరితీవలో యనన్
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై."

ద్రాక్షాపాకము, సలక్షణనిరర్గళధార.

"ఆపదలెల్ల మాన్చి సుఖమైనపదంబుల నెల్లఁ బూన్చి యాత్మసం
తాపములెల్లఁ బుచ్చి విదితంబగు సంపద లిచ్చి భక్తులం
దేపయుఁ బోలె దుఃఖజలధిం బడకుండఁగఁ దేల్చి ప్రోవ ల
క్ష్మీపతి యున్నవాఁడు మదిఁ జింతఁదొఱంగుఁ."

డను విష్ణుపురాణసందేశము శిరసావహింతము. ఇతనికృతి బసువయరాఘువుని కంకితము.

ద్విపదలో గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమును, నవనాథచరిత్రమును రచించెను. పద్మనాయకుల ప్రాపునఁ బెరిగిన యీమంత్రి "లక్షణదీపిక" యను ఛందశ్శాస్త్రమును సైతము రచించెను. ఇతనిహరిశ్చంద్రకథ మార్కండేయ పురాణరీతిగాఁ గాక స్కాందపురాణము ననుసరించి యున్నది. నవనాథచరిత్రము ఒకానొక రాజకుమారిని వలచి, ఆమె ఇంటనుండిన కులనాశమగు నని చెప్పి, యామెను మందసమున నుంచి వానిని నదీప్రవాహమున విడువ నాపెట్టె నొక రాజపుత్రుఁడు తెఱచి, తత్కన్యను వివాహమాడి, దానిలో నొకభల్లూకము నిడి మరల నీటవిడువ, దానికై యొకప్రదేశమున నింతయుఁ దెలియక వేచియుండి, మందసముఁ దెఱచి దానిలో జంతువుచే హింసింపఁ బడిన యొకధూర్తవిప్రునిచరిత్రము. సులభశైలిలో నలంకారములకై వెనఁగు లాడక, కథావైశద్యమునకే కవి యత్నించినాఁడు. ఇతని హరిశ్చంద్రకథను శంకరకృత పద్యకావ్యకథతోఁ బోల్చిచూచిన సామాన్యగృహవిషయంబులు వర్ణితములగుటకు ద్విపద చాలినట్లు మహాకవులు దక్కఁ దక్కినవారియెడ పద్యములు సమర్థములు కావని తోఁచెడిని. ఇతఁడు విడివిడి పలుకులతో స్వభావానుగుణముగా లోకోక్తుల నండగొనుచు, భావములఁ జిత్రించుట

యందు సమర్థుఁడు. శబ్దవిస్తృతియు, వర్ణనాబాహుళ్యము నితనికడ లేవు. ఇతఁడు నవగ్రహస్తవ మను పద్యమాలికను రచించిన ట్లున్నది. శరభకవి, మల్లారెడ్డి, చంద్రమౌళి మున్నగు వా రీహరిశ్చంద్రకథనే పద్యములలో వ్రాసిరి.

ఇఁకఁ గావ్యరంగముఁ బ్రవేశింతము. నిశ్శంక కొమ్మన రాజమహేంద్రవరపురెడ్లకడ నుండి, దొడ్డభూపతికి నంకితంబుగా 'శివలీలావిలాసంబును' రచించెను. ఇతని రెండవగ్రంథము 'వీరమాహేశ్వర' మనునది. ఇతని 'శివలీలావిలాసము' కవి మంచిధారయు, తెలుఁగుపలుకులకలికిదనముఁ గల వాఁడని చెప్పుచున్నది. వీరమాహేశ్వరములోఁ బ్రబంధపుజాడలు విరివిగ నున్నవి.

"సంసారకేళిప్రసక్తిఁ బోఁదట్టియు, సంసారకేళిప్రసక్తి గలిగి" మున్నగు పద్యములు కావ్యశైలిని విడనాడియుఁ బ్రబంధముల తెరువునకుఁ బూర్తిగాఁ బోకను ఉన్నయవి. విక్రమార్కచరిత్రమును వ్రాసి సిద్ధనమంత్రికిఁగూర్చిన పేరపరాజు జక్కనయొక్క వాగ్వైఖరి, ఆశుమహిమ చక్కనివి. విక్రమార్కచరిత్ర మద్భుత కథాసన్నివేశముగలది. కవిత్వము గూడ నద్భుతపదప్రయోగకళాసమంచితమైనది. కథల నింత ప్రౌఢముగా, నింతచమత్కృతితో, నిట్టిపాండిత్యప్రకర్షతో రచించినవారు పూర్వమునఁ బరమువందు నాంధ్రములో నరుదు. రసోదంచితంబులై, గడుసుపోకలు పోవకయే, నిర్మలమగు సెలయేటినీటియురవడింబోలి యూపాతవేగముగఁ బోవు నీతని పద్యంబులు హృద్యంబులు. కథాకావ్యకవితలో నితనిది ప్రథమపీఠము. ప్రబంధరీతులు దక్కవ, మంజులపదపుంజములకుఁ దక్కువ లేదు. వలసియున్న శృంగారైకదృష్టితో

"కలువల గండుమీల దొలుకాఱు మెఱుంగుల నిండు వెన్నెలన్
వలపులరాజుతూపులను వారిరుహంబుల నొక్కయెత్తునన్

గెలుపుగొనంగఁజాలు మృగనేత్రయపాంగనిరీక్షణద్యుతుల్
బలువుగ ధైర్యమూలమగు పాదగలింపవె యీశ్వరాదులన్''

అని పల్కఁగలఁడు. స్త్రీమనస్సును జొచ్చి యాస్త్రీవలెనే జక్కనయు నై

''చెప్పఁదలంచు, సిగ్గు తనుఁ జెప్పఁగ నీమికి సంచలించుఁ దాఁ
జెప్పెడుమాట యెవ్వరికిఁ జెప్పకుమీ యనుఁ జూచు నంతటన్
జెప్పక యుండరాదు మఱి చెప్పఁగరా దని కొంత నెమ్మెయిన్
జెప్పకపోదు పొమ్మనుచుఁ జిత్తము నూల్కొనఁజేసి యిట్లనున్.''

లోకోక్తు లతిరమణీయముగ నిల్చియున్నవి. ''ఏమిటికిఁ జల్లకువచ్చియు ముంత దాఁపఁగన్,'' జక్కన ''కావ్యరచనచాతుర్యంబునన్ జక్కన.'' జక్కన విక్రమార్కకథలను బద్యమునఁ గూర్పఁగా 'ననంతామాత్యుఁడు.' భోజరాజకథల నట్లు చేసెను. అనంతుఁడు బయ్యానమనుమఁడు. ఇతనిఛందో గ్రంథము ప్రసిద్ధము. ఇతని దింకొకగ్రంథము 'రసాభరణము'. మంద మలయానిల మెడతెగక విసరినభంగి నితనిశైలి కుంటుపడక, సంస్కృత జటిలత కానవడక, సులభమై, యుద్ధతిదక్కి, యతివినమ్రమై యున్నను మనోహరమై యున్నది. వీరిరువ్వరికిని చాలకాలము తర్వాత నిట్లనే మనో హరకవితాప్రవాహమున, శ్రీనాథునికడ, బావయగుటచేఁ జనవుతో నీఁదు లాడనేర్చి, 'దగ్గుఁబల్లిదుగ్గన' నాచికేతూపాఖ్యానమును, శివకాంచీమాహా త్మ్యమును రచించెను. 'చందలూరి చిక్కయ' యనునతఁడు నాసికేతో పాఖ్యానమును రచించెను. 'చందలూరి చిక్కయ' కవిత ''నిండారు పండు వెన్నెలసోయగము నవ్వుపసిఁడి కమ్ముల వెల్లపట్టుఁగట్టి''నది, ''హరికథాలాప శోభితమైనయట్టి యాననమ్ము ప్రసన్నత నలరు'' చున్నది; శైలి ధారాళ ముగా నున్నది. దుగ్గనశైలియు సర్వజనసమాదరణీయమై యున్నది. ''జిలి బిలిముద్దుచేతలకు'' నిలయమై యితని కావ్యకన్య లలితభావ ''మందహాస ములఁ దొంగలిఱెప్పలలోన'' దాఁచినది. ''కళాధరఖండభృజ్జటాప్యూహము

లోపలం దొరుగుచుండెడు వేలుపుటేటికై వడిన్'', కథాక్రమోపయోగము లగు సంగతులనే గమనించుచు, కావ్యనియమములకు లోఁబడి యుండె నని చెప్పఁ దగును—'దగ్గన తనకావ్యము నుదయగిరిరాజు, గజపతిసామంతుఁడు బసువరాజునకు మంత్రిగానున్న 'గంగయ'కు నంకిత మిచ్చెను. ఈ బసువరాజు మంత్రి కవిపోషకుఁ డనిఁ బేరెన్నికఁగన్నవాఁడు. ఇతనికే 'నందిమల్లయ, ఘంటసింగయ' యను కవిద్వయము (మేనమామ యల్లుండ్రు) 'ప్రబోధచంద్రోదయమును' కాన్కయొసంగిరి. ఈప్రసిద్ధుఁడైన 'గంగయ' యనంతామాత్యుని పుత్త్రుఁడు. 'గంగయమంత్రి' ఇట్లు నాచికేతూపాఖ్యాన ప్రబోధచంద్రోదయము లను కృతిద్వయికి భర్తకాఁగా బసువరాజు 'దూబగుంట నారాయణకవి'చేఁ 'బంచతంత్రమును' రచింపించెను. 'ప్రబోధచంద్రోదయ' మాపేరుగల సంస్కృతనాటకమునకు కావ్యరూపమగు నాంధ్రీకరణము. తత్కర్తలగు కవులు శ్రీనాథునకుఁ దరువాతివా రగుట శ్రీనాథుని స్మరించి కావ్యారంభము గావించిరి. కవిత్వమాకంద మింకను ప్రాతయూరఁగాయగాన, ప్రబోధచంద్రోదయమున మాఱలేదు. సామాన్యధారనుండి రసవద్వేగపద్ధతికి నట్టెత్తుచున్నది. భావములు సుప్రసిద్ధనాటకములోనివి గాన వీరిఘనత యేమియును లేదు. వీరిర్వురును చేసిన మఱొక్క గ్రంథము 'వరాహపురాణము' మడికిసింగన పద్మపురాణమునకుఁ దర్వాతిదియే యనఁదగును. ఇవ్వరాహపురాణము శ్రీకృష్ణదేవరాయలకుఁ దండ్రియై, సాళువనృసింహభూపతికి సేనానిగనున్న నరసరాజున కంకిత మీయఁబడినది. 'ఘంటసింగయకు' 'మలయమారుతకవి' యని మాఱుపేరు. 'నందిమల్లయ' ప్రత్యేకముగా 'మదనసేన'మనుకావ్యమును రచించినట్లు 'ప్రబంధరత్నావళి'లోని పద్యములు సాక్ష్యము నిచ్చుచున్నవి. ఆపద్యములను జూడఁగా ''ఘంటసింగన్నయే ప్రసిద్ధుఁ'' డను కవిచరిత్రకారుని యూహాసత్యదూర మనవలసివచ్చును.

మదనసేనములోని మల్లయ కవిత రసవంతమై

> "పరిఫుల్లహల్లక ప్రభలు నిండినచోట, సాంధ్యరాగద్యుతి చౌకళింప
> నిర్నిద్రకుముదవనీప్రదేశంబులఁ, దేటవెన్నెలపిల్లతీపులాడ
> దనరు విమలసరసిని"

సృష్టింప నేర్చినది. ఈరసవత్కవిత వ్రాయఁగలవాఁడు ప్రసిద్ధుఁడు గాలేదా? ఏమో దురదృష్టశాలియై యుండి 'సింగన' కలయికచేఁ గీర్తి మంతుఁడయ్యెనా? అట్లును కావచ్చును. మణికిఁ గడలియడుగున నడఁగి యుంకి సహజమైనది. వరాహపురాణమున వీరిసాహితి "అతి విశదప్రభా విలసనాస్పదమైనది." వీరిశయ్యలోని మాధుర్యమును

> "కమ్మని తేనియల్ తఱచు కాలువలై ప్రవహింప మీఁద జుం
> జుమ్మని మ్రోయుతుమ్మెదల జొంపము"

లను బోలి రసజ్ఞు లానందించినారు. మొత్తముమీఁద వీరిశైలి "నాతికఠినము గాను శ్రావ్యముగాను" నున్నది. రుక్మాంగదచరిత్రమును వ్రాసిన ప్రౌఢ కవి మల్లనయందు శబ్దాలంకారములు మెండు. శైలి సులభము. ఇతనికాలము సరిగా నేదియో? వీరివర్గమునకే చేరినవాఁడైన 'దూబగుంట నారాయణ కవి' పంచతంత్రము నాంధ్రభాషఁ, గర్ణామృతముగాఁ గూర్పవలయుఁ నను బసవరాజు నానతిని రచించెను. ఇతనిశైలి యిత ననుకొన్నట్లు

> "సూరిసభాంతరయోగ్యతామనోహరసరసార్థగుంభనల నంద"

మైనది. తెలుఁగుపదములు మెండు. కాని, సోమనాథునికిఁ గవి యను కొన్నట్లు సరిరానేరఁడు.

కాలమునఁ దుదికిఁ జేర్పదఁగి, యుత్తమకవిత నల్లగలవాఁ డగుటచే కవితలో తుదిగానివాఁడైన 'పెదపాటిసోమయ,' 'అరుణాచలపురాణము, కేదారఖండము, త్రిపురవిజయము,శివజ్ఞానదీపిక' అను నాల్గుగ్రంథముల రచించెను. ఇతనిగీర్వాణకవిప్రస్తుతినిఁ జూచిన ననన్యసాహితీపటిమగలవాఁడని

తోఁచెదు. "రాజులువిక్రమోగ్రమృగరాజులు" నను వాగ్వైఖరి యితని ప్రబంధవైఖరికిత్తుమా యనిపించును. శ్రీనాథుని గడుసుపోకలు విరివిగ నున్నవి. ఇతని లక్ష్యము—

"పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యముఁ మంగళా
స్పదభావంబును రాజ్యయోగ్యతయు దోషస్ఫూర్తిరాహిత్యమున్
సదలంకారవిశేషముఁ గలిగి విశ్వప్రాణసౌభాగ్యసం
పదమై తేజియపోలి క్రాలవలదా! పద్యంబు హృద్యస్థితిన్."

అనుపద్యంబువలన సువ్యక్తమైనది. ఇతఁడు నాచనసోముని కవితలో సొంపులు గొన్నింటిఁ గూర్చినాఁడు; కుకవిహేళనముఁ జేసినాఁడు. సాహిత్యపటిమ నుండి భావములు దొరలుచున్నవి. కాని, ప్రతిభవలన కాదేమో? మొత్తముపైన ప్రబంధశయ్య. ప్రబంధరీతులు బాగుగాఁ బట్టినవి. విద్వత్కవియనుట కెట్టి సందేహమును లేదు. ఇతనిని 'కవిలోకబ్రహ్మ' యందురఁట !

కాలము దెలియనికవుల "కంగారు" కొంత చవిచూచి, పినవీరన్నను జేరుదము. (పినవీరన కృతికి భర్తయగు సాళ్వనరసింహరాజేంద్రునకు ముందిట్టి కల్లోలమే విద్యానగరమునకుఁ బట్టినది.)

1. అన్నమరాజు 'శివస్తుతి' బాగున్నది. 2. పెదపాటి యెఱ్ఱాప్రెగడ సోమయ కేవిధమైన బంధువో? శృంగారనైషధమును జూచి కుమార నైషధము రచింపఁబడియునేమో? శైలిమాత్రము శ్రీనాథుని కేమాత్రముఁ దీసిపోదు. సీసములతూగు, మంజులసంస్కృతసమాసముల వైశిష్ట్యము, జాతీయముల పలుకుబడి యద్భుతములుగా నున్నవి. మచ్చున కొక సీసము.

సీ. "మన్మథ దివ్యాగమమునకోంకారంబు, భూతేశునాదలపువ్వుదండ
అల్పశృంగారరేఖార్గళకుంచిక, యధికత మోదంతి కంకుశంబు
విరహిణీజనమర్మవిచ్ఛేదకర్తన, యంబరక్రోడదంష్ట్రాంకురంబు
తారకామౌక్తిక తతికినంచితశుక్తి, దగు నంబునిధికి ముత్యాలజోగు

తే. మారు పట్టాభిషేకాఖ్యవారికుంభి
చిత్తజునికోట లగ్గదంచెనపుగుండు
నాఁగ నానాఁటి కభివృద్ధి నారుకొనిన
చంద్రుఁ డుదయించె కాంతి నిస్తంద్రుఁ డగుచు."

గ్రంథ మసమగ్రముగా నున్నది. ఇతని మల్హణచరిత్ర మిట్లే ప్రౌఢమై "కువలయకమలాభినవమనోజ్ఞుంబయ్యు బంకజీవనవిప్లవంబుగాక" యను నవి మొదలగు శ్లేషానుప్రాణితములు గనఁబడుచున్నవి. 3. చిక్కయ నప్పుడే స్మరించియున్నారము. 4. కుడిచెర్ల తిప్పరాజు కాంచీమాహాత్మ్యము శ్లేషాద్యలంకారంబులం గూడి సంస్కృతసమాససంఘటితమై యున్నది. 5. కుంటిముక్కల తిమ్మరాజుదొక్కసీసము గన్పడినది. 6. పశుపతి నాగనాథుఁ డీయుగమువాఁడేకాని గ్రంథము మృగ్యము. అతని విష్ణుపురాణములోని దొక్కపద్యమే యుదాహృతము. 7. షోడశరాజచరిత్రమునుండి యొకపద్యము మాత్రమే చిక్కెమనకు విజ్ఞాతుఁడైన ఆమడూరి నరసింహభట్టెప్పటివాఁడో? 8. బొడ్డపాటి పేరయ సూర్యభక్తుఁడుగాఁ దోఁచెడు. ప్రబంధవర్ణనలు బలిసినవి. ఇతఁ డనేకగ్రంథముల, సురుచిరపదప్రయోగసామరస్యము వెలయించి, వివిధవర్ణనావైదగ్ధ్యము మెఱయఁగా రచించిన ప్రౌఢ ఇతని సూర్యశతకము, శతకములు ప్రాచుర్యము గాంచుచున్కని విశదముచేయుచున్నది. పెద్దలు శతకగ్రంథముల క్షుద్రములుగా పరిగణింప లేదనుట కిది సాక్షిగాదా? 9. శ్రీనాథుని గాథాసప్తశతి చిక్కలేదుగాని, పోతరాజు బేతాళపంచవింశతిలోని కొన్నిపద్యములు ప్రకాశితములైనవి. 10. పర్వత పురాణములఁ జిక్కిన దొక్కటిరెండుపద్యములు ఇప్పటికి తత్కర్తలు పోలమరాజు, శేషనాథులు నామమాత్రావశిష్టులు. 11. అంగదబసువయ్య పద్యములైదుమాత్రము "నిఱుపేదమీఁద నిర్నిద్ర సంపదవోలె" లభించినవి. కవిత సలక్షణము, నిర్దుష్టము. 12. తులసి బసవయ్య సావిత్రి కథలోని పద్యము లనే

కము లున్నవి. శైలి నానాలంకారముల కాకరము. తెలుఁగులోను, గీర్వాణ జనితములలోను, పదముల గడుసుపోకలు నిండియున్నవి. కాని, వర్ణనావైపుల్యము తాండవించినది. 13. నందూరి మల్లయ యేకపద్యమాత్రస్మరణీయుఁడు. 14. జైతరాజు ముమ్మయ విష్ణుకథానిధానము నించుమించుగాఁ బోతనపదమార్దవమును భజించుచున్నది. సులభములై, నిగ్గులుదేఱు సహజోపమలు దనరియున్నవి. నాచనసోముని మాహాత్మ్య మించుక యితని సీసములపై వ్రాలినది. గూఢచతుర్థి యితనికవితయం దొక వైచిత్ర్యము. "జయనారాయణ" యని పెద్దనామాత్యుని ధోరణిలో నొకపద్య మల్లినాఁడు. మొత్తమువైన నితనిది పరిగణింపందగినకవిత. 15. వాసిరాజు రామయ్యయు, నాంధ్రకవి రామయ్యయు నొక్కరేనా? "సూక్తితిమిధాము నాచన సోముఁదలఁచి" నాఁడాంధ్రకవి! అందుకనియే "శ్రుతులును నిర్జరస్థితులను మఱిడింప, నిగిడింపఁజాలు నీ నేర్పు కలిమి"యను సీసమును రచించినాఁడు. "సంతతాక్రాంతమదననితాంత తాంత, కాంతకాంతాకదంబకస్వాంతములకు, సంతసము నింపవచ్చె వసంతమంత."

"రసికత సోలిసోలి యనురాగరసంబునఁ దేలితేలి యా
కసమలు మెట్టిమెట్టి తమకంబున కాంతలఁ బట్టిపట్టి యా
దొసకులఁ జిక్కిచిక్కి కడుదూరముగాఁ జని తక్కితక్కి పై
కొసరెసఁగెఁ జకోరికలు గోరిక లీరికలెత్త మత్తిలున్."

అప్పకవి మతమునసుసరించి ఇతఁడు శిల్పకవి యగునేమో? వాసిరాజు రామకవిగ్రంథ మతిస్వల్పము కన్పడినది. అది సమాసజటిలము. 16. పోతరాజు వీరయ్యవాక్య "కపిలజటాజూటగంగాసముత్తుంగ, వీచీఘటలు మిన్ను వీఁకదాఁకె" నవి. "చతురత సమకొనంగ జోడుమాటలు సరిపడనాడు నతఁడు." పదసారళ్యము బాగుగనున్నది. ఇతనికృతి "త్రిపురవిజయము." 17. చెనమల్లు శ్రీగిరన్న శ్రీరంగమాహాత్మ్యము శ్రీనాథునియెత్తుగడ నవలంబించినది. 18. శాకుంతలములోని దగు సిద్ధనప్రెగడ దొక్కపద్యమే కనఁ

బడినది. ఈసిద్ధనప్రెగడయే జక్కనకవిని బోషించినవాఁడేమో! అయిన జక్కన తద్గ్రంథమును బేర్కొనలేదు. 19. దామరాజు సోమయ గ్రంథము శాస్త్రసంబంధియైనను కవిత సలలితోక్తివిశేషములచే జాలువాఱినది. 20. కుశలవోపాఖ్యానమును రచించిన చిరుమూరి గంగరా జెప్పటివాఁడో? ఇతఁడే యైరావతకథను వ్రాసినవాఁడని కవిచరిత్రకారుఁ డూహించినాఁడు. 21. మలయమారుతము సర్వన్న షష్ఠస్కంధము తెన్గించెను. శృంగారషష్ఠ మెవరిదో? గౌరనకవితనయుఁడని చెప్పఁబడిన గౌరనభైరవకవి, రత్నశాస్త్రమును, కవిగజాంకుశమును, శ్రీరంగమాహాత్మ్యమును రచించెను. శ్రీరంగమాహాత్మ్యకర్తనాఁబడు పోతరాజు భైరవకవి యెవరు? కవిత్వ ముభయభాషాప్రౌఢిని, శబ్దాలంకారకౌశలమును సూచించుచున్నది. (ఇతనిరత్నశాస్త్రమువలెనే, హయలక్షణసారమను శాస్త్రమును మనుమంచి భట్టు రచించెను. ఇదిశాలిహోత్రుని సంస్కృతగ్రంథమునకుఁ దర్జుమా యగును. చక్కఁగ నుండు శైలితో కంపనృపాలుని కీకృతి యంకిత మీయఁబడెను. వేదాంత తత్త్వరసాయనమను గ్రంథమును ఫణిభట్టు పంచాశ్వాసములుఁగా నుత్తమఫణితిని నిర్దుష్టము, మనోహరము నగు వాగ్రీతితో రచించెను. ఈయిర్వురికాల నిర్ణయ మింకనుగాలేదు.) "మారయామాత్య పుత్త్రుఁడ నని చెప్పుకొన్న అన్నమంత్రి కాలము 14 వ శతాబ్దమనిరి. ఏమో! అతఁడు సాముద్రిక శాస్త్రమును వ్రాసెను.

ఇంచుమించుగా నందఱి సమక్షమునఁ జరించితిమి. మహామహిమాన్వితుండని రూఢికెక్కిన విబుధాగ్రణి పినవీరన, "భారతీతీర్థుల" శిష్యుఁడు. "వాణి నారాణి" యని చెప్పఁగల్గె నని ప్రజలచేఁ బొగడఁబడిన వశ్యవాక్సంపన్నుఁడు. ఇతఁ డవతారదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాససారము, పురుషార్థసుధానిధి, శృంగారశాకుంతలము, జైమినిభారతాశ్వమేధపర్వము నను గ్రంథముల రచించెను. భారతాశ్వమేధపర్వము సాళ్వనరసింహభూపతి కంకిత మీయఁబడినది. అందు భారత

ములో లేని కథ లున్నవి. హంసధ్వజాదిరాజుల నర్జునుండు జయించుటయు, తామ్రధ్వజాదులను శ్రీకృష్ణసాహాయ్యంబు కల్మి వశీకృతులఁ గావించుకొను టయు, మధ్య నుపాఖ్యానంబుగా నున్న శ్రీరామాశ్వమేధకథయు నిందు ముఖ్యభాగములు. కవిత్వము ద్రాక్షాపాకము. మధురపదగుంభనలతో నిగ్గుదేరు చున్నది. పదముల పొందిక యపూర్వసందర్భసముచితము. కథాసంవిధాన మిన్నిటికన్న మిన్న. కథ యిట్లు మాఱునా యని మన మూహించునంతలో మనకన్న నత్యద్భుతకథాచమత్కృతి యేర్పడ, నూతన వృత్తాంతమును దెచ్చి గాథను బెంచుచుండును. ఉచితవీరరసప్రకటనావైచక్షణ్యమునఁ దిక్కనను దలఁపించుచుండును. శృంగారశాకుంతలము, కాళిదాసురూపక మును భారతకథలోఁ బొదిగించి తేల్పఁబడినది. ఇది చిల్లర వెన్నమంత్రి కం కిత మీయఁబడినది. కవిత సుశ్రావ్యమై యర్థపుష్టికై భారతముతోఁ బెనఁగు లాడి, దీనియందు రసోత్కర్ష కాలవాలమైనది. ధార యన్వయసౌలభ్యము గల్గి యనర్గళముగాఁ బ్రవహించుచుండును.

"గొనకొని తావిమూర్కొనని క్రొవ్విరి, యెయ్యెడ వజ్రసూచిరా
యని రతనంబు, జిహ్వ చవి యానని తేనియ, గోరు మోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాసనికేతన మాలతాంగి తా
ననుభవకర్త యేఘనుఁడొ! యావిధి యత్న మెఱుంగ నయ్యెడున్."

ఇత్యాది పదములును, కణ్వమహర్షి కూఁతునకు బుద్ధిగఱపుట, "గోరు వెచ్చైనపాలిండ్ల కొనలు దడుపు" హర్షసంతాపజలము, హస్తినాపురవర్ణ నము, నారదుఁ డరుదెంచి రాజునకు పూర్వవృత్తస్మృతిని గల్గించి పరస్ప రైక్యముం గూర్చుటయును జదువఁదగినవి. ఎట్లయినను జైమినిభారతము వలె శాకుంతలము ప్రజాప్రీతికిఁ బాత్రము కాలేదు. ప్రబంధవర్ణన లందు గొని యున్నవి. ఈశాకుంతలము ప్రబోధచంద్రోదయము తోపాటు నాటక భాషాంతరీకరణ స్వతంత్రోహాసమ్మిళిత కావ్యమై యున్నది.

సంస్కృతనాటకము లీయుగములో నిట్లు కావ్యరూపమున బయల్పడుటయేకాక, యథామూలముగా వల్లభరాయని వీథినాటకములోఁ బ్రదర్శితమైనవి. (శ్రీబండారు తమ్మయ్యగారు రొక్క చో నాంధ్రపత్రికాను బంధములోఁ జర్చించినట్లు) రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము, భాషాంతరీకృతి భీమఖండరచనానంతరమే కావచ్చును. కాని, శ్రీనాథునిసహాయమునుగొని వల్లభరాయఁడు రచించినాఁ డనుట సహింప కున్న, నవకతవకగా వ్రాసియున్న దానిని పూర్తిగా సంస్కరించి వెఱుగుఁ దీర్చి ముక్కాలుకళ తనకళగాఁ జైసెనే యనుట లెస్స. అంతియకాని వల్లభరాయునిచేతనే కాంచకున్నామని తద్గ్రంథకర్త శ్రీనాథుఁ డనుట సమంజసము గానేరదేమొ! హరిహరరాయల రత్నభాండాగారాధ్యక్షుఁడుగా వల్లభరాయఁడు విలసిల్లెనఁట! అతనితండ్రి మాత్ర మాపదవిలో నుండినది సత్యము. 'క్రీడాభిరామ - భీమఖండముల' రెంటను గన్పడిన "గార్గ్యసిద్ధాంత ముషఃకాలకలన" మను గీతము స్కాందపురాణము (మాతృక) లోని శ్లోకమునకుఁ దెనుఁగనుట సరియ. కవివాక్కునుబట్టి ఇది స్వతంత్రానుసరణమని తేలుచున్నది. మొత్తముపైన శ్రీనాథుని సిద్ధహస్తము వల్లభరాయని వాక్యసరణి నణఁచివైచి నామమాత్రావశిష్టము గావించి యునికి సత్యము. ఈక్రీడాభిరామమునకు మాతృక ఇంకను జిక్కలేదు. (చిక్కదనవచ్చును. గ్రంథమునకు మూలముండెననుట కల్పితమేమో!) కృతిమాత్రము సొగసుగ నున్నది. ఇది స్వతంత్రగ్రంథమైనచో, పల్నాటి వీరచరితమున కుద్దియై యీయుగంబున నుత్పాద్యగ్రంథద్వయి నొక్కటి యగును. "మృదుమధురపదగుంభనములు" నిండుకొని, ప్రౌఢమై, రసవిస్మరవిరచనాసముజ్జృంభితమై తనరారినది.

"ప్రక్కలువంచు వంచి మునిపండ్లను బండ్లనురాచు, రాచి తా
మ్మక్కిలఁజేయుఁ జేసి తలయల్లనఁ గాళులసందు సందిలో

చెక్కిలినొక్క నొక్కి యిరుచంబడ గుమ్మడిమూటగట్టి వీ
పెక్కి దువాళిచేసి చేలి యిక్కడ నక్కడఁబెట్టు వేకువన్."

ఇది ఎట్టిచేలి ? ఇందే నాయకుఁడగు మంచనశర్మ యోరుగంటిపురంబున విహరించుచు కామె పల్లివారిభాగవతకలాపములోని లక్ష్మీనారాయణుని ప్రేమఘట్టమును వర్ణించుచు నృత్యముఁజేయు జక్కులవారి చిన్నదాని నిట్లు వర్ణించినాఁడు.

సీ. "ముద్రికా మాణిక్యములదీప్తి కెంగేలు, పించంబు గుంచెతోఁ బ్రస్తరింప
ఉపవాసమున నున్నయువిదసన్నని కౌను, చనుదోయిభరమున జలదరింప
తోఁకచుక్కలఁబోలు తోరంపు తెలికన్ను, లావైళమున సిగ్గునతకరింప
నిద్దంపు వెలిపట్టు సెఱికదూలినయప్డు, తొడలమించులు వెలిఁ దొంగలింప

తే. ఊరుముచప్పుళ్లకును బిళ్లదొరులమ్రోఁత
కంతకంతకుఁ బేరుబ్బు నావహింప
నాడెఁబీఁటలపై నోలిఁ గూడియున్న
యక్కలేడ్వురిలో నొక్కయలరుఁబోఁడి."

ఈయక్షగానములు సంగీతప్రధానము లని యంద్రు. నృత్తముకూడ నుండినది. నృత్యసంగీతముల కలయికలో నభినయ ముండకుండునా ? అభినయప్రధానము లైనను సంగీతముతో విమిశ్రములైన, నేఁటినాటకములకును, పల్లెటూళ్ల ద్రౌపదీవస్త్రాపహరణము మొదలగు వీథినాటకములకును, బొమ్మలు, చెబ్బలు? రాగయుక్తముగాఁ బ్రదర్శింపఁబడుటకును యక్షగానము లాదియనుట యసమంజసముగాదు. శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులుగా రన్నారు గదా: "ఆంధ్రవాఙ్మయరసాలము తొలుదొల్త యక్షగానములు మున్నగువానిరూపమున నంకురించి, కాలక్రమమున దోహదవిశేషములు జరుగుకొలఁదిని ప్రేళ్లు నాటుకొని, ద్విపదనాఁ బరిణమిల్లి, అటుపైని గద్యపద్యోభయాత్మకముగా వెలసి, ఈమననాఁటికి విశ్వరూపమున వెలయు

చున్నదని మాభావము.'' ఈభావమువంటిదానినే శ్రీ తేకుమళ్ల రాజగోపాలురావుగారును వ్యక్తపఱచిరి. కావచ్చును. శైవమతవిజృంభణమునకు ముందటివి, తర్వాతివి, అధునాతనములని వారు ముత్తెఱఁగులుగ వానిని వారు విభజించిరి. కాలక్రమము ననుసరించి జంపె, కందార్థాదులు, ద్విపద, ద్విపదార్థము, లాలి, జోల, దూపారతి, నిదురగడలు, వెన్నెలలు, విన్నపములు, ధవళము, త్రిభంగులు, మేలుకొలుపులుఁ, మిగిలిన వివిధగానములు నైన వనిరి. హరికథలు, ''భాగోతు బుచ్చిగాని'' ప్రదర్శనమునుండి పరిణమించి యుండుననియు, వీనికిఁ బ్రత్యేకపాత్రనిరూపణ మలవరించి వేర్వేఱ నిల్పిన తోలుబొమ్మలలో కథావిభాగములు, సంభాషణములుఁ జూపించుట కలిగిన తర్వాతనే ప్రాచుర్యము వచ్చియుండు ననియు, వీని యన్నిటి సమ్మేళనమే నేఁటినాటకముగా ఫలించెననియు నూహించుట కెడమున్నది. పైనుడివిన పదునాల్గువిధముల పాటలును, ఏలపాటలు, పడవపాటలు నన్నియును చక్కని విశ్రాంతులతో, మంజులపదమధురిమతో జిగిదొలఁకుచుండిన వనుట నిస్సంశయము. బాల్యములోని కథలు జీవితాంతము వఱకును పరమానందసంధాయకము లైనట్టులే, యీజక్కుల గానములు నవ్యక్తభావమాధుర్యము ననుభవింపఁగల చదువరికిఁ గల్గించుచునే యున్నవి. వీని నెల్లను విస్మరింపక సంధానకగ్రంథములలో పరిశోధకులు సేకరించుట లెస్స! సమర్థులుగానివారు తర్వాత పూనుకొనుటవలన, నసభ్యశృంగారము ప్రాఁకి, జాతీయాదర్శములకు భిన్నముగ నగుటవలన నివి నశించినవండ్రు. పిమ్మట నివి తోలుబొమ్మలాటలుగ పరిణతినొందుచుండ భాగవతులమేళము లింకొకవంక శాఖలై పెరిఁగి హరికథయై పూజ్యమైనది. ఒకశాఖ యధఃపతితము. మఱొకశాఖ అక్కడక్కడ కాలూఁదియున్నది. నాటకము మాత్రము పెద్దవాఁడై సంపదనొందిన ధూర్త కనిష్ఠసోదరునివలె, హరికథలకన్నను, యక్షగానముల కన్నను, వీథినాటకముల కన్నను మిన్నయై కులుకుచున్నది. ఇంకొకచోట తక్కిన కథను చెప్పుకొందము.

## 3. కావ్యవిమర్శ

ఈయుగమునకు సూర్యచంద్రు లిరువురకవు లున్నా రనుకొంటిమి. వారి నింతవఱకు ప్రస్తావింపమైతిమి. శ్రీనాథుని విధేయులమై సందర్శింతము గాక.

బెండపూఁడి యన్నయమంత్రి గోదావరీతీర రాజమహేంద్రవర పురసౌధములో నేమనుచున్నాఁడు? "భాషించినాఁడవు బహుదేశబుధులతో, విద్యాపరీక్షణ వేళలందు". ఔననియో కాదనియో నవ్వునవ్వుకొనుచు గోదావరీప్రశాంతతరంగమాలికలపై ప్రేక్షణ చంద్రికల నింపుచు, తనపూర్వచరిత్రయంతయు స్మృతికి స్ఫురింపఁగా హర్షాశ్రువుల జారవిడుచుచు కొండవీటిని దలపోయుచున్న యేఁబదేండ్ల బ్రాహ్మణపుంగవుఁడు మీకుఁ గన్పడు చున్నాఁడా? అతనిమనస్సులో ఏఁబదేండ్లవృత్తాంతము మెఱసి పోయినది. కృష్ణామండలము బందరుతాలూకాలోని దగు 'కలపటము'లో 1380 ప్రాంతముల జన్మించి "పండితపౌత్త్రుఁడై"; తల్లిదండ్రుల యల్లారు ముద్దులతోఁ బెరిఁగి, తాతయగు 'కమలనాభామాత్యుని' దివ్యవాణి నాలించి, యుభయభాషాసాహిత్యము నేర్చుకొనుచు, కవిత నభ్యసించినదినములు కనులకుఁ దట్టినవి. "చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు" రచియించిన మరుత్తరాట్చరిత్రయును, యౌవనారంభములో శృంగారనైషధమునకుఁ బడినపాట్లును, పల్నాడుచరితములోఁ దాను పోయినపోకలును, ఆరాధ్య చరిత్రము నంకితం బిచ్చిన రీతియు, పెద్దకోమటి వేమారెడ్డిదగ్గఱ విద్యాధి కారిపదవి కభిషిక్తుం డగుటయు, శాసనములకుఁ దన సంస్కృతశ్లోకము లెక్కుటయు స్మృతము లైనవి. "జోటీభారతీ" యనుట వినఁబడినది. కర్ణాటకరాజ్యమున కేఁగి డిండిమభట్టారకుని కంచుఢక్క నుద్భటవివాదప్రౌఢిని బగులఁ గొట్టించిన యుదంతముతోపాటు విద్యానగరప్రౌఢదేవరాయరత్న సింహాసనసమక్షమునఁ గనకాభిషేకము నొందిన యపారగౌరవము మనశ్చ

క్షువునకు దృశ్యమై యొదలు జలదరించినది. కొండవీటిరెడ్లు రాజ్యము గోల్పోయినవిషయము కన్నుల నీరు దెచ్చినది. "వెదచల్లినాఁడవు విశదకీర్తి స్ఫూర్తి, కర్పూరముల దిశాంగణములందు" అను మంత్రివచనము ఇంతలో వీనులంబడి యోచనల కంతరాయము గల్గినది. "నాకుఁ గృతిసేయు మొక ప్రబంధము" అని కృతిభర్త యడిగినాఁడు. ఏగ్రంథమని యోచించినాఁడు. ఆంధ్రవల్లభుని (తెనుఁగురాయని) మైలారురెడ్డిని, సర్వజ్ఞసింగమనాయని దర్శించి యుండి యనేకకృతులను జెప్పినాఁడు. శ్రీశైలగిరికి యాత్రపోయి ముమ్మడి శాంతయ్యకు శివరాత్రిమాహాత్మ్యం బంకితంబిచ్చి యుండెను. గన్న నరపతికి ధనంజయవిజయంబు నంకితంబుచేసెను. శాలివాహనసప్తశతి యైనది. భీమఖండము మనస్సునకు వచ్చినది. సరే యని యన్నమంత్రికి దాని రచించుచో నక్కఁడి యల్లాడవీరభద్రారెడ్డిని కూడ వర్ణించినాఁడు. రాజునకు శ్రీనాథునిపై ననుగ్రహము తలసూపినది. కాని, "రాజమంద్రి" లోని పండితులు కవిసార్వభౌము నపహసించినారు. కోపముతో నన్నాఁడుగదా !

"బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములఁ బోలె కొంచెమెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు."

రెడ్లతోఁగూడి సింహాచలము తిరునాళ్లలోని కాంతలనందఱిని వర్ణించినాఁడు. రెడ్లయనుగ్రహము లభించినది. కాశీఖండమును దెనిఁగించినాఁడు; సుఖము గానున్నాఁడు. కాని, శ్రీనాథుని దురదృష్టమేమో, రాజమహేంద్రపురము సైతము వినాశమైనది. కృష్ణానదీతీరమున బొడ్డుపల్లె యనుగ్రామమును గుత్తకుఁ దీసినాఁడు. ఒడ్డెవారిదొరతనము. గజపతు లూరక విడుచువారు గారు. గుత్తఁ జెల్లించుటకు కాసులేదు. "కర్ణాటకక్షితిపాలమౌక్తికసభాగారాంతరా కల్పిత, స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధకవి"రాట్టే, కష్టములకులోనై పూర్వదశను

దలంచి యేడ్చినాఁడు. అతని యవసానదశయు, నతని చరిత్రయు నీ రెండు పద్యములలో స్థిరపరచి 1460 ప్రాంతమున దివి కేఁగినాఁడు.

1. సీ. "కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండఁ బొగడదండ
సార్వభౌమునిభుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాఁకిటనుండు నల్లగుండు
వీరభద్రారెడ్డివిద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము

తే. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్టుచెల్లింతుఁ డంకంబు లేదు నూర్లు?"

2. సీ. "కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁ డేఁగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు

తే. భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు

దివిజకవివరుగుండియల్ దిగ్గు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

పైకథనమువలన శ్రీనాథుఁ డఖండపాండితీమహిమ నద్వితీయుఁ డనియు, బహుదేశరాజాస్థానబహూకృతుండనియు, శివగ్రంథబాహుళ్య ముచే "తరుణేందుమౌళిని వలచిన" భక్తుఁ డనియు, భోగైకలాలసుఁ డనియు, విపులప్రపంచానుభవతరంగితజీవితాంతరంగుం డనియు సత్కవిత్వప్రభాభాసమానుం డనియు, "కావ్యమీమాంస" ననుసరించి "కవిరాజు"నియు, ప్రభుమతానుసారి యనియుఁ దేలినది. ప్రభువులు, పండితులు, శృంగారప్రియులు. క్రీడాభిరామమునందు, చాటుపద్యము లందు ప్రభువులకు మక్కువ. కాలగతికి వశ్యుఁడై కవియును పాండిత్యమును సూచించుచు దీర్ఘసమాసముల నుపయోగించెను. ఏసమయమున నెట్లు చెప్పవలయునన్న నట్లు చెప్పువాఁ డగుటచే నొకవిధమైన యాథార్థ్యము శైలికిఁ బట్టువడినది. ఈ యాథార్థ్య మితనిశైలికిఁ బ్రాణము. ఆంధ్రసార స్వతములో నేచోటఁగాని, సెంత మఱుఁగుగా నిఱికించినను, తిక్కన, పోతన, శ్రీనాథ, నన్నయల శైలిభేదములను గుర్తింపనగును. నన్నయయందలి ధారావేగము, తిక్కనయందలి యర్థపుష్టి, పోతనయందలి సుశ్రావ్య మధుర గానము, శ్రీనాథుని యుద్ధతశయ్య రుచిఁజూచిన తర్వాత మఱువరానివని తజ్జ్ఞు లెల్లరికిఁ దెల్లము. ఈయుద్ధతి కవియొక్క పాండిత్యప్రతిభాసమ్మేళన మునకుఁ బ్రతిబింబము. పల్నాటివీరచరిత్రము నీపండితుఁ డెట్టు రచించి యుండు నని కొంద ఱుత్తమవిమర్శకమహాశయు లనుకొనుట గలదు. కేవల పాండిత్యమే యుండువాఁ డగునేని 'పార్వతీపరిణయకర్త' వామనభట్టార కునితో సమముగా పెదకోమటి వేమన యాస్థానమున నెగడియుండఁడు.

శ్రీనాథుని కృతులగు శాసనములలో సైతము

"కల్యాణం జగతాం తనోతు స విభుః కాదంబినీమేచకః
క్రీడాక్రోడతనుః పయోధిపయసో విశ్వంభరా ముద్వహన్,

భారాపేతఫణావివర్తనవశాన్మోదాయ యస్యాభవ
న్నిర్యత్నా భుజగేంద్రమౌళిమణిభిర్నీరాజనప్రక్రియా.''

యని వ్రాయఁగల్గినవాఁడు కేవల పండితుఁడా? చమత్కారోక్తియే కవితాంకురమైనప్పుడు, ఎక్కడఁజూచినను లెక్కకు మిక్కుటముగా నుడికారముల సొంపుఁ గైసేసి, సాధారణముగా నెల్లయెడల తనస్వాతంత్ర్యపథంబును సూపి, సామాన్యభోజనము మొదలుకొని చక్రవర్తుల రాజకార్యవివరణమువఱకు, నిరాటంకముగా వర్తించిన యాతనికలము పల్నాటివీరకథను రచింపకపోయినదా? ఆకాశములో నలరు చందమామ కడవిలోని సరస్సులోఁ దేలియాడు నేర్పులేదా? శ్రీనాథుని కొక్కచోటనే ప్రజాశయములోనికిఁ దొంగిచూచు నవకాశ మబ్బినది. అవకాశమును సార్థకపఱచుకొన్నాఁడు; తరించినాఁడు. భీమఖండములో కాశినివీడి వ్యాసుఁడువచ్చు సందర్భమును, హరవిలాసములో జంగములవిశ్వాసములను, చిరుతొండని కథలోఁ బ్రతిబింబించిన నేర్పును జదివిచూడుఁడు. ఈతనిశివభక్త్యతిశయముచే భీమఖండములోని శ్రీకూర్మసర్పవర కథ లొక్కటిన్నరపద్యములో సంగ్రహింపఁబడినది. 'దేవరాట్' శబ్దము దేవవేశ్యాభుజంగుఁ డైనది. క్రీడాభిరామములోని ''భువనమోహిని చిన్నపోతి'' ''దివ్యగంధర్వికపరావతారంబు'' గాననే ''వీథి'' నాటకములోని కామె పేరెక్కినది. తెలుంగురాయని కస్తూరికావాసనలు ''ద్రాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ, వక్షోజద్వయకుంభికుంభములపై'' వాసించినవి. ఈశృంగారమున కేమికాని, శ్రీనాథునిలో రూపవర్ణద్వయ మగ్గలించిన దనుట వాస్తవము. ఈయంగాంగ నటనావిలాసప్రదర్శనము ప్రభుచిత్తవృత్తిని బట్టియు సరసుఁడు కవి యనుపించుట కవశ్యమైనదగుటను, ఆశ్రయమునకై కవి యెప్పుడును దేవులాడుచుండుటవలనను, ప్రాచుర్యమును గాంచి యప్పటి సంఘజీవితమునందలి యొకకళంకమును బ్రస్ఫుటము సేయుచున్నది. 'చిన్నపోతి' 'మాచల్దేవి' వారాంగనవంటిదేమో?

"భీమేశ్వరపురాణము శృంగారనైషధమువలెనే సంస్కృతపదభూయిష్ఠముగా నున్నను, చక్కని లోకోక్తులతోను, భాషీయములతోను నిండియుండి, మంచి కవిత్వశైలిని నేర్చుకొనఁగోరువారి కనుకరణీయములైన రచనావిశేషములతోడఁగూడి రసికజనహృదయంగమముగా నున్న" దను కవిచరిత్రకారునివచనము ప్రత్యక్షరసత్యము. శృంగారనైషధము సంస్కృతపదజటిలము. కాని, భాషాంతరీకృతియైయుండి శ్రీనాథునిగొప్ప, హృదయంగమంబుగా రచించుట యందును, మూలమునకు చెఱుపుగలుగకుండ రక్షించుటయందును మాత్రమే కాన నగును. శ్రీనాథతత్త్వనిర్ణేత లాంధ్రీకరణవైచిత్ర్యమును వివరింతురు గాక! కాశీఖండము కడపటి గ్రంథమై నను తొల్లిటిరచనావైశారద్యము తఱుఁగలేదు. ధారయు నటులే యున్నది. కాని సూక్ష్మముగాఁ బరికించిన రసోత్కర్షకించుక పటుత్వము దప్పిన దనవలయును. లేక, యొకరూహించినట్లు భీమఖండము శీఘ్రముగాను, కాశీఖండము నిదానముగాను రచింపఁబడినదగుటచే నుక్తిచమత్కృతి నధికము చేయుం దలంపున భీమకథలోని రసోద్వేగము దీనియందు మందగించియుండును. విశేషోక్తిచమత్కారలక్షణ మెప్పుడును, కథాసంవిధానమున కొక...... 'యనుట పాఠకులకుఁ గొత్తకాదు. కాకున్న 'లోకో భిన్నరుచి' యనియూరకుందము. ఎటులైనను పంచకావ్యములలోఁ బ్రథమమను విఖ్యాతినివిద్వదౌషధమగు నైషధమునకు, నయఃపిండమగుట పాండిత్యాతిశయప్రకటనాసమర్థమను నానుడి కాశీఖండమునకు నంటఁగట్టి వానియుత్కృష్టతయంతియేయనుకొన్నచో నతని గ్రంథములలో తెనుఁగు నుడికారముల కిక్కయగు 'హరవిలాసమును', రసోదంచితకథాసంవిధానకమనీయతకాటపట్టయిన భీమఖండమును, ప్రజాప్రీతిదాయకమైన వీరగీతమై విలసిల్లిన పల్నాడుగానమును ప్రశస్తము లనక తప్పదు. 'పండితారాధ్యచరిత్రము' ప్రెగడయ్య (మామిడి సింగన్నయన్న) కంకితమయినది. పాల్కురికి సోమనాథుని

గ్రంథమునకన్న నెట్లు మిన్నయో కానఁబడదు. శివరాత్రిమాహాత్మ్యము సమంజసమై యతనిసామాన్యపటుత్వమును ప్రదర్శించినది. "కేలందో యెత్తి మ్రొక్కెనె పాశుపతులకు శరణార్థియనియెనే జంగములకు" నను నవి మొదలగు వచనము లాతని జంగమభక్తిగలవాఁ డని చెప్పుచున్న వనిరి. అతని పద్యములు, అతనిభావములు స్వానుభవయుతములు నన్నచో నతని జంగమ భక్తుఁడని యన్నట్లే జారుఁడనియును, ధూర్తశృంగారధౌరంధర్యముగలవాఁ డనియు నొప్పుకొనక తప్పదు. శ్రీనాథుఁడు ప్రభుమతానుసారియు, కాలమునకు వశ్యుఁడును, సరసపండితవిఖ్యాతికిఁ బాటుపడినవాఁ డనియు నిర్ధారించుకొని యుంటిమిగదా? రాజ్యభోగముచే దుర్వృత్తిని జరించిన విద్వత్ప్రభువు లిప్పటికి నుండవచ్చునన్న నప్పటికి లేకపోయిరా? వారి కది దుర్వృత్తిగాఁ గనఁబడదు. కేవలభోగవిశేషము; గతిలేనివానిలో నది దుశ్చర్య! నాగరకతాధిక్యముచే వెలింగినవార మని విఱ్ఱవీఁగు నేఁటి మహాను భావులకే పేదవానిది పెద్దతప్పు, గొప్పవానిదోషము గోటితోఁబోవునది యై యుండఁగా నప్పటి సరససంస్కృతశృంగారకావ్యలోలురు భోగైకలాలసులు నగు ప్రభుపండితులచూపు లేవనితపైనను రసికతకుమాత్రమేపోయి యుండ వచ్చునన్న తప్పులేదుగదా! అట్టిచో శ్రీనాథుని చాటువులు ప్రభుసమక్ష మున తత్ప్రీతికై రచింపఁబడిన వగుటఁ గవినే జారునిగాఁ జేయఁజాలవు. స్త్రీముఖమునే యెఱుంగనివారు వనితలను భావపటములోఁ జిత్రించుకొని, వర్ణించి, యహాహా, యనిపించినవా రెందఱో కలరు పిల్లకవులు. 'షేక్స్పియర్' మేక్బత్తును రచించెనుగాన, స్త్రీఘాతుకుఁడని యతనిని దూషించుట కవ కాశమున్నదా? కవికి స్వానుభవమే కాక, జనశ్రుతి, పూర్వగ్రంథపఠనము, పరానుభవవర్ణనము, విచిత్రసంఘటనాసందర్శనము నను వేర్వేఱుమార్గములు విజ్ఞానము నిచ్చునవి యున్నవికదా! 'చిన్నపోతి' ద్రాక్షారామభీమేశ్వరు నెదుట నాడెడు వేశ్యయై ప్రతాపరుద్రునికి 'మాచల్దేవి'వలె రాజ మహేంద్రవర పురపాలకుల కత్యంతప్రియురాలై యుండరాదా? ప్రభు

చిత్తవృత్తికి దాసుఁడగు శ్రీనాథుఁడు వారినిమిత్తమే యామెను బొగడి యుండరాదా? కాఁబట్టి ప్రబలములగు నితరసాక్ష్యములు చిక్కువఱకును శ్రీనాథుని జారుండనుటఁ బొసంగదు. అటులనే జంగమభక్తుఁ డనుటయు నటుంచఁదగినది. శివభక్తుఁ డగుటమాత్రము నిక్కువమని భీమేశుని స్మరణ యొకటే ఘంటాపథముగాఁ జాటుచున్నది.

1. "ఈతని సీసము లొయ్యారపునడకగలవి." అన్నారు. ఒయ్యారపు నడకలే కాక, సీస మెన్నినడకల మెఱుఁగుఁదీఱినదో యన్నియును శ్రీనాథుని వాగ్విశేషములే. కనుఁడు:

"లోలారుక్కనకు నీకు లోలోన నేమేని, పోటుపుట్టదుగదా మాటమాట."
"కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ, గస్తూరికాపుండ్రకములఁ నొసల."
"పరరాజ్య పరదుర్గ పర వైభవశ్రీలఁ, గొనకొని విడనాడు కొండవీడు."
"ఏమంత్రి సౌభాగ్య మిగురుఁ గైదువుజోదు, లాలిత్యలీలకు మేలుబంతి."
"దీనారటంకాలఁ దీర్థమాడించితి, దక్షిణాధీశు ముత్యాలశాల."
"సకలసంపత్స్ఫూర్తి చాతుర్యమహిమల, నిందిరకాఁబోలు నిందువదన."
"గొజ్జంగి పూదేనె కులికి మేదించిన, కమ్మకస్తురి మేనఁ గలయ నలఁది."

సామాన్యముగాఁ జెప్పఁబడువానిలో నిన్ని భేదములుగానున్న వింకెన్ని విధముల పోలిక లాతని గ్రంథగర్భమున నున్నవి. ఎన్ని భావికవుల కవలంబనీయములయినవి? వీని నన్నిటనుండు ముఖ్యగుణములు, పద్యములతూఁగు, ప్రౌఢపదోద్ధతి యనునవి. సీసముల శ్రావ్యతలో, గడుసుఁదనములోఁ, గులుకు నడకలో శ్రీనాథుఁడు చూపిన శిల్పము "న భూతో న భవిష్యతి" యన్న సాహసోక్తి గానేరదు.

2. సీసములతో నితనిదీర్ఘసమాసరచనము గమనింపఁదగినది. అతఁడర్థవంతముగా వానినిఁ జొప్పించెను; మెప్పించెను. హానిభావిరచయిత కొక దుర్బలపథకమును సూచించెను. శ్రీనాథునిలో నెచట నేని నపార్థకములు

నసమర్థములు నగునవి యంతగాలేవు. కాని, తర్వాతివారిలో నస్థానపతిత ములై యాడంబరములో దిగిపోయి కాగితపు పూలు, నీడవ్రాలు నైనవి.

3. తెలుఁగుసామెతలు, లోకోక్తులు, తెలుఁగునుడికారముల నిగ్గులు సంస్కృతపదములమధ్యనుగలసిపోయినవి. "ఆవగింజంత మైఁ బూది యలమి కొనిన వెలఁది గుమ్మడికాయంత వెట్టిపుట్టు"—"మగవాఁడో మానో"—"కోటికిఁ బడగయెత్తిన"—"ముండదైవమునకు న్మోమోటలేదే"—"పరుల యెంగిలి కాసపడితి"—మొదలగునవి యెన్నియే నుదాహరింప నగును.

4. సందర్భసాక్షాత్కారవిచక్షణం బగుచిత్రరచనాశిల్ప మితనియం దుత్తమగుణము. ఇతని యుద్ధతశైలి కది చక్కఁగఁ గుదిరియున్నది. "అదె వియద్వాహిని యదె మణికర్ణిక, యదె కాశి నిఖిలకల్యాణరాశి." సంభాషణ లెదుట జరిగిన ట్లుండును. భీమఖండములోని "వ్యాసాగస్త్యసంభాషణంబును," హరవిలాసములోని "చిరుతొండనికిని వృద్ధజంగమునకును నైన సంవాదము," పల్నాటికథలోని "వాదములు" మున్నగునవెన్నియో రసవంతముగా నున్నవి.

లాక్షణికకవి యని ఇతని ప్రమాణముల నితరు లంగీకరించిరి. 'ఎన యన్నిట', 'వినుపించె న్నశరీరభాతి' మున్నగు ద్రుతసంధులును, "చ, ర్లాట లకు సెలవులు మధురాపురిచెంతక్" ప్రభృతులలో నఖండయతియు, 'సంసార', 'వంశ'ములకు శ, స ప్రాసమును,ల, డలకుఁ బ్రాసము 'నేడు' 'గగ్గోలు' శబ్దములయందును నితం డుపయోగించెను. పండితులు వీని నెట్లో సమర్థింతురు. పోతన్న కవిరాజు నని చెప్పుకొనక, సహజపాండిత్యుం డనుటచే నలాక్షణికుండై పోయినాఁ డప్పుకవికి! 'కవిరాజు' కాలమునకు లొంగెను; 'మహాకవి' కాలమును జయించెను. మహాకవి పోతనా! నమస్కృతి.

చూచుచున్నారా పోతన్నను? "రాకానిశాకాలంబున నభ్రంకష శుభ్రసముత్తుంగభంగయగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయమం

జులపులినప్రదేశంబున మహేశ్వరధ్యానంబు సేయుచు, కించిదున్మీలిత లోచనుండై .........వల్లీయుతతమాలవసుమతీజముభంగి బలువిల్లుమూపునఁ బరఁగువాని... జూచుచున్న మహాభక్తునిఁ గన్నులారఁ జూడుఁడు. ఆముఖమున నెట్టిశాంత ముట్టిపడుచున్నది! ఎన్నఁడో చిన్నవయస్సులో నల్లిన 1భోగినీదండకము మఱువఁబడినది. భోగినీదండకము నాఁటి 'పూపవయస్సు' చెల్లిపోయినది. అప్పటిచలనము లణఁగిపోయనవి. నిత్యనిర్మలజ్ఞానసంపదచే మనస్సు నెమ్మదికి వచ్చినది. రాజ్యముచేయవచ్చిన కాలాంగన పరాభూతయైనది. పార్వతిని జూచినప్పుడు శివుఁడు చలించినది సత్యమే. కాని, యది క్షణికము. మదనుఁడు దగ్ధుఁడైనాఁడు. దారిద్ర్యపుచేఁదు రాజాశ్రయ శర్కర నభిలషించినది. భోగసుముఖమగు యౌవనారంభము వాంఛకుఁ జేయూఁతనిచ్చినది. కాని, ఈసంచలనము గొంతకాలమే. సర్వజ్ఞుఁడు పరమపదించినాఁడు. సర్వజ్ఞసింగమనీనిపరిపాలనము 1400 న కంతరించినది. ఆ ర్యావర్తములో పఠానురాజ్య మంతరించినది. దక్షిణహిందూరాజ్యము చీలికలై యోరుగల్లు పూర్వవైభవముఁ గోలుపోయినది. దక్కను పీఠభూమి యనఁబడు మధ్యభరతఖండము భామినీతురుష్కాక్రాంత మైనది.

మొఘలుల మూఁక, తైమూరుచే నడుపఁబడి దేశమును దోఁచుకొనుచుండెను. రామానందకబీరుల గానామృతబోధన లుత్తరమునుండి వినవచ్చుచుండెను. పూర్వాంధ్రవైభవమును స్మరించినాఁడు. అంతయుం నంధకారమున మున్గియున్న వర్తమానమును పరీక్షించినాఁడు. భావిపరిణామమూహించినాఁడు. రాజుల దుర్వృత్తములను దిలకించినాఁడు. మున్నుఁదానొనర్చిన పని తప్పని పశ్చాత్తాప పడినాఁడు. చిదానందయోగి కరుణగల్గి

1 భోగినీదండక మితనిది గా దని పలువుర యాశయము. నాయాశయముంగూడ నదియే. కాని, దానిలోని శైలిమాత్ర మించుక సంశయమును, కర్తృత్వము నిశ్చితమగుదాఁక కల్గించుచునే యుండును.

నది. కాలము శాశ్వతముగాదు. జగత్స్వరూప మెప్పటికప్పటికి మాఱిపోవు చున్నది. ఆత్మావలోకనముచే చిత్తశాంతి చేకూరినది. పరతత్త్వసందర్శనమున శివవిష్ణుభేదము సన్నగిల్లినది. "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" యను శ్రుతి యవగాహమైనది. కాఁబట్టియే 'రామకృష్ణ హరి' త్యాదినామములు పర్యాయములైనవి. తనమతము "చేతులారంగ శివునిఁ బూజించు" టయు, "నోరునొవ్వంగ హరికీర్తి నుడువు" టయు, "దయయు సత్యంబు లోనుగాఁ దలఁచు"టయు నైనది. శివపూజ మనస్సులో నిత్యమును జరుగుచున్నది. దయాసత్యములు తననిర్మలపరోపకారప్రవర్తనలో, ప్రాపంచికభోగనిరసనములో సిద్ధించినవి. కాని, వాక్కునకు నిర్ణయించినపనిమాత్రము సాగలేదు. యోచించినాఁడు. "పదిరెను భాస్కరుండు, లేదా, బండ్లకెక్కింప నా రామాయణంబు" నని తర్కించుకొని తెల్లఁబోయినాఁడు. ఇంతలో సోమోపరాగము గల్గినది. చల్లనివెన్నెలలో గోదావరి ఇసుకతిన్నెలలోఁ బరతత్త్వమును మహేశుని ధ్యానించుచున్నాఁడు. మనమును జూచుచుంటిమి. "శ్రీమహాభాగవతంబుఁ దెనుంగుసేయుము. నీకు భవబంధంబులు తెగు" ననుచున్నాఁ డాపరంజ్యోతిమూర్తి! అందుకనే అప్రయత్నముగాఁ బోతన యనుకొన్నాఁడు:

"ఒనరన్ నన్నయ దిక్కనాదికవు లీయుర్విన్ బురాణావళుల్
తెనుఁగుల్ జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దా నెట్టిదో.
తెనుఁగుల్ జేయరు మున్ను [1]భాగవతముల్ దీనిం దెనింగించి నా
జననంబుల్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్."

పునర్జన్మము తనకును లేదు; కృతికిని లేదు. యథామూలమని తెనింగించుటపద్య రూపమున భారతమునకుఁ దటస్థించినది. రామాయణమున కన్ననో లెక్కయే

1 తెనుఁగుభాగవతము 30 వేలగ్రంథమని తజ్జ్ఞులందురు. సంస్కృత మిర్వదివేలు.

లేదు. ప్రతిపండితునికి నదే పనియే కాని భాగవతమున కట్టి గతిలేదు. మహాత్మునివాక్యము లమోఘములు. భారతరామాయణములకుఁ గల్గిన పునర్జన్మము భాగవతమునకు ముమ్మాటికిని లేదు. హేతు వేమనఁగా నది భాగవతమగుటయే. మాతృకకంటె పదివేలగ్రంథము తెనుఁగులో హెచ్చియుండుట. ఏవ్యాసకృతశ్లోక మొక్కటేని మొక్కపోకయుండుటయే. మహారాష్ట్రమునకును దెనుఁగునకును భాషాసంబంధ మున్నది. ఓరుగల్లునకును మహారాష్ట్రదేశమునకును దగ్గఱ. మహారాష్ట్రదేశస్థుఁ డనఁబడిన బోపదేవుఁడనుకవి సంస్కృతభాగవతమునకుఁ గర్తయండ్రు. వ్యాసభాగవతము దేవీభాగవతమండ్రు. కావచ్చును. ఆబోపదేవుఁడే యీపోతనగా నవతరించెనా? ఇట్టి యూహాలను గాదందురా? పోనిండు.

1భగవత్తత్త్వార్థప్రతిపాదనంబునందు "గీతకుఁ" బిమ్మట "భాగవతము" లోకోత్కృష్టమైన గ్రంథరత్నము. దాని మూలానుసారముగఁ దెన్గించుటకు నిస్తులమేధావిస్తృతనిరంకుశకవితావేగంబు గలమహాకవికిఁ దప్ప నొరుల కసాధ్యము. నిజమైనభాషాంతరీకృతి మూలములోని మనస్తుష్టికవితయే కాని, "చ" అనుటకు "ను" వచ్చినదా లేదా యని చూచుకొననిచ్చు నట్టికవి వ్రాసిన నీరసరచన గానేరదు. పోతన్నగారి భాషాంతరీకృతియెట్టిది? 1. మూలార్థములు గూఢముగానున్నచోట శ్రీధరీయవ్యాఖ్య ననుసరించి వానిని తేటతెల్లముగావించుట. 2. వలయొకడలఁ బెక్కువ్యాఖ్యానపదంబులనే తెనుఁగునఁ జొప్పించుట. 3. సరసంబులుగాని కథాంశముల సైతము రసవత్తరంబులుగా రచించుట. 4. కవితావైచిత్ర్యమునకు ననువుపడని వేదాంతఘట్టముల మృదుపదఘటనచేఁ దెనుంగున మనోరమ్యముగఁ జేయుట. 5. మూలమునంతయుం సుంతేనియుం విడువక, విపులీకరించియు, అర్థబాహుళ్యము

1 పదునారవయుగాదిసంచికలోని "మహాకవి పోతన" యనువ్యాసమునుండి కొన్నివిషయము లుద్ధృతములు.

హావణించియు, పాఠకులచిత్తము నాఁచికొనుసులభపదంబులతో భావంబుల సంగ్రహించియు మొత్తముమీఁద కావ్యభక్తి కనుకూలించునట్లు మూలా విరుద్ధముగా నన్వయసౌలభ్యము దీటుకొన రచించుట యను నైదుసూత్రం బుల నతనికవితనుబట్టి నిశ్చయింపవచ్చును.

1, 2, 4 సూత్రము లావశ్యకంబులు కాని, యాంధ్రీకరణంబునకు 3, 5 సూత్రములలోఁ దేలిన కావ్యరచనాశిల్పమును, భావవైశద్యోత్కర్ష రస సౌభాగ్యసంపాదకంబులగు నుచితపదంబులఁగూర్చి మూలాతిక్రమణము సరకుగొనక, వ్యర్థవిశేషంబులను విస్మరించి, స్వకీయకల్పనావిజృంభణపార వశ్యముచే ప్రత్యేకవ్యక్తిత్వమును సంతరించుటయును ముఖ్యములు గావు. సహజకవితామృతతరంగితప్రతిభాసముద్రునికి గాని సాధ్యములు గావు. కావున భాగవతము కేవలము ఆంధ్రీకృతముగాక స్వతంత్రమహాకావ్య రూపముం దాల్చుటచే పోతన "మహాకవి" యగుట నిస్సందేహము.

మహాకవి పోతనకే "ఇమ్మనుజేశ్వరాధముల" నని యప్పటినరనాథు లను తిరస్కరించుట చెల్లినది. ఈవ్యత్యస్తమున కాంధ్రభారతి తలయూఁచి నది. నరపతుల నాశ్రయించి వారి నమరమూర్తులఁజేసిన గుండలీంద్రాది యాదికవులు విస్మయచకితులై యాశీర్వదించినారు. ఆగర్భదారిద్ర్యబాధ మూలకుఁ ద్రోయఁబడినది. అహో! స్వాతంత్ర్యశీలుఁడే మహాకవి యని తేటపరచిన పోతనా! అని ప్రతినపట్టితివెట్లు నెరవేర్తువో!

నిడుదలు నన్వయసులభంబులగు నన్నయను "సూరి" యనియును, ప్రౌఢసందర్భార్థసముచితపదప్రయోగసామరస్యమునకుఁ బెన్నిధియైన తిక్క న్నను 'మనీషి' యనియుఁ బేర్కొని వారియర్థసారస్యాన్వయసౌలభ్యంబులఁ దన రసప్రవాహమునఁ గల్పుకొన్నాఁడు. సోమన భాస్కరుల రససౌభాగ్య మీతనియందు, రాకాశశాంకసందర్శనసముద్రిక్తసముద్రంబుభాతి భక్త్యు ద్రేకసాతత్యంబుచే సహజసముల్లసనమును బడసియున్నది. యతిప్రాసముల

యందు వెదకికోలు గానిపింపక, సరసపదాభినివేశము వెలయ పద్యాదినుండి పయింబయి రసపుష్టినొనర్చుటలో నితం డసమానుఁడు. రసానురూపములుగఁ బద్యములు సువిభక్తములై యుండును. సంగీతపరిజ్ఞానమును రసౌత్కృట్య ముతో మేళగించి ప్రతిపద్యంబును, సౌకుమార్యమెందును గుంటువడనిధారతో శ్రావ్యముగా ఘటించినాఁడు. కాననే భావసుభగత్వము నిండారినది.

పోతన కమనీయకవితాకల్పశాఖి భాగవతప్రథమస్కంధమున నశ్వ త్థామావమానకలినిగ్రహంబులలో భయానకబీభత్సరసంబులను, కృష్ణస్తవ శుకసందర్శనంబుల శాంతరసంబునను, కృష్ణనిర్యాణవార్తాదుఃఖసందర్భమున కరుణరసంబులను, బ్రోదిసేయ మొలకెత్తి యుత్సన్నంబులుగాక నిల్చిన ద్వితీయ తృతీయ చతుర్థస్కంధభాగంబుల మైత్రేయ విదురసంవాద ధ్రువాద్యుపాఖ్యాన కపిలజననకథాదికంబులందు వెలయు తత్త్వఘట్టంబులందలి భక్తిభావైకద్యోతకంబగు నద్వైతసరణి నిరూపించుటలోని విషయవిశదీకరణ నైపుణ్యంబులచే బలిసి,—సప్తమస్కంధంబున నవరసంబులకుఁ దావలంబైన ప్రహ్లాదచరిత్రయందలి మంజులతామహనీయ పద్యజాలంబుల నిగ్గులుదేఱి పల్లవించి అష్టమస్కంధంబున శబ్దార్థాలంకార విశిష్టదుర్వారశైలి శాఖోప శాఖలంబెట్టెఁగి, నానావిధానూనకల్పనాకోరకంబుల జిగిచేరహించి,—నవ మస్కంధమున వివిధరాజవంశచరిత్రమాలాత్తకోమలవాక్యకలకంఠమధురిమ నెసఁగి,—గంగాప్రవాహావతరణ రామకథామృతనిధులందలి మధురశబ్దమక రందమును వహించిన భావపుష్పములఁ జూచి సురభిళమై—దశమస్కం ధంబున సర్వరసౌత్కృట్యముఁ బ్రదర్శించుచు, భరతశాస్త్రాదికపరిచయమును, శిశులీలాదికమానవప్రకృతి విజ్ఞానధౌరంధర్యమును, యుద్ధప్రభృతి రాజ కీయకార్యవిజ్ఞానము నొక్కుమ్మడిఁ గ్రమ్మరించుచు, రాసలీలా, జరాసంధవధ, గోపికాలాప, రుక్మిణీకల్యాణ, ముచికుందకథాది సత్ఫలంబులఁబండి, పండిత పామరభేదంబు లేక, నాంధ్రమహాజనుల కందఱకు సర్వకామదంబై చెన్నారినది.

ఇతనిమహాకవితలో నుభయరేఫ మైత్రియు, ద్రుతసంధియు ననువ్యాకరణదోషములును గలవండ్రు; వ్యాకరణదోషము లితనివి గావనియు నితరపూరితకృతుల నున్నవనియు, [1]కూచిమంచి తిమ్మనకవియు, గుప్తార్థప్రకాశికాకారుఁడును నిరూపించిరి.

పదాడంబరము [2]రసావేశపారవశ్యంబున నైతె, శ్రావ్యతకై, సందర్భాచితికై కలిగినది. సమయస్ఫూర్తికొఱకు పదాడంబరము రసోద్దీపకముగాఁ గవులు ప్రయోగింతు రని శకవీర (Shakespeare) కవి హామ్లెట్ (Hamlet) నాటకమున నిర్వచించెను. ఇంతకు నవి రంధ్రాన్వేషకులకే కానిపించునుగాని, పాఠకులకు, భక్తులకు 'సుధావర్షములు' గా నుండును.

పోతన్న యందలి ముఖ్యవిషయంబులలో వర్ణనావైశద్యమొకటి: 'ఇంతింతై వటుఁ డింతయై' యనుపద్యంబుంజూడుఁడు. భావము ననుసరించి శైలి నడచు టింకొకటి: 'వరగోవిందకథాసుధా' యను పద్యమును జదువు తీరుతీయములతోఁ బఠింపుఁడు. 'ఏకోరసః కరుణఏవ' యనుభవభూతిరచనమునకు నిదర్శనమగు రచన మఱి యొందు: గజేంద్రుని మొఱ నాలింపుఁడు. సోమ

---

1 పుట్టెన్నఁడు మొదలగు రెండుమూఁడు ప్రమాదపతితములు. పోతన్న వనఁబడునవి నారాయణశతకము, భోగినీదండకము, వీరభద్రవిజయము. వీరభద్రవిజయకర్త సోమేశ్వరునకు శిష్యుఁడు. వేమన సమకాలికుఁడు. 16-వ శతాబ్దిలోనివాఁడు. భోగినీదండక కర్తృత్వ మనిశ్చితము. భాగవతపుఛాయలు పెక్కు లందుండుటవలనను, కవిత చక్కఁగా నుండుటవలనను నారాయణశతకము పోతనదనియే యననగును. (చూడు: నారాయణశతక విషయమై 10-వ ఉగాదిసంచిక.)

2 వీరభద్రవిజయము గద్య వేఱుగా నున్నది. ఇది బమ్మెరపోతన్న కృతము కాదని నానమ్మకము.

నాథునికల్పనాసౌష్ఠవము మఱియొక్కటి: సత్యభామాయుద్ధఘట్టమును బరికింపుఁడు. పద్యములు పాదపాదములకు విఱిచి తూఁగుటుయ్యాలలోని బాలికలంబోలి, రసావేశముతో భావముల తారతమ్యము సరిదిద్దుట యింకొకటి: రుక్మిణీదేవికి వివాహోత్పూర్వము గలిగిన యాందోళనమును వినుఁడు. 'ఘనుఁడా భూసురుఁడేగెనో?' అంత్యానియమాదిశబ్దాలంకృతుల నేర్పును బట్టిచిల్లు. ఇతని తాదాత్మ్యము 'కుచేలోపాఖ్యానమున' గనుఁడు. శరతల్పగుఁడైన భీష్ముఁడు కృష్ణుని స్తుతించుఘట్టములో తిక్కన పోతన్నలను బోల్చి చూఁడుడు. దేవయానిని బైకెత్తు సందర్భములో నన్నయపోతనల భేదమును విలకింపుఁడు. సత్యభామాయుద్ధఘట్టమున పోతన సోమనల నిష్పరం బరీక్షింపుఁడు. సర్వజ్ఞ ప్రబంధపరమేశ్వరులతో నితండు తుల్యుండు. రసౌత్కృష్ట్యమున వారికన్నను దిక్కన్నకన్నను మిన్న. అర్థపుష్టిలో నితరులకుఁ దీసిపోకున్నను దిక్కనకుఁ దగ్గును. ఈక్రిందిపండితాభిప్రాయములం జూడుఁడు:

## I

'ఈకవి సంస్కృతపదరచన లించుమించుగా నన్నయకవనంబునందుఁబోలె లలితములుగా నుండును. అయినను అర్థసారస్యమునను, పదవాక్యసౌష్ఠవమునను నితనికవనంబు తిక్కనదానియంత ప్రౌఢముకాదుగాని, రసోచిత రచనావైచిత్ర్యయందు ఇది యతనికవితకు వెనుదీసినదికాదు. ఎక్కువ యని చెప్పుటయును సాహసముకాదు. తిక్కన కర్థసారస్యమునందు గన్ను. పోతనకు రససౌభాగ్యమునందు దృష్టి.'

కీ. శే. తం. లేపపెరుమాళ్లయ్య,
(ఆనందముద్రాలయ భాగవతము).

## II

ఇతనిపదము లతికోమలములు; అలంకారములు మనోజ్ఞములు; రచనలు సరసములు; పాకము మధురము; ఇతనియెడఁ జూపట్టు హరిభక్తి యగ్గలము;

పాండిత్యము మిక్కుటము; లోకానుభవం బహీనము; వేదాంతార్థచింత నంబు మెండు. ఇతండు సాహాయంబగు కాయంబు దొలంగియు జీవించియే యున్నాఁడు. ఇతనిభాగవతము ఆంధ్రదేశీయులెల్లరుఁ బెల్లుగాఁ జదివి భవరుగార్తులు నిర్లేపత్వమును, భాషాజ్ఞానార్థులు భాషాజ్ఞానమును, సుకవిపుంగవులానందమును, భాగవతులు దృఢభక్తిని, ముముక్షువులు మోక్షమును బొందుదురు. శ్రీనాగపూఁడి, కుప్పుసామయ్య, బి. ఏ.,

(ఆనందముద్రాలయ భాగవతపీఠిక)

## III

భక్తిరసమున నాంధ్రవాఙ్మయమునఁ బ్రధానపీఠము పోతరాజుదే. ఆతని నాపీఠమునుండి తొలఁగింపఁగల కవి 'న భూతో న భవిష్యతి' యని సాహసముతోఁ జెప్పవచ్చును. నవరసములలో భక్తిరస మొకటి కాకపోయినను దాని నొక రసస్వరూపముగ నిర్ణయించి సజీవము చేసెను. పోతన 'రసో వైస' అనుసూక్తి నెఱిఁగినవాఁడు.

శ్రీ సేపూరి, లక్ష్మీనరసయ్య, యమ్. ఏ., యల్, టి.,

(16-వ ఉగాదిసంచిక)

## IV

పోతన్న శబ్దార్థములు రెంటికి సమానగౌరవముల నిచ్చి సామర్థ్యాతిశయముతో శబ్దార్థాలంకారము లుపయోగించెను.

'ఆత్మగౌరవము గల కవిసత్తముఁడు.'

శ్రీఆంధ్రశేషగిరిరావు, (14-వ ఉగాదిసంచిక.)

## V

"రాజరాజేంద్ర సామ్రాజ్యభోగములందు, నన్నయభట్టు పాల్గొన్నవాఁడు
మనుమసిద్ధిశశిమాచక్రమరుదారఁ, దిక్కన్న తనచేతఁ ద్రిప్పినాఁడు
వీరభద్రారెడ్డి విరివియౌవిభవంబు, శ్రీనాథుఁ డెంతొ భుజించినాఁడు
... ... ... ...

తే. వెఱఁగు పడనేల వారి కవిత్వమునకు
బ్రమకు పైయాస కూడను బాడు సేయు
ఘోరదారిద్ర్యదుఃఖంబు గుడుచుచకట
యేగతి నిబల్కె పోతన్న భాగవతము?" శ్రీ వసురాయకవి.

పోతనయొక్క సందేశము భక్తిప్రధానైకేశ్వరోపాసనాద్వైతతత్త్వవిశిష్టమగు నిష్కామకర్మయోగము.

స్వకీయకల్పనావిశ్వభావనకళాకౌశలములు మూఁడు నున్నను భాషాంతరీకరణకళంకం బొకటి తిక్కనపోతనలను వేధించెను. ఎటు లయిన నేమి? ఆంధ్రసరస్వతికి రూపకల్పనఁ జేయుట తటస్థించెనేని యర్థపుష్టిగల తిక్కన శిరంబనియు, రసగభీరతయు, పదప్రసన్నతయు గల పోతనహృదయమనియుఁ జెప్పవలయు. ప్రపంచభాషామతల్లు లెల్లపను నొక్కసమావేశమునఁ గలియుటయే ఘటిల్లిన నాంధ్రవాణికి ననపాయులై వెన్క నరుగుట కిరువురర్హులు: తిక్కన్న ప్రథముఁడు; పోతన్న ద్వితీయుఁడు. సోమన్న వేమనలు వారి నీడలగుదురేమో! కాననే తిక్కనపోతనల నధీశ్వరులని యనుకొనియుంటిమి. భాగవత ముత్సన్నము గాక ఏర్చూరి సింగన షష్ఠస్కంధముఁ బూరించెను. ఇతనికవిత పోతన్నకు శిష్యత్వము నెరపినది. పోతన ప్రియశిష్యుఁడగు వెలిగందల నారయ్య ఏకాదశద్వాదశస్కంధములను బూరించెను. వీరందఱిభాషాంతరీకరణకృతి, మూలమునకు సరిగానుండక కొన్నిచోట్ల న్యూనముగా, కొన్నిచోట్ల భిన్నముగా నుండును. కవిత్వము స్వభావసుఖముగాదు. సింగనమాత్రము రసవంతముగనే చెప్పె ననవచ్చును. భాగవత ముత్సన్నము గాక మొదటనే భాస్కరరామాయణము భంగి నల్వురకవులచే నారంభింపఁబడియుండఁగూడదా?

## ౪. యుగలక్షణసమన్వయము.

1. భోజరాజీయాది స్వతంత్రగ్రంథములు బయలుదేరినవి. స్వతంత్రకల్పనము హెచ్చయినది.

2. ప్రబంధరీతు లన్నియు నీయుగములోఁ బ్రచారములోనికి వచ్చినవి. సంస్కృతదీర్ఘసమాసరచన, యమకాదిశబ్దాలంకారములు, శ్రీనాథపోతనల తర్వాత విశేషముగా నుపయుక్తము లగుట ఆరంభమైనది.

3. నాటకగ్రంథాంధ్రీకరణ మారంభమైనది.

4. వాఙ్మయరంగము లద్దంకి, రాజమహేంద్రపరము, విద్యానగరము, కొండవీడు, ఓరగల్లు.

5. శతకకవిత ప్రబలినది.

6. శృంగారశాకుంతలము ప్రబంధయుగమునకు వేగుజుక్క.

7. క్షేత్రమాహాత్మ్యములు ప్రబలి చిన్నచిన్నకావ్యములకు దారితీయుటచే ననేకకవులు బయలుదేరిరి. క్రమక్రమముగ కవులసంఖ్య హెచ్చయినది.

8. వీరగీతము (పల్నాటిచరితము) వాఙ్మయములో నుత్తమస్థానము నాక్రమించుకొనుస్థితికి వచ్చినది.

9. కాకతీయాంధ్రోన్నతిలోని లౌకికతత్త్వమును తిక్కన చిత్రించెను కాని, యందలి యాధ్యాత్మిక ([1]మర్మ) కవిత్వవైభవము పోతనయీయుగారంభమున గానముచేసెను. ఇది ప్రజాజ్ఞానవికసనమునకుఁ దోడ్పడి, యనేకులను వేదాంతులనుగా మార్చినదను టెల్ల ఱుకుఁ దెల్లము. ఇట్టి

1 శ్రీదువ్వూరు రామిరెడ్డిగారు పెట్టిన, ఆంగ్లేయానుకృతియగు నామము. పోతనకవిస్తుతియు. పోతనగృహచరిత్రమను ప్రాతగ్రంథమును పోతన 1380 ప్రాంతమునఁ బుట్టియుండు నని సూచించును.

వేదాంతుల పరంపరలోనే శ్రీవేమనయోగియు నొకఁడు. కాఁడని యేల చెప్పఁగూడదు? వేమనయేల? కేవలపామరులగువారికి సైతము భాగవతము వేదాంతమని, పవిత్రగ్రంథమని నమ్మకమున్నదిగదా! భాగవతప్రశ్నలఁ జూచునాచార మిప్పటికి నున్నది.

10. లక్షణగ్రంథములు విశేషముగఁ బుట్టినవి. కాని, అన్నిటిని సమన్వయము చేయఁదగిన యప్పకవీయమువంటి గ్రంథములు పుట్టలేదు. (సమష్టిలక్షణసమన్వయము వాఙ్మయనిర్మాణప్రతిభారాహిత్యమును సూచించునని పాశ్చాత్త్యసిద్ధాంతము.)

11. ఈయుగము వివిధవాఙ్మయశాఖలకును లతల నల్లినది. తాళ్ళపాక అన్నమయ్యగారి శతకములోఁ జిక్కిన యొకపద్యములో నీయుగములో నానావిధకావ్యము లున్నటులే, యెన్నివంటలు చెప్పఁబడినవో వినుండు.

చ. అరిసెలు నూనెబూరెలును నౌఁగులుఁ జక్కెరమండెఁగల్ వడల్
బురుడలు వాలమండెఁగ లపూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందువెట్టెఁ బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవినిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా!

---

## 2. శ్రీరాయలయుగము: ప్రబంధము (1501—1650.)

### ౧ సంఘచరిత్ర

అధికాంధ్రదేశము గజపతుల పరిపాలనలోనికి వచ్చుటయు, రెడ్లు, నాయఁకుల రాజ్యము లస్తంగతము లగుటయు, విద్యానగరముద్వితీయరాజవంశముతో మకల రేకెత్తుచుండి యుఁదెలిసికొంటిమి. గుండరాజునకు నిద్దరు కొడుకులు. సాళువ

నరసింహారాయ లోకఁడు. ఇతని పట్టాభిషేకమును గూర్చి తర్కించుకొంటిమి. తర్వాత నితఁడు గతించినటులున్నది. గుండరాజు మొదటికొడుకు తిమ్మరాజు. ఆతిమ్మరాజు మనుమఁడు తుళువనరసరాజు. పినతాత మరణానంతరము దాయాదులు కడతేఱఁగా, నరసరాజు సింహాసన మెక్కెను. కవీశులు నంది మల్లయ్య ఘంటసింగయ్య. భార్యలు తిప్పాంబ, నాగలాంబ, ఓబాంబ. ఈముగ్వురియందును క్రమముగా వీరనరసింహారాయలు, కృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలు జన్మించిరి. ఓబాంబకు సదాశివరాయలను రెండవకొడుకుఁగూడఁగల్గెను. వీరనరసింహారాయలు 1509 వఱకుఁ బాలించెను. తిమ్మరసు సహాయముచేఁ గృష్ణదేవరాయలు (ఆంధ్రభోజుఁడు) 1509లో రాజ్యాభిషిక్తుఁ డయ్యెను. 1512, 1513 సంవత్సరములలో నితని దక్షిణదిగ్విజయయాత్ర ముగిసినది. శివసముద్రము, ఉమ్మటూరు, శ్రీరంగపట్టణము, కొడగు, మళయాళము, చిత్తూరుమున్నగునవివశమైనవి. దక్షిణదేశమునుమూఁడుభాగములుచేసి నెల్లూరు మొదలు కొల్లడంవఱకు జింజిలోని కృష్ణప్పనాయకుఁడును కావేరిభాగమును, తంజావూరిలో నుండి విజయరాఘవనాయకుఁడును, తిరునల్వేలిప్రాంతమునకు వెంకప్పనాయఁకుఁడును అధికారులుగ నియమితులైరి. కొందఱు తెలుఁగు రెడ్లు, బ్రాహ్మణులు ఆదేశమున కాకాలమునపోయిరి. 1513-1515 సం॥ లలోఁ బూర్వదిగ్విజయయాత్ర ముగిసినది. ఉదయగిరి, కొండవీడుదుర్గములు వశము లయ్యెను. గజపతుల ప్రాబల్యము మంటిలోఁ గలసినది. వేఁగిమండలమును జయించి, కటకమును గాల్చి, సింహాచలములో జయస్తంభము

నాటి వెనుదిరిగెను. ఇప్పుడే శ్రీకాకుళక్షేత్రమూర్తిని దర్శించి యాముక్తమాల్యదకు సంకల్పించెను. తర్వాత నైదేండ్లు యుద్ధయాత్రాప్రసంగము లేక విద్యావినోదసామ్రాజ్యములో, పండితగోష్ఠిలో రాయలు కాలము గడపెను. 1520లో కావ్యాకర్ణనము, రచనముఁ జాలించి రాయచూరు దండయాత్రకు వెడలెను; దానిని జయించెను. కలబరిగిని ధ్వంసము చేసెను. బీజపురమును గొల్లగొట్టెను. బహమనీరాజపుత్రులను జెఱవిడిపించి, అందొకనికిఁ బోయిన రాజ్యము నిప్పించెను. దీనితో దక్షిణభారతసామ్రాజ్యము సుస్థిరమై శ్రీకృష్ణరాయల కీర్తి దిగంతవిశ్రాంతమైనది. ఆంధ్రభాష కితనిదినములు శుభోన్నతదినములు. హజార రామస్వామిగుడి మొదలగు వానిలో నీతనిక్రింద శిల్ప మెంత వృద్ధిపొందినదియుఁ దెల్లమగుచున్నది. ఇతఁ డపజయ మెఱుంగఁడు. విద్యానగరము నగరరాజమై తనరినది. ఇతఁడు విష్ణుభక్తాగ్రేసరుఁడు. [1]ఇతని పూర్వులును నట్టివారే. కృష్ణరాయలకు భార్యలు ముప్వురు: చిన్నాంబ; అన్నపూర్ణాదేవి [2]కటకరాజుకూఁతురు; శ్రీరంగపట్టణాధిపతి కూఁతురు తిరుమలదేవి. ఇతనికి ఒకకొడుకు పుట్టి చనిపోయెను. తిరుమలాంబ యనుకూఁతురు పుట్టెను. ఆమె మగఁడే యళియరామరాజు. రామరాజు తమ్ముఁడగు తిరుమలరాజు కృష్ణరాయల ఇంకొక పుత్రికయగు తిరువేంగళాంబను పెండ్లాడెను. రాయలకు పరమత

---

1 విద్యానగరరాజుల మతము. 16-వ సంవత్సరాది సంచిక.

2 విదుషీమణియగు తుక్కాదేవి యెవరు! మరీచిపరిణయకవయిత్రి మోహనాంగి రాయలకూఁతు రండ్రు. సత్యమేనా!

ద్వేషము లేదు. 1527 లోఁ దిమ్మరుసు శత్రువుల కుట్రలచే మనస్సు చెడి, రాయలచే కారాగృహమం దుంపఁబడి చనిపోయెను. ఈ యొక్క విషాదవృత్తాంతము రాయలకీర్తి చంద్రున కుండు కళంకము. రాయలు మరల విజాపురముపై 1539 లో దాడివెడల నుంకించుచుండఁగా కాలఖడ్గము రాయల నిహలోకమునుండి వేఱు చేసినది.

ఇంతవఱకు చెఱలోనున్న రాయలతమ్ముఁడు, అచ్యుత దేవరాయలు రాజయ్యెను. బావమఱఁదుల మాటలు విని, మంత్రుల నిరాకరించి యవమానకరముగా నబాబులతో సంధిచేసికొన్నాఁడు. దానములు మాత్ర మెక్కువగాఁ జేసెను. ఇతనికాలమునఁ గొండవీటిలో రామయామాత్య భాస్కరమంత్రి సుప్రసిద్ధుఁడుగ నుండెను. కృష్ణదేవరాయలు గడించిన సామ్రాజ్యముతోఁ, దద్ధనముతో భోగము లనుభవించెను. రెండువందల ప్రభువులకు రాజ్యము పంపకమై యుండెను. సలకము తిమ్మయయను (రాయలభార్య వరదాంబి కకుఁ దండ్రి) మామ యితనికిఁ బ్రధానమంత్రి ప్రాయుఁడు. అచ్యుతరాయలు 1542 లో గతించెను. అచ్యుతరాయల కొడుకు వేంకటరాయులు బాలుఁడు రాజయ్యెను. సలకము తిమ్మయ యాబాలునిఁ జంపి తానే రాజయ్యెను. ఇతనిపై సర్దారులు తిరుగుబాటుచేయఁగా నితఁడు రాజభవనములోని యమూల్యవస్తువులను నాశనముచేసి యాత్మహత్యఁ గావించి కొనెను. అంతట నా 1542 లోనే అళియరామరాజు సదాశివరాయలను రాజ్యాభిషిక్తునిఁ జేసెను. కాని పేరునకు మాత్రమే. నిజముగా రామరాజే పాలకుఁడు. [రామరాజునకు

ముత్తాత యార్వీటి బుక్కరాజు, సాళువ నృసింహునకుఁ గుడిభుజము. అతనికి అబ్బలదేవియందుఁ బుట్టినకొడుకులు నంద్యాల సంస్థానమునకు రాజులైరి. బల్లాదేవి తనయులు కందనోలు (కర్నూలు)న కధిపులైరి. బల్లాదేవి వంశములోని వాఁ డీరామరాజు; కళాపూర్ణోదయకృతిభర్త అబ్బలదేవి వంశములోని కృష్ణరాజు] రామరాజు "దక్షిణములోని నబాబులను దిద్దిమ్మని జంత్రపుఁబొమ్మలవలె నాడించిన మహానుభావుఁడు. అతనివలన విజయనగరవైభవలక్ష్మి మహోన్నతదశ కెక్కి యతనితో నశించెను." భామినీసామ్రాజ్యము 1518 లో నాల్గు చీలికలై విజాపురము, అహమ్మదునగరు, గోలుకొండ, బేదరురాజ్యము లనఁ బరగినది. బేదరు తప్పఁ దక్కినరాజ్యములవారినందఱను రామరాజోడించి యుండెను. పోర్చుగీసువారితో సంధిచేసికొని 1547 లోఁ గట్టుదిట్టములు చేసెను. గోలకొండనుండి అభయము వేఁడివచ్చిన ఇబ్రహీము నకు రక్షణ మొసంగెను. ఈయిబ్రహీము 1550 లో గోల్కొండకు నబాబయ్యెను. విజాపురపు అదిల్షాహితోఁ బోరాడి కృష్ణా తుంగభద్రల యంతర్వేదిని గెల్చెను. 1551 లో రామరాజు తమ్ములు తిరుగుబాటుచేసినను విజితులై క్షమింపఁబడిరి. ఇబ్రహీం అదిల్షాహ 1553 లో చావఁగా నతనికొడుకు అలీ అదిల్షాహ రామరాజునకు "దత్తపుత్త్రుఁడ" నని చెప్పి కొని అతనికి మిత్త్రుఁ డయ్యెను. విజయగర్వోన్మత్తుఁడై రామరాజు తురుష్కరాయబారుల నవమానించెను. నబాబుల దుర్గముల నొక్కటొక్కటిగాఁ దీసికొనఁ జొచ్చెను ఇంతలో నిజాము, విజాపురనబాబులు వివాహసంబంధముచే మిత్త్రులైరి.

నల్లుర్గు నబాబులు నొక్కచోఁ జేరిరి; రామరాజు మీఁదికి దండెత్తిరి. అందఱకును నొప్పిగల్గిన నూరకుందురా? రామరాజు అప్పుడు 96 ఏండ్లవాఁడు. 1565 లో నతిభయంకరమైన తాళికోటమహాయుద్ధము కృష్ణ కుపనదియగు ద్రోణనదియొడ్డున జరిగినది. యుద్ధసైనికుల కుత్సాహ మిచ్చుటకు మేనాలోఁ బోవుచున్న రామరాజు చెఱఁబెట్టఁబడి తనచేఁ బోషింపఁబడిన నిజాము నబాబుచేఁ దలత్రుంపఁబడియెను. "దత్తపుత్త్రుఁడ" నని నమ్మకముఁ జూపుచు వచ్చిన తంత్రవేదియగు విజాపుర సుల్తానే యింతచేటుఁ గూర్చెను. రాజ్యతంత్రములలోఁ బ్రమత్తతయు,విశ్వాసమును బనికివచ్చునా? తిరుమలరాయఁడు పాఱిపోయి విద్యానగరసంపత్తిని సదాశివరాయలను వెంటఁ గొని పెనుగొండకుఁ జేరెను. దిక్కులేని విజయనగరము కొల్లఁగొట్టఁబడెను. ప్రపంచచరిత్రములో మహావిఖ్యాతములైన నాంధ్రనగరరాజము లోరుగల్లు,విద్యానగరము పాడుపడినవి [1]హాయి! హాయి! విద్యానగరము కడకు మానిసియే లేక యడవిజంతువులకు వాసముగా నేర్పడినది. కాలగతి యనుల్లంఘనీయము!

జీర్ణవిద్యానగరసామ్రాజ్యశకలములలోనుండి, బెద్నూర్, మైసూరు, మధుర, తంజావూరు మున్నగు సామంతరాజ్యములు తలలెత్తినవి. తిరుమల దేవరాయలవంశజులు కొన్ని యేండ్లు చంద్రగిరిలో రాజ్యముఁ జేసిరి. 1636 లో చెన్నపట్టణాము ఆరాజులకడనుండి "ఈస్టు ఇండియాకంపెనీ"చే కొనఁ

1 మాతృసేవలోఁ బ్రచురింపఁబడిన "విస్మృతసామ్రాజ్య"మను గీతమాలికను జదువుఁడు.

బడినది. "ఈ యీస్టుఇండియాకంపెని" బ్రిటీషుసామ్రాజ్య భానుఁ డుదయించుటకు ముందుఁ దోఁతెంచిన బ్రిటీషు సామ్రాజ్యప్రభాతము.

రామరాజుచేఁ బోషింపఁబడి నబాబుచేయఁబడి, రామరాజునే తలత్రుంచిన ఇబ్రహీంకుతుబ్‌షా 1550- 1580 సంవత్సరములలో రాజ్యముచేసి రాజ్యనీతిచే నిందకు నించుకపాలైనను మంచిపాలకుఁడని పేరొందెను. విద్వాంసుఁడు కాననే యాంధ్రకవులను బోషించెను. విజయనగరవాసకాలములో నితనికి తెనుఁగుభాష వచ్చినదేమో! ఇతనికి వాఙ్మయములో మల్కిభరాముఁ డని నామము. విజయనగర సామ్రాజ్యపుసామంతులు కొంద ఱీతనికి సామంతులైరి. "ఇభరాం" మనుమఁడగు అబ్దుల్లాహుసేను కుతుబ్‌షా కాలము (1611-1658) లో గోలకొండరాజ్యము మీర్‌జుమ్లా దౌష్ట్యముచే మొఘలులకు లొంగిపోయెను. ఔరంగజేబు 1658 లో మొఘలు సామ్రాజ్యాభిషిక్తుఁ డయ్యెను.

1600 లోనే అహమ్మదునగరము జయింపఁబడియుండెను. 1656లో బేదరురాజ్యము మొఘులులకు లొంగిపోయినది; కాఁబట్టి మిగిలినవి గోల్కొండ బీజాపురమహమ్మదీయ రాజ్యములు; దక్షిణములోని చిన్న చిన్న హిందూరాజ్యములు. ఈచిన్నరాజ్యములలో పాండ్యరాజ్య మొకటి. [1] శ్రీకృష్ణరాయల యాజ్ఞానుసారము నాగమనాయఁకుఁడు పాండ్యరాజు శత్రు

---

1 ఆంధ్రపత్రికాసారస్వతానుబంధము (7-4-1926 సం.) దుర్మతినామ సం. మార్గశిర బ. 3) ను జూడుఁడు. శ్రీ వావిళ్లఅప్పాసామినాయఁడుగారి. కట్టి సత్యరాజుగారి వ్యాసములు.

వుల నడంచుటకు గాసుపోయి తానే సింహాసనము నాక్రమించు కొనఁగా నీతనిపై నాతని కుమారుని విశ్వనాథనాయకునిఁ బంపెననియు, విశ్వనాథనాయకుని రాజభక్తికి మెచ్చి యతనిని మూర్ధాభిషిక్తునిఁ జేసెననియు, నాతనివంశములోని వాఁడైన తిరుమలనాయకుఁడు 1623 నుండి 1658 వఱకును బాలించె ననియు, ఆతిరుమలనాయకుఁడు మీనాక్షీ నటరాజాదుల కోవెలలఁ గట్టించెననియుఁ జెప్పుదురు. అచ్యుతరాయులకాల ములో నతనికిఁ దోడియల్లుఁడైన చెవ్వరాజు తంజావూరికిఁ బాలకుఁ డయ్యెను. ఈచెవ్వరాజునకే చెవ్వప్పనాయఁ డని పేరు. ఈతనికిఅచ్యుతరాయల మఱఁదలగు మూర్తమాంబనిచ్చి వివాహము చేయఁబడెను. అచ్యుతరాయలే ఈవివాహమునకు కారకుఁడు. అందుచేత తన స్వాధీనమున నున్న చోళదేశమును మూర్తమాంబకు స్త్రీధనముగ నిచ్చివేసెను. పై నుదహరించిన నాగమనాయఁకుఁడును, ఈచెవ్వప్పనాయఁకుఁడును దక్షిణదేశ మందలి నాయఁకరాజులకు మూలపురుషులు. కొంతకాలము వఱకు అఱవపాండ్యరాజులకును ఈనాయఁకరాజులకును పోరా టములు కలుగుచునే యుండినవి. కాన నీనాయఁకరాజులు అచిర కాలముననే చోళపాండ్యరాజ్యములలో నాంధ్రపతాకమును స్థిరముగా నెగురునట్లు చేయఁగలిగిరి. ఇంతియకాక వీరు మళ యాళము, సింహళము మున్నగుదేశములను జయించి బలిష్ఠులయి రాజ్యముల నేలఁగల్గిరి. ఇప్పటినుండి ఆంధ్రులవెల్గు దక్షిణమునఁ బ్రకాశింపఁ దొడంగినది. ఈనాయఁకరాజుల వెంబడించి ఆంధ్రతంత్రజ్ఞులగు నియోగులు, ద్రావిడసం పర్కము లేకుండఁ జేయుటకు పురోహితులు, ధర్మశాస్త్ర

వేత్తలు, అపూర్వాంధ్రకవిత్వ రచనాకౌశల్యమును జూపఁగల కవీశ్వరులు, వీరు వా రన నక్కరలేక తండోపతండములుగ నన్ని జాతులవారును ఆంధ్రదేశమునుండి ద్రవిడదేశమును జొచ్చిరి. ఆంధ్రవనిత అంత్యకాలమునఁ బోషింపఁబడిన దిచటనే. నాయఁకరాజులకాలమున నాంధ్రమహాకవు లెందఱో యుద్భవించి యాంధ్రవాణికి పూలసొనలు కానుక లిచ్చుచు చుండిరి. ఈకాలమున వాఙ్మయము సువాసనల నీనుచు, దేశ మంతటను సుగంధమును వెదచల్లుచుండెను. ఆకాలమున వెల్వడిన గ్రంథములలోఁ గొన్నిటి నిం దుదాహరించుచు న్నాను. ౧. సంగీతసుధ, ౨. రుక్మిణీపరిణయము, ౩. రఘునాథ భూపవిజయము మున్నగు సంస్కృతగ్రంథములును, ౧. విజయవిలాసము, ౨. సారంగధరచరిత్ర, ౩. వాల్మీకిచరిత్ర, ౪. రామాయణము, ౫. నైషధపారిజాతీయ మను ద్వ్యర్థి కావ్యము, ౬. మన్నారుదాసవిలాసము, ౭. రఘునాథాభ్యు దయము, ౮. రాజగోపాలవిలాసము, ౯. ఉషాపరిణయము, ౧౦. విప్రనారాయణచరిత్రము, ౧౧. సత్యభామాసాం త్వనము, ౧౨. శశాంకవిజయము, ౧౩. ఆంధ్రభాషార్ణవ మను నిఘంటువు మున్నగు తండోపతండములగు నాంధ్రగ్రంథము లును. ఈయాంధ్రనాయఁకరాజులే తంజావూరిలో సరస్వతీ మహాలను గ్రంథాలయనిర్మాణకర్తలు. ఆమహాఖనిలో నుండి రత్నముల నేరలేక విద్వాంసులు కష్టించుచున్నారు.

చెవ్వప్పనాయని మనుమఁడగు రఘునాథ [illegible] నాదరించెను. (1674 లో రఘునాథరాయఁ [illegible] విజయరాఘవరాజు పాండ్యాధీశ చొక్కలింగనాయకునిచే

నిహతుఁ డయ్యెను.) మధురరాజులవిషయము తర్వాతి దగుట వలన నీయుగపరిమితిని 1650 వఱకు నని నిర్ణయించుకొని యుండుట నింతకుఁ జాలింతము. (విజయవిలాసము 1640 ప్రాంతమున రచింపఁబడినదై యుండ నగును గాన నతఁడే ఈయుగపు తుదికవి యగుచున్నాఁడు.)

---

## ౨. వా ఙ్మ య చ రి త్ర

ఈప్రబంధయుగము నూటయేఁబదియేండ్లు సెగడినది. కాలమును బట్టి మొదటిభాగమునకు శ్రీకృష్ణదేవరాయలు, అల్లసాని పెద్దన్న, పిడుపర్తిసోమనాథుఁడు, నంది (ముక్కు) తిమ్మన్న, ధూర్జటి, మాదయగారి మల్లన్న, తాళ్ళపాక చిన్నన్న, ఆయ్యలరాజు రామభద్రుఁడు, సంకుసాల నృసింహకవి, వెల్లంకి తాతంభట్టు మున్నగువారును, మధ్యభాగమునకు పింగళిసూరన, రామరాజభూషణుఁడు, కుమార ధూర్జటి, అందుగుల వెంకయ్య, కోట శివరామయ్య, కుమ్మర మొల్ల, కంసాలి రుద్రయ్య, దోనేరు కోనేరు నాథకవి, అద్దంకి గంగాధరకవి, పొన్నగంటి తెలగన్న, పిడుపర్తి బసవకవి, తాళ్ళపాక తిరువేంగళనాథుఁడు, తిమ్మరాజు, తెనాలి రామకృష్ణుఁడు (రామలింగకవి), మట్ల అనంతభూపాలుఁడు, కొఱ్ఱపాటి కర్త యెఱ్ఱన, రామరాజు రంగపరాజు, మల్లారెడ్డి, తెనాలి అన్నయ్య, చిన్న నారాయణనాయఁకుఁడు, బైచరాజు వేంకటనాథకవి యనువారును, తృతీయభాగమునకు రాయసము వేంకటపతి, తరిగొప్పుల మల్లన, చరిగొండ ధర్మన, సారంగు తమ్మకవి, ఎలకూచి బాలసరస్వతి, దామెర వేంకటపతి, రాజలింగకవి, చెన్నమరాజు, చిత్రకవి పెద్దన్న, చిత్రకవి అనంతకవి, చిత్రకవిరమణకవి, శంకరకవి, వీరశరభకవి, లింగముగుంట తిమ్మన్న, సింహాద్రి వేంకటాచార్యుఁడు, ముద్దరాజు

రామన్న, భాస్కరపంతులు, లింగముగుంట రామకవి, యాదవామాత్యకవి, వెలఁగపూఁడి వెంగనార్యుఁడు, రెంటూరి రంగరాజు, చేమకూరి వేంకటకవి, వేమనయోగి యనువారుఁ జేరుదురు.

ఈ యుగములో 'పురాణవిపులకావ్యములు లేవు. ప్రబంధములు, లక్షణగ్రంథములు, ద్విపదలు, శతకములు, కావ్యములు నను నాలుభాగము లుగా వాఙ్మయమును విభజింప నగును. కాని, కావ్యములు గూడ ప్రబంధ వర్ణనామయములగుట వానిని లేవని చెప్పవలయునేమో! ప్రబంధములలో వైష్ణవములనియు, సామాన్యము లనియును, కావ్యములలో శైవములనియుం అచ్చతెనుఁగులనియు, వైష్ణవములనియు, సాధారణములనియు, విభజింప నగు. వైష్ణవప్రబంధములకు శ్రీకృష్ణదేవరాయలు, వేంకటాచార్యుఁడు, సారంగుతమ్మయ్య యనువారును, శైవకావ్యములకు పిడుపర్తి సోమ నాథుఁడు, పిడుపర్తి బసవయ్య, ధూర్జటి, రాజలింగకవి, రమణకవి యను వారలును, వైష్ణవకావ్యములకు తిరువేంగళనాథుఁడు, తిమ్మరాజు, మొల్ల, కోనేరునాథకవి, రామకృష్ణుఁడు మున్నగువారును, అచ్చతెనుఁగునకు పొన్న కంటి తెలగన్నయు, శతక కవితకు ధూర్జటియు, వేమనయుం, తక్కినవారు సామాన్యప్రబంధములకును జేరుదురు. వెల్లంకి తాతంబట్టు, లింగమగుంట తిమ్మన, యాదవామాత్యుఁడు, ముద్దరాజురామన్న మున్నగువారు లక్షణ గ్రంథములను వ్రాసిరి. పింగళి సూరన్న, ఎలకూచి బాలసరస్వతి, ద్వ్యర్థి కావ్యముల రచించిరి. ద్విపదకు చిన్నన్న ప్రసిద్ధుఁడు. ఇఁక లక్షణశాస్త్ర కవులు, ప్రబంధకవులు, కావ్యకవులని విడఁదీసి చర్చింతము.

మొదట ప్రబంధముల చవి చూతము. ప్రబంధవర్ణనలు "పుర, ఓవహ సింధు, నగ, ర్త్విన (ఋతు+ఇన), శశి, సరసీ, వన, మధు, రతిప్రసంగ, విరహ ముల్, పరిణయ, తనయోదయ, నయవిరచన, యా, త్రాజి, దౌత్య, విభువర్ణ నముల్" అని యెల్లఱుఁ దెల్లమే. ఇవియన్నియుఁ గలవి మూఁడు ముఖ్య ములైనవి. ఆముక్తమాల్యద, కవికర్ణరసాయనము, వసుచరిత్రము అని పేర్ల

నుడువ నవసరములేదు. [1]కృష్ణదేవరాయ లాముక్తమాల్యదకుఁ గర్త. ప్రజాభిరుచి యాకాలమునకు సాంఘికాధిపతిగనున్న వానియభిప్రాయములను ప్రతిబింబించుట తప్పదు. అవి పరంపరాగతములు. ప్రబంధరీతులు పూర్వయుగమునందే ప్రతిధ్వనించినవన్న మాట. వానిని రాయలనుసరించి స్థాపింపఁగా నితరులవలంబించిరి. (భారతమునకు సారాయణభట్టును, ఉత్తరరామాయణమునకు తిమ్మనయు, రంగనాథరామాయణమునకు రంగనాథుఁడును సహాయపడినటులే, విష్ణుచిత్తీయ మను నీ యాముక్తమాల్యదకు పెద్దన సహాయపడినాఁడు. వీనిని మిశ్రకర్తృకము లనియు, నిరువురు గలసి రచించి రనియన్నను దోషములేదు. ఏలననిన, వారిసహాయ మచ్చువేయునప్పుడు పరిష్కరించునటువంటిది గాదు. సందర్భశుద్ధికి, రసౌచితికిఁ దగినట్లు పద్యముల నే సంస్కరించుట యైనది. ఈ పద్యసంస్కరణము మొదట చేసినవానికన్న నెక్కుడుకష్టమన్న సాహసోక్తిగాదని తజ్ జ్ఞు లెఱుంగుదురు. కాన, వారే వీరుకాదను వాదములకన్న నిర్వురది యనుట సత్యసమీపము సమంజసము నగును. క్రీడాభిరామమునిట్టి గ్రంథకోటిలోఁ జేరినదనియే యెంచియుంటిమి.) వైష్ణవమతప్రవిష్టుఁడు, యోధుఁడు, నీతినిపుణుఁడు, "కవితా ప్రావీణ్యఫణీశుఁడు," విద్వాంసుఁడు నగు రాయ లాగ్రంథమున నెక్కుడఁ జూచినఁ గానఁబడుచున్నాఁడు. [2]

---

1 "A Neglected Emperor Poet— శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, యం. ఏ.

2 రాయలు వ్రాయనేలేదని శ్రీవిద్వాన్ K. శివకామేశ్వరరావు ప్రభృతులు రాయలే వ్రాసెనని శ్రీరామమూర్తి ప్రభృతులు నందురు. (ఆముక్తమాల్యదలోని పీఠిక, కవిజీవితములు, దుందుభి జ్యేష్ఠ బ. ౧. సారస్వతానుబంధము, ఆంధ్రసాహిత్య పరిషత్సంపుటములు చూడుఁడు.

"The imaginative pictures rising to etherial heights, the peculiar terse, style, the liberty and vigour of expression, the keen observation of country life and scenes, all of these placed most eloquently for Krishna Devaroya."

ఆముక్తమాల్యదలో వర్ణన లొక్కటియును, పెద్దననుండి స్వకీయముగా నుద్భవించినది కాదని నిరాటంకముగాఁ బ్రతి పాఠకుఁడును చెప్పితీరును. వస్తువు వైష్ణవభక్తుని కథ. మధురను మత్స్యధ్వజుఁడను రాజు పాలించెను. ఆతనికినాగవాసమునకుఁ బోవు టలవాటు. ఒక విప్రభక్తుఁ డాయూర నొక పురోహితునింటియరుగుపై (సుందరబాహుస్వామి తెప్పతిరునాళ్లకై వచ్చి యుండి సంధ్యానంతరము) పరుండి రాత్రికై పగటును, వార్ధక్యమునకై యౌవనమునను; క్రొత్తలోకమునకై యీలోకమునను సామగ్రి సిద్ధపఱచు కొనవలయునని యనుచుండెను. దానిని వేశ్యాగృహంబున కరుగుచుండినరాజు విని, వైరాగ్యముగల్గి విప్రుని సన్మానించి, వెనుదిరిగి, ప్రొద్దుననే యేమత ముత్కృష్టమని సభ చేసెను. శ్రీవిల్లుబుత్తూరు శ్రీమన్నారుకృష్ణుఁడు తన యంతరంగభక్తుఁడగు విష్ణుచిత్తుని ప్రేరేపించి పంపెను. ఆభక్తుఁడు వాదములో నితరుల గెల్చి విశిష్టాద్వైత మతస్థాపనఁ జేసెను. తరువాత నతఁడు ఖాండిక్యకేశిధ్వజసంవాదమును జెప్పి యష్టాక్షరి నుపదేశించెను. వాదము సత్యమని నిర్ణయించుటకై పైనఁగట్టియుండినబంగారుముల్లె క్రింద బడి నది. రాజు శిష్యుఁడై విష్ణుచిత్తుని, సామంతులను బంపెను. మధ్యమార్గంబున దేవుఁ డతనికి సాక్షాత్కరించెను. పిదప నతండు విల్లుబుత్తూరిలో హరిని సేవించుచుండ నా భగవంతుండు ప్రసన్నుఁడై లక్ష్మి కితండు యామునాచార్యునంతటి వాఁడని యామునాచార్య కథ నేకరువుఁ బెట్టెను. ఒకనాఁడు విష్ణుచిత్తునికి కమలసరస్సుచెంగట శిశువు గన్పడ, దానిని సాకతము చేసెను. ఆకన్య యెదుగుచు విష్ణుని మోహించె. ఆమె నవయౌటఁ జూచి విష్ణుచిత్తుఁడు ప్రార్థింపఁగా హరి యామె, భూదేవి యనియు, నామెను శ్రీరంగేశున

కిమ్మనియు నుడివెను. వల్లెయని యాతఁడు శ్రీరంగమునకుఁ బోఁగా రంగేశుఁ డామెను దనలో నైక్యమొనర్చుకొనియె. తర్వాత నది తెలిసి, విష్ణుచిత్తుఁడు వారిని చీవాట్లు పెట్టగా, బ్రహ్మరుద్రులు వారిభార్యలు వివాహార్థము విష్ణుని పృచ్ఛింపఁగా, రంగేశుఁ డంగీకరించి శ్రీవిల్లిబుత్తూరిలో యథాపూర్వముగా విష్ణుచిత్తు నిల్లుచేరియున్న యాముక్తమాల్యదనుఁ బెండ్లాడెను. ఈకథ నొక మహాప్రబంధముగా రాయలు నిర్మించెనుగాని, యామునాచార్యచరిత్రాదులు సంవాదములు, రసపుష్టి కంతగా నవసరము గాదంద్రు. ఆముక్తమాల్యదాశీలము పూర్ణముగా నిరూపితముగాలేదు. పాత్రము లనితరతుల్యములుగా నుండుట కళావేత్తకు లక్షణమనియు, జీవకళ చలనముగాన, వికృతిలేని పాత్రములు జడసమానము లనియు విజ్ఞులు సెప్పుదురు. అట్టి విశేషములను రాయలు ప్రదర్శింపలేదు. విష్ణుచిత్తునకు మన్మథాటోపమే తెలియదు. "మిశ్రచరిత్రలుగాని పాత్రములు ప్రకృతివిరుద్ధము" లనుట నిజము. ఇవన్నియు నరసిన పాత్ర ప్రవృత్తి పరిణామచిత్రములను రాయ లంతగాఁ జూపలేదనవలెను. కావున వర్ణనాంశముల విమర్శింతము. 1. స్వభావోక్తినీతఁడు చక్కఁగఁ బోషించెను. శ్రీవిల్లిబుత్తూరు ప్రథమసందర్శనము, పుష్పసంయుత జలకుంభములఁ గొనిపోవు తమిళస్త్రీలు, చేఁపలఁబట్టుట, పచ్చని కేదారములు, పల్లెటూరి కన్నెల పరిహాసములు, ప్రాఁచికప్పిన ప్రాఁతకొలఁకులు, కోవెల జింకలు, తక్కిన వెన్నియేని స్వభావ మధురముగా వర్ణింపఁబడినవి. పంచకావ్యకవులలో నీతఁ డీవిషయమున నితరులకన్న మిన్నయేమో? ఇంటియాపేక్షము లెంత స్పష్టముగ వర్ణితము లైనవి? విశ్రమాలయములో నుబుసుపోకకై మాటలాడుకొనుతీరుగూడ రాయల తీక్ష్ణవీక్షణములకుఁ దప్పిపోలేదు. నాల్గయిదుపద్యములలో మాత్రమే శ్లేష గాన్పించుచున్నది. ఉత్ప్రేక్షయుఁ గొంచె మధికముగనె యున్నది. 2. స్వభావోక్తి తర్వాత రాజనీతినిఁ జేర్కొనవలయును. రాజునకు ధర్మము ముఖ్యము. చాడీకోరులపల్కులకు చెవియొగ్గకూడదు. మంత్రి వయోవృద్ధుఁడును, అనుభవజ్ఞుఁడును, బ్రాహ్మణుఁడును

గావలయును. 'చీలఁదీసి పాలింపుము' (Divide and Rule) అనునీతి నతఁడు నిరూపించినాఁడు. 3. రాయలు సూచించిన మతము విశిష్టాద్వైతము. ప్రేమయే సత్యము. మొత్తముపైన జానపదజీవితము నితఁడు చక్కఁగ చిత్రించె నన చ్చును. 4. శైలినారికేళపాకమున రాజసముతో మెఱయుచున్నది. పదసరణి రాయలప్రత్యేకత్వముం జూపుచున్నది. ౧ చేష్టుడిగె, ౨ రంగధర్తంచు, 3 నిట్టతాడువంటితివ, ౪ చించిచ్చు, ౫ గంజిండ్లు, ౬ పట్టుక, ౭ పుట్టునీఁగెద, ౮ నింగిటు మొదలగు సంధిదోషములును, శ్రుతికటువులగు "కఱకిసరు", "హిండితములు" మున్నగుపదములును, "ఆత్థావాగ్విభవ మ్మహో......" మున్నగు పాండిత్యప్రకర్షయును పొసఁగియున్నను, శైలి విషయమునకును, కవికిని జతపడి గంభీరముగా నున్నదన వచ్చును. చూడుఁడు: గంభీరమై ప్రత్యేకతను జాటుట, వర్ణనాచితితో నొక్కొక్కచోట మధు రముగా నగుచు మఱొక్కచో కఠినమై రాజనీతివలె మనోహరవక్రతలు గల యితనికవిత యేమనుచున్నది?

> "శయపూజాంబుజముల్ ఘటిందడఁబడన్ జన్గోయి లేఁగౌనుపై
> దయఁ దప్పన్ బసపాడి, పాఁగడపుఁబాదం బొప్పఁ జెంగల్వడి
> గ్గియనీ రచ్యుతమజ్జనార్థము గటిం గీలించి దివ్యప్రబం
> ధయుగాస్యల్ ద్రవిడాంగనల్నడతు రుద్యానంబులో త్రోవలన్."

ఇట్టి ద్రవిడాంగనలఁ దవిలి మన మనశ్చక్షువులు పఱుగిడుచున్నవి గాని, పెద్దన యిట్టిదృశ్యము నొకండేని జూచెనా? చుయ్యంకె, బారాసి విళంగాయలు, ఆవిరెగయ, పెరంజు, వింగడము దివెదాకొమ్ము మున్నగు న ప్రయోగము లేవియైన పెద్దనచేసెనా? వృథా పెద్దన గ్రంథకర్తగాఁ జేయం టయా? తగదు. మాంసము రుచి రాయలకుఁ దెలిసినట్లు బ్రాహ్మణునకుఁ దె యదనుట సహజమే. కావ్యాత్మయనఁదగుశైలి కొండంత భేదముఁ జూ చుండఁగా నేమని రాయలకర్తృత్వమును నిరాకరించెదరు? రాజకంఠీరవుండు

శ్రీకృష్ణదేవరాయలకీర్తి గ్రంథకర్తగను, కృతిభర్తగను, సామ్రాజ్యప్రణేతగను జగద్విదితమైనది. లేనిపాదముతో వృథపుచ్చక కఠినపదాళి యను చిప్పను బగులఁగొట్టి, వర్ణనయను పచ్చికొబ్బెరనుఁ దిని, భావసలిలములను గ్రోలి, యారాజపరమేశ్వరుని యాత్మకు శాంతిఁజేకూర్చి, తత్కావ్యాలాప సమాకర్ణనమున మనకృతజ్ఞతను జూపి ధన్యులమగుదుము గాక! ఉభయభాషా పాండితి, అలంకారసమృద్ధి, దేశీయములగు పదములు, అర్థగాంభీర్యముతో మేళగించిన కఠినశైలి, అపూర్వములైన యతులు, స్వకపోలకల్పితకథాసంవిధానము, దూరాలోచనీయములగు నుద్దేశములు వస్తువర్ణనల రెంటినిఁబట్టి నూతనపథము, మతశాస్త్రవిజ్ఞానము గుణములుగాఁ గల్గి, రాయలప్రబంధము తాత్కాలికనాగరకతను ప్రతిఫలించుచుఁ బంచకావ్యముల నొక్కటియై మనకు మాననీయమైనది.

ఆముక్తమాల్యద చూపిన వర్ణనాధిక్యము విపరీతవైపుల్యము నందినది, కవికర్ణరసాయనములో, ఇది మాంధాతృచరిత్రమును చెప్పినది. ప్రథమాశ్వాసములో స్తుతులు, కృతిదూషణ, సాకేతపురీద్విజవేశ్యాపుష్పలావికా పౌరవిలాసినీ గంధవహయువనాశ్వవర్ణనలు, మాంధాతృజననరాజ్యాభిషేకములుగడచినవి. రాజనీతివివరము, యువనాశ్వముని వృత్తి, మాంధాతృపాలన, శరత్కాల దిగ్విజయములు, స్వర్గముపైదాడి, రావణునితోఁడి యుద్ధము, విజయానంతరము మందరగిర్యుపరిజయధ్వజస్థాపనము, రెండవయాశ్వాసమునఁ జెల్లిపోయినది. చిత్రకారులరాక, కుంతల పలితనయవిమలాంగి యౌవనము, పరస్పరగుణాకర్ణనమున మాంధాతృ విమలాంగుల విరహతాపము, దౌత్యము, వివాహము, నవోఢాసంగమ వర్ణనములు తృతీయాశ్వాసమునం ఘటిల్లినవి. వసంతర్తు వర్ణన, జలక్రీడా సూర్యాస్తమయోదయ, చంద్రికా, సాంధ్యాంధకార, విట, విటీ, వార వనితా, యువతీ, శృంగార కేళీ, మధుపానవర్ణనములు, చతుర్థమున గడచినవి. వసిష్ఠాదిఋష్యాగమన

పూర్వజన్మస్మృతి, వేదాంత, భక్తి, యోగ, మోక్షాదికములు పంచమాశ్వాసమునఁ జెల్లిపోయినవి. మాంధాతృని తపస్సు, గ్రీష్మ వర్షా హేమంతర్తు వర్ణనలు, దేవేంద్రకృత తపో భంగప్రయత్నములు, మాంధాతృస్థిరసమాధి వెలయించుట, నారాయణుని దేవతలు సమీపించుట, వైకుంఠవర్ణన, మాంధాతృనకు హరి ప్రత్యక్షమగుటయు, నాఱవయాశ్వాసమున ముగిసినవి. గ్రంథము శ్రీరంగనాథున కర్పింపఁబడినది. కవిప్రతిజ్ఞ యేమనఁగా—

> ''యతి విటుఁడుగాక పోవుటె ట్లస్మదీయ
> కావ్యశృంగారవర్ణ నాకర్ణనమున
> విటుఁడు యతిగాక పోరాదు వెస మదీయ
> కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున.''

అనఁగా యతులను భ్రమపెట్టి మరల వారి నియతియే మంచిదని చెప్పుట యాకవి యుద్దేశమా? కాదు, తాను చేయువర్ణనలు విటుని యతిగను, యతిని విటునిగను జేయఁగల్గినంత రసవంతము లన్నాఁడు. రసవంతములే కాన కవి కృతకృత్యుఁడైనాఁడు. కవి యుద్దేశ్యము నెఱవేరినదా, లేదా, యని కావ్యము విలువను నిర్ణయించుట కొందఱి విమర్శనాపథము. కాని, దానితోఁ గూడ కావ్యకళాసిద్ధి లభించి సమష్టిభావమున వాఙ్మయమున నెట్టిపదవి వచ్చినదియుఁ గనుఁగొనుట తారతమ్య నిర్ణయమునకుఁ జెరువు. కవి ప్రజ్ఞాశాలి. ''ఇతనితో సమానుఁడగు 'ప్రబంధకవి' యాంధ్రములో నున్నట్లుగ చే కానుపింపఁడు.'' అని కవిజీవితకారుని వచనము. అంతియే కాదు. ప్రబంధమునకు పెద్దన, సంకుసాలి నృసింహకవులు, పురాణమునకు నన్నయ తిక్కనవంటివారలనియే. [1]అనఁగా పెద్దనకంటెను మెఱుఁగులు దెచ్చినాఁడు నరసింహకవి యని కావచ్చును.

---

1 కవిజీవితమును, పరిషత్పత్త్రికలో శ్రీ అనంతకృష్ణమాచార్యుల వ్యాసమును జూడుఁడు.

"పరభుక్తము లైనయలం
కరణముల జుగుప్స లేక కైకొని పదవి
స్ఫురణంబు జూపుకుకవితఁ
బరికింపఁగ లజ్జలేని బానిసగాఁదే?"

యని మనుచరిత్రమును గవి వెక్కిరించినాఁడే యందము. "నీరసపుకావ్యాశవముల" నీతఁడు పరిపోషించినాఁడు. సమర్థుఁడే! ఒక్కసారిగా పురవర్ణనమను పేరితో పండ్రెండు దృశ్యములను జిత్రించెను. గ్రంథమున నొట్టుకు 45 విషయములు వర్ణితములైన వనిరి. ఆవర్ణనములును మహాప్రౌఢములైనవి. ఒక చంపకమాలతో బాల్యవర్ణనమును పెద్దన సరిపుచ్చగా నరసింహకవి సీసములు, కందములు వెరసి యాఱుపద్యము లల్లెను. నన్నయ మితవాక్యగాంభీర్యమునకు మున్నీరు. పెద్దన కథోచిత మితవాక్యసరణికి నిధానము. కథపైన పెద్దనకు దృష్టి. నృసింహునకు వర్ణనపైన దృష్టి. ప్రబంధయుగములో నృసింహుఁడు వర్ణనావైపరీత్యమునకుఁ బట్టుఁగొమ్మ. భావప్రౌఢతకు రాయలు పెద్ద. శ్లేషకు భట్టుమూర్తి పెన్నిధి. కథారామణీయకమునకుఁ బెద్దన యాధారము. కల్పనాశక్తికి సూరన్న మిన్న. పదశుద్ధిధారావైలక్షణ్యచమత్కృతులకు రామకృష్ణుఁడు వాసిగన్నవాఁడు. కాన, వీరిలో నధికుని నిర్ణయించుట కష్టము. వస్త్వైక్యము లేదనుటకు పలుకు పదదుకదా మాంధాతృ చరిత్రలో? ఇంక యేది పెద్దనను పెద్దఁజేసినది? కథావైచిత్ర్యమే! ప్రజకెప్పుడును కథపైనప్రీతి. కథకు ముఖ్యములుగాని వర్ణనలు వినుటకు విసుఁగొందుట సామాన్య మానవప్రకృతి. కథాభిరుచికి ఎక్కుడు వర్ణన లెప్పుడును భంగకరములే. ఒక యుదాహరణము: శ్రీరాముల గుణవర్ణనము ప్రత్యేకించి వాల్మీకి చేయలేదు. ఏదో సందర్భము ననుసరించి ఇతరుల స్తుతులే తద్గుణవర్ణనలకు సాధనములైనవి. ఆంజనేయులు సీతమ్మతో రాములగుణవర్ణనఁ జేయుచున్నంతవఱకు వినికిడికింపుగా నుండును. కేవల రామవర్ణన కథను విడఁదీసి చేసిన నంతసొంపు నింపదు. కథలో తదవసరవర్ణన మితముగాఁ జేర్చుట

పతకములోఁ గెంపుఁ బొదిగించుటవంటిది. బంగారు పతకములోని స్థలమును మించి కెంపులు ప్రేలాడఁగట్టిన నాయందము నారీజన మభిలషింపదే? కాన, సందర్భసారస్యము, అర్థగాంభీర్యము, కథాకల్పనాకౌశలముతోపాటు వర్ణనౌచితి, పాత్రప్రకృతి పరిణామనిరూపణము నావశ్యకములు. ఈయైదును రసానుకరణదక్షమగు శైలిలోఁ జేసి దివ్యకావ్యనిర్మాణమున ఫలించును. దీనినిఁబట్టి చూచిన నృసింహకవి గుణదోషములు రెండు నొకేదానియందు ఇమిడియున్నవి కదా? అదియే వర్ణనావైపుల్యము. కథకుని సన్నిధిగాక, కవి కర్ణరసాయనములో మనము వివిధ విషయవేత్తయు, సురుచిరాలాపకోవి దుఁడు నగు పండితునెదుట నుందుము. పాత్రవర్ణనము, కథ తగ్గుటచే సభిరుచియుఁ (Taste) దగ్గినది. కావ్యకళ కది లోపము. ఎట్లైనను గానిండు. నృసింహకవి ప్రబంధమార్గముల నొక్కదాని కధీశ్వరుఁడు. ప్రశంసనీయుఁడు. ఆతనికృతి సామాన్యప్రజ కంత యావశ్యకముగాదు.

వసుచరిత్ర పైరెంటికి బరువునఁ దీసిపోదు. భట్టుమూర్తి దత్తమండలమువాఁడు. రామరాజ భూషణుఁడైనాఁడు. ఆంజనేయవరప్రసాదము గలవాఁడు; సూరపాత్మజుఁడు. వేంకటరాయభూషణ సుపుత్త్రుఁడు. రామరాజు, "శుభ" చిహ్నము నొసంగినాఁడు—[శ్రీనాథుఁడు సంస్కృత కావ్య సంస్కృత సమాసములనే తెల్గులో కీడ్చెను. దానినిఁజూచి పిన వీరన్నయు నట్లే చేయుచు నూత్న శోభలఁ గొన్నిటిం జేర్చి ప్రబంధమునకు శృంగారశాకుంతలమను పునాది వైచెను. దానిపై పెద్దనార్యుఁడు మను చరిత్రలోని ప్రవరస్వారోచిషుల కథలతో గోడలు పెట్టెను. దానికి రామ లాముక్తమాల్యదలోఁ నుక్కుకంబముల పాతి పైకప్పు వేయుటకు జతనము చేసెను. తమ్మన్న ముందరివైపున నొక మాకందము నాటెను. వసుచరిత్ర కారుఁడు గోపురము కట్టెను. నరసింహకవి చిత్తరువులు సంతరించెను. రామ కృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యముచేఁ దెల్లఁగ గచ్చు కొట్టించి దా విహారమందిరముఁ జేసెను. ఈప్రబంధమందిరమునకే భట్టుమూర్తి ప్ర

గదిని హరిశ్చంద్రనలోపాఖ్యానరూపమునఁ గట్టి యచ్చట నరసభూపాలీయ మను నియమప్రకటన ఫలకము (Notice Board.) దగిల్చెను. ఇంతలో సూరన్న రాఘవపాండవీయ మను మఱొక ప్రక్కగదిని నిర్మించి, ప్రభావతీప్రద్యుమ్న మను సౌధమును గట్టి చుట్టును కళాపూర్ణోదయమను దివ్యోద్యానమును స్థాపించెను. దానిమధ్య వేంకటకవి విజయవిలాస సరస్సును చక్కగాఁ ద్రవ్వెను. ఇది యాశ్రమధర్మముల కనువుగ నున్నదని వేమన యోగి తన శతకపటవృక్షము నొక చివరఁబెంచి యందాసీనుఁడై శాంతిని బోధించెను. అంతలో కాలము మాఱినది. వేఱ్వేఱుగా చిన్నమందిరనులు నిర్మింపఁబడుచు వచ్చినవి. శృంగారశాకుంతల నైషధములను బాగుగఁ బఠించినాఁడు. తానునుబూని, చికిలిచేసిన జాతిరత్నములను సేకరించినాఁడు. మనుచరిత్రను చవిచూచినాఁడు. తనరత్నములను గిరికాప్రణయమను తీగతో హారముగా నొనర్చుటకుఁ బ్రయత్నించినాఁడు. [1]ఉత్తరహరివంశ కాశీఖండములలోని పోలికలను గుర్తించినాఁడు. మనుచరిత్ర వస్త్వైక్యము లేనిది. కాన, తాను సమంజసమగు ఫక్కికి దొరకొన్నాఁడు. [2]భట్టుమూర్తి యంతతోఁ బోక నాటకరీతులనుగూడఁ జొప్పించినాఁడు. శ్లేషధ్వనులు తనకు వశములైనవి. (శబ్దాలంకారములు తమంత వలచి వచ్చును. కాఁబట్టియే వాని నంతగాఁ గొనఁడయ్యెను.) ప్రథమాశ్వాసము వసంతర్తువర్ణనతో

1 శ్రీ వఝుల చినసీతారామశాస్త్రులుగారి మనుచరిత్ర విమర్శనమును దప్పక పఠింపుఁడు. అనుస్మృతులు సుబోధములగును. మనుచరిత్రాదులలోఁ బోలికలు చక్కఁగ నీయఁబడినవి.

2 చాటుధార, సోమనాథకవివ్యాఖ్య, సమానవర్ణనలు, ఆంధ్రకాముదిలోని సాక్ష్యము, లక్షణదీపికలోని యుదాహరణము మొదలగున వన్నియు భట్టుమూర్తి రామరాజభూషణు లొక్కరేయని ఘోషించు చున్నవి. కాన, సందేహింపఁ బనిలేదు. భావములు, పదములుగూడ నంత సాక్ష్య మిచ్చుచున్నవిగదా!

వృథయైనది. ద్వితీయాశ్వాసములో సంగీతాకృష్టుఁడగు వసురాజునకు గిరికా జన్మవృత్తాంతము సమాకర్ణనమైనది. తృతీయాశ్వాసము వసురాజు నర్మసఖుఁడు కుహనావిధిని గిరికావసురాజులకు సమాగమముచేకూర్చ, నిరువురును విరహాక్రాంతులగుటతోఁ గరఁగిపోయినది. చతుర్థాశ్వాస మొక్క రాత్రితోఁ దెల్లవారినది. రాత్రియంతయును గిరికాదేవి మదనమారుత చంద్రసముపాలంభనముతో నడపినది. చెలికత్తెయగు మంజువాణి సాహాయ్యముచే నిర్వురును హారమును, ముద్దుటుంగరమును మార్చుకొనిరి. పంచమాశ్వాస మింద్రుండు రాయబారము నడపి వివాహసమయము సమకూర్పఁగా వధూవరుల పెండ్లికి సిద్ధమగుటలో మటుమాయమైనది. షష్ఠాశ్వాసములో శుక్తిమతీ కోలాహలులు గిరివ్రజపురంబునఁ గల్యాణంబు సేసి బిడ్డకు నీతులు గఱప, నామెయు భర్తతో నధిష్ఠానపురంబునకుఁ బోయి యచట నొక శుభదినంబున సమాగమ సంతోషంబు నొందినది. చూచితిరా కథ! ఆముక్తమాల్యదలో నల్లిబిల్లిగ నల్లుకొని, మనుచరిత్రలో రెండుపాయలై, కవికర్ణరసాయనములో యుద్ధవేదాంతరసాయనములతోఁ జెరసి, వసుచరిత్రలో శుష్కించి కథాప్రవాహము శరదృతువునఁ బలెఁ దరగినది. వసుచరిత్రవిమర్శకుఁడు "కథాసంవిధానమం దంతగాఁ బస కానరా" దనిరి. కొంచెమాలోచింపుఁడు. ధీరోదాత్తనాయకునకై భారతాంతర రేతఃస్ఖలనాది వృత్తాంతము విస్మరించుట మంచిదని యంద్రుగాని, మార్పులేమిచే పాత్రలో జీవకళ మాసినదయ్యెను. వసురాజున కిచ్చిన వరములు వేణుయష్టియు, మాలయు, భారతమున తపఃప్రభావ రాజ్యపాలనా సామర్థ్యముల కింద్రుఁ డిచ్చెనని యుండ, వివాహకాలమున బహుమతు లియ్యఁబడెనని భట్టుమూర్తి వ్రాసి మూలకథలోని యౌచితినింగూడఁ జెరిచెను. పోనిండు. కథాకల్పనమైనఁ గలదాయన్న నిండుసున్న. ఔచితిలేదు. కల్పనలేదు. జీవకళలేదు. బలాత్కరించి భోగించిన కోలాహలునికి, శుక్తిమతి ("శశిరేఖ" యను నవలలో శశిరేఖ సుందరరావునకు లోఁబడినట్లు) లోఁబడి తరువాత వశంవదయైనది. అది

నీతి! ఒకసారి చూడడము—విరహమొకరాత్రి కూడలేదు—రాయబారము లైనవి—పెండ్లి ముగిసినది. ఇది ప్రణయతత్త్వము! కవియొనర్చిన పరమార్థబోధ యేది? అయిన వసుచరిత్ర నిరర్థకమైనదియేనా? కాదు. ముమ్మాటికి గాదు. కృష్ణరాయలకన్న మిన్నయై రాజ్యతంత్రము నడపిన రామరాజు పాలన నిరర్థకమనియే యందుమా? అనము. కాని, రాయల ఘనత రాదు కదా? సామ్రాజ్యము పెంపొందిన దొకచోట, నశించుటకుగాను విజృంభించినది మఱొక్కచోట. రామరాజు తళ్లికోట యుద్ధములో సామ్రాజ్యభానుం డస్తమించెను. రామరాజభూషణుని వసుచరిత్రలో ప్రబంధయుగములోని గడుసుపోకలన్నియును గూడివచ్చి విజృంభించినను ప్రాణము మాత్రము నిలువున నెగిరిపోయినది. పువ్వు వాడిపోయినను పూర్వవాసనాస్మృతి యున్నదిగదా? అటులనే వసుచరిత్రయుం దన మోహనగానములతోం బూర్వసమున్నతిని బాడుకొన్నది. సారాంశమేమనంగా: నీ ప్రబంధ మప్పటికిం బుట్టిన యెల్లప్రబంధములనుండి రుచులను గ్రహించి దివ్యమైన యనుసృతి యైనది. స్వాతంత్ర్యముం గోల్పోయినది. వసుచరిత్రలోని సుగుణములు సమష్టిభావన కింతేయైనను, వ్యష్టిభావము ననుసరించినచో, కవియుద్దేశమును బరికించినచోం గావ్యాలాపరత్ననిధి యనుట కేమి సందేహము? నిస్సందేహముగా నమూల్యములగు ననేక భావానుసృతులున్నవి. సాహిత్యముతో సంగీతము జతపడినది. శైలి మధురమంజులవాగ్విలాసవిపులమై, శ్రావ్యమై, శ్లేషానుప్రాణితమై మనోహరమైనది.

"నీతమ్ముల శుభవాసన, నీతలిదండ్రులగభీర నిశ్చలగుణవి
ఖ్యాతియును దలంచి మెలంగుము, నాతల్లీ కులవధూజనమతల్లికవై"

యన్నాండు హితబోధలో.

"పవమానమానవ ప్లవమానకైరవ, చ్యవమానరజముపై నంటందివురు"

మున్నగు భట్టుమూర్తివాక్యములన్నియు "సుధామయ సూక్తైకాయత్తములు." ఇంత యర్థవంతమైన శైలి యితరుల కలవడలేదన్న సాహసము గాదు.

కాఁబట్టి యనుస్మృత భావములను జికిలిచేసి ప్రౌఢముగాఁ దెల్పుటయందును, శ్లేషానుప్రాణితమగు శ్రుతిమధురశైలియందును నితఁడసమానుఁడు. కాననే యితనిపద్యము లసమానములు. కావ్యదృష్టిని మరల్చి పద్యములనే పరికించితిమా యితని పద్యకృతు లనర్ఘరత్నములు; అమందానందతుందిలములు. అఖండశ్రావ్యతాగుణ మనోహరములు. ఇతని హరిశ్చంద్రనలోపాఖ్యానమును సూరనకృత రాఘవపాండవీయముతో జతఁజేసి చూచుకొందముగాక! ఇతఁడు కావ్యాలంకారసంగ్రహమునకుఁ దగినవాఁడు. ఆంధ్రకవులలో నిట్టి లక్ష్యలక్షణనిరూపణమునకు నితనిఁబోలువారే లేనప్పుడు మించినవారుండరు గదా? కావ్యాలంకారసంగ్రహ మితని సాహితిని, కవిత్వశక్తినిగూడఁ బ్రదర్శించుచు కవితో నైక్యమొందిన ట్లున్నది. శక్తికిఁ దగినకృతి; కృతికిఁ దగినకవి. అతిపాండిత్య కవితాశక్తులు గూడిన కల్గుఘటన కితఁడు దృష్టాంతము.

ప్రౌఢప్రబంధకవులను దర్శించితిమి. అదో శ్రీకృష్ణరాయలచేఁ గేలూతఁగొని మదగజేంద్రము నెక్కుచు రాయలను "అంబరచుంబిశిరస్సరద్ఝరీపటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వనస్ఫుట"ములగు పద్యములతో నాశీర్వదించుచున్న పెద్దన్నను, విజయనగరవీథులలో, తుంగభద్రాతీరమునఁ గన్గొనుచున్నారా?

"లజ్జకుఁబాపు శీలముఁ గులంబు వడి న్విడిపించు సూనృతం
బుజ్జనసేయుఁ జేయు మొగమోటమిఁ దూలుచుఁ బాతకంబులన్
మజ్జనమార్చు నార్చు నభిమానము రోఁతల కియ్యకొల్పు నీ
ముజ్జగమైనఁ ద్రిప్పుఁ దుదిముట్టదు తా ధనకాంక్ష యేరికిన్."

అని పలికి "ప్రభుదురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు" నని కొదమసింగమువలె స్వాతంత్ర్యమున గర్జించిన సంకుసాల నృసింహకవియు నీదృశ్యమును జూచుచున్నాఁడా? ఎవ రెటులైన నేమి? రాయలయొద్ద గారవమొంది పెద్దన్న యందలమునెక్కి యూరేగినాఁడు. వహవ్వా! ప్రభువులకుఁ

బూజ్యులైన యానాంటి కవులను, భాషాపోషకులను దలంచుకొన్నంతనే హర్షాశ్రువులు జాఱుచున్నవి. మేను పులకరించుచున్నది. పెద్దన్న దత్త మండలములలోనివాండు. మనుచరిత్రము రచించినాండు. మనుచరిత్ర మిరువదేడు గద్యపద్యములలో నిమిడినది. వరూథినీప్రవరులచరిత్రము, మనోరమా స్వరోచులచరిత్రము తక్కిన పద్యాదులం బూర్తియైనది. ఇది స్వరోచిచరిత్రమన్నారు! అది సత్యము. మూండాశ్వాసములతో ముగిసిన వరూథినీ ప్రేమగాథ అనుపమానరసపోషణ వైదగ్ధ్యమును మెఱయించినది.

"ప్రాంచద్భూషణబాహుమూలరుచితోం బాలిండ్లు పొంగార...

హా శ్రీహరీ? యంచుక్" వరూథినీ ప్రవరులు పోరాడిరి. ప్రణయ ముగ్ధయగు నారీరత్నమును ఛాందసుండగు విప్రుండును మనకన్నులకుం గట్టినట్లు న్నారు. 1. పాత్రపోషణమును పలువురు మెచ్చుకొన్నారు. 2. అతనిసమాసములు నన్నయరచనలంబోలి యన్వయసులభములు. అంతియకాక నన్నయలో నంతగాం గన్పడని 'దృశ్యానుకరణ' ధ్వని యితనిశైలియం దగ్గలము. "జలజల ప్రవహించు సెలలచప్పుళ్లు శిఖావలకులకలకలకేకలు" ను వినంబడుచునే యున్నవి. "మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబులు" కన్పడుచునే యున్నవి. ప్రబంధయుగమునకు నితండు నన్నయవంటివాండనుట సత్యము. కాననే "యాంధ్రప్రబంధకవితాపితామహుం" డని పేరందినాండు. 3. కథాసంవిధానము మంచిశిల్పమును వెలయించినది. మాయాప్రవరునితో వరూథినికి సంగమము గల్గించు సందర్భమునందలి పెద్దనయుపాయము వర్ణనీయము. కళామధురిమ? అవసరముకాని వర్ణనలకుం బోలేదు. 4. ఋష్యాశ్రమములు ప్రవరునకుం గన్పడలేదా యందుర్. ఉండి యుండదగును. వానిప్రసక్తి ఇట ననావశ్యకమనియే కవి విడిచినాండు. 5. శ్రీనాథుని పోక లనేకములు పోయినాండు. కాని, యాయనుస్మృతిపద్యముల నడకలోనేకాని భావములయం దంతగా లేదు. సంస్కృతశ్లోకముల భాషాం

తరీకరించి తమదిగాఁ జేసికొనిన పినవీరభద్రన, భట్టుమూర్తులలో నర పాలును నితనియందు పరభావాదిచౌర్యము లేదని యనవలసియుండ నితనిని భావశూన్యుఁడని యొకరు నిందించిరి. అది పర్యాలోచనీయము, అసమంజసము, అసంగతము. కథాసందర్భమే వేఱు. 'ఇంతలు కన్నులుండ', 'అటఁజనికాంచె', 'కొనసాగి' మున్నగు పద్యము లెక్కడను లేవు. పెద్దన్న ప్రత్యేక వ్యక్తిత్వ మెల్లెడల వ్యక్తమైనది. 6. ఈచెప్పిన సుగుణములు తృతీయాశ్వాసమువఱకే తరువాత సన్నగిల్లినవి; మనోరమ భయపీడితయై రాక్షసుఁడు వెన్నంటితఱుముచున్నను కథనంతయుం జెప్పివైచినది. విద్యలకై భార్యలనుఁ జేకొన్నాఁడు స్వరోచి. ఎట్లో సాగినదికథ. కాని వర్ణనా వైశద్యము, శైలిమాధుర్యము తగ్గలేదు. పదసారళ్యము మాత్ర మించుక మందగించినదే! తుదకు వండైనది. ప్రబంధముల బురద మెత్తుకొన్నది. పోనిండు. (భావ) 'వియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహా, యాత (సగంధ) గంధవహహారిసుగంధవిలాసయుక్త'మైన పెద్దనకవిత నభినందించి 'పాండురంగసుకవిపద్యంబు హరువును' గన్గొందము.

పదగుంభనలకుఁ బ్రసిద్ధిఁగన్నది రామకృష్ణునికవిత. "సరసార్థబోధ ఘటనాహేలాపరిష్కారశారద నీరూప మ'ని విరూరి వేదాద్రిశౌరి ప్రస్తుతించినాఁడు. 'శైవవైష్ణవపురాణావళి నానార్థములు నీకుఁ గరతలామలక విధము'లనియు నన్నాఁడు. 'ఆశువునందు మేటి', 'అఖిలభూమిపాలకాస్థాన కమలాకరోదయతరుణసూర్యోదయుఁడు.' కావున 'దేవకీనందనుని సత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాప మర్మ, గుందనముగ్ ఘటించి కడుఁ గ్రొత్తగుసొమ్మొనరించినాఁడు.' అతని'కింక నెదురేరీ?'

ఇతని పాండురంగమాహాత్మ్యము, నైషధమనుచరిత్రాముక్తమాల్యదా వసుచరిత్రలతోఁ జేరి పంచకావ్యముల నొక్కటియైనది. ప్రబంధయుగమును బురాణయుగముతోఁ బోల్చి చూచినయెడల, పెద్దనను నన్నయ.

తోను, రాయలను ప్రబంధపరమేశ్వరునితోను, సూరన్నను తిక్కన్నతో డను, సోమనాథునితో రామకృష్ణునిం బోల్పవలసియుండును. ఈపోలిక యీయుగకవుల తారతమ్యములఁ జూచి విలువ కన్గొనుటకేకాని, కవిత్వరీతులను దెలియుట కుపయోగపడదు. పురాణకవులకుఁ బ్రబంధకవులకుఁ బొత్తు కుదురుట లేదు. దృష్టిభేదమేకాదు; కార్యరంగములుగూడ భిన్నములు. సోమనాథుని గడుసుపోకలను దర్వాతివా రనుకరించిరి. రామకృష్ణునిపిదప వా రనుకరింపలేదు. శక్తిలేదేమో! ఇతని దొక విలక్షణమైన ధార. విలక్షణమైన భావగమనము. భక్తిరసపోషణమునఁ బోతన్న భాగవతరుచి యించుక నిగ్గుదేలుచున్నది. కాని పదసరళి దానిం గ్రొత్తచేసినది. ఒకరీతిగాఁ గావ్యప్రబంధపురాణములరీతులు మూఁడును మిశ్రములై పోయినట్లుండును. చూడుఁడు: కథ పురాణములోనిది. కాశీఖండాది కావ్యములలోని కవితాఫక్కి గాననగుచున్నది. కాని, వర్ణనలు ప్రబంధములలో వలె సమగ్రములు. అగస్త్యుఁడు కార్తికేయుని దర్శించుట, పుండరీక చరిత్రము, క్షేత్రమాహాత్మ్యము, నక్కడి తీర్థములు, నిగమశర్మోపాఖ్యానము, శ్రీరాధాకృష్ణచరిత్రము, కాకము, హంసము, చిలుక, పాము, తేనెటీగ, ఆవు, మోక్షమునొందినకథలు, సుశీల యనుపతివ్రతాస్త్రీచరిత్రము, ధర్మరాజు పాండురంగక్షేత్రయాత్రఁ బోవుట, సుశర్మోపాఖ్యానము, అయుతనియుతులను మునికుమారుల చరితము లను నవి కావ్యములోని సంగతులు. (1) ఇతనికవితయందు నిరర్థకపదము లెక్కడనోకాని కానరావు. పదసందర్భ మితనికిం గుదిరినట్లు మఱియొకనికిఁ గుదిరిన దని చెప్ప వలను పడదు. (2) ఇతనిపదసామగ్రి విలక్షణమైనది. "జవణి సరకులు", "మలుమచ్చిగందంపు వలపు", "పారుపత్తెములు" "జాయవెన్నెల", "తెలనాకులు", "నిజాల", "మంజిడియేతులఁబోవుచు", "అప్రాద్దుప్రొయిరాజనట్టినిశ్వేద", "గిరగొట్టు", "తరటుంజేసిన", "తప్పిదారియు", "మురారి

యెడ బరిప్రేయక" మున్నగు నపర్వరామణీయకములగు పదంబు లెన్ని యేనిఁ జూపనగు. (3) ఇతని సంస్కృత సమాసము లోక క్రొత్తసోయగమును హవణించుకొన్నవి. గీర్వాణవ్యాకరణసారముఁ గ్రోలిన వానిభంగి నెన్నియో ప్రయోగంబులు బ్రాసగించినాఁడు. "నమోవాకము", "ఛత్రితశేష", "వాసోనిగ్రహతక", "స్నపనరచన","ఏకతానతాయుతుఁడు" మున్నగు నవినూత్నములు. అల్పజ్ఞునకు నాకుఁ దోఁచక బోవచ్చును గాని, యితరకావ్యములోనుండు సంస్కృతపదములను, నితనిపలుకులనుఁ బోల్చిచూచినచో నేమో వింతఁగాఁ జూపట్టుచుండక తప్పదు. (4) సీసములతూగునఁగాని, పద్యములఁ గూర్పునఁగాని పంచకావ్యకవులలో నెవరికిం దీసిపోఁడు. పైగా నందఱిపోకలు నితనియందు సమావేశమై యందఱను దలఁపించినను, ప్రత్యేకతమాత్రము సుస్పష్టమై కాననగును. "కాబోలు నివి","సమధికజ్ఞాన", "చొరకు జన్మమునకు", "నీటిలోఁజివుకక", "పాదలు నీపొక్కుట", "పరమేష్ఠినుండి", "నీరజగర్భుండు", "నర్మగరోభక్తులు" మొదలగు సీసములఁ జదివినచో రాణ ప్రబంధకావ్యఫక్కులన్నియు బెరసిన ట్లుండును. ఇతని యుపమానములు బద్యస్ఫురణ నిచ్చునవి. సుస్పష్టములు. "తలలో పలనాలుక", "పూసలలోదారంబు", "పాలఁజల్లిన నీరుంబలె వెలియేఱుగక మనసులు గలసి" యున్నాఁడు. (5) స్వభావవర్ణనకు ప్రపంచానుభవప్రౌఢిమకు నిగమశర్మోపాఖ్యాన మొక్కటే నిదర్శనమునకుఁ జాలును. (6) జాతీయములగు నుడికారములు మేలిమి కితఁడు పెన్నిధి "మచ్చికంగ చ్చువదలక", "ఓమనగాయలంగానోముచు", "పుటపుటనై యున్న చిన్నిబొజ్జ", "తేనెపూసినకత్తి", "చదువు సంధ్యలు" "వీడరతెల్లవ్రాఁకు", "పాలపండ్లనాఁడు", "కంపలఁబడ్డకాకి", "గువ్వగుత్తుక", "చదువుసంత" మొదలగునవి చూడుఁడు. "వారకాంతలఁ దడవినవచ్చుఁ గీడు" మున్నగు లోకోక్తులన్నను లెక్కింపఁబనియేలేదు. (7) ధార "యనర్గళ తుంగభద్రారంగఘుమఘుమారావసమంచితంబు", "ఉత్తాలఫణిభుగ్గరుత్తాల

వృఁతాని, లాశాంత ఘర్మాంబువయ్యో మేను" అను సమాసములును, "ఒకయింత జెప్ప నేయక చూచు......అవతారదశకమును మున్నె తాల్చెనా ధరణీ సురుఁడు" వనుశ్లేషోక్తులును, "దినవెచ్చమునకునై" యనుపద్యములు మున్నగు వానిలోఁ దెలుఁగునుడుల కడిమియును, పంపాతరంగరింఖణ ఝుంపాసంపాత్య మానజలకణరేఖా సంపాతశీతలానిలసంపదలును" చవిఁజూచినచో నితరముల నొల్లము. కాని, నిదానముగాఁ గూర్చుండి చదివి యానందింపవలయునే కాని, యవసరపడినచో రామకృష్ణునిచే " భక్తిన్తుల " మగుదుము. (8) "అడుగంటెనె", "మానిసాత్మవిన్యాసము", "నుయిదాటె", "చింత యూఁకు" మున్నగు కొన్ని వ్యాకరణ విరుద్ధములు ఇతని నిరంకుశ పదప్రయోగమును జాటుచున్నవి. (9) భక్తిరసము, శృంగారరసమును, గాంభీర్యమును, వదలక నుచితముగఁ బోషించెను. ఆవేశ మొకప్పుడును గలుగఁజేసికొనక, సందర్భస్ఫూర్తికై యత్నించి పూర్తిగా విజయుఁడైనాఁడు. (10) సాహిత్య జ్ఞాన మలవరచుకొనఁ గోరువారికిఁ బంచకావ్యముల నిదియే యుత్తమ గ్రంథమనియు, దీనిని సమగ్రముగ నర్థముఁజేసికొనినవాఁడు తక్కినకావ్యముల నవలీలగా సంగ్రహింపఁ గలఁడనియును జెప్పుట సాహసముగాదు. ఇతని కవితలో "జొటజొట ధారగావడియుచుం గడవెత్తు సుధారసంబు గ్రుం, గుటగుట నప్పుటప్పటికిఁ గ్రోలి" ప్రజను సముద్రునితోఁ బోల్చి, యతని కృతిని దుంగభద్రతోఁ బోల్చి, ఇతరకావ్యముల నితరనదుల కీడు సేసి ఇటులని మనమును బాడుకొందము గాక.

"గంగాసంగమ మిచ్ఛగించునె మదిఙ్ గావేరి దేవేరిఁగా
నంగీకార మొనర్చునే యమునతో నానందముం బొందునే
రంగత్తుంగతరంగహస్తముల నారత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ!

తెనాలి రామలింగకవి కందర్పకేతువిలాసమును, హరిలీలావిలాసమును వ్రాసెను. "లింగనిషిద్ధు కల్వల చెలింగని" యనుచాటు వితనినే సూచించు

నేమో! "అదుగెంటనే" యను రామకృష్ణుని ప్రయోగము కానవచ్చునది. ఒకనిఁబోలిన ప్రయోగము లింకొకనియం దుండవా యన్న రామకృష్ణ రామలింగన లొక్కరె యనువాద మొక్కటి బాధించుచున్నది. శైవవైష్ణవ పురాణార్థ విదుఁడ నని చెప్పియున్నాఁడు గదా! రామకృష్ణుఁడు కాన, మొదట శైవుండైయుండి పిదప వైష్ణవుఁడయ్యెనా? అట్లొందఱో కలరు. "నానాభూమీపాలకాస్థానకమలాకరతరుణసూర్యోదయుం డైన" రామకృష్ణుఁడే రాయలసంస్థానమున నుండి యుండరాదా? విమర్శకులు, పరిశోధకులు; రామలింగ రామకృష్ణులను, భట్టుమూర్తి రామరాజభూషణులవలె నొకటిగాఁజేసిన బాగుండును.

రామలింగకవి కవిత్వము సలలితముగా, ప్రబంధముల కనువుగా, రసోదంచితముగ సులభముగ నున్నది. కాని, రామకృష్ణుని విలక్షణపద ప్రయోగము లిందుఁ గన్పడవు. రామలింగని పద్యమగు

"చంగున దాటుదే యనిన సప్తసముద్రము లైన వేగ వా
గెం గుదియింప నిల్చు, నదుగెంటనె శస్త్రనిపాతిధీరతన్
సంగరరంగవీథిఁ దమస్వామికి గెల్పు ఘటించు నట్టి యు
త్తుంగతురంగరత్నములు తొంటి హయాకృతి శార్ఙ్గిపుట్టువుల్."

అనుదానిని రామకృష్ణుని ఈక్రిందిపద్యముతోఁ బోల్చిచూడుఁడు.

"కెరలక క్రమ్మరింప నదుగెంటనె నిల్చు నొకింతనూకినన్
శరనిధులేదుదాఁటు మెయి చాచి చివుక్కున నుక్కుమీఱి సం
గరమున గాయమైన పతిగాచుఁ జలింపక తత్పురీహరుల్
హరిహయుమావుమున్ డిగిన యంబుధిరేవున వచ్చెనో సుమీ."

రామలింగకవి చంద్రగిరిరాజునకు సంతోషము గల్గుటకై పేరు మార్చుకొనె నని కొంద ఱందురు. ఇతని లింగపురాణ మేది? "జాహ్నవి లోకేశ్వరి తమసోదరి యానఁట" యని పాండురంగనుకవి తనహారిలీలా

విలాసములో "మందాకినితోడు నీడలయినారు; రామకృష్ణునిలో బిగు వెక్కువ; రామలింగనిలో సారళ్య మెక్కువ; "ఆగడ్త" యొకచో "రావియాకులమొలనూలు" మఱొక్కచో "కాంచనకాంచి" యైనది. కవిత్వశక్తిని, భావసాదృశ్యములను జూడఁగా బాల్యము లేక, పూర్వార్థ వయస్సులోని రామలింగఁడే, యుత్తరార్ధములోని రామకృష్ణుఁడనియు, కందర్పకేతువిలాస, హరలీలావిలాసములలోని సులభసరళమనోహర ప్రబంధ సముచితధారయే, పాండురంగమాహాత్మ్యములోని, "కవిజన సహకారవసంతోత్సవసూక్తి" విలసితమును, విశాలభావముల క్షుప్తపఱచు కౌశలముతోఁగూడి చిత్రప్రదర్శకగుణరాజితంబును, స్వభావోక్తి ప్రబల మును, నిరుపమాన ప్రపంచానుభవ ప్రతిబింబమును, నడుమ నడుమ సంస్కృతశ్లోకములు యథామాతృకములుగాఁ గల్గి, ప్రౌఢమైనదియును నగు ధాటిగా మాఱినదనియు నా నిశ్చితమై యున్నది. రామకృష్ణకవి నైషధములోని నడకల నేర్చినాఁడు. భాగవతములోని భక్తిని లీలాపార వశ్యతను చవిగొని యటులనే సంతరించినాఁడు.

"నఖరాగ్రలూనాననస్వేద", "మరువంపువలపు", "సర్వధర్మ విహీన" అను పద్యములఁ బఠింపుఁడు. 1 రామలింగకవి ఇంకను తనకాలపు ప్రబంధరీతులనే సానఁబెట్టుచు నున్నాఁడు. సత్యము తేలినట్లే! ఇరువురు నొక్కరే యని యంతస్సాక్ష్య మైనది.

క. "గిరికానుషక్తబుద్ధి ను
పరిచరునింబోలు నొక్కపన్నగ మొక నా
దురవడి నెచ్చటనుండియొ
మురమర్దనుదివ్యభవనమున కేతెంచెన్."

---

1 తెనాలి రామలింగయ రామకృష్ణులొక్కరే యనియు, అన్నయ్య తమ్ముఁడనియు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రోధన వైశాఖ భారతిలో నిర్ణయించినారు.

క. "యమదండచండ మగుభుజ
గమునకు వెఱచఱచి యాఖు కన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ
తమతికి నాముక్తమాల్యదకు నెన యగుచున్."

అనుపద్యముల రెంటిని విమర్శించినచో పాండురంగమాహాత్మ్య మాముక్త మాల్యదావసుచరిత్రముల రెంటికిఁ దర్వాతనే రచించిన దని తేలుచున్నది. కాఁబట్టి కవి 1565 ప్రాంతములకుఁ బైననే (పిమ్మట) గ్రంథమును రచించియుండును. శ్రీకృష్ణరాయలసంస్థానము 1525 లోనిది గానఁ గవి యప్పటికి యౌవనమున నుండియుండును. అప్పటికి పేరు రామలింగమై యుండునా?

"పరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియున్
సరసావంతయుఁ గానలేరు తుద యోషావిభ్రమాంభోధికిన్"

యన్న యితఁడు స్త్రీత్వముఁ జక్కఁగ చిత్రించినాఁడు.

"ప్రకృతి మధురంబులకు వేషరచనలేల?"

యని ప్రశ్నించిన యీకవిభావములు మధురములు; ఇతని వాగ్విన్యాసములకు వేషరచనలు లేవు గాననే వేషరచనల కధికతఁజూపిన ప్రబంధయుగములో నవి విలక్షణములు ననియును తీర్మానించుకొని ప్రబంధయుగ సార్వభౌముఁడగు నితని సమక్షమునుండి తత్కాలాధీశ్వరుఁ డనఁదగు సూరన్నను దర్శింతము.

తిక్కన్న పోతన్నల తరువాత మహాకవి పదముఁ జేరఁ జనినవాఁడొక పింగళి సూరన్న యని కొందఱి యాశయము కావచ్చును. "తిక్కన సోమయాజికి తరువాత నింత ప్రౌఢముగాఁ గవిత్వము చెప్పిన కవి మఱియొకఁడు లేఁడు. ఈ సూరన కావ్యరచనయందు సర్వతోముఖచాతుర్యము కలవాఁడు. ఈతనికవిత్వము మృదుపదగుంభితమై ద్రాక్షాపాకముగా నుం

డును. కళాపూర్ణోదయము విచిత్రమైన కల్పితకథగలదై తెలుఁగు ప్రబంధములలో నిరుపమానముగా నున్నది. ఇది నాతికఠినమై మృదుమధుర శైలిగలిగి యున్నది. రాఘవపాండవీయము క్లిష్టార్థములు లేకుండ మృదుమధురసులభపదములతో రామాయణభారతార్థములు వచ్చునట్లుగా రచింపఁబడిన శ్లేషకావ్యము. ఇంతటి సులభశైలితో సంపూర్ణశ్లేషకావ్యమును రచియించుట మఱియొకరికి సాధ్యముగాదు. ప్రభావతీప్రద్యుమ్నము చక్కని స్వభావోక్తులను గల్గి లలితపదఘటితమై కథాచమత్కృతి గల్గి చదువు వారికి కర్ణరసాయనముగానుండెడు ప్రౌఢకావ్యము.'' అని కవిచరిత్రకారుఁడు నుడివినాఁడు. పింగళివారి 'పేకి' దానికథ యద్భుతముగా నున్నది. [1]ప్రబంధకవు లెవ్వరిలోను గనఁబడని ప్రతిభయు, భావనాశక్తియు, సందర్భశుద్ధియు, పాత్రోచితపద్యరచనయు, నిందు ప్రసిద్ధములు. ''అపూర్వకథావైచిత్రీమహనీయంబునుఁ, బుణ్యావస్తువర్ణనాకర్ణనంబును'' నగు మహాకావ్యమును కవి యుద్దేశించెను. (ఇతనితో సమకాలికుఁడు షేక్స్పియరు మహాకవి) తనసంకల్పమును నెఱవేర్చుకొని, ఆదిమొదలు ఆఱవ యాశ్వాసాంతము వఱకు నొకేరీతిగా ననల్పకల్పనావేగముతోఁ గథ సాగించినాఁడు. తరువాతఁ గుంటువడినది కథ. అలంకృతమైనది. ఆగిపోయినది. కథావివరణము భారతరామాయణేతిహాసములవలె కాలము ననుసరింపలేదు. వస్తుపరిణామము ననుగమించినది. ''కళాపూర్ణోదయమునకు కార్యక్రమము ముఖ్యపద్ధతి.'' ఔత్సుక్యము మనకు మొదటినుండియునుఁ బెరుగుచునే యుండును! అదికదా ప్రతిభాలక్షణము. దానిచేతనే కదా రామాయణ మెన్నిసారులు పఠించినను తృప్తిలేదు. ''మణిహారములో'' వివిధకథారత్నములు కూర్పఁబడినవి. నాటకరీతిని సంభాషణములు పాత్రలతోఁ జేయించి వృత్తములను కవి ప్రకటించెను. రంభానలకూబరాపహాసఘట్టమును, తత్ప్రదర్శితస్త్రీస్వభావ చాపల్యమును విచిత్ర కళాకౌశలమును గన్పఱచునవి. ప్రకృతి

---

1 కవిత్వతత్త్వవిచారము. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు.

వర్ణనమున పాత్రపోషణమున నితఁడసామాన్యుఁడనుట కతని కృతిని జదు వుఁడు. అవయవసంయోగము లేనివానిని ప్రభావతీప్రద్యుమ్నములోఁ జేర్పలేదు. భావములు కథావిధానము, కళాపూర్ణోదయము ననుసరించినది. దానికనియే యొక్కరు దీనికన్న కళాపూర్ణోదయమే గొప్పదనిరి. ప్రభా వతీప్రద్యుమ్నములో 1 శుచిముఖిచరిత్ర మత్యద్భుతము. శుచిముఖి సంభాషణలు గంభీరభావనిర్ఛిద్రములు. సంస్కృతమున నైషధమునకుఁ గర్తయగు హర్షకవిభావనలకు సూరన మెఱుఁగిచ్చినాఁడు. రాఘవపాండ వీయములో సులభపదంబులకు శ్లేష. అనగా పదములవిఱుపులలోని చమ త్కృతిచే రెండర్థములు పుట్టినవి. హరిశ్చంద్రనలోపాఖ్యానమున పాండి త్యాతిశయముచే నేర్చి కూర్చిన యమూల్యపద సన్నివేశమున సహజార్థ ద్వయ ముప్పతిల్లినది. సరియైన విఱుపులతోఁ జదివిన రామభారతకథలు ప్రత్యేక గ్రంథములగును. ఈవైచిత్రి హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు రాదు. ఏలయనఁగా శబ్దములలోని యర్థాంతరము ముఖ్యమై పోయినది.

"ఉభయశ్లేష" యనుగుణ మించుమించుగాఁ బుట్టినది. రాఘవపాండ వీయ, కళాపూర్ణోదయ, ప్రభావతీప్రద్యుమ్నములు మూఁడు నొక్కొక్క రీతి నొక్కొకటి సుప్రసిద్ధములై వెలసిన రత్నములు. ఇవి వరుసగాఁ (కాలమునుబట్టి) గూర్పఁబడినవి. కవిత్వపాండిత్యములు సమములై రాఘవ పాండవీయములోఁ జిందులు ద్రొక్కినవి. కవిత్వప్రతిభ మితిమీఱి కళాపూర్ణోదయములో నిబిడమై ఫలించినది. మనీషయుఁ గల్పనయుఁ దగ్గి సాహితీపటిమ మాత్రము మిగిలియున్న వార్ధక్యమును ప్రభావతీప్రద్యు మ్నము దలఁపించుచున్నది.

---

1 మండలేముల వెంకటశాస్త్రిగారు, బి. ఎ., ఎల్. టి. 14-వ సంవత్స రాది సంచిక. పింగళి సూరన్న ననేకులు విమర్శించియుండిరి గాన చర్విత చర్వణమని పూర్తిగ చర్చింపలేదు.

“గగనధునీశీకరముల చెమ్మను” ప్రబంధపులినములోఁ దేల్చిన నంది తిమ్మన, కాలమునుబట్టి పెద్దన, రాయలతో సమకాలికుఁ డయ్యును నింతవఱకు విస్మరించుట తప్పు. తిమ్మనకవి ముద్దుపల్కులకుఁ దద్దయుఁ బెద్ద. “పారిజాతాపహరణ” మను సుకృతిని రచించి సుకృతియై రాయలకు దాని నంకితము చేసెను. ఇతని కావ్యము రాయలవిద్యావ్యాసంగవసంతములోని మాకందము. ప్రథమాశ్వాసములోనికథ యవ్యక్తమాధురీప్రపూర్ణము. దృశ్యకావ్యలక్షణ లక్షితము. పాత్రపోషణ ప్రదర్శనావైచిత్ర్యము గలది. స్త్రీస్వభావ మార్దవము నతిసొగసుగ నిరూపించెను. “పాటునకింతులోర్తురె” యను మనుచరిత్ర పద్యమును, “ఆజాబిల్లి” యను భట్టుమూర్తి శార్దూలమును, “కొసరి వసంతకాలమున” అను కాశీఖండములోని చంపకమునుఁ బోల్చి చూచినచో, శ్రీనాథుని కొంటెశృంగారము, పెద్దనయందలి సందర్భశుద్ధి, భట్టుమూర్తియొక్క సమాసధాటి మూఁటిని మించిన తన కారణకార్యసమన్వయముతో నేకీభవింపఁజేసి “ఈసునఁబుట్టి” యను నుత్పలమును సృజించినట్లున్నది. కథావేగమునకు తిమ్మన్నదే యితరులకన్న నుత్కృష్ట మనవచ్చును. ఆతని ధారయు “బాలపల్లవగ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వని”ని బోలియున్నది. గిరిక కేవలమోహావేశమున గయ్యాళితనముం జూపినది. కాని సత్యభామ యేడ్పు—ఆమనసుకరగించు నటనలు—తిమ్మన్నయే రచింపఁగల్గును. పదలాలిత్యమును అర్థవైచిత్ర్యమును గల్పి రచించుటలో నీతనికావ్యము సమర్థతను జూపి హాయి యనిపించుచున్నది. శ్రుతికటువు గాదు—పాండిత్యప్రకర్ష లేదు. ఈయుగములో నొక్కింత చలువనీడ నిచ్చినది కళాపూర్ణోదయజననమునకు ముం దిదియనియే ఘంటాపథముగా వాకొననగును.

“జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధుఁ గన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునన్

దొలఁగం ద్రోచె లతాంగి, యట్లయగు నాథు ల్నేరము ల్సేయఁ బే
రలుకన్ జెందినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే!"

పదలాలిత్యమున కితఁడు పట్టుఁగొమ్మయై, తనంత నొకప్రత్యేకసృష్టిగాఁ బెరిఁగిన పారిజాతాపహరణమునకుఁ గర్తయై, శైలినిఁబట్టి భాస్కర, సింగన, పోతన, సూరనలవరుసలోఁ జేరవలసినవాఁడైన తిమ్మకవి నభినందించి ఇతర కవుల నిఁకఁ బరామర్శింతము.

"గంగాప్రవాహధారావేగముగల" శతకరచయిత ధూర్జటి సలక్షణ మధురశైలితోఁ గాళహస్తిమాహాత్మ్యమును వర్ణించెను.

"పరిచితబంధనైపుణి నపారకళానుభవప్రసక్తి నా
దరసవివేకసంపద, సదాశుకవాక్యసుధానుభూతిమో
హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి న
వ్వూరమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబుపోలికన్"

అని రచించిన యితనియందు శృంగారవేదాంతములు సమన్వయంబు నొంది నవి.యమకాద్యలంకారమనోహరంబై, ఒక్కొక్కచోఁ గన్నడపద సమ్మిశ్రమును జూపుచు, పాల్కురికి సోమనాథుని, నన్నెచోడుని స్మృతి కితని ధార దెచ్చుచున్నది. ఇతనితో నిక్కడనే సూచింపఁదగినవాఁడు "అయ్యల రాజు రామభద్రుఁడు."

ఇతఁడు చాలకాలము బ్రతికి పిల్లలుగలవాఁడై కష్టపడెనఁట. బాల కవిగనే 'సకలకథాసారమును' రచించెను. ఇతఁడు వ్రాసిన ముఖ్యప్రబంధము 'రామాభ్యుదయము' "ప్రౌఢకవితాధోరణిగల్గి పదగుంభమునందు పాండురంగమాహాత్మ్యమునుబోలి యమకానుప్రాసములను గలదిగానున్నది." అని కవిచరిత్రకారుఁడు వ్రాసెను. ఎట్లున్నను వీ రిరువ్వరును ప్రబంధమహా కవుల సభలోనివారే.

పైనఁజెప్పిన కృష్ణరాయ, పెద్దన, తిమ్మన, నృసింహకవి, భట్టుమూర్తి, సూరన, రామకృష్ణ, ధూర్జటి, రామభద్రులతోఁ జేరి ప్రబంధప్రపంచ దశదిశలనుఁ బూర్తిఁజేసిన చేమకూర వేంకటకవి, యుగాంత్యమునకుఁ గన్పడినవాఁడయ్యును నిటనే స్మరణీయుఁడు.

తెనుఁగు లోకోక్తులతోఁజాలువాఱి, యలంకారములతోఁ గులికి, రసోదంచితంబై, సూరన్న రచనలకుఁ బిమ్మట తేటతెలుఁగుపదముల కలయికతో శ్లేషను గల్పించుటయం దద్వితీయుఁడై మెఱసిన వేంకటకవిధార ప్రశంసనీయమే. ఇతని కృతి విజయవిలాసము. అర్జునుఁడు తీర్థయాత్రాసమయమున పాండ్యరాజు తనయాదులను వివాహమాడిన కథలు గలది. దక్షిణదేశమున రాజపోషణము నందినవాఁ డగుటచే కథయు నక్కడకే యేగినది. ఇతనివర్ణనలు సముచితంబులు. రసోద్దీప్తములు. ఇతనియందు క్త్వార్థకసంధి మొదలగునవి పొసఁగినవి గాని సర్వజనాదరణీయమైన యితని కవనమున కవి కళంకము నీఁజాలవు.

1. కందుకూరి రుద్రయ్య (కంసాలి భద్రయ్య) కందుకూరి జనార్దనాష్టకమును, సుగ్రీవవిజయ యక్షగానమును రచించెను. జనార్దనాష్టకము భావగీతరాజము. ఇతఁడు నిరంకుశోపాఖ్యానమునకుఁ గర్త. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహముగారివలన నందఱి చెవులఁ బడిన ''ఎన్నఁడు నేరిచెనే బెళుకు లీచెలికన్నులు కారుకమ్ము'' లను పద్యము రుద్రయ్యది. రుద్రయ్యకు మల్కిభరామ్ ప్రభువు చింతలపాలెము శ్రోత్రియముగా ననుగ్రహించినాఁడు.

2. కొండవీటిశైవబ్రాహ్మణుఁడైన మాదయ్యగారి మల్లన్న సులలితపదధాటితో రాజశేఖరవిలాస మను మూఁడాశ్వాసముల గ్రంథమును వ్రాసి నాదిండ్ల అప్పామాత్యున కంకిత మిచ్చెను.

3. శ్రీకృష్ణరాయలకాలపువాఁడైన [1]తాళ్లపాక చిన్నన్న యష్ట మహిషీకళ్యాణమును రచించెను. ఇది ద్విపదకావ్యము.

4. కుమ్మరమొల్ల నెల్లూరు మండలములోనిది. ఈమె రామాయణ మును చిన్నకావ్యముగ వ్రాసెను. పురుషులు వ్రాసిన చిన్నచిన్నరామా యణము లన్నిటికన్న నిది యుత్కృష్టముగ నున్నది. శబ్దాలంకారములతో నిండి, మధురమై, మనోహరమై, అవిరళధారాస్పదమై యరుదారినది. స్త్రీలలో నీమె, తరిగొండ వెంకమ్మయు నగ్రగణ్యలు. నుడికారముల సొంపు నింపుచున్న ఈకవయిత్రి సుస్మరణీయ. శ్రీకృష్ణరాయలకు సమకాలికురా లేమో ?

5. కోటశివరామయ్య యనుకవి సానందోపాఖ్యానమును వ్రాసెను.

6. స్తుతమతియైన ధూర్జటికి మనుమఁడైన కుమారధూర్జటి కృష్ణరాయ విజయమును వ్రాసి యొకనూత్నపథమును జూపె ననవచ్చును. సంస్కృతచరి త్రవలె నిది మనకు మాననీయము. శైలి రమణీయము.

7. కోదండరామరాజునకు (తిరుమలరాయని మనుమఁడు) రామ రాజీయము నందుగుల వెంకయ్య యంకితముఁ జేసెను. కవిత్వము రసవిహీనము కాదు.

8. దోనూరు కోనేరునాథకవి బాలభాగవతమును వ్రాసెను. కవి త్వము హృదయరంజకముగానే యున్నది.

9. అద్దంకి గంగాధరకవికృత తపతీసంవరణమను కావ్యము వసు చరిత్ర ననుసరించినది. శృంగారగ్రంథము. గంగాధరకవి మల్కిభరాముని యాస్థానమున కవిగా వెలసినవాఁడు.

---

1 తాళ్లపాకవంశపువా రనేకులు శతకకవులు విలసిల్లినారు. (చూ. శతకకవులచరిత్ర.)

10. రుద్రయ్యను, గంగాధరుని బోషించిన ఇబ్రహీంపాదుశాహీకొలువునున్న అమీనుఖానునకు పొన్నగంటి తెలగన్న యయాతిచరిత్రమను అచ్చతెలుఁగు గ్రంథము నంకితమిచ్చెను. "తొంగలిపువ్వు దేనియలఁ దూకొని మత్తిలు తుమ్మెదల్ పయిం, బొంగుచు వ్రాల నొప్పెసఁగఁజూచినపొన్న వలె" నితనిగ్రంథము తత్కాలపాఠకులచేఁ బొగడ్తనందినది. శైలి మిక్కిలి చక్కఁగా నున్నది.

11. పిడుపర్తి సోమనాథుఁడు ద్విపద బసవపురాణమును పద్యముగా మార్చి యేడాశ్వాసములుగా రచించెను. కవనము సొంపుగ "దాత్పర్యముఁ భక్తియుఁ లోనఁ గీల్కొను" నట్లున్నది.

12. పిడుపర్తి బసవకవి ప్రభులింగలీలలను పద్యముగా మార్చెను. నరసభూపాలీయానంతరము కవిత క్రమముగా భావశూన్యమై శుష్కించుచుండె ననుట కీపద్యానువాదములు ప్రబలసాక్ష్యములు.

13. "అనుపమ శ్రీవేంకటాద్రీశదత్త, మకరకుండల యుగ్మమండిత కర్ణుఁడైన" తాళ్లపాక తిరువేంగళనాథుఁడు 'పరమయోగి విలాస'మను నెనిమిదాశ్వాసముల వైష్ణవగ్రంథమును వ్రాసెను.

14. ఈ ద్విపద పరమయోగివిలాసమును జూచియేకాఁబోలు సమకాలికుఁడైన తిమ్మరాజు పద్యములోనికి మార్చెను; లేదా, కూర్చెను.

15. రాయసము వేంకటపతి లక్ష్మీవిలాస మనెడి యయిదాశ్వాసముల ప్రబంధమును రచించెను. సలక్షణమై మృదుమధుర రచనము గల్గియున్నది.

16. తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రమను ప్రబంధమునకుఁ గర్త; లాక్షణికుఁడు. తిరుమలరాయనికొడుకు. వేంకటరాయల కాశ్రితుఁడు. గాన వసుచరిత్రనుబోలుదానిని కల్పించెను. యమకాలంకృత దీర్ఘసమాసములతో రచించినాఁడు. కవిత్వము రసవంతముగా నుండును.

17. కోనేరునాథకవి భాగవతమునకు మొల్లరామాయణమునకు బిల్లలుకనగా, చరిగొండ ధర్మన్న భారతమునకు సంగ్రహముగా చిత్రభారతమును రచించినాఁడు.

"హారము భారమై మణిగణాకరబంధురసౌధరంగసం
చారము దూరమై తనువుసంగతినొప్పెడు చందనాదిశృం
గారము క్రూరమై చెలియకైవడి నెమ్మి యొనర్చినట్టి రా
కీరము వైరమై నెగడెఁగేసరిమధ్యకు నొక్కపెట్టునన్."

ఇఁకఁ దట్టుకొనఁజాలము.

18. రెండర్థముల గ్రంథములను రెండిటిని జూచితిమి. మూఁడవది మూఁడర్థము లైనది. రాఘవ యాదవపాండవీయముతో త్రిమూర్తు లేకమై అదృశ్యమగు బ్రహ్మమైనది. ఈ ప్రథమత్ర్యర్థికావ్యకర్త ఎలకూచి బాల సరస్వతియను పండితుండు. ఇతఁడే యాంధ్రశబ్దచింతామణికి తెనుఁగు టీకఁ జేసినాఁడు. ఇతఁ డనేకగ్రంథములకుఁ గర్త. తక్కిన ముఖ్యగ్రంథములు చంద్రికాపరిణయము, మల్లభూపాలీయ మను భర్తృహరి సుభాషితాంధ్రీకరణము నై యున్నది. ఈతఁడు వ్యాకరణము వ్రాసి ప్రబంధత్ర్యర్థి కావ్యముల నిర్మాతయైనందున, ప్రబంధ, ద్వ్యర్థికావ్య, కావ్యాలంకార సంగ్రహములను వ్రాసిన భట్టుమూర్తితోఁ బోల్పనగును. ఇతఁ డీయుగమున రెండవ భట్టుమూర్తి.

19. రామలింగకవి కూర్మపురాణమును రచించెను. సరసమైన కవిత్వము.

"భంబుగదే నఖావళి నభంబుగదే నడుము న్మదద్విరే
భంబుగదే కచంబు, దిగిభంబుగదే నడతీరు హేమకుం
భంబుగదే కుచంబు కరభంబుగదే తొడ పూర్ణచంద్రికా
భంబుగదే స్మితంబురుశుభంబుగదే వచనంబు బోటికిన్."

అనుపద్యం బితనిదే.

20. దామెర వేంకటపతిబహుళాశ్వచరిత్ర రచించిన శూద్రకవి. ఇతనికవిత్వము రసవంతమై సలక్షణముగా నున్నది.

21. చెన్నమరాజు 'చారుచంద్రోదయ' కృతికర్త. ఈకవి ముత్తాత యగు లక్ష్మీపతి శ్రీనాథునకు శిష్యుఁడట.

22, 23, 24. చిత్రకవి పెద్దన్నది కవివంశము. పెద్దన్న లక్షణ సారసంగ్రహము రచింపఁగా, ఇతనికొడుకు అనంతకవి హరిశ్చంద్ర నలోపాఖ్యానమునకు వ్యాఖ్యానమును, ఇందుమతీ పరిణయమను ప్రబంధమును రచించెను. అనంతకవి పుత్త్రుఁడు రమణకవి 'సాంబవిలాస' మను ప్రబంధమునకుఁ గర్త యయ్యెను. ఇతని రెండవగ్రంథము విద్వత్కవికర్ణరసాయన సకలవర్ణనాపూర్ణ రామాయణము. లక్షణా (దుర్యోధనుని పుత్త్రిక) పరిణయము, రామకథ వస్తువులు; సలక్షణమైన గ్రంథములు. ధార పురాణధాటికి ననువుపడినది. కాన తాతతో నారంభమైన కవిత్వలత మనుమనియందు బలిసి పూచినది. ఎప్పుడు మనుమలలోనే కాని, కొడుకులలో ఘనులయాశయములు ఫలింపవను పాశ్చాత్త్యసిద్ధాంతము సార్థకమైనది.

25. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమును రచించెను. అక్కడక్కడ మాణిక్యములవంటి పద్యములు గలవు. "ఇంపగు లోకోక్తులతో" నిండి సంభాషణఫక్కి నిది వ్రాయఁబడినది. అక్కడక్కడ కఠిన సమాసములు పడినను మొత్తముపైన సులభమైనదియే.

26. హరిశ్చంద్రోపాఖ్యానమును రచించిన రెండవకవి కంచి వీరశరభకవి. ఇర్వురును గౌరనమంత్రి ద్విపద ననుసరించినవారే. సమకాలికులే. నేఁటి శ్రీమద్రామాయణ, వాల్మీకిరామాయణ కర్తలనుబోలి యొకేవస్తువును గురించి వ్రాసినారు. ఇరువురి గ్రంథములలోను పదములపోలిక తక్కువైనను భావములపోలిక దట్టముగా నున్నది. శైలి శంకరకవిదే ప్రౌఢమనవలయును. శరభకవి పద్యమగు

"సప్తద్వీప సముద్రముద్రితమహా సర్వంసహాచక్రసం
ప్రాప్త శ్రీకమనీయలక్షణ జగత్ప్రావీణ్య సత్యవ్రతో
ద్దీప్తప్రాభవుఁడైన రాజసుతుఁ డర్థిన్ దైన్యభావోదయ
వ్యాప్తిన్ బెత్తెఁడునేలకైనఁ దగఁడే యంచు న్విలాపించుచున్."

అనుదానితో 'శంకరకవి'దగు నీక్రింది పద్యమును బోల్చుఁడు.

"అకటా! చేరెఁడునేలకున్ దగడె సప్తాంభోధివేష్టితభ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణశుంభత్పాదుఁడైనట్టి రా
జకుమారుం డని యేడ్చెఁ గన్నుగవ నశ్రుల్కాల్వలై పాఱఁగన్."

శరభకవి గ్రంథములో నేఁబదిపద్యము లధికముగ నున్నవి.

27. సింహాద్రి వేంకటాచార్యుఁడు లక్షణావివాహమును చమత్కారమంజరిని రచించెను. శ్రీవైష్ణవకవి. ప్రౌఢప్రబంధ లక్షణము లించుక పట్టినవి.

28. భాస్కరుఁడు కన్యకాపురాణమును రచించెనుట వైశ్యులెల్లఱకుఁ దెల్లము. ఇతనిని భాస్కరపంతులందురు. కవిత ప్రసిద్ధముగాక పోయినను గ్రంథముమాత్రము మతవిషయకమై, మాననీయమై వైశ్యులకుఁ బూజ్యమైనది.

29. మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్రమునే వ్రాసెను. మల్కిభరాముపర్గమున కితఁడును జేరినవాఁడని చాటువులు చాటుచున్నవి. ఈరాజుకవి కవిత్వము ప్రౌఢమై రమణీయమై తనరు శైలిని జాలువారుచున్నది.

"సరసులఁ దేలి పుష్పవనసంతతిపైఁ గడువ్రాలి సుప్తబం
భరములఁ దోలి చారుశుకపఙ్క్తుల నేలి ప్రసూనగంధమా
దరమునఁ గ్రోలి పుష్పితలతాతరులెక్కుచు సోలి మెల్లఁగా
జరగఁగఁ జొచ్చె దక్షిణపు... గాలి వయాళి మెంపునన్."

కాఁబట్టి పాఠకుఁడు నేడఁదీర్చుకొనుటకు హాయిగా నున్నది.

30. మల్లారెడ్డి, గంగాధర, రుద్ర, తెల్గనలతోపాటు మట్ల అనంత భూపాలుఁడును, నిభరాముని (ఇబ్రహీంకుతుబ్షా) వర్గములోనివాఁడే. శ్రీ వైష్ణవమతాభిమాని. కాకుత్స్థవిజయమను నైదాశ్వాసముల గ్రంథమును నిర్దుష్టముగ, రసవంతముగ,లలితపదలీలావిన్యాసములతో రచించినప్రౌఢ. "గబ్బున ద్రేచు" మున్నగు జాతీయములను వాడెను. తెల్గుపలుకులు కొల్లగానున్నవి.

31. సుదక్షిణాపరిణయ నిర్మాతయగు తెనాలి యన్నయ్య కృతిభర్త పులిజాల సోమామాత్యుఁడు "పలుకులకల్కికప్పురపుఁబల్కులఁ జల్లినరీతిఁ బండువె, న్నెలతళుకుల్ విధుండు వావణించినమించున శంబరారి చెంగలువల తూపుకోపుల ముఖాముఖిఁజూపిన యేపునన్ గృతుల్, పలుకఁగ నేర్తు"వని పొగడినాఁడు. 1580ప్రాంతముల నున్నవాఁడు.కవిత్వము రసవంతమై, తేటతెనుఁగుపదముల మేల్కొని యన్వయ సౌలభ్యము మెఱయ, శ్రావ్యమై, యయ్యైతావులలో దీర్ఘసమాసరచనలతో కవిపాండితిని జూపుచు, మధురమై గాలికిఁ గదలుకెమ్మలవ్రాలు పూలసోనవలె దొరలు మనోహర వృత్తములతో దులకించుచున్నది. ఇతఁడు సుకవిపఙ్క్తికెక్కఁ దగినవాఁడు, తెనాలివాఁడు, గావున రామకృష్ణునిమాహాత్మ్యము కొంచెము సోకినది. కాని, ప్రౌఢార్థపదప్రాచుర్యము గొనక ఇతనిధాటి లలితమధురార్థసందర్భసంగతమైనది.

"జలకంబుల్ దగఁగూర్చి నెన్నుదుట రక్షాకాంతిఁ బాదాంగుళీ
స్థలమృత్స్నాతిలకంబుఁ దీర్చి రుచులం దట్టాడు వజ్రంపు టు
య్యలపైఁ బొత్తుల నుంచి యోషధరకన్యాధీశ దివ్యాంశపే
శలమూర్తీ నిదురింపవే యను సుతుం జంద్రాస్య జోకొట్టుచున్."

అని చిత్రించినాఁడు. కాని, యొక్కకాసారము మాత్రము—

"కమలామందమరందబిందుకణికాకల్లోలడోలావిలో
లమరాళీగరుదంచలత్పవన బాలక్రీడనప్రోల్లస

తుక్కముదామోదిపరాగవాసిత దిశా కుంభీంద్రగండస్థలీ
సముదాయం......"

బగునంతవఱకుఁ బూర్తి గన్పడదు.

32. రామరాజు రంగప్పరాజు 1550 ప్రాంతమువాఁడై తన సాంబోపాఖ్యానమును శ్రీరంగనాథున కర్పించెను. శ్రీవైష్ణవుఁడు. "ఇతనిది సలక్షణమై నిరర్గళధారగల మంచికవిత్వము."

33. పసరము చిననారాయణనాయకుఁడు, శ్రీవైష్ణవులశిష్యుఁడు. ఇతనిశైలి విన సొంపు నింపును. కువలయాశ్వచరిత్ర మితనికృతి.

34. రామకృష్ణునితో సమకాలికుఁడైన లింగముగుంట రామకవియు శ్రీవైష్ణవసాంప్రదాయికుఁడే! చతుర్వాటికామాహాత్మ్యమను స్థలపురాణకర్త. కవిత నిర్దుష్టమై రసవంతముగ నున్నది.

35. సకలనీతికథానిధానమును, సకలపురాణసారమును రచించిన కూచిరాజు యెఱ్ఱనయే కొక్కోకమను కళాశాస్త్రమును రచించెను. కొక్కోకము కుంటముక్కల మల్లయామాత్యున కంకితము. కళాశాస్త్రమును యువకు లెట్లైన సంపాదించుకొని యుందురు. వృద్ధుల కక్కఱలేదు. కాన, దానిఁ దడవఁ బనిలేదు. ఇతని 'సకలనీతికథానిధానము'లో తేలిక తెనుఁగు నుడుగులతోఁ గొంచెపు సంస్కృతసామగ్రితో నొండొరులు మాటలాడుకొనునట్లుండు సులభపదసరణితో కథామంచ మల్లినాఁడు.

36. చంద్రహాసవిలాసము సంస్కృతశ్లోకముతో నారబ్ధమై పూర్వోత్తరభాగములుగా రచింపఁబడినది. కవియగు యాదవామాత్యుఁడు 'లక్షణశిరోమణి' యను యాదవామాత్యచ్ఛందమును గూడ రచించెను. కవిత "కదళీపాకముతోఁ దేనెలొలుకు ముద్దుపలుకులతో వినువారి వీనులకుఁ జవులుగొలుపుచు హృదయంగమముగా నున్నది."

37. పంచతంత్రమును రచించుటలో బైచరాజు వేంకటనాథుఁడు రెండవవాఁడని చెప్పనక్కఱలేదుగదా ! (దూబగుంట నారాయణకవి మొదటివాఁడు. మొదటివానికంటె రసపుష్టిగ రచించెనని కవిచరిత్రకారుని మతము. కాని, యరయఁగా నీ తీర్మానము వ్యత్యస్తమగున ట్లున్నది. మొత్తము మీఁద భాషాంతరీకృతి బాగుగనే యున్నది.)

38. రెంటూరి రంగరాజు భానుమతీపరిణయమును రచించి అప్పటి వేంకటగిరి ప్రభువగు రాయభూపాలున కంకిత మిచ్చెను. "ద్రాక్షాపాకమై మనోహరముగ నున్నది" కవిత. ఇతనిశైలికి మచ్చు:

"అలరెఁ జకోరముల్ మదనకంపితపాంథమనస్సరోజముల్
తూలఁగెను భీతిఁ జక్రములు ధూర్తగుణోజ్జ్వలజారచక్రముల్
నలినవిరోధినూత్నకిరణంబులు కొన్ని దివిం దలిర్పఁగన్."

39. శతకకవులలోఁ బ్రఖ్యాతుఁడగు పట్టాభిరామకవి యను భట్రాజు వజ్రపంజరశతకమును, మరున్నందనశతకమును, గువ్వలచెన్నని శతకమును రచించి కీర్తికాయుఁ డయ్యెను. ఈ కృతిత్రయంబును బఠనీయంబు.

40. భాస్కరశతకమును రచించిన మారనకవి (మారన వెంకయ్య?) యిప్పటి (1600) వాఁడే.

41. శ్రీ లీలాశుకకృష్ణకర్ణామృతమును గర్ణామృతముగా నాంధ్రీకరించినవాఁడు వెలగపూఁడి వేంగనార్యుఁడు. కవిత్వము నిర్దుష్టమై, శ్రావ్యముగా నుండుట యట్లుండ, తత్పాఠకులు పోతన్నకుఁ బిమ్మట నట్టి భక్త్యావేశముతో మూలమునే చదువునట్లుండునంత మనోహరముగాఁ దెల్గించినవాఁడు లేఁడని చెప్పవలయును. శబ్దాలంకారములతో రసమును సమ్మేళనముఁ జేసి చదువరులకు భావోద్రేకముఁ గల్గించుటతో సమర్థుఁడైన లీలాశుకుని కృతు

లను తెలుఁగులో దించుటకు సమర్థుఁడు వ్రాసినవి గొన్నిపద్యములే కదా! కాన ప్రతియాంధ్రుఁడును దానిఁ జదివి తీరవలయును. పాఠకులకు సత్పథ భావముల నీ కవి ఇట్లు రంజింపఁజేయును.

"అదిగో ముంగల పెద్దమద్దియటపో నాచెంత ప్రేపల్లె యు
న్నది యాదండఁ గళిందజాతటమునం దాపించభూజాళిలోఁ
గదుపు ల్మేపుచు గోపబాలకుఁడు నిక్కం బొప్పఁగాఁ దెల్పు స
త్పదవిం బొమ్ము సఖా! సుఖాస్పదముగా భావంబు రంజిల్లెడున్."

ఈతనికవిత్వము, భాషాంతరీకరణమైనను, పోతన భక్త్యావేశమును, క్రింది పద్యమునఁ గాన్పించురీతి శైలిని సైత మనుకరణమును బొందియున్నవి.

"చల్లనివాని నవ్వు వెదచల్లెడువాని దయారసంబు జో
బ్బిల్లెడువానిఁ గెంపు జిగి పెంపు సెలంగెడు మోవివాని సం
ఫుల్లసరోజనేత్రములఁ బొల్చినవానిఁ బయోధివీచికా
వేల్లిత నీలనీరదనవీనతనుద్యుతివానిఁ గాంచెదన్."

42. మాధ్వుఁడగు సారంగుతమ్మయ్య ఈయుగాంత్యభాగముననే మోహకావ్యవృక్షమునకు బీజము వేసినాఁడు. వైజయంతీవిలాసము నూత్న పథమును జూపినది. ఇదినాల్గాశ్వాసముల గ్రంథము. తొండరడిప్పొడియాళ్వారును దేవదేవి యనువేశ్య జయించి భోగించిన కథ ఇందలి వస్తువు. ప్రథమాశ్వాసములో దేవదేవి చోళేంద్రుని దర్శింపవచ్చి నృత్యము చేయుటలో నైనది. ఆ వేశ్య వలిపంపుమడుఁగుఁజల్వలు, కోరకొప్పును గలది. ఆమె నృత్యము చూచి తీరవలయును. ఆమె కటాక్ష వీక్షణాంచలంబులు "యువ ధైర్య కంచుకంబులఁ జించి చీకాకుపఱచి విసంచు" చేసినవి. రెండవయాశ్వాసమున శ్లేషానుప్రాణితంబగు శైలితో పుష్పవాటికావర్ణనమును, దేవదేవి విప్రనారాయణునిపై పంతముఁ బట్టుటయును, సూర్యాస్తమయాదివర్ణనలును, "చనుదోయి నిఱియఁగట్టిన చుట్టుపయ్యెద" తో, దేవదేవి దాసరిసాని

వేషము వేయుటయును, విప్రనారాయణుని తిరువడిఘుళ నామె యాశ్రయించుటయును, క్రమక్రమముగా నతని వజ్రపంజరనిభంబైన మనస్సు నీళ్లకుం బలుచనై కరఁగుటయును, వాన "సముద్యద్దీర్ఘనిర్ఘాత సం, రంభాఘాతవిభగ్నదిఙ్నగకఠోరగ్రావ ఖండావలీ, దంభాంభశ్చరవాహినీకలుషపాదశ్శుంభదంభోళురై, కుంభద్రోణముగాఁగ" గురియుటయును నైనవి. తృతీయాశ్వాసమున భక్తుఁడు దాసురాలిని కనికరించి లోపలికి రమ్మనుటయును, తరువాత నామెను మోహించి రమ్మనుటయును, నిజాంశుకమును తెరగావైచి దిగంబరయైన దేవదేవిని జూచి, యా బ్రహ్మచారి యమ్మగువమేన, నతనుఁడంగడినమ్ము పనసతొనయనఁగఁ దగినవస్తువును జూచుటయును, 'కాముకస్య కుతో లజ్జా' యనునట్లు మధురనువీడి, కాంచికివిప్రుఁడు వేశ్యతోఁ జనుదెంచుటయును, దేవదేవిమాత—విటలంపము—యవ్విప్రుని వెడలనడచుటయును, శరదృతువర్ణనయును, "వలచిన యింతిఁ బాయుం వగఁ వద్దుసుమీ పగవానికేనియుఁన్" అని విప్రుఁ డాడుటయు నడచినవి. చతుర్థాశ్వాసమున భగవంతుఁడే వేశ్యయింటిలోఁ దన గిన్నె నుంచినది తెలియక, వేశ్యమాత దానిని వర్తకులకుఁజూప నది బయటపడి, వేశ్యగృహము శోధనముజరిగి, విప్రనారాయణుఁడు శిక్షార్హుఁడు కాఁగా, రంగనాథుఁడే స్వయముగా వచ్చి విప్రునిలోఁ జొచ్చుటయును, దేవదేవి వైరాగ్యమును బొందుపడినవి. ఇట్టిది కథ. భక్తునకై వేశ్యపొత్తు దేవుఁడే కూర్చినాఁడు. దండనమునుంచి తప్పించి బ్రహ్మరథము బట్టించినాఁడు! కవి గోల్కొండనబాబుల యాశ్రితుఁడు. ఇబ్రహింషాగాక, మహమ్మద్‌షా ఇతనికాలపు ప్రభువు. కావ్యము లోకుల నడవళ్ళను విశ్వాసమును బ్రతిబింబించును. కవి దుర్నీతిని వ్రాసినాఁడని నిందించుట బాగుగాలేదు. తనకాలము నమ్మకమునకుఁ దానును లొంగినాఁడు. అప్పటియాచారము ఇప్పటి ప్రజలమనస్సున కధర్మముగావచ్చును. ఉద్దాలకునకు ముందు సంతానార్థము పరులభార్యలను యాచించుట ధర్మమేకదా! శుక్రునకు ముందు సురాపానము ధర్మమే కదా? అప్పటి శ్రీవైష్ణవులలో భక్తి ప్రధా

నముగాని, నీతిగాదని దీనిచేఁ దేలుచున్నది. మాల మాదిఁగల నుద్ధరించిన మహామతమునకు భక్తుని వేశ్యాభోగ మొకదోషముగాదు. అత్యున్నతభావముతో నడుగునఁ బడ్డవారిని లేవనెత్తినది. భక్తిప్రాబల్యముచే భగవన్నక్తభరత్వమును బుట్టించి పాపినిగూడ తరింపఁజేసినది. కళాదృష్టి కవికి బాగుగ నున్నది. సమయోచిత పదసన్నివేశము, సందర్భసముచితవర్ణనావైదగ్ధ్యము, వేశ్యాస్వభావవర్ణనా వైశద్యము, ప్రబంధ లక్షణసమన్వయము గలిగిన ఇతని కవిత యనుభవార్హము. చూడుఁడు: వేశ్యమాతలు "సూనశరభుక్త నిర్ముక్త శుష్కపత్రములు." చినుకులు "కటపెట, తొటతొట, పాటపాట" రాలినవి మొదట. "అంగజవ్యాధి కడుపుబ్బినట్టి విటుల, యాత్మజలపూరములతెట్టు వల్లపట్టు", "వెన్నెలల్ తారలలోన జాజె" అంతయుం సరియే. కాని, యితఁడు వేసిన [1]నూత్నమార్గముపై నితరులుం నడువఁదొడంగిరి. అదియే ఇతని గుణమునకును దోషమునకుఁ గారణము. మోహాకవిత్వము కొందఱికి వలయును. అందునను యౌవకులలో నరపాలునకు మించి వాంఛింతురు. అట్టి మోహాకావ్యకవిత నితఁడు పితామహుఁ డగుట నితని నింతవఱకుఁ జర్చించుట యైనది.

ఇఁక లాక్షణికకవులను,కవిచరిత్రము పేర్కొనని కవులను స్మరింతము.

43. వెల్లంకి తాతంభట్టు 'కవిచింతామణి' యను లక్షణగ్రంథమును జేసెను. ఇతఁడు రాయలకు సమకాలికుఁడు.

44. లింగముగుంట తిమ్మన్న 'సులక్షణసారము' రచించెను. ఇతఁడు రామకృష్ణునకు సమకాలీనుఁడు. ఇతని కృతి యంత ప్రచారముగాంచినది మఱేలక్షణగ్రంథమును లేదు.

45. ముద్దరాజు రామన్న యనునాతండు 'కవిసంజీవని' వ్రాసెను. పూర్వమే యాదవామాత్యఛందమును,బాలసరస్వతీయమును పేర్కొంటిమి.

---

1 చెదలువాడ మల్లయకృత విప్రనారాయణచరిత నెఱుఁగుదుముగదా!

46. సులక్షణసారమునకుఁ దర్వాత నధికప్రచారములో నుండునది యప్పకవీయము. ఛందోవిషయబాహుళ్యము. ఇతఁడు 1550 ప్రాంతమున నున్నవాఁడు. అప్పకవి లక్షణశాసనముతో యుగములోని కవితావృక్షమునకు శిశిరర్తు వాసన్నమైనది. లాక్షణికునకు లొంగినతర్వాత కవిప్రతిభ పాఱదు. కవికి లాక్షణికునితోడి మైత్రి ముఖ్యమేకాని దాస్యము మంచిదిగాదు. ద్వేషమైన భాష చెడునుగదా ?

47. పైయుగములలోఁ జేర్పక వదలిన ప్రబంధరత్నావళివారిలో తెల్లపూడి కసవరా జొకఁడు. ఇతనిది కళావతీశతకము.

48. సౌగంధికాహరణము వ్రాసిన రాయసం గణపయ్య యింకొకఁడు.

49. హరిశ్చంద్రకథకు కర్తయగు చంద్రమౌళి మఱొక్కఁడు.

50. రాపరది దేచిరాజు గ్రంథ మేదో తెలియదు.

51. గౌరన, శంకరకవి, శరభకవి, చంద్రమౌళి యనువారివలెనే దేవరాజభట్టు హరిశ్చంద్రకథను వ్రాసెను. హరిశ్చంద్రకథ జనప్రీతిఁ గాంచిన దనుట కింత మంది వ్రాయుటయే తార్కాణము.

52. మద్దికాయల మల్లయ రేవతీపరిణయము నిట నుదాహరింతము. లక్షణాపరిణయములు రెండైనవి. ఇది మూఁడవపరిణయము.

53. ఘటసాసి మల్లంభట్టువ్రాసిన జలపాలిమాహాత్మ్య మేయుగమునకుఁ జేరినదో? కవనము మాత్రము మధురమై, లలితమై, సలక్షణమై బాగుగనున్నది.

54. ఫణిభట్టుమాధవకవి ప్రద్యుమ్నవిజయమును రచించెను. ఈయుగపు నుడికారముల గడుసుపోకలు గానఁబడుచున్నవి.

55. రెడ్డిపల్లె ముద్దమరాజు అష్టమహిషీకల్యాణమునకుఁ గర్త. ద్విపదకవి ఇతనిని జూచి వ్రాసెనా? లేక, ఇతఁడే ద్విపద ననుకరించెనా?

56. నెల్లూరు ముత్తరాజు పద్మావతీకల్యాణమును వ్రాసెను.

57. పోతరాజు భైరవకవి శ్రీరంగమాహాత్మ్యమును వ్రాసెను. అతఁడును పోతరాజు వీరయ్యయును బందుగులా? అయిన నెప్పటివారు?

58. కంచిరాజు సూరయ్య తన కన్నప్పచరితమును ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యమునకుఁ బిదపనే రచించెనా? ధూర్జటి కవితయందలి సామరస్యము లేదేమోకాని ప్రౌఢిమాత్రము సమానముగానే యున్నట్లున్నది.

59. పాలపర్తి సోమేశ్వరుఁడు, శరభలింగమును గూర్చి శతకము వలె స్తుతిని గూర్చినాఁడు.

60. బహుగ్రంథకర్తయగు హరిభట్టు కాలము తెలియలేదు. ఇతర లక్షణగ్రంథములయం దుండియే పద్యములను గైకొన్న యప్పకవి యతని నుదాహరింపక పోయిన మాత్రమున నీతఁ డర్వాచీనుఁడు కానేరఁడు. ఇఁక నెందఱిగ్రంథములో బయల్పడవలసినవి యున్నవి. కవులకాల నిర్ణయము కావలసియున్నది. పెదపాటి జగన్నాథకవి సంతరించిన ప్రబంధ రత్నాకరమున నీకవి పేర్కొనఁబడి యుండుటచే 1600 ముందటివాఁ డని యే తోఁచెడిని. ఇతఁడు మత్స్యపురాణము, వరాహపురాణము, ఉత్తర నృసింహపురాణము, భాగవతైకాదశద్వాదశస్కంధములు రచించిన ప్రౌఢ. కృష్ణామండలమువాఁడు. వరాహపురాణము నరాంకితమని, మాత్స్యము రంగనాథున కిచ్చినాఁడు.నిసర్గలలితధారతో నిర్దుష్టముగ బహుగ్రంథములను రచించిన దొడ్డకవి. ప్రాచీనాంధ్రకృతులవలె రచనము విన నింపు; భావింప రసముఁ బెంపు.

61. నూతనకవి సూరన్న సకల జనాభి రామనామాంతరముగల 'ధనాభిరామమును' జేసెను. కుబేర మన్మథులు రూపసౌందర్యముల నేది ఎక్కుడని పందెమువేసికొని రెంటిని సమానములని నిర్ణయించిన కథ. శైలి

మనోహరము. చిమ్మపూఁడి యమరేశ్వరుని తర్వాతికవుల నితఁడు పేర్కొన లేదు.

62. అంగర నృసింహకవి, 'వ్రాసుటకు' మున్నగునవప్రయోగములఁ గొన్నిటిని వేసియున్నను స్తవనీయధారతో రాజరాజాభిషేకమును రచించినాఁడు. కాలము నిర్ణీతము కాలేదు.

63. పోలూరి గోవిందకవి భరతశాస్త్రమును తెనిఁగించెనఁట.

64. రంగనాథుఁ డను ప్రబంధరత్నావళిలోని కవి యెవ్వరో?

65. ఒంటరిగ నిల్చినవాఁడు సన్న్యాసి, సంగత్యాగి, వేమనయోగి. ఒకేకాలమున ప్రఖ్యాతులైయున్న ముత్తామాత్యుని రాయన భాస్కరుని, "పరగరాయనికులు బాచని ధనమెల్ల, భటులపాలు కవులపాలు దలఁప" యనియు, "ప్రాకటముగ నిట్టి లోకములో గుంటుపల్లి ముత్తఁడన్న పరమగుణుఁడు" ననియు వ్రాసియుండుటచే నిస్సంశయముగా వేమన 1623 తర్వాతనే యున్నవాఁడు.(ఇంతకు 150 ఏండ్లకు ముందు వ్రాయఁబడిన వేమనపద్యముల వ్రాఁతప్రతు లున్నవ్వ డంతకు నూఱేండ్లకు ముందున్నవాఁ డనుట యసమంజసము గాదు.) ఇతనివలెనే ప్రసిద్ధుఁడు నర్వాచీనుఁడు నగువాఁడు పోతులూరు వీరబ్రహ్మము. తత్త్వములు వీరికంటె ముందుపుట్టినవనియును, కాకతీయయుగపు యేగంటివారు, సిద్ధరామదేవుఁడు మున్నగువారు వ్రాసిన దానిని సమర్థించుకొనఁజాలని "యసమగ్రభావనా విభవులు మాత్రమే" వేమనాదులనియు, 14-వ ఆంధ్రసంవత్సరాది సంచికాసంపాదకులన్నారు. ఉండవచ్చును గాక! తారతమ్యములకుఁ బోక వేమననుగూర్చి యోచింతము. కవిత్వమును పరిణామ నియమములేక పాడుకొని యప్పటికప్పుడు కార్యకారణ విమర్శకు దిగక జిహ్వాచాపల్యముఁ దీర్చుకొని సంతోషించు కవులలో వేమన యొక్కఁడని యొక రనిరి. భావనాశక్తికిఁ బ్రమాణమైన వాఁ డనియుం, మహాకవి కోటికెక్కినవాఁ డనియుం, మూఢభక్తాదులను దూల

నాడుటలో నద్వితీయుఁ డనియు, కారణవిమర్శన శక్తికి పట్టాభిషేకముఁ జేసిన మహాత్ముఁడనియు, అతని పద్యములన్నియు లోకోక్తులనియు, పరిహాస రసము దట్టమైనను గాయము కనిపింపనీయని కత్తితో నుత్ప్రేక్షల నుపమేయముల నిర్మించెననియుఁ, నిదర్శనములఁ జూపుటలో నసమానుఁడనియును, వైశద్యమనుగుణ మితనియందు ప్రబలమనియు, సామాన్యవిషయములకు గాంతి, రూపము, ప్రాణము నావహింపఁజేసి యేవో వింతలుగాఁ జేయు గారడీ విద్యలో నీతఁడు మొదటివాఁడనియు, నితనికి సమానుఁడో, మించినవాఁడో పల్నాటిచరిత వ్రాసిన వీరకవి యనియు నింకొకరు నుడివిరి. ఇరువుర పలుకులును యథార్థములే కాని, సత్యనిరూపణాలేశపురంగుతో నవి యతిశయోక్తులవోలెఁ గన్పట్టుచున్నది. "నస్వమే యనువాఁడు నంబివెధవ" యగుటయు, అభిప్రాయములలోఁగల స్వవచనవ్యాఘాతములును చూచి, "వేద సారమెల్ల వేమనయే యెఱుఁగు" నన్ననానుడి "బడాయి" యనువారును నున్నారు. ఇతఁడు దత్తమండలవాసి. [దత్తమండలములో నాయాయెడఁ గన్పడు మెట్టవేదాంతము ఉత్తరాంధ్రదేశమున నంతగాఁ గన్పింపని కళంబునను, గుంటూరి మస్తాన్‌సాయబు తప్ప తక్కినవారనేకు లవధూతలర్వాచీను లప్పటికి దత్తమండలమునఁ బూజఁగొనుటయు, ధనసంగ్రహణశీలురగు కుహనావేదాంతు లగు భూసురు లిప్పటికిఁ గొందఱు శిష్యవర్గములలో నున్కియు, నితఁడు తప్పక దత్తమండలమువాఁ డే యనిపించుచున్నది. వీరక్షాత్రమునకు శృంగారవిషాదపర్యవసానమునకు, నిశ్చలతత్త్వ కపటవేదాంతమునకు, రేగడి నేలలను, యెఱ్ఱ మెట్టభూములను, కొండ సీమలను దున్ని బ్రదుకు మహోన్నత విగ్రహులగు కృషీవలులకు నావాసమైన దత్తమండల మాంధ్రసీమకు 'స్కాట్లాండు' వంటిది. 'ఉత్తరాది' ఇంగ్లాండువంటిది. తుంగభద్రా పినాకినీ తీరము లప్పటికిని కృష్ణరాయల సేనలోఁజేరి దక్షిణభారతమునంతయుం గెల్చిన వీరయోధులగు "మోటుమానిసు" లను, జగద్గురు విద్యారణ్య రాఘవేంద్రరాయాది మహాపురుషులను

గీర్తించుచు తరంగఘోషములతోఁ బాడుకొనుచున్నవి.] స్థలనిర్ణయమున వాదము లున్నవి. విచార్యము.

"విత్తులేని యట్టి వృక్షమొక్కటి పుట్టె
ఫలము పువ్వు మొదలు పత్రి లేదు
స్వాదులేదు చూడ సాపాటునకు లెస్స
దీనిభావమేమి? తెలుపు వేమ."

యని మనమునడిగికొనవలసిన పద్యము లల్లినాఁడు. [1]ఇతనిది మర్మకవిత్వమని, తాము నట్టిది వ్రాసినామని యొకరు ప్రదర్శించిరి. భావగీతములను విజ్ఞులు విచారింతురు గాక! ఒక్కటిమాత్రము వ్యక్తమగుచున్నది. ఇతఁడు ముంగోపి. "ఎప్పటికేది యాగ్రహజనకమైన దానినిఁ దిట్టును. తెగిన గాలిపటమువలె" నితఁడు స్వాతంత్ర్యభావమును, నవ్యతయును గల్గించినాఁడు కవితకు! ఇదిగాక ఇతనియిందు పాఠకుని మనస్సును సమాలోచనఁ జేయుటకుఁ, బురికొల్పుట ముఖ్యగుణము. ఇది మహాకవి లక్షణము. ఒకవిషయమును దడవినచో ననేకము లూహలుగల్గునట్లు భావనాప్రపంచమున నోలలాడించు శక్తియే "ధ్వని"యని ముందనుకొంటిమి. అట్టి ధ్వని కీతఁడు నిధి!

"పండ్లుపడ్డకుక్క పసరంబుఁ గరవదా?"
"తలలు బోడులైనఁ దలఁపులు బోడులా?"
"ఇంటిలోనిపోరు నింతింత గాదయా"

---

1 శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు, కవిత్వతత్త్వవిచారము. వేమన సోమశేఖరుని శిష్యుఁడనియు, వీరభద్రవిజయకర్తయగు పోతన సహపాఠియనియు నందురు. వీరభద్రవిజయకర్త శైవాభిమాని; భాగవతకర్త యెన్నటికిఁ గాఁజాలఁడు. వేమన పుట్టుక నెల్లూరుమండలము మూగచింతలపల్లెయనియు, కృష్ణామండలపు కొండవిడునికిపట్టనియు, కడపజిల్లా కటారుపల్లె సమాధిచోటనియుఁ గొందఱు తీర్మానించిరి.

"చెఱకు రసముకన్న చెలిమాట తీపురా"
"ముఱికిభాండమునను మునరు నీగలరీతి"
"మొదలు లేనిచేత తుది నెట్లువచ్చురా?"
"కల్లు కడవఁ గడిగి గంగ నించినరీతి"

మున్నగు వాక్యములం జదువుఁడు. కాకతీయాంధ్రసామ్రాజ్యములోని బహిరంతః ప్రపంచములను తిక్కన పోతన్నలు ప్రతిబింబించిరి. విజయనగరాంధ్ర సామ్రాజ్యములోని బహిరంతః ప్రపంచస్థితులను సూరన వేమనలు వ్యక్తముఁ జేసిరి.

---

## 3. యుగలక్షణ సమన్వయము

1. ఈయుగములోని ప్రధానకవు లొకరిని మించి యొకరు వ్రాసిరి. ఒకరి కింకొకరు మెఱుగులు వెట్టినారు. ఒక్కొక్క రొక్కొక్క ప్రబంధ రీతిని బోషించినారు. బాలసరస్వతి, అన్నయ్య, తెలగన్న, తమ్మయ్య, రాజలింగకవి యనువారి నీ యుగమునకు దశదిశ లనఁబడినవారితోఁ జేర్చిన పదునైదుగురు ముఖ్యకవు లగుదురు.

2. వాఙ్మయము పూర్వార్ధమునఁ బెంపొంది,యుత్తరార్ధమున నీరస మైనది. లాక్షణికులు పెక్కురైరి.

3. వాఙ్మయము విస్తృతిగాంచి నానాముఖములఁ బ్రవహింపు సూచనల నిచ్చినది. (చూ. రాయవాచకము).

4. అచ్చతెలుఁగు కావ్యములకు,"పిల్ల" ప్రబంధములకు, "మోహ కావ్య" పరంపరకు బీజములు చక్కఁగా నాటఁబడినవి.

5. నీతికావ్యకవిత వేమనయందు రెండున్నరవేలు గ్రంథముగా మాఱి సంపూర్ణస్వతంత్రపరిణతి నొంది ఫలించినది.

శతకచరిత్రఁ దిలకింతము. నీతికావ్య మన్నప్పుడు శతకము స్ఫురించుచున్నది. శతకములను భావగీతము లనిరి. భావగీతములు శతకకవితలో దాగుడుమూఁత లాడినవిగాని, శతకములు భావగీతములు మాత్రమే కావు. ప్రకృతిసందర్శనతన్మయత్వమున ముగ్ధుఁడై యొకే మనోవికృతిని విపులీకరించి కవి పాడుకొనునది భావగీతము (Lyric). దీనికి శ్రుతి సహాయముగాన భావగీతములలో గేయములు కలియుచున్నవి. శతకములన్ననో నానాభావానుభవ సంగ్రహములు. అనేకములు తురీయపురుషార్థసాధన కుపయోగ్యములైనవి. శతక ముఖ్యలక్షణములు:—1. చతుర్థపాదాంత్యసంబోధనము. మకుటమన్నిపద్యముల కొకమాదిరి నుండుట. 2. శతకముగాన నూఱు, లేక, నూటఎనిమిది పద్యము లుండుట. 3. శ్రోతకునుఁ గవికిని మధ్య తెఱలేకునికి (స్వీయానుభవముల కవి ముఖాముఖిగాఁ జెప్పుకొనుట)యును నై యున్నవి. 4. మూఁడవదానినింబట్టి యుద్రేకసాతత్యము, కథాసంవిధానమునకు బదులుగా నావశ్యకమైనది. ఉద్రేకమే భావావేశము. అనేకభిన్నభావసంపుటీకరణమే శతక మనఁబడును. భిన్నభావముల కుద్రేకసాతత్యము పూసలలోని దారము. శతక కవిత్వ పరిణామము ప్రాకృతము ననుసరించినది. ౧. దశకముల విభాగము మొదటిమార్పు. (నామదశకము, అవతారదశకము మున్నగునవి యేర్పఱచుకొని కవి శతకమును బూర్తిఁజేయును.) ౨. భావములమార్పు రెండవది: 1. శత్రుసంహారేచ్ఛ (వీరభయానకములు): గోగులపాటి కూర్మనాథకవి నృసింహస్తుతిలో, కవి తెలియని వేంకటాచలరమణ పశ్చిమరంగశతకములలో రూపొందినది. 2. సంఘదూషణము(హాస్యము): చౌడప్పాదులలోఁ గన్పడినది. 3. ప్రపంచానుభవము; తద్విచారము (Reflection): భాస్కరశతకాదులలోఁ దెల్లమైనది. 4. స్వాతంత్ర్యప్రియత్వము (శాంతాద్భుతములు): కాళహస్తీశ్వరప్రభృతులలోఁ దెల్లంబు. 5 నీతి సుమత్యాదులఁ బ్రకటితంబు. 6. శృంగార రసారాధనము: కలువాయి, కాంతాలలామ, లావణ్యాదులలో విస్తృతమై విరిసోన గురిసినది. 7 జ్యో

తిషశకునాదులు: శిఖనరసింహాదులలో వ్యక్తమైనవి. 8. మతవేదాంతములు; శైవవైష్ణవశతకము లనేకము లందుఁ గన్పడినవి. ఈవిధములుగా భావరసములు నానావిధములుగాఁ బ్రవహించినను శతకకవితలో నుత్కృష్ట రామణీయకతను గాంచినవి. భక్తిజ్ఞానములే యనుటను మఱువరాదు. శతకకవితా వైలక్షణ్యములు ముఖ్యముగా—1 స్వతంత్రరచనలు, (వస్తువు); 2 స్వతంత్ర ప్రయోగములు (శైలి); 3 వ్యావహారికపదసంక్రమణము (భాష); 4 ఆధ్యాత్మికవిషయము (భావము) నై యున్నవి.

శతకముల కుపజాతులని రెంటిని జేర్పఁగ నగును. 1 హ్రస్వశతకములు:—రుద్రకవి జనార్దనాష్టకము, సత్యవోలు భగవత్కవి దశావతారస్తుతి దశకము, త్రిపురాంతకుని చంద్రతారావళి, నవరత్నములు మున్నగునవి. 2 దీర్ఘశతకములు:—నీతిధర్మవేదాంతాదులను బోధించునట్టివి. ఈవర్గమునకు పండితారాధ్య వేమనలు చేరుదురు. వైపుల్యము పండితుని యందు ప్రారంభమై వేమనయందు పరమావధిని దట్టినది.

చాళుక్య చోడయుగమునకు పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకమును, కాకతీయయుగములో సర్వేశ్వరశతకమును రెడ్డియుగమున నారాయణశతకమును, రాయలయుగమునందు ధూర్జటి, మారకవి, పట్టాభిరామకవికృతులగు కాళహస్తీశ్వర, భాస్కర, గువ్వలచెన్న శతకములును ప్రఖ్యాతినందినవి. పట్టాభిరామకవి లాక్షణికులచేఁ బొగడ్తఁ గనెను. కేవల శతకరచయితయయ్యును గానరసము కావ్యగుణము.

మధ్యయుగములో శ్రీరామదాసు కంచర్లగోపన్నకృత దాశరథీ శతకమును, బాణాల వీరశరభేంద్రుని సాంబశివమును, శృంగారభక్తిసమగ్ర శతకకవితలో కవిరాజనందగు వైదర్భి అప్పయకవి భళిర కరివేల్పు, ఉపమాక వేంకటేశ్వరములును, అడిదము సూరకవి, కూచిమంచి తిమ్మకవి వ్రాసిన రామలింగేశ, కుక్కుటేశ్వరములును, రావూరు సంజీవకవికృత వీరనారా

యణ మను గునుగు సీసముల శతకమును, "ఇందూ,నందునిమందనుండికద నీ వేతెంచుటల్ రాకలక్" అను మకుటముతో వెలసిన చంద్రదూత, లేక, ఇందు శతకమును వ్రాసిన పుసులూరి సోమరాజకవి నందనందన స్తుతియు, [1](మాధ్వమతావిష్టమగు రమణప్ప విష్ణుసర్వోత్తమశతకము, బౌద్ధమతము నభిమానించిన శ్రీపతి భాస్కరకృత చిత్తశతకమును, తాత్కాలికసంఘ మును బ్రతిబింబించిన చక్రాతి లక్ష్మీనరసు గర్వాణకావ్య మనఁదగు కోదండ రామశతకమును, నుదిన సుభద్రయమ్మగారి కేశవాది శతకములును) శేషప్ప నృసింహశతకమును, వేమనఁబోలు మల్లయోగి పద్యములును, రాచవేటికవి గణికాగుణప్రవర్తన తారావళియును, తాడేపల్లి పానకాలరాయని శతక రాజము [2]మానసబోధమును, కాసుల పురుషోత్తమకవి యాంధ్రనాయక శతకమును బ్రజాప్రీతిఁగాంచి ప్రాచుర్యము నందినవి. జయరమారమశతక ములో శ్రీరామసాక్షాత్కారము లభించుచున్నది. ఇట్టి శతకకర్తలు ధన్యులు. వారికృతులం జదివి యాభావాతిశయరామణీయకము నభినందించి మనమును దరింతముగాక !

సంధియుగములో (1800-1900) మదనగోపాలశతకకర్త వంకా యలపాటి వేంకటకవియును,మాతృశతకమును జిత్రించిన మాత్తూరి అప్పావు మొదలియును, మీనాక్షీకందశతక కవయిత్రి బండిబాపనమ్మ, వేంకటరమణ కందకవయిత్రి రత్నాంబ యనువారలును, వేశ్యాగౌరవ ప్రీతిపాత్రమైన నాయికానాయక శతకమును రచించిన తోట విజయరాఘవ కవియును, లావణ్యశతకకర్త పోలిపెద్ది వేంకట్రాయకవియును, కలువాయి శతక మున శృంగారరసము నమితముగానందిచ్చిన డబ్బీరు నరసకవియును, పార్థ

1 అధిక ప్రాచుర్యము లేనివి గాన "బ్రాకెట్ల" లో నుంపఁబడినవి.

2 "మనసా! హరిపాదము లాశ్రయింపుమా" యను పద్యములరుచి యనుభవైకవేద్యము.

సారథి, జానకమ్మ శతకములు రచించిన చెలికాని చెల్లయ్యమ్మయును సుస్మరణీయులు.

ఎటులయినను నానావిధ విస్మృమరకవితా స్రవంతి మధ్యమ యుగమున శతకములలోఁ జక్కఁగ బలిసియుండుటచేతను, కావ్యములకన్న నా యుగములోని శతకములే సుప్రసిద్ధము లగుటచేతను, వేమన పురికొల్పిన శతకరచనాపక్కి వృథపోక, నతివేగముగ ఫలించుటచేతను, శతకకవిత్వాదిపటిమలు దూషణకావ్యాదులుగ మాఱుటచేతను, మధ్యయుగము శతకయుగమన్న దూరము గానేరదు. ప్రభువులు పోషించినారు. శతకకవిత గొప్పదని (చూ. [1]చింతలపల్లి వీరరాఘవకవి) కవులు పరిగణించినారు.

అయ్యెతావులలో నాయకవులు కొందఱు పేర్కొనఁబడినవారు. హ్రస్వశతకకవిత నేఁటి భావకవితకు పూర్వరంగమైనది. అంతియేగాని వాస్తవమరసిన హూణభాషాపఠనమే నేటిగీతములకు, నూవోగానములకు ప్రధాన తాత్కాలిక హేతువు.

(ప్రాకృతములోని ఛాయ లున్నంతమాత్రమున ప్రాకృతసంభూతము మనభాష యనుట పొసఁగదు. ఆంగ్లేయానుకృతు లున్నంతనే తెనుఁగింగ్లీషు నుండి జన్యమనుట పొసఁగునా?)

**6.** దక్షిణములోని యాంధ్రరాజ్య మొకవంక, విజయనగరరాజేంద్రులొక ప్రక్క, మల్కిభరా మొకకెలన నాంధ్రభారతికి బాసటగా నిల్చిరి. ప్రభువుల పోషణ మింత విరివిగ నేయుగమునను లేదు. అనేకు లధికారమున నుండువారలుగూడ కావ్యముల రచించుటయ తార్కాణము.

---

1 శతకకవులచరిత్ర

7. విద్యానగరము, గోల్కొండ, మథుర, నంద్యాల, చంద్రగిరి వాఙ్మయరంగము లైనవి. ఉత్తరాంధ్రసీమలో బొత్తిగ నాంధ్రభాష సంచారము మానిన ట్లున్నది.

8. ౧ ఈయుగమున గుణదోషములు సమ్మిశ్రములు. దోషములు ముందునకు మార్గదర్శకము లయ్యెను. మానవజీవిత పరిశీలనమున, నసామాన్యమైనను, నారికేళపాకమును జూపినది. ౨ భాషావిషయమున ననుపమానమైనను, వసుచరిత్ర కథాసంవిధానమునను, "సంభాషణసమీచీనత" యందును నధమమైనది. అనుకరణముల మంచిదనిపించినది. 3 "జాతీయములకు నిలయమై" నాటకసంప్రదాయముల కిరవైన ప్రభావతీప్రద్యుమ్నము ఔచితికి భంగముఁ గల్గించినది. ౪ ప్రబంధరచనపై ప్రజాభిమానము మెండగుటచేఁ గుప్పతెప్పలుగా నవియే పుట్టఁదొడఁగినవి. ౫ ద్వ్యర్థికావ్యములు శ్లేషకు దారివైచినవి. పాండిత్యప్రకర్ష మొకగుణముగాఁ బాటింపఁబడినది.

9. శ్రీకృష్ణదేవరాయల "యవనవిజయ" మహాసభ చిరస్మరణీయమైనది.(దానితో నారంభమైన ప్రబంధయుగమునకు సూరన్నను జక్రవర్తిగాఁ గొందఱు పేర్కొందురు. కావచ్చును. కాని నాతఁడు తిక్కన, పోతన, వేమనలతోఁ జేరఁదగినవాఁ డైనాఁడు). పైయుగములకు పాల్కురికి సోమనాథ నాచనసోమనాథ శ్రీనాథులు కవిరాజులు అయినట్లే తెనాలిరామకృష్ణ "సరసకవితాసనాథుఁడు" కవిరాజుగాఁ బరిగణింపఁ దగినవాఁడని నాయాశయము. (రామలింగ రామకృష్ణు లొక్కటియై గ్రంథములన్నియు బయల్పడిన నీయూహ స్థిరపడఁ దగినదియే.) రాయలు దండనాథుఁడు. పెద్దన పురోహితుఁడు. భట్టు వంది. తిమ్మనమంత్రి ఇతరు లితరులు.

10. పైయుగములోని కావ్యసరస్సు కట్టతెగి ప్రబంధనదియై యీయుగమునఁ బారి సాధారణగ్రంథ సముద్రజలవిరసక్షారములతోఁ జేరి, భావియుగమున వెగటైనది.

11. ఈయుగమున ప్రభువు లనేకుల వైష్ణవ స్వీకారమునం జేసి గ్రంథములకు విశిష్టాద్వైత ప్రాధాన్యము గల్గినది.(చాళుక్యయుగమున వైదిక ధర్మము, కాకతీయమున వీరశైవము, రెడ్డియుగమున సాధారణ శైవము. వైష్ణవభావములు వెలిఁగినవి.) శైవముగూడ ఈకాలమున నిరసింపఁబడలేదు. వైష్ణవులగు భట్టరు, చిక్కాచార్యులు, కందాళప్ప, తాతాచార్యు లనువారు ప్రసిద్ధ వైష్ణవాచార్యులు.

12. స్వకపోలకల్పనాప్రతిభ పింగళి సూరనార్యుని కవిత్వతరంగము లలోఁ నొడ్డుఁదాఁకినది.

---

శ్రీ

# ఆంధ్ర వాఙ్మయచరిత్రసంగ్రహము

## చతుర్థఖండము - అర్వాచీనకవిత్వము

(1651 - 1875)

---

## మధ్యమయుగము (శతకము).

(1651 - 1800)

### ౧. సంఘచరిత్రము

1658 లో మొగలాయిసామ్రాజ్యమునకుఁ గడపటి చక్రవర్తియగు నౌరంగజీబు పట్టాభిషిక్తుఁడయ్యెను. దక్షిణములో మిగిలిన మహమ్మదీయరాజ్యములు విజాపురము గోల్కొండ అని తెలిసియుంటిమి. ఇభరాముని తర్వాత నతని కొడుకు, మనుమఁడు వరుసగా గోల్కొండను బాలించిరి. ఆ మనుమనికి మేనల్లుఁడు అబూహసన్ కుతుబ్షా యనఁబడు తానీషా రాజై 1658 నుండి 1687 వఱకుఁ బాలించెను. ఇతనితో శివాజీ మైత్రి చేసెను. ఈకాలముననే శివాజీ ఛత్రసాలు లుదయించి విజృంభించిరి. తానీషా ముఖ్యమంత్రియగు మాదన్నకు గోపన్న మేనల్లుఁడు. 1687 లో గోల్కొండ మొఘలులవశమయ్యెను. చాందుబీబీ ఇప్పుడే పాలించుచుండెను. ఆమెకాలమున అహమద్ నగరము పోయినది. విజాపురరాజ్యము 1683 లో నస్తమించెను. కాఁబట్టి 1700 వఱకంతయును భరతఖండము

పూర్తిగా మొఘుల్మయమైనది. తర్వాత క్రమముగా మొఘుల్సామ్రాజ్యము క్షీణించి, యౌరంగజేబు తర్వాత వచ్చిన రాజుల పరంపరలోనివాఁడగు మహమ్మదుషా కాలములో చీలితునకలైనది. 1724 లో క్రొత్త హైదరాబాదు రాజ్యమును నిజాముల్ముల్కు స్థాపించెను. 1754 ప్రాంతములకు మహారాష్ట్ర విజృంభణ ముచ్చదశ నందినది. 1803 లో నింగ్లీషు వారికి మహారాష్ట్రులకుఁ బోరు జరిగి ఇంగ్లీషువారు విజయవంతులైరి. దక్షిణమున ఆర్కాటు మొదలగు నబాబులు నిజాము ప్రభృతులు సామంతులైరి. విక్టోరియా మహారాజ్ఞి కాలమున నీస్టిండియా ప్రభాతములో నుండి బ్రిటీషు సామ్రాజ్యభానుఁ డుదయించెను.

దక్షిణదేశములోని యాంధ్రరాజులు, నాయఁకులు 1750 వఱకుఁ బాలించిరి. తర్వాత వచ్చిన తురకరాజ్యము 1790 లో బ్రిటీషు సూర్యకాంతిలో లీనమై పోయినది. 1623-1659 లలో పాలించిన మధురరాజును తిరుమలనాయఁకుని స్మరించినారము. [ఆతరువాత 1704 వఱకు నెవరు పాలించిరో! [1]విజయచొక్కప్ప నాయఁకుని కుమార్తెను తిరుమలనాయఁకుఁడువివాహమాడెనని తంజావూరు మహాలులోని రామపట్టాభిషేక చిత్రమును గాంచియుండు రక్షకభటులు చెప్పిరఁట! 1659-1704 లోనే చొక్కనాథనాయకుఁ డను మధురరాజు తంజావూరు విజయరాఘవరాజును జంపెను. అట్లు చంపఁబడినది 1704-వ సంవత్సరమఁట.] కృష్ణరాయల కాలములో నాగమనాయఁడు మధురను వశపఱచుకొన్న

1 దుర్మతి, మార్గశీర్ష సారస్వతానుబంధము, శ్రీకర్రి సత్యరాజుగారు.

చోళరాజునుజయించుటయును, నతఁడేమధురకురాజు కాఁగా రాయలుకోపించి నాగమనాయనికొడుకు విశ్వనాథునిపంపఁగా నతఁడు తండ్రిని ఖైదుగాఁ జేయుటయును, తర్వాత విశ్వనాథనాయకుని రాయలు రాజుగాఁ జేయుటయును, విశ్వనాథుఁడే చోళరాజును జయించెననియు, అచ్యుతరాయలు రాజ్యాభిషిక్తుఁడైన యనంతరము,తనభార్యయగుతిరుమలమ్మకు చెల్లెలగు మూర్తెమ్మను పెండ్లాడిన చెవ్వప్పనాయఁకుని, చోళదేశమునకుఁ ప్రత్యేకనాథుఁడు లేనందున, రాజుగాఁ జేసెననియు, తంజావూరి యాంధ్రరాజుల చరిత్ర నుడువుచున్నది. ఆచరిత్రమే పెదవీరప్పనాయఁకుఁడు తర్వాత పాలించెననియు,పిమ్మట వచ్చిన తిరుమలనాయఁకునికి తంజావూరిరాజపుత్త్రి భార్యయై యొకనాఁ డేదోహాస్యముగా తనతండ్రినగరు తిరుమలనాయని నగరుకన్న బాగున్నదనఁగా నామెను మగఁడు పొడిచి చంపెననియు, తిరుమలరాయనికి మనుమఁడు రాజా చొక్కనాథనాయనిం గారనియుఁ దేల్చినది. ఈచొక్కనాథునాత్మజుఁడే చొక్కలింగనాయఁకుఁడు. (?) ఇతనికొడుకు విజయరంగ చొక్కనాథుఁడు.

ఇఁక తంజావూరు కథను జూతము:— చెవ్వప్పనాయని కొడుకు శ్రీరఘునాథరాయలు; అతనికుమారుఁడు శ్రీవిజయరాఘవరాయలు. ఈవిజయరాఘవరాయలు మహాభక్తుఁడై రంగేశునిఁ గొల్చుచు బ్రాహ్మణులకునిరతాన్నప్రదాతయై యుండెను. తండ్రికొడుకు లిద్దరును భాషాపోషకులే. విజయరాఘవరాయలు తనకూఁతును చొక్కలింగనాయఁకున కియ్యనందున నిద్దరకుఁ బోరుగల్గి సముఖము వేంకట

కృష్ణప్పనాయకుఁడనుమధురసేనాని తంజావూరును ముట్టడించి, విజయరాఘవుఁడు దేవధ్యానములో నుండ పురినిగొల్లఁగొట్టి రాజును సమాధానమునకుఁ బిల్చెను. సమాధాన మొప్పక విజయరాఘవనాయఁడు కొడుకు మన్నారుదేవునితోఁ గూడ పోయి ఎదుర్కొని కొడుకు మడియఁగా తానును బోరి మడిసి శ్రీరంగేశునిఁ జేరెను. హా! ఆవృద్ధవీరుఁ డెట్లుండెనో! అంతఃపుర మగ్నిలోఁబడి నశించినది. మిగిలినప్రాణి చెంగమల దాసను వంశాంకురము. నాలుగేండ్లది. ఆపిల్లవానిని సాకిన వర్తకునిఁ జూచి సంగతి తెలిసిన నియోగి వెంకన్న చే, తంజావూరికి ప్రతినిధిగా చొక్కనాథునిచే నియమితుఁడైన యతని సవతితమ్ముఁడు అళగిరినాయఁడు ప్రేరేపింపఁబడి తిరుగుఁబాటు చేసెను. అతనిపై దండెత్తి చొక్కనాథనాయఁకుఁడు వచ్చి యోడించెను. అళగరన్న కోటలో డాఁగి శరణనెను. ఇంతలో వెంకన్న విజాపురమునుండి షాహాజీకొడుకు వెంకోజీని సైన్యమును వెంటఁగొనివచ్చెను. చొక్కనాథుఁడు వెనుదిరిగెను. విజయరాఘవనాయని మృతికి ముందు భూస్థాపితమైన ధనసహాయముచేత వెంకన్న చెంగమలదాసును రాజుచేసి, వెంకోజీకి లంచమిచ్చి యితర తురకసర్దారులను తృప్తిపఱచెను. చెంగమలదాసు 14 సంవత్సరముల బాలుఁడు గాన తన దాదిమాటలు విని, దాదికి వలపు మగఁడైన సెట్టికి దళకర్తప్రధానిక మిచ్చెను. వెంకన్న యది సహింపక వెంకోజీకి దుర్బోధఁజేసి, తన కుతంత్రముచే తంజావూరి మహారాష్ట్రనాయఁకుఁడు వెంకోజీ కప్పించెను. (వెంకో తండ్రి షాహాజీ ప్రథమపుత్త్రుఁడే శివాజి యని యెల్లర

చెల్లంబ.) వెంకోజీ వెంకన్న యుక్తిపరుఁడని వెళ్లఁగొట్టెను. ఆ 1684 తర్వాత తంజావూరును వెంకోజీయును, మన్నఁడు జయసింహావల్లభుఁడు, అతనివంశమువారును బాలించిరి. తంజావూరిలో ప్రతాపసింహుఁడు 1740-1765 వఱకుఁ బాలించెను. అతనికొడుకు తుళురాజేంద్రుఁడు 1765-1788 వఱకుఁ బాలించెను ముద్దుపళని ప్రతాపసింహుని యుంపుడుకత్తెయఁట. చెంగమలదాసువంశమువారు చిన్నజాగీరుదారులై మధుర రాజులప్రాపులోఁ బ్రదికిరి. తంజావూరునాయఁకరాజులధనము "విప్రులకూ కవులకూ" ఖర్చైనది. అళగరన్నయు రసికుఁడై 'సత్యభామాసాంత్వనము' కృతి నందుకొన్నాఁడు. నాయఁకరాజుల "గుళ్లూ సరస్వతీభాండారమూ మేడలూ" నిల్చి వారి కీర్తిని స్మరించుచున్నవి. చెంగమలదాసుని కొడుకు విజయరాఘవనాయఁడు. అతనికొడుకు విజయమన్నారప్ప. ఇతని చెల్లెలిని చొక్కనాథుని (కుమారుని తర్వాత రాజ్యమునకు వచ్చిన) మనుమఁడగు విజయరంగ చొక్కనాథున కిచ్చి వివాహాముచేసి బావ యిచ్చిన జాగీరు ననుభవించెను. విజయరంగ చొక్కనాథుఁడు 1704-1734 వఱకుఁ బాలించెను. 1750 తర్వాత తురకలు, 1790 పిమ్మట నాంగ్లేయులు వచ్చిరి.

ఈ దక్షిణాంధ్రరాజుల కుద్దిగాఁ జెప్పఁదగిన సంస్థానములు కొన్నియున్నవి. భాషాపోషకు లగు ప్రభువులను స్మరించుట మనకుఁ గర్తవ్యము గదా! పెద్దాపురసంస్థాన మీ విషయమునఁ బెద్దయే! వెణుతురుపల్లి విశ్వనాథకవిని ఏనుఁగు వారిని వీరే పోషించిరి! [1]పెద్దాపుర రాజవంశమునకు చాగి

1 కవిచరిత్ర తృతీయభాగము.

పోతరాజు మూలపురుషుఁడు. 1230 సంవత్సరమున ఇతఁడు వత్సవాయనగరమును నిర్మించినందుననితనివంశమువారికి వత్స వాయనామము వచ్చినది. ముసలి తిమ్మరాజుగారు పెద్దాపుర సంస్థానమును సంపాదించి 1555-1607 వఱకుఁ బాలించెను. ఇతఁడు విశ్వనాథుని శేషధర్మప్రబంధమునకు భర్త. రాయన రాజు 1649 వఱకు పాలించి హరిభక్తిసుధోదయమును రచింపించెను. సార్వభౌమ తిమ్మరాజు 1688 వఱకుఁ బాలించి యేనుఁగు లక్ష్మణకృత ద్రౌపదీపరిణయమునుకృతివడసెను. ఇతని తమ్ముఁడు రాయపరాజు 1714 వఱకు నుండెను. రాయపరాజు తండ్రి బలభద్రరాజు కవియు, రామశతకకర్తయు, కిరాతార్జునీయ భర్తయు నై వెలసెను. ఇతని మనుమఁడు శ్రీరాయ జగపతిరాజు 1756 ఆనందగజపతిచే రణనిహతుఁడయ్యెను. ఆతని కుమారుఁడు తిమ్మజగపతి 1797 లో పరమపదించెను. ఇతనికే పూర్వోక్తలక్ష్మణకవికి పౌత్రుఁడైన లక్ష్మణకవి, సుభాషితరత్నావళికి కర్త, యాశ్రితుఁడై యుండెను. పెద్దాపురమును బోలినదియు, "నాంధ్రక్షత్రియుల" కాదిపీఠ మనఁబడినదియు నగు పూసపాటి యాస్థానము సుస్మరణీయము.పూసపాటివార సూర్యవంశజుఁడైన మాధవవర్మసంతతివారు 1652 సంవత ములో రఘునాథరాజు భోగవరపు తాలూకాను పాలించె పూసపాడువాసము పూసపాటిపేరుఁ దెచ్చిపెట్టినది. కొ సీతారామరాజుగారు విక్రమవంతుఁడై కళింగరాజని గనియె. ఇతనికొడుకు సుప్రసిద్ధుఁడగు విజయరామర మన్నెసుల్తానై 1712 లో విజయనగరకోటకు శంకుస్థా జేసెను. 1753 లో కొండపల్లి, రాజమండ్రి వగైరా సర

రుల ఫ్రెంచివారికిచ్చెను. జాఫరల్లీని (శ్రీకాకుళనబాబు) వీడి, ఫ్రెంచివారిమైత్రి పాటించి, వారిని బుస్సీ సేనానిక్రింద బొబ్బిలిమీఁదికిఁ బురికొల్పి, తాను తాండ్రపాపయ్యచే 1757 లో నిహతుఁడయ్యెను. తరువాత పితృవ్యపుత్త్రుఁడానందజగపతి రాజై యాంగ్లేయులతో మైత్రిచేసి ఫ్రెంచివారిని వెడల నడుప యత్నించెను. కర్నలు ఫోర్డుసాయముచే ఫ్రెంచివారినిఁ దోలి బందరును వశము చేసికొనెను. కాని, తాను క్రొత్తఁగా జయించిన సొమ్మున కాసపడక తనరాజ్యమును దాను నిలుపుకొనెను. (1759 సమయముననే నిజాము సలాజతుజంగు ఇంగ్లీషువారికి సర్కారులను, కొండవీడును వదలెను.) వెనుదిరుగునపుడు చనిపోయెను. బొబ్బిలి యుద్ధనిహతుఁడైన విజయరామరాజు పత్ని వేంకటపతి రాజును, జ్ఞాతిపుత్త్రుని పెంచుకొనెను. ఆ దత్తపుత్త్రుఁడే రెండవ విజయరామరాజు. ఈవిజయరామరాజు (పెద్దాపురమున నాకాలముననే యున్న తిమ్మజగపతివలెనే) బాలుఁడైనందున సవతి యన్న యగు సీతారామరాజు మంత్రిగా నుండి రాజ్యపాలనఁ జేసెను. ఈ సీతారామరాజొక యద్వితీయపురుషుఁడు. క్షాత్రమును మెఱయించి తనరాజ్యమును స్వతంత్రరాష్ట్రముగ నేలిన ఘనుఁడు. ఈఘనతలో నన్యాయపరరాజ్యాక్రమణమును, ప్రజాసంక్షోభమును గలసి క్రౌర్యముగఁ బరిణమించినదని యడిదము సూరకవి రామలింగేశ శతకము సాక్ష్యమిచ్చుచున్నది. ఇతఁడు తుదకు కంపెనీవారిచే నుపకారవేతనము గొని సింహాచలముఁ జేరెను. ఇతని దుష్పరిపాలనమునకు ఫలముగా విశేషఋణముగల్గి విజయరామరాజుగారిని బందరు

నకుఁ బోవునట్లు కంపెనీ యాజ్ఞాపించెను. అతఁ డట్లుపోక పద్మనాభుని కొండలో నిల్చెను.

ఇతనిబంధువులు రాచవారు బాసటయైరి. వీరందఱు ముప్పావుఘంట పోరి, యింగ్లీషువారిచే నిహతులైరి. రెండవ విజయరామరాజుగా రి ట్లుత్తమక్షత్రియ వీరమరణ మని మ్రందగా నతనికొడుకునకు నారాయణబాబునకు 1807-వ సంవత్సరమున నప్పు లన్నియుఁ దీర్చి కంపెనీ మరల రాజ్య మిచ్చినది. వీరిపుత్రపౌత్రులు విజయరామగజపతియు, నానంద గజపతిగారును మహారాజబిరుదముతో వర్థిల్లి సద్యశస్సు సంపాదించిరి. అటులనే దాట్లవారు, జంపెనవారు, పెనుమచ్చ వారు, మంథెనవారు, మందపాటివారు, దంతలూరివారు, తునివారు, మొగలితుట్టువారు మున్నగువారు విజయనగర పెద్దాపురములతో పాటు ఆంధ్రక్షత్రియవిద్వత్ప్రభుపరంపర కెక్కినవా రున్నారు.

బొబ్బిలిసంస్థాపకుఁడు పెద్దారాయనింగారు గొప్ప వాఁడు. రంగారావని ఇతని బిరుదు. బుస్సీ యను ఫ్రెంచి నాయకుఁడు విజయనగరరాజుతోఁ జేసిన యొడంబడిక తనకు మంచిది గాదని యెఱింగి దానిని భంగపఱుప యత్నించెను. విధి వేఱైనది. రాజమండ్రిలో బుస్సీ నితఁడు చూడలేదు. బొబ్బిలిని శత్రువులు ముట్టడించిరి. వధూశిశుసంహార మెప్పటి యట్లు జరిగినది. రంగారావుగారు వీరస్వర్గమునకుఁ బోయిరి. అతనిభటు లొక్కరును పాఱిపోక వీరమూర్తులై పోరి మర ణించిరి. ఈబొబ్బిలి యుద్ధము నాంధ్రు లెల్లరును విని పర వశులు గాఁ దగినదియే. బొబ్బిలిరాజులకథ 1794-వఱకు దుర

దృష్టమే. ఆపైన ఇంగ్లీషువారు తత్సంతతివారికి రాజ్యమప్పగించిరి. పద్మనాయకవంశజుఁడు శూరుఁడు వెలమదొరయు నగు రంగారావును పిఠాపురవేంకటగిరిరాజకుటుంబములు నొకవంశమునకే చేరినవి. వేంకటగిరి పిఠాపురము లిప్పటికిని భాషాసేవను జేయుచునే యున్నవి. నూజవీడు. జటప్రోలు మొదలగు నితరపద్మనాయక సంస్థానముల నెన్నియో గ్రంథకర్తల కాశ్రయము నొసంగి ధన్యము లైనవి. వీరితోఁ జేర్చి పండితసన్మానమును గావించిన గద్వాల, కార్వేటినగర, కాళహస్తి ప్రభువులును వందనార్హులు. [1]వెలుగోటివారిమూలపురుషుఁడగు చెవిరెడ్డిగాథయు, సర్వజ్ఞసింగమనీఁడను ప్రసాధాదిత్యనాయఁడును విష్ణుమాయావిలాసకృతిపతి, శ్రీ పెదయాచమనాయఁడును సుప్రసిద్ధులు.

మైసూరు రాజులు గూడ స్మరణీయులు. వీరిదళవాయులుగా నున్న కళువె వీరరాజు,నతనికొడుకు నంజరాజును చిక్కదేవరాయలును, చామరాజ పుత్త్రుఁడగు కృష్ణభూపతియును భాషాపోషకులు. సుదురుపాటి కవులకాశ్రయు లైన తొండమానురాజులు పుదుక్కోటపతులు పేర్కొనఁదగినవారు. ఋూస్లే దగ్గఱనున్న ద్విభాషి ఆనందరంగంపిళ్లె కూడ కృతుల నందుకొనెనఁట! ఇచటనే నవపాలపురాధిపతియగు రాయరఘునాథుఁడును, సేలము కృష్ణమనాయఁడును, ఇఁక నట్టివా రదంఱును స్మరింపఁబడవలసినవారు. శ్రీవాసిరెడ్డి వేంకటాద్రినాయఁడిట పేర్కొనఁదగినవాఁడు. ఇతనియాశ్రితుఁ డుభయభాషావేదియు, కవియు, నభినవకాళిదాసబిరు

[1] వీరివంశచరిత్రలు సమయమునకుఁ జిక్కనందున వ్రాయఁబడలేదు.

దాంకితుఁడునైన ములుగు పాపయారాధ్యకవి గీర్వాణమున
ఏకాదశీ మాహాత్మ్యాదులను, 1760 తెలుఁగులో దేవీభాగవ
తాదులను, అచ్చతెలుఁగులో "సర్వ మధురమును" వ్రాసిన
దొడ్డకవి. ఇతనికవిత ప్రౌఢమైనది. సత్యర్హుమని యందురు.

---

## ౨. వాఙ్మయచరిత్ర

శ్రీకృష్ణదేవరాయలవంటి శ్రీరాజరాజ పరమేశ్వరులు లేరు. దేశమంతటను చిన్నజమీందారీ లేర్పడినవి. వీరు ఫ్రెంచి ఇంగ్లీషువారి సాహాయ్యమునుగొని పరస్పరము పోరాడి క్షీణించిరి. కాఁబట్టి ఇది మధ్యమ యుగమైనది. గ్రంథము లన్నియు ననుసృతులును, లేకున్న భాషాంతరీకృతులును, లేకున్న ప్రజాశయౌన్నత్యమును సరకుగొనక ప్రజాతీతములోని యల్పతను ప్రతిబింబించిన ప్రబంధములును నగుటచే చారిత్రకముగ నేకాక వాఙ్మయవిషయమునను [1] మధ్యమమే యైనది. అర్థవంతమైన పాండిత్య ప్రకటనమునఁ గూడ పూర్వీకులతోఁ దులఁదూఁగునట్టి బాలసరస్వతుల లేమి సాహితీదక్షతయందును మధ్యమమే యైనది. క్రొత్తపథము చాల లోక్కటియుఁ ద్రొక్కఁబడలేదు. వృద్ధినొందిన వచనకావ్యములలో నాధునిక ప్రౌఢిమ యింకను బట్టలేదు. కాన, గద్యవిషయమునను గూడ మధ్యమమేయైనది. ఎటు చూచినను ఈయుగమునకు మధ్యమయుగమను పేరు సార్థకముగ నున్నట్లున్నది. [2] చూడఁగా శతకగేయకవితలు ముఖ్యములు.

---

1 దీనిని మధ్యమయుగమని తొలుత వ్రాసినది శ్రీ ఆంధ్ర శేషగిరి రావుగారు. కాని, వారిభావము వేఱు. వారాంధ్రవాఙ్మయమును భాషాంతరీకరణయుగమని, ప్రబంధయుగమని, మధ్యమయుగమని కవిచరిత్రకారుని ఆదిమధ్యఆధునిక కవులవిభాగము నించుమించుగా ననుసరించిరి. (14-వ ఉగాదిసంచిక).

2 గోపన్న త్యాగరాజులఁగుఱించి ముందు చర్చింతము.

ఈకాలపు వాఙ్మయమును దడవుటలోఁ 1 ప్రబంధకవులని, 2 లాక్షణికకవులని, 3 శాస్త్రకవులని, 4 ఆంధ్రీకరణకవులని, 5 మోహాశృంగార కావ్యకవులని, 6 ద్వ్యర్థికావ్యకవు లని, 7 శతకగేయదండక కవులని, 8 గద్యకవు లని, 9 నాటకకవులని తొమ్మిదిభాగములుగ కవులను విభజింప నగును. మొదటి ఏడుభాగములను నొక (ప్రథమ) సరణిగాను, గద్యనాటక కవుల నొక(ద్వితీయ)సరణిగాను గణించుట లెస్స.

# ప్రథమసరణి

## 1. ప్రబంధకవులు

1. కాలమునను గ్రంథబాహుళ్యమునను ప్రథముఁడగు కూచిమంచి తిమ్మకవి, పిఠాపురము జమీందారిలోని కందరాడకు కరణము, అద్వైత మతస్థుఁడు. ఇతఁడు వ్రాసినగ్రంథములు రుక్మిణీపరిణయంబును, సింహాచల మాహాత్మ్యము, నీలాసుందరీపరిణయము, రాజశేఖరవిలాసము, అచ్చ తెనుంగు రామాయణము, సారంగచరిత్ర, సాగరసంగమాహాత్మ్యము, రసికజనమనోభి రామము, లక్షణసారసంగ్రహము, సర్పపురక్షేత్రమాహాత్మ్యము, శతకములు, దండకములు, శివలీలావిలాససమితి యను నది కడపటిగ్రంథము.

ఇతఁడు 1756 వఱకు నుండినవాఁడు. ఇతనికి రావు మాధవభూపతి కవిసార్వభౌమ బిరుద మిచ్చెనఁట. ఈకవి ప్రాశస్త్యము నితరపూర్వకవులతోఁ బోల్చుట యాచారము. తత్త్వమరయఁగా నితండు ప్రబంధయుంగములోని పోకలన్నియు ననుసరించెను. మాహాత్మ్యము, శతకము, అచ్చ తెనుఁగుకబ్బ ములు, శృంగారప్రబంధము నను తెగల నన్నింటిని బ్రయత్నించెను. పూర్వకవు లొక్కొక్కదాని నుద్యమించి కృతార్థులైరి. ఇతఁ డన్నిటను కృతార్థుఁడై మొత్తముమీఁద గ్రంథబాహుళ్యముచే ప్రబంధయుంగకవుల

వర్గమునకుఁ జేరినవాఁడయ్యెను. రసికజనమనోభిరామము నలుపుఫూఁతపూసిన వసుచరిత్రను ప్రతిబింబించిన యద్దము. ఇతని నీలాసుందరీపరిణయము, కుక్కుటేశ్వరశతకము నాదృష్టి కితనిరత్నము లనిపించెడు. అచ్చఁదెలుఁగు రామాయణ మొకతీరున బాగున్నది. ఇతనిధార లలితపదమధురము. నిరర్గళ మయ్యును శాంతముగా ప్రవహించును. లక్షణసారసంగ్రహములోఁ గొన్ని నూతనవిషయములఁగూర్చినాఁడు. పోతన్నకున్న కళంకమును మాన్పినాఁడు. ఈ లక్షణగ్రంథములో నాంధ్రనామసంగ్రహకర్త యగు పైఁడిపాటి లక్ష్మయ్యను, కన్నప్పచరిత్రను వ్రాసిన కంచిరాజును, ద్విపద రుక్మాంగదచరిత్ర వ్రాసిన రామయ భాస్కరుని యింకను గొందఱఁ బేర్కొని కవులనామముల నైనఁ దెలియఁజేసినాఁడు. ఒట్టునకు ఇతనిని రసవత్కవి యనియు, లక్షణవిమర్శకుఁడనియును బేర్కొన నగును.

2. తిమ్మ "కవి సార్వభౌముని" తమ్ముఁడు జగ్గకవి. ఇతని చంద్రవిలాసమనునది తెలుంగులోని గొప్పదూషణకావ్యము. అది యొకతరగతిరచనకుఁ బరిణామము గాన నవశ్యస్మరణీయమే. శ్రీనాథ భీమకవిముఖ్యులు లిట్టు కవితకు నాద్యులు. ఇతరగ్రంథముల నన్నిట మనోహర మైనది సుభద్రాపరిణయము. ఇతని మూఁడవముఖ్యగ్రంథము సోమదేవరాజీయము. ఇది చరిత్రకావ్యము. కాని సర్వప్ప ద్విపద ననుసరించి చేయఁబడెను. ఇతని శైలి యమకాది శబ్దాలంకార సుభగమై "రాజన్యసభాఘూటనిరాఘూటనటచ్చాటుకవిత్వాంక" మును వెలయించుచు నింపుగా నున్నది.

3. వీరిర్వురివలె బహుగ్రంథకర్త యగువాఁ డేనుఁగులక్ష్మణకవి. ఇతని రామవిలాసప్రబంధమును, సుభాషితరత్నావళి యను నాంధ్రకృతియుఁ బ్రసిద్ధములు. సుభాషితరత్నావళి నెందఱో తెన్గించినవా రున్నను నింత మనోహరముగ యథామూలప్రౌఢముగ రచించినవారు లేరు. ఇతనిశైలి సందర్భసముచితమై, రసాస్పదముగ సాహితీపటిమ గొదువపడక రమణీ

యమై యుండి రామవిలాసము పఠనీయముగా నున్నది. ఇతని తాతను పెద్దాపురాధీశు నాశ్రితుని ముందే విని యుంటిమి.

4. పోచిరాజు వీరన్నయు, కృష్ణార్జునసంవాదము, పంచకావ్యములు, మార్కండేయచరితము, ఆనందలహరి, సౌందర్యలహరి, ముక్తదేవుకథ మున్నగునవి రచించి బహుగ్రంథకర్తయైనవాఁడు. ఇందు భల్లాణచరిత్ర ముచ్చికులస్థుఁడగు దామ మొగ్గన్నకంకితము. అన్వయసౌలభ్యములాలిత్యము గలదై అలంకారములగల్గి ఇతనికృతులు నిర్దుష్టములుగా నున్నవి.

5. బహుగ్రంథకర్తలై ప్రబంధకర్తలగువారి జతకుఁ జేర్పఁదగిన వాఁడు అడిదము సూరకవి; బాల భాస్కరకవికొడుకు. ఆంధ్రనామశేషము, కవిసంశయవిచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము వ్రాసిన లాక్షణికుఁడు. ఇతని కవిజనరంజనము (చంద్రమతీపరిణయము) మూఁడాశ్వాసముల గ్రంథమైనను "మూర్తి కన్నకీర్తి గొప్ప" యను లోకోక్తి ననుసరించి "పిల్లవసుచరిత్ర" మనుఖ్యాతిం గడించినది. గొప్ప పండితుఁడు 'కదలు మిట మాని దివిజ గంగాభవాని' యను నితని చాటువులు విన నింపుగ నున్నవి. కూచిమంచి తిమ్మ 'కవిసార్వభౌమున' కితఁ డుద్దియన్నఁ దప్పు గాఁబోదు.

6. సూరకవితో సరిగాఁ గూర్చుండఁ దగినవాఁడు కాకమాని మూర్తి. పాంచాలీపరిణయ, రాజవాహనవిజయములను ప్రబంధములకుఁ గర్త. నిరర్గళధారావేగముతో, శబ్దాలంకారవైచిత్ర్యములతో రసవంతమై ప్రబంధయుగకవుల కీడగు [1] పదప్రయోగములతో నితనికవనము సొంపు నింపినది.

7. సుప్రసిద్ధుఁడై 'కవిరాజమనోరంజనము (పురూరవచరిత్ర)' అని రుద్ధచరిత్రము వ్రాసిన కవివరేణ్యుఁడు కనుపర్తి అబ్బయామాత్యుఁడు. సంగీతమునందును నితం డసమానుఁడై, వసుచరిత్రకుఁ దర్వాత నంతటిగ్రంథము రచించి ధన్యుఁ డయ్యెను.

---

1 చింతలపూఁడి శేషగిరిరావుగారు, 16-వ ఉగాదిసంచిక.

"మలయజగంధి తాళపరిమాణమనోహరరాగగీతికా
కల నినదంబు జంత్రమున గాత్రమునం జెలఁగింపు నింపుచే
శిలలు ద్రవించె చిత్రములు జీవకళ ల్ధరియించె దారువుల్
పొలుపుగనంకురించె మృగముల్ మదిఁజొక్కువహించె నెంతయున్."

అను పద్యమున నితనిపద్యములకడఁ బ్రయుక్తము గాఁదగినది. తీగవలె మృదువుగా సాగి, యాటంకములులేక మృదువులగు పదములతోఁ బొందు పడి యయ్యెసందర్భముల కనువగు రీతులతోఁ బెరిగి సుభావములోఁ బూచి, ప్రౌఢమై పరిమళించిన యీతని కవిరాజమనోరంజనకృతి నుత్యర్హము. "కవితఁజెప్పి హరికి నర్పింపఁదగున్" అని నుడివిన ధీరుఁడు.

'తప్పుగల్గిన దిద్దుఁడీ యొప్పుగా' నన్న వినయశీలుఁడు.
'రసదీపక కావ్యకళారహస్యముల్' దెలిసిన ప్రౌఢ.

ఇందలి కథ పురూరవదిగ్విజయమును విన్న యూర్వశి యతనిపై మరులు గొని, మైత్రావరుణుల తపంబుఁజెఱుపఁ జనుదెంచి వారిచే శప్తయై, మానిసియై, పురూరవుని పెండ్లాడుటయు, వివాహాదిని జేసిన విగతవస్త్రాదర్శనాది సమయములు భగ్నములై యూర్వశిని వీడిపోఁగా నామెకై ప్రయత్నించి దేవతలిచ్చిన యగ్నిస్థాలి నొల్లక, కడకుఁ దనయాలిని పురూరవుండు బడయుటయు, సందర్భానుసారముగ శ్రూయమాణమైన యిలాకన్యా, తారాశశాంకోర్వశీ పూర్వజన్మాద్యుపకథాజాలములునై యున్నది. ప్రథమాశ్వాసమనావశ్యకమేమో? కథాసంవిధానమున లోపములు గల్గినవిగాని, యవి పురాణవస్తువును సంస్కరింపనికతంబున జనించినవి. ఇతఁడు పోషించినవి, తలంపుఁ గొన్నవి శృంగారవీరరసములు. శృంగారము మేరదాటి మోహాశృంగార మనం బడినది. భావసంపద, ఔచితి పోయి యంగాంగదృష్టియే మిగులుట మోహమునకు లక్షణము. ఆ శృంగార మీయుగమున ప్రత్యేకసారస్వతమైనది; యయుగ మితనియందుఁ బ్రతిఫలింపక తప్పినదికాదు. గర్భిణీ, ప్రసవానంతర

సంభోగములు వర్ణితములు. ఇది దోషమా! అనుచితమనిమాత్ర మనవచ్చును. సంభాషణావైఖరి సమంజసముగ నున్నది. పాత్రపోషణ సామాన్యము. ఇందలిశుకమిథునము శ్రీనాథసూరనలు పోషించినట్టి పక్షియుగమును బోలి యుండలేదు. అంత్యానుప్రాసములను జాల పాటించెను. శ్రీనాథపెద్దనల కనుకృతులు గొన్ని దొరలినవి. 'మృదుగూఢపాకరసబంధురకావ్యవచస్సమం బు'లైన యితని వాగ్విన్యాసములను, 'అభినవాలంకరణార్థ సూచనల మనోవీథులం జొనుపంగల్గిన' రసజ్ఞులు మెచ్చినారు. బంధగర్భశ్లేషకవితల మెఱయించినాఁడు. జాతీయములు దొంతరలు దొంతరలుగాఁ బడినవి. సాముద్రిక వైద్యజ్యోతిషములఁ దనకుంగల విజ్ఞానమును సూచించెను. ధారాళమైన యీతనిమంజులతామహనీయకవితాశాఖ యీయుగమున నవభావశోభ వహించినదని యనవచ్చును.

8. రోసనూరి వేంకటపతి విష్ణుమాయా విలాసమును,

9. పైడిమట్టి వేంకటపతి ప్రౌఢమై, రసవంతమై, పూర్వకవులరచనలనుబోలి హృదయాహ్లాదకరముగానున్న చంద్రాంగదచరిత్ర మనెడి యేూ ఆశ్వాసముల ప్రబంధమును,

10. వెలఁగపూఁడి కృష్ణయ్య భానుమద్విజయ మనెడి యైదాశ్వాసముల కృతిని, మాలతీ మాధవీయ గౌళిశాస్త్రాదులను,

11. కుందుర్తి వేంకటాచలపతి మిత్రవిందాపరిణయమును,

12. ధూర్జటి వేంకటరాయకవి రత్నావళీపరిణయమును,

13. ఆతనితండ్రి లింగకవి కాళహస్తిమాహాత్మ్యమును,

14. దిట్టకవి నారాయణకవి వీరరసమును సోమయాజిభంగి పోషించి రంగరాయప్రబంధమను బొబ్బిలికథాప్రబంధమును,

15. చింతకుంట కోదండరామకవి సునందాపరిణయ నామాంతర ప్రదీప చరిత్రమును,

16. క్షేమమాయనకవి యుషాకల్యాణము,

17. వెలిదండ్ల వేంకటపతి రాధామాధవ సంవాదమును,

18. పట్టమెట్ట సరస్వతి సోమయాజి పృథుచరిత్రమును శబ్దాలంకార భూయిష్ఠమును హృదయరంజనము నగుశైలిచే మించినదానిని,

19. వల్లవరపు వాలేశ్వరుఁడు భల్లాణచరిత్రమును,

20. రేచర్ల మాధవరాయకవి యను పద్మనాయక కులజుఁడగు రాజు శ్లాఘాపాత్రమగు చంద్రికాపరిణయమను ప్రబంధమును,

21. చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీవిలాసమును,

22. గణపవరపు వేంకటకవి శ్రీప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాస మను విచిత్రాది చతుర్విధచిత్ర కవితాపాండిత్య ప్రకటనాధురంధరమైన యేకాశ్వాసప్రబంధమును,

23. గుడారు వేంకటదాసకవి బలరామచరిత్రమును,

24. కాకునూరి కృష్ణయ్య యిందుమతీపరిణయమును,

25. వైష్ణవ వేంకటాచార్యుఁడు భద్రరాజపుత్ర చరిత్రమను నూతనకథావిలసితంబగు గ్రంథమును,

26. రేవణూరి వేంకటార్యుఁడు శకుంతలాపరిణయంబును,

27. వీణెము లక్ష్మీపతి యభిమన్యుపరిణయంబును,

28. వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులు సుప్రసిద్ధుఁడగు వాసిరెడ్డి వేంకటాద్రినాయుని సోదరపుత్త్రుఁ డగు చంద్రమౌళినాయని కంకితంబుగా నహల్యాసంక్రందనవిలాసమును,

29. కృష్ణకవి ప్రౌఢకవిత్వమును గ్రంథచౌర్యముతో వెలయించి, దాక్షిణాత్యు లితనికృతిని పిల్లవసుచరిత్ర యని నుతించునట్లుగా శకుంతలాపరిణయంబును,

30. వల్లూరి నరసింహకవి చిన్న చిన్న పదముల యతుకులు ముద్దులు గురియ నాగ్నజిత్తీపరిణయమును,

31. చేతపూఁడి కృష్ణయ్య సరసశయ్యతో జానకీరాఘవపండిత మనోభిరామములను,

32. బసవరాజు నాగేంద్రకవి ఆనందసుందరచాతుర్యవిలాసమును,

33. కోటీశ్వరుఁడు భోజకన్యాపరిణయమును,

34. ముప్పిరాల సుబ్బరాయకవి కృష్ణాభ్యుదయమును,

35. ప్రయాగ కామేశ్వరకవి "తోయజనాయక! దండనిల్చి కో, దండము డించి మాచెలికి దండము పెట్టుము రెండు కన్నులన్, పిండిననీరు దోయిటను నించి శపించు" నని రసవచ్చిత్రకవిత్వసల్లనేర్చి, 'గోపాలలీలాసుధాలహరి' ని,

36. రామనామాత్యుఁడు గయోపాఖ్యానమును,

37. పోచన శబ్దాలంకార సుశ్రావ్యశైలిమధురముతో చంద్రాభ్యుదయమును,

38. గట్టుప్రభు కుచేలోపాఖ్యానమును, సురాభాండేశ్వరమును,

39. తక్కెళ్లపాటి లింగన్న మదనమోహినీవిలాస, సూర్యతనయాపరిణయోత్తరహరిశ్చంద్రకథ లనువానిని,

40. బాపనామాత్యుఁడు (నెనుపల్లె) సీతావిజయమను నేకాశ్వాసప్రబంధమును రచించిరి.

41. కొట్ర వేంకటేశ్వరకవి యడిదము సూరనవలన బాలకవి యను బిరుదొంది "విమలాంగపరిణయ" మను మాంధాతకథను వ్రాసెను. ఇతఁడు "శబ్దాలంకారకోశమున కధిపతి" యండ్రు.

## 2. లాక్షణికకవులు

కూచిమంచి తిమ్మకవియు, సూరకవియు, గణపవరపు వేంకటకవియుఁ జేర్పఁబడిరి.

42. కోట వేంకనార్యుఁడు "ఆంధ్రభాషార్ణవ" నిఘంటును రచించెను. దీనితో సమానమైన యచ్చతెనుఁగు నిఘంటువు మఱి యొకటి లేదు.

43. కస్తూరి రంగకవి లక్షణచూడామణి యను రంగరాట్ఛంద మును, దివ్యమగు మంజులవాగ్ధాటితో కృష్ణార్జునసంవాద కావ్యమును రచించెను.

44. వెణుతుర్లసడ్డికవి శృంగారరసాలవాలమను మూఁడాశ్వాస ముల యలంకారశాస్త్రమును రసవంతముగా రచించిన ప్రథమశాఖ బ్రాహ్మణ రామభక్తుఁడు.

45. కటికినేని రామయకవి కువలయానంద మను నలంకారగ్రంథ మును, కువలయానందప్రకాశమను పేరఁ దెనిఁగించెను. ఇతఁడు పద్మనాయఁ కుల కులమువాఁడు.

## 3. శాస్త్రకవులు

46. వెణుతురుపల్లి విశ్వనాథకవి శేషధర్మమును పద్యకావ్య ముగా రచించెను.

47. కొడిచర్ల శ్రీనివాసకవి శేషధర్మరత్నాకరకర్త; ఇతనిది ప్రౌఢ కవిత్వము.

48. కానాల నరసింహకవి,

49. తామరపల్లి తిమ్మయ్య యనువారలు శేషధర్మమును రచించిరి. ఇట్లు నలువురు తెనిఁగించిన శేషధర్మము హరివంశములోనిది.

50. అయ్యలరాజు; అయ్యలభాస్కరకవు లిరువురును రెట్టమత మను కన్నడగ్రంథమును తెన్గించిరి.

51. వేముగుంట దత్తోజీపండితుఁడు భగవద్గీతా యోగశాస్త్రమును వృత్తములఁగాఁ దెనిఁగించెను.

52. అధికవృత్తములలో గీతాశాస్త్రమును మాధవమంత్రియుఁ దె నుఁగుబాసలోనికి దించెను.

53. భారత భాగవతోత్తరరామాయణములవలె పల్లెటూళ్లకును వ్యాపించినదియు, హృద్యావపద్యశైలి ప్రాశస్త్యము నొందినదియు నగు వేదాంతగ్రంథ మాశ్వాసత్రయాత్మకమగు సీతారామాంజనేయమను సత్కృ తికి కర్త పరశురామపంతులలింగమూర్తి.

54. ఇతని కుమారుఁడు రామమూర్తి శుకచరిత్ర మను వేదాంత గ్రంథమును రచించెను. వేదాంతమైనను కావ్యరూప మిందు పరిస్ఫుటమై నది. కవి, "ఝురులంపాలం దీరరసాలజాలముల నేలా డోలలం గేళీలీలల నాట ల్గానిరుఁడు నప్సరోలలనా రత్నములఁ" దలంపునకుఁ గొనివచ్చు చున్నాఁడు.

55. వివేకసింధువును వేగినాటి కొండనార్యుఁడు వచనమునుండి పద్యముగా మార్చెను.

56. జీవప్రబోధమను నుత్తమకృతిని వాసుదేవయోగి సంతరించె ను. [జ్యోతిష రత్నాకరకర్త చరిగొండ హొన్నయ యెప్పటివాఁడో?]

## 4. ఆంధ్రీకరణకవులు

57. ఎందులూరి లింగనారాధ్యుని [కూచిమంచి తిమ్మకవివలెనే] శిష్యుఁడైన వక్కలంక వీరభద్రకవి సుబంధుకవి వాసవదత్తను, కాళి దాసు కుమారసంభవమును, వాసవదత్తాపరిణయము, గౌరీకల్యాణము నను పేర్లతో తెనిఁగించెను. మొదటిది పీఠికాపురాధీశ్వరరావు మాధవరాయనిం గారి కంకితమైనది. ఇతఁ డసమాన సాహిత్యప్రౌఢిగలవాఁడని, సమకాలి కులు తిమ్మకవిని వీడి యితనినిఁ బొగడి యున్కి చాటుచున్నది. పూర్వాయుం గాంధ్రీకరణకర్తల కవిత్వపటిమయు, నిరాఘాటధాటియు నితనియందు వెలసినవి.

58 పట్టమట్ట సోమనాథకవి స్కాందపురాణములోని సూతసంహితను తెన్గించెను.

59. కోడూరి వేంకటాచలకవి యాపురాణములోని శివరహస్యఖండమును తెనింగించెను.

60. ధర్మఖండమును ఈదురుపల్లె భవానీశంకరుఁడు తెనిఁగించెను.

61. వీరభద్రకవినిఁబోలి రఘువంశమహాకావ్యమును నవుడూరి కిచ్చయ్య పదియాశ్వాసములుగా రచించెను.

62. భారవికృత కిరాతార్జునీయమును గోపాలునిసింగయ్య యయిదాశ్వాసములుగా భాషాంతరీకరించెను.

63. భానుమిశ్రవిరచితమైన రసమంజరిని శృంగారరసమంజరియను పేర గుడిపాటి కోదండపతి మూఁడుగుచ్ఛములుగా తెనిఁగించెను.

64. జయదేవగీతగోవిందమును రాధాకృష్ణవిలాస మనుపేర కృష్ణదాసకవి మూఁడాశ్వాసముల కావ్యముగా నాంధ్రీకరించెను.

65-66 క్రైస్తవ వేదాంతగ్రంథములను మంగళగిరిఆనందకవి వేదాంతరసాయన మనుపేరను, సర్వేశ్వరమాహాత్మ్యనామాంతర తోభ్యచరిత్రమును పింగళి యెల్లనార్యుఁడును రచించిరి. ఎల్లనార్యుఁడు శైవబ్రాహ్మణుఁ డెందులకుఁ గ్రీస్తుమతగ్రంథమును వ్రాసెనో? ఇరువురి కవిత్వమును ప్రౌఢమై రసవంతమై యున్నది.

## 5. మోహాశృంగారకావ్యకవులు

### అ. మోహాశృంగారకవులు

సాధారణముగా దేనిని సంఘము నీతియనుచున్నదో యది ప్రత్యేకవ్యక్తులయెడ దుర్నీతి గావచ్చును. ప్రత్యేకవ్యక్తులకు నీతిగాఁ గన్పడినది దేశకాలాచారవ్యవస్థలచే నియమితమగు సంఘనీతి దృష్టితోఁ జూచిన

దుర్నీతి గావచ్చును. ధర్మరహస్యము లతిసూక్ష్మములు. అందుచేతనియే ఋషులు "అహింసా పరమో ధర్మః" యను దివ్యసూత్ర ముద్ఘోషించిరికాఁబోలు! ఎట్లైననేమి? వివాహమునకు విరుద్ధమగు ప్రణయము నీతిబాహ్యమని సంఘమన్నది. సాంఘికస్థిరతనుబట్టియు, ప్రపంచానుభవము ననుసరించియు నాలోచించినచో, వైవాహికబంధ మత్యుత్కృష్టధర్మమని విజ్ఞు లొప్పుకొనక తప్పదు. క్షణికాంగలోలుపత్వము మోహమని విద్వాంసులు పల్కుదురు. క్షణికాంగలోలుపతయే కాక, పరస్పర శుద్ధానురాగమే కుదిరినను, వివాహబంధరాహిత్య మట్టి చిత్తవృత్తిని మోహమనియే పల్కునది. నిత్యమైన శుద్ధమైన యన్యోన్యానురాగము గుదిరినచో, వివాహముద్ర చేదానిని లోకమునకుఁ జాటకపోయినను నది మంచిదియే; అధర్మముగాదని కొందఱందురు. ఎవరేమన్నను సంఘమేమో యట్టిసేఁతకు సమ్మతింపదు. సంఘజీవితశాంతికిఁ దోడ్పడు నాచారము ధర్మముకదా! అట్లయిన తప్పక యది యధర్మమేనా? పూర్వకవులు శృంగారముల వర్ణించిరిగాని దంపతుల గాథలే. సారంగుతమ్మయ యట్టిదానిని గాక తుచ్ఛతనుభోగము నాదర్శముగా గొనెను. అది సంఘనీతికి బాహ్యము. కాన నధర్మము. తారాశశాంకు లది ప్రేమయే కావచ్చును. కాని, సంఘాచారవిరుద్ధమగుటచే నధర్మమైనది. ఆర్యులు తారను పతివ్రతగా నేల గణించిరి? వారు ప్రేమకే ప్రాధాన్యమిచ్చి వివాహబంధమును నిరసించిరా? ఎట్లో? సంఘము ననుసరించియే నేను నట్టి యధర్మప్రేమలను వర్ణించు గ్రంథములకు మోహశృంగారకావ్యము లని నామకరణముఁ జేసితిని. ఈ మోహశృంగారకావ్యము లీకాలములో "Scholar's Edition" పేర ప్రఖ్యాతి వహించినవి. పూర్తిగ పచ్చిశృంగారమునకు దిగిన రాధికాసాంత్వనాదుల నేమనుటకుఁ దోఁచక నవియు నివియు నొకేచోటఁ జేర్పఁబడినవి. వానితోఁ గూడ ధర్మశృంగారగ్రంథములుఁ గొన్నియుఁ జేరినవి. కాననే మోహశృంగారకవులను శీర్షిక.

67. కామేశ్వరకవి సత్యభామాసాంత్వనము రచించె. ముద్దళగిరి దీనికిభర్త. విజయవిలాసముఁబోలె శుద్ధద్రావిడదేశములోఁ బుట్టిన ఈకృతి ప్రౌఢమై, రసవంతమై, సరససాహితీ విలసితమై యొప్పారెడు శృంగార కావ్యము. చూడుఁడు:

"తావులవెంబడిం గదలి తార్కొనె దేఁటులు దేఁటిజొక్కులం
బోవక నాటెఁ బుప్పొడియుఁ, బుప్పొడితోఁ దగెఁబూవుసోనయూ
పూవులసోనతో మిగులఁబొల్చెను గల్పతరుప్రసూన మా
ధ్వీవిరసంబు నావెనుక వీచెను జల్లని కమ్మతెమ్మెరల్."

శరత్కాలము, "ముకుందదారకృతలీలాలాస్యసారస్యభ్భృం,
గీ సంగీతతరంగితాబ్జరుచిభంగీజాతరంగోల్లస,త్కాసారాబ్ధితరంగజాలమట".

68. అహల్యాసంక్రందనమును సముఖము వేంకటకృష్ణప్పనాయఁ కుఁడు మూఁడాశ్వాసములుగా రచించెను. బాటపడినది. గౌతముఁ డన్నాఁడు:—

"ఓసి నీ,చేతిజలంబు లంట నీకెఁ జెల్లునె యెంతటి జంతవే బలా,
రాతినిఁగూడఁ దీవిపుడు రాతిరిజామునఁ గావునన్ బలా
త్పాతిశరీరమందుము."

69. ఇతని స్నేహితుఁడు శేషము వేంకటపతి, తారాశశాంక విజయ కర్త. ఈకావ్యమును దెనుఁగుకావ్యములఁ జదువువా రెల్లఱుం జదివియుందురు. విమర్శన మనావశ్యకము. ఒక్కటి మాత్రము సూచింపనగు. పాత్రలోలీనమై కథకుఁ దోడ్పడు సంవాదవైఖరిని దిద్దుటయందును నతఁడు నిరుపమానుఁడు. కుంటువడక మనోహరముగ భావప్రకటన సేయు నిరర్గళధార యితనిసొత్తయినది. తారాప్రవర్తన మెట్టిదను నిర్ణయ మెట్లున్నను, తారయందు గాఢప్రణయముగ్ధయగు స్వైరిణి నద్వితీయముగ సృష్టించినాఁడు; స్వకపోలకల్పనాశక్తిమంతుఁడు. అధర్మదృశ్యమును జిత్రించుటంత తప్పు లేదుకాని,

ఈతనినైత్రము మఱపించునంత కళావైదగ్ధ్యమును వెలయించి యితఁడు సంఘభావమున కొకయాఘాతము చేసినటులైనది. కళావేశములో సంఘనీతికి బాహ్యుఁడైనదంతయు లోకజ్ఞుల దృఢాభిప్రాయమై యున్నది. కళావేత్త లేమందురు?

70. ఒడయనంబివిలాసమను స్థలపురాణగాథను తెలుఁగులో నాల్గాశ్వాసములుగా వ్రాసినకవి అజ్జరపు పేరయలింగము. ఇతఁడు శైవనియోగి, బమ్మెరవంశజుఁడఁట! వైజయంతీవిలాసమును బోలియున్న దీకథ. వేశ్యవాటికలో ఱంకను వారిని యముఁడు శిక్షించునఁట! ఈశ్వరుఁడు భోగకుదానితోఁ బ్రత్యక్ష మయ్యెనట! "దుర్నీతిపారమును కడముట్టిన దనియే చెప్పవచ్చును" అని కవిచరిత్రకారుఁడు వ్రాసెను. సత్యము, కళయు, లేక నీతియు, లేక నిరర్థకములైన బూతులతో నింపిన యిట్టిపుస్తకము కేవలము సాంఘికవృత్తిలో నధమస్థితిని జూపించుచు హేయమగునదియే కాని వేఱుగాదు.

71. దివి రమణకవి వాసిరెడ్డి రామలింగప్రభునిప్రేరణముచేత శృంగారధామమను రెండాశ్వాసముల కృతి నల్లెను.

72. ముద్దుపళని ప్రతాపసింహుని యుంపుడుకత్తె. సంగీతసాహిత్యభరతశాస్త్రప్రవీణ. భారతస్త్రీసహజాలంకారమగు సిగ్గు నీమె వదలినది. వేంకటకృష్ణప్ప వ్రాసి 'యిళాదేవీయ'నామాంతర రాధికాసాంత్వనమునకు ముద్దుపళని కవయిత్రిగా నారోపించె నండ్రు. పాత్రమున కృష్ణప్పకవిత్వలక్షణములు లేవు. స్త్రీహస్తము గానఁబడుచున్నది. కాన, నీజనశ్రుతి త్యాజ్యము. లోకోక్తులు, జాతీయములు నిండిన యీమెకవనము రసవంతమైనది. [మొదటియాశ్వాసములో నిళాయావనము, ఇళతోటి కృష్ణుని కూటమి, రాధాదేవి యీర్ష్య, ప్రాతఃకాలవర్ణనము లైనవి. ద్వితీయాశ్వాసములో రతి జ్యోత్స్నానృత్యాదికవర్ణనలు, తృతీయచతుర్థములలో కృష్ణరాధికాప్రణయకలహతచ్ఛాంతులు జరిగినవి.] శబ్దాలంకారములు మెండు.

వర్ణనావైశద్యము స్తవనీయము. కాని, యంతయు నంగాంగవ్యామోహము. గయ్యాళిమాటల నెఱజాణతనము! తుడిచేటిలతాంగొకర్తు, పడకిల్లు, బహునాళ్లు, హేలావతిల్లాదె, త్రుళ్లినెద్దెసరా, నిన్నుండెమానిసి, కొన్నం గడి మొదలగు వ్యాకృతిదోషము లనేకములు. దీనిపై పాఠకుల కేయూహ కల్గునో? ఆపె కొన్నినుడుల నిం దందిచ్చెద. గుబ్బలమెలమెల్లఁ గ్రుమ్మ వమ్మ, మేకపన్నియపులి, అర్ధరాత్రిగొడుగు తెమ్మన్న—అలజక్కువలపెక్కువలఁ ద్రొక్కుబలునిక్కు గలగుబ్బపాలిండ్లు గదలెనమ్మ, మారునిల్ చిలచిల మంచు చెమ్మగిల్ల,వాలుమీలనేలు వాలుఁగన్నులడాలు, నునుపచ్చరాకట్టు పని గీముల నడంగి రవమేది యుండు పారావతమ్ము, చారుతరచంద్రికాపూరమందు, మదవతి పైసోకు మారుతమెలసిన శుక పికనికరముల్ సోలివ్రాలె, కుచకుంభములమీఁద గోరంకుసం బాని కరుకు కరుక్కున నరికి నరికి, ఏయెడ నా బొమ్మబాయని వీణె నేపాటలాధరి గోట మీటునొక్క—

"కలువలు మీఱె నీరరుహకాండము తారె చకోరపఙ్క్తి వె
న్నెలరుచిఁ గోరె జక్కువల పెంటులు పాఱె విటీ విటాలిపే
రలుకలు జాఱె సూనశరుఁ డమ్ముల నూఱె సుధాంశుతాలలోఁ
పల జల మూరె దంపతులబంధము లాఱె నంతటన్."

నంది తిమ్మనపెద్దనశృంగారపుఁ బోలికలు గలవు.

73. చిత్రకవి సింగనార్యుఁడు బిల్హణీయమును వ్రాసి పండిపెద్ది కృష్ణస్వామిపేరును బెట్టినాఁడు. రసవంతమైన కవనము, కథ యొకరాజ పుత్త్రి,యామినీపూర్ణతిలక యనుకన్య, బిల్హణుఁడు ననువిప్రకవి పరస్పరము జాత్యంధుఁడు, కుష్ఠపీడితయని చెప్పఁబడి యుండ నది బొంకని తెలిసి యన్యోన్యము ప్రేమించి పెండ్లాడుట.

74. చెన్నూరు శోభనాద్రియను కవి పద్మనాయకకులరాజ పుత్త్రున కంకితముగ బిల్హణుని కథను శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయ మను పేర రచించెను.

75 చళ్లపిళ్ల నరసకవియు నిదేకథను యామినీ పూర్ణతిలకావిలాస మను పేర రచించెను.

76. చెదల్వాడ మల్లయ విప్రనారాయణచరిత్రను మృదుమధురముగా రచించెను. దీనిని వైజయంతీవిలాసమున కన్న మే లని కొందఱందురు. ఇది విచార్యము

77. చదువుల సోమలింగయ్య యనునతఁడు మదనసాయకవిలాస మను శృంగారప్రబంధమును రచించెను. సులభమంజులకవిత్వము.

78. వెంకోజీ మనుమఁడు జయసింహున కంకితముగా నెల్లూరి శివరామకవి 'కామకళానిధిని' [రతిశాస్త్రము] రచించుట నిచటనే తలంతము.

## ఆ. కావ్యకవులు

79. ఒడ్డెపూఁడి పెద్దయ్య వాయుపురాణములోని కొంతభాగమును రసవత్కవితతోఁ గావ్యమును జేసెను.

80. మరింగంటి సింగరాచార్యులు నిరోష్ఠ్యరామాయణమను దశరథరాజనందనచరిత్రను వ్రాసెను. హృదయంగమమైన శైలి.

81. కాణాద పెద్దన సోమయాజి గద్వాలప్రభువుల నాశ్రయించి ముకుందవిలాసమును, అధ్యాత్మరామాయణమును రచించెను. "ఇతనిగ్రంథములలోనున్న శబ్దాలంకారములును, చిత్రబంధకవిత్వపద్యములును మఱియేకవి గ్రంథములలోను లేవు. ఈతనికవనము రసవంతమై హృదయరంజకముగా నుండును." అని కవిచరిత్రకారుఁడు పల్కెను.

82. అనంతరాజు జన్నయకవి రామకథాభిరామమను పదియాశ్వాసముల మహాకావ్యమునకుఁ గర్త. "కవిత్వము నాతికఠినమై మృదుపదగుంభితమై కర్ణరసాయనముగా" నున్నది.

83. కంకంటి పాపరా జుత్తరరామాయణమును కావ్యఫక్కినిఁ దెనిఁగించెను. ఉన్న యుత్తరరామాయణములకెల్ల నిదియే పెద్ద. భా

స్కరరామాయణమునకుఁ బిదప నిట్టి రసవద్రామాయణకృతి మఱియే కవియు నల్లలేదు. ఈకవికిరీటికి సాయపడిన వాఁడు పుష్పగిరి తిమ్మశాస్త్రి. ఇతనియందు గీర్వాణరచనలు మెండు. అయినను, శ్రావ్యమై, మధురమై, శుంభచ్ఛంభుజటాజూట గంగాప్రవాహమై, అనర్గళమై, రసాస్పదమై, యలరు శైలితోఁ గృతిని పావనించినాఁడు. సర్వవర్ణనలు నలరారినవి. తన ప్రతిభను కథతోఁజేర్చి కర్ణరసాయనముగా రచించెను. లోకోక్తులు శబ్దాలంకారములు కొల్లలు. గద్యలు పూర్వకవులఁ దలఁపించుచుఁ బ్రౌఢములై, పద్యములవలె నడచుచున్నవి. కరుణాశృంగారవీరరసములను జక్కఁగఁ బోషించెను. "మీటిన మ్రోగువీణవలె" నేసందర్భమున కెట్టి ధాటివల యునో యట్టి ధాటి కథాసంవిధానమునకుఁ దోడ్పడి మనోహరార్థ పరిమళముల, హృదయంగమభావచంద్రికల నీనుచున్నది. కాని అనావశ్యకములైన ద్వ్యర్థిపద్యములు, అచ్చతెలుఁగుపద్యములు, ప్రబంధ ఫక్కి యితనియందుఁ గన్పడి పాండిత్యప్రకర్ష యించుక రసోత్పత్తికి భంగముఁ గల్గించినది. వ్యాకరణస్ఖాలిత్యములుసైతము నున్నవి. భారత భాగవతములకుఁ బిమ్మట ప్రజాసామాన్యమునకు నచ్చియున్న కృతి యితని యుత్తరరామాయణమని చెప్పనక్కఱలేదు. ఇతఁడు రాజయోగప్రవీణుఁడు, గణితశాస్త్రజ్ఞుఁడు, ప్రపంచానుభవజ్ఞుఁడు, ఇతని కృతిలోని సీతావనవాసము కరుణకు, రావణదిగ్విజయము వీరమునకు, కపిలసందర్శనము బీభత్సమునకు, బలిచక్రవర్తి సన్నిధి హాస్యభయానకాద్భుతములకు నూత నొసంగి ప్రత్యేకకృతులవలె విమర్శింపఁదగినవి.

84. పుష్పగిరితిమ్మన సమీరకుమారవిజయమును రచించెను. ప్రౌఢకవిత్వము. పాపరాజుకంటె రసోదయము తక్కువ. ఇతఁడు భర్తృహరిని గూడఁ దెనిఁగించెను.

85. ధరణిదేవుల రామమంత్రి దశావతారచరిత్రను వ్రాసెను.

86 అత్తలూరి పాపకవి చెన్నబసవపురాణమును వ్రాసెను.

87. ఆనందగిరికృత శంకర విజయమును ఆలూరి కుప్పనకవి తెనుఁగు కబ్బముగా రచించెను.

88. అనియాది గణపతిదేవుఁడు శివయోగసారమును రచించెను.

89. ముక్తి చింతామణియను పేర జగన్నాథమాహాత్మ్యమును వేంకటాచార్యుఁడను పెదమాళ్లాచార్య తనయుఁడు రచించెను.

90. లింగకవి గంగకవులనువారు సీతావిజయనామాంతరమైన శతముఖరామాయణమును రచించిరి. కవిత్వము బాగున్నది.

91. సిరిప్రెగ్గడ ధర్మనామాత్యుఁడు నలచరిత్రమును,

92. కొండమడుగు పురుషోత్తముఁడు సానందచరిత్రమును,

93. మల్లంపల్లి నాగభూషణకవి బసవవిజయమును,

94. ములపాక బుచ్చన్నశాస్త్రి వేంకటేశ్వరమాహాత్మ్యమును,

95. గూళికల్లు వెంకటరమణకవి కనకరంజితశిఖామణీపరిణయము [విక్రమార్కచరిత్ర]ను,

96. గొంతేటి సూరన్న కృష్ణాభ్యుదయమును,

97. మాచవరపు పాపనామాత్యుఁడు నందవరీకచరిత్రమును,

98. అనపగుర్తి రంగయ్య యాదవమాహాత్మ్యమును,

99. నారన సూరన వనమాలివిలాసమును,

100. రామావఝుల కొండుభట్టు కపిలగోసంవాదమును,

101. మారయకవి మైరావణచరిత్రను రచియించిరి.

102—104. వీరుగాక ముప్వురుకవులు కథలను వ్రాసిరి. వీరిలో కోవెల గోపరాజు సింహాసనద్వాత్రింశతి యను పేర విక్రమార్కకథలను, పాలవేకరి కదిరీపతి రసవంతమగు హృద్యకవితాప్రౌఢిమతో శుకసప్తతిని, అయ్యలరాజు నారాయణకవి హంసవింశతిని రచించిరి.

## 7. ద్వ్యర్థికావ్యకవులు

105. నెల్లూరు వీరరాఘవకవి యాదవరాఘవపాండవీయము

106. క్రొత్తలంక మృత్యుంజయుఁడు ధరాత్మజాపరిణయ
[నిరోష్ఠ్య నలచరిత్ర బృహన్నారదీయములను కావ్యములను]

107. తిరుమల బుక్కపట్టణపు వేంకటాచార్యుఁడు
పరిణయమును,

108. అయ్యగారి వీరభద్రకవి రాఘవ పాండవ యాదవీ

109. పోడూరి పెదరామామాత్యుఁడు శివరామాభ్యుదయ

110. ఉభయభాషావైదుష్యమును, కవిత్వప్రౌఢిమయుఁ
గంటి సోమశేఖరకవి రామకృష్ణార్జునరూప నారాయణీయమును

[105-108-110 కవులు త్ర్యర్థిగను, దక్కినవారు ద్వ
వ్రాసిరనుట ప్రత్యేకముగాఁ దెలుప నవసరములేదు.]

## 7. శతకగేయ దండకకవులు

### అ. శతకకవులు.

[1]కూచిమంచి తిమ్మకవియు, సూరనయు వ్రాసినశతకముల పూర్వయు
గంత్యమున స్మరించితిమి. ఈయుగమున నుత్కృష్టశతకరాజము దాశరథి
శతకము. దీనియందు భక్తి వెల్లివిరిసినది. జ్ఞానవైరాగ్యములు భక్తి
మైనవి. ఇట్టిభక్తియే యాంధ్రశతకకవులచేఁ బ్రదర్శింపఁబడినది. ఆంధ్ర
మున సుమారు ఆఱువందల శతకములున్నవి. కొన్ని యాంధ్రీకరణములు
లైనను,చాలస్వతంత్రరచనలై యయ్యైకాలపు సాంఘికస్థితులను బ్రతిబింబింపఁ

1 శతకకవులచరిత్రము [కీ. శే. వంగూరు సుబ్బారావుగారిది], శతక
రత్నావళి [విక్టోరియాడిపో] ని, పరిశోధకమండలివారి శతకసంపుటము
మును జూడుఁడు.

జేసినవి. గోపన్న దాశరథీ యన్నప్పుడు శ్రీరాములు సాక్షాత్కారమైనటు లుండును. ఆయావేశమే జీవకళాస్వభావము. కవిచౌడప్పశతకము, వేణుగోపాలశతకము, నరసింహశతకము మొదలగునవి సుప్రసిద్ధములు. భద్రాజురచించిన వజ్రపంజరము, మరున్నందనశతకము, శ్రీకాకుళాంధ్ర నాయక మానసబోధశతకములను బరికించినచో నీతి, హాస్యము, నిందా స్తుతి, దూషణకావ్యాదికము మున్నగు వివిధకావ్యస్వరూపము లిప్పటి శతక వాఙ్మయములో నణఁగియున్నవని నిరాఘాటముగఁ జెప్పనగును. గోగుల పాటి కూర్మకవి యనునతఁడు సింహాద్రినరసింహశతకమును వ్రాసి స్తుతిం పఁగా, దేవుఁడు తురకలను బారఁదోలెనఁట! కావచ్చును. భక్తున కేదియసా ధ్యము? మనోవ్యగ్రతగల్గి సాధించువాని కసాధ్యమనుటయే లేదు గదా? కలువాయి, లావణ్య, మదనగోపాలప్రభృతి శతకములలోని శృంగారము లను జవిచూచిన ప్రబంధాదులు సరసములై కన్పట్టును. కస్తూరిరంగ, భాస్కర, భైరవ, శరభాంక, రామతారకశతకములు ప్రచారములో నున్నవి. భాస్కరశతకము ప్రత్యేకనీతిశాస్త్రముగాఁ బరిగణింపఁదగినది. శతకములను సంబంధించి యొకశాఖగా నేర్పడిన గేయములం జూడుఁడు.

## ఆ. గేయకవులు

గేయములను యతిప్రాసములతో వ్రాయుదురు. మట్టు, లయ దీనికి ప్రాణములు. విషయములు శిష్టములుగను, క్షుద్రములుగను గూడ నున్నవి. కీ. శే. వంగూరి సుబ్బరావుగారు వీనిని కృతులు, కీర్తనలు, మంగళహారతులు, ఏలపాటలు, తత్త్వములు, చూర్ణికలు, జావళీలు, హరికథలు నని యెన్నిదివిధ ములుగ విభజించిరి.

1. కృతులతోడనే శ్రీత్యాగరాజు స్మృతికిఁ దగులుచున్నాఁడు. ఇతఁడు ప్రహ్లాదభక్తవిజయమును రచించినాఁడు. కాకర్లవంశస్థుఁ డగు తెనుఁగుబ్రాహ్మణుఁడు. తండ్రి రామబ్రహ్మ మనువారు. ఇతనితాత గిరి

రాజకవి. శొంఠి వేంకటరమణయ్యగారను వైదికునికడ విద్యనేర్చెను. ఇతని జననవత్సరము 1764. ఇరువదేండ్లు శ్రీరామజపము 96 కోట్లు చేసెనంట! ఒక్కొకకృతి నెలలపర్యంత మభ్యసించిన నలవడనట్టివి పదివేలకుఁ బైగా వ్రాసిన ఇతని మహిమమేమో! 1"కనకనరుచిరా" (వరాళిరాగము), 2. "సాధించెనే" 3."దుడుకుగల" (గౌళిరాగము), 4. "ఎందఱో మహాను భావులు" (శ్రీరాగము), 5. "జగదానంద" (నాటరాగము) యనుకృతులు ఇతని పంచరత్నము లనఁబడు క్రొత్తరాగముల నెన్నింటినో ఇతఁడు వెలయించెను. అంత్యమున సన్న్యాసియై 1846 లో పరమపదించెను. శ్రీత్యాగరాజస్వామి నేఁటికిని తిరువయ్యారులోఁ బూజింపఁబడుచున్నాఁడు. వాఙ్మయపురుషులలో నాంధ్రలోకమునకుతిక్కన పోతన త్యాగరాజులు త్రిమూర్తులవలె నిత్యస్మరణీయులు. లౌకికప్రజ్ఞకు అద్వైతనిష్ఠకు భక్తిగభీరతకు వీరు వరుసగాఁ బెన్నిధులు. త్యాగరాజకృతులలో ముఖ్యములైనవి ఆఱువందలసెదరు. మువ్వగోపాలపదములు, అధ్యాత్మరామాయణకీర్తనలు నీకృతుల పజ్క్తిని సమీపించునవి.

2. కీర్తనలన్నతోడనే శ్రీరామదాసుఁడు "అంతారామమయం"బని యెదుట సాక్షాత్కరించును. అవి యనుభవైకవేద్యములుగాన వానిని విమర్శింప వలనుపడదు. పైమఱచి, నవరసనవ్యములై, జాలువాఱుకీర్తనలతో భద్రాద్రిలో గోపన్న పాడినపుడు శ్రీరాముని దేహ మెట్లు పులకరించినదో? ఎందఱు కష్టజీవుల లోకయాత్ర కవి తోడ్పడుచున్నవో? నిట్లల ప్రకాశదాసు మనకు స్మరణీయుఁడే.

3. స్త్రీలపాటలు, మంగళహారతులు వేనవేల కున్నది. లాలిపాటలు, మేలుకొల్పులు, కుచ్చులకథ, కలుపులదగ్గఱపాటలు, లంకాయాగము, గోవిందనామము లందుఁ జేరఁదగినవి. అద్వైతవేదాంతము నతిసంగ్రహ

ముగ, సుస్పష్టముగ వెలిపరచు [1] నారాయణశతక మిందుఁ జేరినదేనా?
[2]లక్ష్మణదేవరనవ్వులో నాటకకళ చిందులాడినది. [కవిపేరు తెలియదు.]

"వెన్నెలబైలనే వేలసంఖ్యలనూ,
గద్దెబెట్టించిరీ కరుణాకరూలూ"

లక్ష్మణుఁడు నవ్విన సందర్భమున రచించినవర్ణన లత్యుత్కృష్టములు; రసోదంచితములు లక్ష్మణుని చంపఁబోయి సంగతి బయల్పడి రాముఁడు దుఃఖపడునప్పుడు,

"అరచేతి కన్నీరు అతిసహస్రమాయె
జలము అంజలిపైని కలియఁ గురిపించె."

లక్ష్మణుఁడు నిదురించునపుడు రాముఁ డడుగులొత్త, వెంటనే లేచిన తమ్ముఁ డన్నాఁడు గదా! "అహల్యపావనమైన యడుగు మీయడుగు."

అంత రాముఁడు,

"దీపమ్ము లే నిల్లు ఎట్టిదటుపోలు
ఉదకమ్ము లేని కలశ మెట్టిదటుపోలు
పతిలేని సతి ఎట్టిదటుపోలు
తమ్ముఁడా! నీవు లేనిసభ యటుపోలు"

"వయ్యారి నడకతో! వయ్యెదజారా
వారచూపులు చూస్తు వచ్చెనాదేవి."

ఈకృతి సుకుమారాకృతి. ప్రతివారును జదువఁదగినది.

4. కంట్రోలు బియ్యపు పాటలువగైరా, అసభ్యములుగా నున్న వన్నియు నేలపాటులే!

---

1 స్త్రీలు పాడునట్టి నారాయణశతక మిది. పోతన్నది వేఱు.

2 కనగాల లక్ష్మీనరసింహారావుగారు, క్రోధన సారస్వతానుబంధము.

5. తత్త్వముల నందఱును వినియుందురు. "దేహమే గాలిపట"మను తత్త్వము వినఁబడని దినమే యుత్తరాదిలో లేదు. ఎడ్లరామదాసు, దూదేకుల సిద్దప్ప యనువారు వ్రాసిన జాతిమతభేదములఁ బాటింపని పాటలెంతయో చవులు గులుకుచుండును.

6. చూర్ణికలలోనే రగడలను జేర్తుమా? చామర్తి నరహరికవి శ్రీశైలయాత్ర రగడలో—

"శివతత్త్వము పరిశీలనఁ జేసితి
శివసంస్కార విశేషుఁడ నైతిని."

యనుచున్నాఁడు. శివభక్తులు విని రండు.

7. దాసు శ్రీరాములవంటివారే జావళీల నాదరించినప్పుడు వాని శృంగారపదప్రభావ మెట్టిదో చూడుఁడు.

8. హరికథలు పెక్కురు కవులు రచించిరి. తాళ్లపాకవారు కొన్నిఁటిని వ్రాసిరి. మద్రాసులో ప్రాతరకపుపుస్తకములు, బయలు నాటకములు నమ్మునట్టి కంపెనీక్యాటలాగుల నిండుగా హరికథలు కనఁబడుచుండును. అటులని ఎగతాళిగాదు. కాని, విశేషించి యున్నవనుచున్నాను.

ఇ దండకకవులు.

దండకము క్రోధాశ్చర్యబీభత్సోద్రేకమునకు నిలయము. నూకాలమ్మ, వీరాంజనేయ, పోలేరమ్మ మున్నగుదండకముల విన్నారము. సాంఘిక విషయములను జమాబంది మున్నగునవి తెలుపును భోగినీప్రభృతులు శృంగారములు. భక్తికై నన్నయ దీని నుపయోగించెను. భోగినీదండకమునకు పుత్త్రికలగు పద్మావతీ, పద్మినీ, చంద్రానన, విద్యావతీత్యాదులు గానవచ్చుటచే నెవఁడో వ్రాసి పోతన్నశైలి ననుకరించి యాతనిపేరు నతికించి కృతియీని మహాకవిపై రాజునకుఁ గల కసినిఁ దీర్చెనని కొందఱంద్రు. అది సమంజసముగానే యున్నది. పోతన్న పిన్నయైనపుడే రచించియైనయుండి

రాజులను గర్హింప నేర్చియుండవలయును. ఈయుగములో గణపవరపు వేంకటకవి చంద్రవిద్యావతీదండకమును, అడిదము సూరన్న, ఏనుఁగు లక్ష్మణకవి, మదిన సుభద్రమ్మ లనువారలు వరుసఁగా రామ, నృసింహ, శ్రీరామ దండకముల రచించిరట! [కవయిత్రులగు మొల్ల, ముద్దుపళని, సుభద్రమ్మల తో పాటు—మరీచిపరిణయమును వ్రాసిన మోహనాంగి యెవరు?—తంజావూరు విజయరాఘవరాయల సభలో మన్నారుదాస విలాసమును వ్రాసి కనకాభిషేకమును బొందిన రంగాజియును స్మరణార్హ గాదా?]

రామస్తవరాజమను ప్రబంధమును రచించిన ముమ్మడిరాజు మల్లనార్యకవి, గురుగీతల నాంధ్రీకరించిన కంభంపాటి నారపామాత్యకవి, కిరాతార్జునీయము ప్రబంధముచేసిన కోటిచింతల కృష్ణయామాత్యకవిని యీయుగమువారని యంద్రు. చంద్రదూతయను నామాంతరము గల్గిన యిందుశతకము రసోదంచితదివ్యభావగీత సంపుటమనియు, దీనిని రచించిన పుసులూరి సోమరాజామాత్యకవి ఇప్పటి కిన్నూఱేండ్లకుముం దనఁగా నీయుగమువాఁ డనియు నొకరనిరి. రాపూరి సంజీవరాయకవి వీరనారాయణశతక మిప్పటిదేయఁట! ఔరంగజేబు దుండగములఁ దెల్పునట్టిదియు గ్రంథకర్తపేరు లేనిదియు నగు వేంకటాచలవిహారశతకము నిప్పటిదౌనఁట! సన్న్యాసనందమను శాస్త్రగ్రంథకర్త కోనయామాత్యకవి, ఇప్పటివాఁడో, లేక ఇంతకంటె నాధునికుఁడో?

---

# ఆ. ద్వితీయసరణి

## 1. గద్యము

1 గద్యమునకును నన్నయయే యాద్యుఁడని మున్ను విన్నవించితిని. పద్యము తరువాత గద్యమని పెద్ద లనిరి. చంపువే మన కాదికావ్య మగుటచే గద్యము మొదటనుండియు మనకున్నది. కాని, యాగద్యములు దీర్ఘవాగ్విసరములు. "గద్యం కవీనాం నికషం వదన్తి" అన్న మనపూర్వులకు గద్యముపై నెంత ప్రీతియో ?

నన్నయ సులభసాంస్కృతికపదములతో చిన్నయసూరి కాదర్శకమయిన గద్యరచన చేసెను. ధారాచమత్కారములు వెలసినవి. ఇసుకతిన్నెలలోని సన్నకాలువలవలె అతని గద్యరచనలు వెలసినవి. వారణాశీవర్ణనాదులను బరింపుఁడు. తిక్కనామాత్యుని రచనలు ప్రౌఢములు. పద్యములపోలిక నున్నవి. విరాటపర్వప్రభాతవర్ణనను దిలకింపుఁడు. శంభుదాసునివి దేవభాషాపదసుందరములు, సమతాగుణబంధురములు. పద్యముల నొండొంటి నందుకొనుమెట్లు. అర్జునవిజయాదిక ప్రసంగములలోని సారళ్యమును గనుఁడు. భారతకవు లెన్నియో పోకలు చూపిరి. "గొల్లేటి చేఁదత్రాడు"లు వారి యందును గలవు. కాని, వానిపృథక్త్వము నాచన సోమునియందు మితిమీఱినది. హంసడింభకసాల్వప్రభృతుల యుద్ధములలోని గద్యములఁ జూడుఁడు. ఇవి విసుఁగునకు హేతువులగు దైర్ఘ్యాదిగుణములు గలవి. పోతన్న యితని ననుసరించెనా? భాగవతములో నైమిశారణ్యవర్ణన మొదటి దీర్ఘవచనరచన. శ్లేషానుప్రాణితార్థాలంకారంబు మెండు. దీనిని పోతనవచనములంద గుప్పించినాఁడు. ఈయలంకృతి యష్టమస్కంధసరోవరవర్ణనంబున పదప్రౌఢిమను సూచించి హాలాహలోదయవర్ణనమున నుపమాద్యలంకార

---

1 శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రివారిసాహిత్యపరిషత్ప్రథమ సంపుటములోని దివ్యవ్యాసమును, వాఙ్మయచరిత్రలోని వచనచరిత్రను జదువుఁడు.

సహజసౌభాగ్యంబు వడసి, గంగావతరణంబున నసదృశభావరస సముత్తేజితమై షాంగి కట్టతెగి విశృంఖలకల్పనాప్రవాహంబుగాఁ బరిణమించినది. వర్ణనావసరముల నీవచనంబుల ఛందోబద్ధములుగాని వృత్తము లనవలయును. నృసింహావతారఘట్టమును, మోహినీవిలాసప్రదర్శనవేళలోని శృంగారరస సన్నివేశసముచితానల్పకల్పనలును, అమరావతీనగరవర్ణనంబును నితనిని సర్వజ్ఞుఁ డనిపించునట్టివి. వచనరచనల కితఁడు ప్రసాదించినవి మాధుర్యము కోమలపదవిన్యాసము ననునవి. శ్రీనాథునిలో నయ్యైచోట్ల సారస్యము, సౌలభ్యము, కాఠిన్యముఁ బెరసినవి. పెద్దన్న తన వేఁటవర్ణనలోను, చంద్రికా విలాసప్రకటనములోను, పద్యముల కనువుపడనిదానిని, గద్యముగా మార్చి, వచనముఁ జేర్చినట్లున్నది. నన్నయ్యలో తెలుఁగు పందొమ్మిది, సంస్కృత మిరువదియేడుపాళ్లు; తిక్కనలో నలువదిపాళ్లు తెలుఁగు, ఏడుపాళ్లు గీర్వాణము; ఆముక్తమాల్యదలోఁ దెనుంగు పదునాలుగు, పదునాఱుపాళ్లు దేవభాష; సుమారు 12, 340 తెలుఁగుపదము లిప్పు డున్నవట! ఎన్నియో విదేశ్యములు "గాడి" ప్రభృతులు వచ్చి పడ్డవి. 15-వ శతాబ్దారంభమున ప్రత్యేకగద్యకృతులుఁ బుట్టినవని పరిశోధకులయాశయము. పదునాఱవశతాబ్దిని కృతులున్కి సత్యము: 1 ఏకామ్రనాథకవి వ్రాసిన ప్రతాపచరిత్రము. దీనిననుసరించియే కాసె సర్వప్ప [1450?] ద్విపదగా రచించెనేమో? 2 విశ్వనాథనాయకుని స్థానాధిపతి వ్రాసిన రాయవాచకము. విశ్వనాథుఁడు, రాయలు ఏకకాలము వారు గాన 1535 లో నిది పుట్టియుండును దీనిలోని వచనములు ప్రతాపచరిత్రములోవలె వాక్యావసానశూన్యములు. నిరుపదిముప్పదిపుటల కొక్కటిగానుండు వాక్యములు గలవి. ఇందలిభాష లక్షణవిరుద్ధము. తాత్కాలికసంప్రదాయముల కిది యద్దము. ధారాళమగు వాగ్ఝరి; "కాములమీదసముద్రతరణమై, ధనుష్కోటిలో ఖడ్గం కడిగి, సేతుస్నానం, తులాపురుషదానం మొదలగునవి యాచరించి"— "అందున బంగారుహెచ్చింది యేది అంటె వోరియకు రాంగా వచ్చె

హెచ్చించినట్లు గుణాధిక్యంవల్ల మనుష్యులలో నున్నఅప్పాజీ అధికుఁడని ఎరుగవలెను.'' విద్యానగరనిర్మాణాదులు, రాయల దినచర్య, అశ్వగజనరప తుల తారతమ్యములు, రాయలదిగ్విజయము లిందు వర్ణితములైనవి. కథ, చరిత్ర, శాస్త్రము లేకీభవించిన ట్లున్న యీగ్రంథము పఠనీయము. 3 ఈరాయవాచకములో భారతసావిత్రి పేర్కొనఁబడినది. ఎల్లరకు నృసింహ కవికృత భారతసావిత్రియంత ప్రాచీనమైనదా? 4. గోవ్యాఘ్రచరిత్రము. 5. పులిపాకరామన్నది శ్రీరంగమాహాత్మ్యము. 6. మైసూరుచిక్కదేవ రాయలదళవాయి కళువె వీరరాజువచనభారతమును రచించెను 1660 ప్రాంతమున. ఇది శ్రీకృష్ణాంకితము. తేనె తేటను బురుడించు తేటతెనుంగు బిగువుపీడినరచనలు తక్కువ. అధ్యాయవిభాగములతో విపులమై యున్నది. ఇతఁడు వీరభూపాలీయమను లక్షణగ్రంథమునకు భర్త. ఇతని రచనలో "నేను" నకు "తానును", "పలుకు" ధాతువునకు "పలుకరించు" అని యును, తత్సమక్రియల శత్రర్థకమునఁ దఱుచుగా నింపుగాగమంబును, అమహదర్థక తచ్ఛబ్దమునకు "వాటిని" వ్రాసి యున్నాఁడు. కొంతభాష వ్యావహారికము. ["తేజోధికుండగు పాండునృపాలుండు వయఃక్రమం బునఁ గనిష్ఠుం డయ్యును, జ్యేష్ఠుఁ డనంబడు. నతనికుమారులు వేదశాస్త్రా దులు చదివి.''] అయినను మొత్తముపైన పరిశుద్ధధార. 7. వీరరాజుకొడుకు నంజరాజు "అభినవకాళిదాసబిరుద" విభ్రాజియగు నృసింహకవిచే "నంజరాజయశోభూషణంబు"ను గైకొనెను. ఈనంజరాజు హాలాస్యమా హాత్మ్యము, విష్ణుభక్తవిలాసము, హరభక్తవిలాసము, కాశీమహిమార్థదర్ప ణము ననువానిని రచించిన యద్వైతి. మొదటిది స్కాందపురాణహాలాస్య ఖండాంధ్రీకరణము. డెబ్బదిరెండధ్యాయముల వచనము. 'హాలాస్యనాథుఁడు ......ఆశీర్వాదములచేత నతనిం బ్రమోదములనొందించి, కరమ్ముల దదీయ శరీరమ్ము దివిరి, ముహూర్తమాత్రంబునం దదృశ్యుం డయ్యె' నను వాక్య మితని ధారను దెల్పుచున్నది. అయినను తండ్రిశైలి యంత ప్రాఢిమ ఇతని కడ లేదన నగును. 8. తుపాకుల యనంతభూపాలుఁడు—'శ్రీనందనందన

చరణారవింద మత్తమధుకరాయమానచిత్తచతుర్విధకవితాసామ్రాజ్యభోజ చంద్రగిరి కృష్ణభూపాలతనూజ భాగమాంబాగర్భ శుక్తిముక్తాఫల తుపాకుల యనంతభూపాలుఁడు' శాంత్యానుశాసనికసభాపర్వములు, విష్ణుపురాణము, భగవద్గీత యనువానిని రచించెను. రామాయణమును వచనరచనావైచక్షణ్య బిరుదాంకితుఁడై వ్రాసెనఁట! వీరరాజు సాయముచేసెనఁట! సుందరకాండము మాత్రము చిక్కినది. 'సర్వభూతమనోహరంబైన యమ్మురళీనాదం బాలకించి గోపాంగనలు మదనబాణవిదళితహృదయలైరి. మొ.' ప్రౌఢవర్ణనలున్నవి. మూలానుసారములుగ నాఙాశ్వాసములలో, వెన్నెలకంటి సూరనార్యునకన్న విపులముగ విష్ణుపురాణమును రచించెను. 9. విజయరంగచొక్కనాథుఁడు (1704-1731) శ్రీరంగమాహాత్మ్యమును, మాఘమాహాత్మ్యమును రచించెను. ఇవి వ్యావహారికభాషలో సులభగ్రాహ్యముగ నున్నవి. 10. ఇతని యాస్థానకవి వెలఁగపూఁడి కృష్ణకవి వేదాంతసారసంగ్రహమును రచించెను. 11. ఆస్థాన కవియగు కుందుర్తి వేంకటాచలకవిని కృతిభర్త 'వచనకావ్యములుగా రచియించినాఁడవు. భారతభాగవతములు రామాయణకథయు' నన్నాఁడు. అవి యేవీ? 12. సముఖము వేంకటకృష్ణప్ప జైమినిభారతమును రచించెను. 'తేజినెక్కి శుభశకునంబులఁ బొడఁగనుచు ప్రధానివాకిటికిం జని ఫణిహారిచేఁ దనరాక కుమారుని కెఱింగించె.' సారంగధరచరిత్రమును గూడ రచించెను. 'చిత్రాంగి నగరిలోనఁ జేరుటయుఁ జేరికలనున్న రాకొమరులు సారెసారెకుఁ గేకలు వేయుచు మనంబునఁ గలవరపడుచు, మత్వారావతంబు వెంటి గానరైరి.' వర్ణనాంశములఁ గొఱవడక సుద్ధతశైలి వెలయుచున్నది. 9—12 దాక్షిణాత్యవచనరచయితలు నిండు సున్న నే యరసున్నకు బదులు తెలుచువాడిరి. ద్రుతాదేశముగ వచ్చు నర్థానుస్వారమును గమనింప లేదు. 'వాఁడు' ప్రభృతులు నుచ్చారణమున నట్లు యని, వ్రాఁతలో 'వాండ' నియేవ్రాసిరి. 'గుత్తికి—గొత్తి', 'గట్టునకు—గెట్టు' మున్నగు వ్రాఁతలలోని యపరూపములు వ్రాయసగాండ్లవో, కవులవో? సముచ్చయము 'న్ను' అని యున్నది. అనుస్వారానంతరమందు 'పదప' 'ప్పదప' యైనది. 'యడనెడ',

"యెల్లయెల్ల' లెందుకో? 'మూకుడు' నిర్బింధువు. 13. ముకుందయోగి వివేక సింధువును రచించె నఁట. 14. పుష్పగిరి తిమ్మకవి భాగవతము రచించెను. సమీర కుమారవిజయగద్యలభంగిఁగాక పామరజనోపకృతికిఁగాఁబోలు, సుల భమై వ్యావహారిక పదమిశ్రమైనది. ఔత్తరాహులపురాణకవిత దాక్షిణా త్యుల కర్థముకాదని దాక్షిణాత్యుల కని యిట్లు రచింపఁబడినదా? 15. పంచ తంత్రము, 16. భగవద్గీత, 17. విక్రమార్కకథలు, 18. పాండవాశ్వ మేధము, 19. మహావాక్యము, 20. ఆత్మైకబోధము, 21. గురుశిష్యసం వాదము, 22. గజారణ్యమాహాత్మ్యమునునవిఎవరివో? 23. శ్యామరాయకవి రామాయణవచనమును, 24. సాంద్రీసుదొరప్రేరణముచే పైఁడిపాటి పాపయ్య రంగనాథరామాయణానుకరణవచనరచనయుఁ జేసిరి. 25. శుక సప్తతికథలు, 26. తెనాలి రామలింగనికథలు, 27 పంచవింశతి కథలు, 28. పరమానంద శిష్యులకథలు, 29. మదన కామరాజుకథలు, 30. మైరావణ కథ, 31. మర్యాదరామన్న కథలు, 32. కాశీమజిలీకథలు, 33. స్థలపురాణ వచనములు, 34. సభాపతిలక్షణము ననువాని నెవరు రచించిరి? ఎప్పుడు?

## 2. నాటకరచన

వేములవాడ భీమకవికాలముననే నాటకము లున్నవనుచు కళింగ గంగుకథఁ దెలుపుచున్నది. శ్రీనాథునికాలములో వీథిభాగవతములు, యక్ష గానములునుండెనని యనుకొంటిమి. యక్షగానాదులు క్రమక్రమముగా తోళ్ల బొమ్మలాటలుగా మాఱి పిదప బయలు (వీథి) నాటకములుగా నెట్లు పరిణ మించినదియు ముందే చర్చించుకొంటిమి. పినవీరన నాటకములఁ దెనింగించెను. 17-వ శతాబ్దారంభమందలి 1600 యెలకూచి బాలసరస్వతి "కవిసమీహిత రంగకౌముదీనామనాటకవిధానప్రతిష్ఠాఘనుండ" నని చెప్పుకొనియెను. కుం దుర్తి వేంకటాచలకవిని (1700) కృతిభర్త 'ఘటియించినావు ద్రాక్షాపాక ముగ బహునాటకంబులసమున్నతిఁ జెలంగి' తని కొనియాడెను. నాయూహా యేమనఁగా నాంధ్రుఁడగు కోలచలమల్లినాథసూరి సంస్కృతనాటకవ్యాఖ్యలు

ప్రాయుంనప్పటినుండియును దేశమున నాటకరచనమునకుఁ బ్రయత్నము జరుగుచుండె ననియే. క్రమక్రమముగాఁ గొన్నినాటకములకుఁ బ్రచారము వచ్చియుండును. 1600 లోపలిదైన కావ్యాలంకారసంగ్రహములో నాటక ప్రకరణమును భట్టుమూర్తి విస్మరించి యుండుటచే పండితకవులు పాటించు నట్టిస్థితికి వచ్చియుండ దనుట కవకాశమేర్పడినది. ఉన్నంతలో 'క్రీడాభి రామ' మాది. [జావాలోని కట్టెబొమ్మలను జూచి కొందఱు ఆర్యులరాకకు ముందే యాంధ్రులలో నాటకము లుండెనందురు.] క్రీడాభిరామమునకన్న ముందే నాటకములుండెననుటకు భీమఖండములో, శ్రీనాథుఁడు ఆట వెలంది తెలియుచుండగనఁ జేరె ననుటయే ప్రబలసాక్ష్యము. 16-వ శతాబ్దములో నాటకము లున్నవని ప్రభావతీప్రద్యుమ్నము ఘోషించుచున్నది. 17-18 శతాబ్దములలో బాలసరస్వతి, వేంకటకవి నాటకములనే రచించిరి. రాజ లింగకవి రుక్మాంగదచరిత్రయు, మృత్యుంజయకవి వామనచరిత్రయు నీయం గమునఁ జేరినవేమో! ఒకటియా, రెండా, అరువదియేడునాటకములు (యక్ష గానములు) ప్రాచుర్యమును బొందియుండె నని పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులగారువ్రాసిరి. *అహల్యాసంక్రందనీయము, కుశలవనాటకము, రుక్మాం గదచరిత్రము, ప్రహ్లాదనాటకము (లక్ష్మణదాసొకటి, తిరునారాయణాచారి యొకటి), జలక్రీడలు, భాగవతము, రామానుజవిజయము, శూర్పణఖా భంగము, సారంగధరచరిత్రము, సుగ్రీవవిజయము, హనుమంతవిజయము, రామనాటకము (ఇర్వురుకవులు చెరి యొకటి) శశిరేఖాపరిణయము, శశాంక విలాసము, సీతాపహరణము, సీతాకల్యాణము, సముద్రమథనము మొదలగు నవి యం దుదాహరింపఁబడినవానిలో నివి.

## 3. యుగలక్షణ సమన్వయము

1. తంజావూరు, గద్వాల, మధుర, విజయనగరము, బొబ్బిలి, వేంకట గిరి, పిఠాపురము, పుదుక్కోట, అమరావతి-ఇది యది యననేల? సమస్తాంధ్ర దేశములోని ధనికులసభలును వాఙ్మయరంగము లైనవి.

* పండ్రెండవ ఉగాదిసంచిక 126-వ పుటలో.

2. ఆంధ్రీకరణము మరల తలయెత్తి విశేషముగా వర్ధిల్లినది.

3. ఈయుగమున రెందులూరు లింగనారాధ్యుఁడు మొదలగువారు గురువులు. ములుగు పాపయారాధ్యుఁడు విద్వత్కవి. ప్రజాప్రీతిపాత్రుఁడై కంకంటి పాపరాజు పండితపామరులమెప్పుఁ బడిసినాఁడు. ప్రబంధకవి కనుపర్తి అబ్బయామాత్యుఁడు. విజయరంగచొక్కనాథుని యాస్థానము వచనకవితకు త్రిభువనవిజయము వంటిది. ప్రబంధకావ్యకవితలు కుప్పలై త్రుళ్లి మురిగిపోయినవి. లక్షణగ్రంథములు మెండైనవి.

4. వచనసారస్వతము పృథక్త్వముగాంచి సుస్థిరముగా స్థాపితమై కొనలు సాగినది.

5. నాటకకవిత సభలకెక్కి గౌరవనీయమై ముందుకు దూకుచున్నది.

6. గేయ, శతకకవిత్వములు పరమావధి నొందిన వన నగును.

---

## ౭. సంధియుగము (1801—1900).

### ౧. సంఘచరిత్ర

భవిష్యద్వాఙ్మయవిమర్శకు లీశతాబ్దమును నవయుగమని పిల్తురేమో? పందొమ్మిదవశతాబ్దము ఆంగ్లేయసారస్వతమున నుత్తమకావ్యయుగమైనది. ఆంధ్రవాఙ్మయమున ఇరువదవశతాబ్ద మట్టిది కావచ్చును. షెల్లీ, కీట్సు, బైరన్, వర్డ్స్‌వర్తు, రస్కిన్, కార్లైలు, మెరెడిత్, డికన్సువంటివారు కొందఱు కన్పడుచున్నారు; కొందఱు కన్పడనున్నారేమో! ప్రస్తుతపుస్థితి ఎట్లున్నను పూర్వశతాబ్దముమాత్రము పాశ్చాత్యనాగరకతచే విభ్రాంతమై పోలేదు. విభ్రాంతము కాకుండనుండలేదు. అనఁగా ప్రాచీనాధునాతనభావసంఘర్షణము విశేషించియున్నది. ప్రాతప్రబంధకవిత్వము సన్నగిల్లుచుండెను గాని, పూర్తిగఁ బోలేదు. నవయుగారంభసూచనలు గన్పడి

నవే కాని, పరిణతి కలుగ లేదు. ఈవిషయము ముందు స్పష్టమగును. ప్రాతదిపోవుచు, నవీనము వచ్చుచు నున్న యీ యుగమును నవయుగమనుట పొసఁగదు. ఇది సంధికాలమే.

బ్రిటీషుసామ్రాజ్యము భరతఖండమున పదిలపడినది. కాని, విక్టోరియామహారాజ్ఞికి లోఁబడినట్లు యుగాంత్యభాగమున లార్డు కానింగుకాలముననే ప్రకటింపఁబడినది. 1857 లోని సిపాయీల తిరుగుపాటు, పాశ్చాత్త్యప్రాచ్యభావసంఘర్షణమునఁ బుట్టి, పాశ్చాత్త్యసద్భావోన్నతి విజయము గాంచినది.[1]

1. 1770 మొదలుకొని 1820 వఱకును బందరు మొదలగు పట్టణములలో జిల్లాజడ్జీగా నుద్యోగముఁ జేసి, యాంధ్రవధూటిని వలచి, జూలూరి అప్పయ్య, గురుమూర్తి శాస్త్రి, పరబ్రహ్మశాస్త్రి మొదలగువారి నాదరించి, ఆంధ్రగీర్వాణగ్రంథ సమితిని విశేషించి ప్రాచ్యలిఖిత భాండాగారమునకుఁ జేర్చిన త్యాగశీలుఁడు, దయాళువు, భాషాపోషకుఁడు సి. పి. బ్రౌనుదొర నెఱుఁగనివారుండరు. ఇతఁడు "నూర్లార్లు లెక్క సేయక పేర్లందిన విబుధవరులఁ బిలిపించుచు వే, మా గ్రంథ మిచ్చు వితరణి." ప్రథమాంధ్రనిఘంటువును గూర్చిన యీ ఛార్లెసు ఫిలిప్‌దొరగా రాంధ్రవాఙ్మయముండుదాఁక కీర్తికాయముతో నిల్చువారు. 1783 లో మద్రాసున కింజనీయరుగా వచ్చి, భరతఖండమున కంతటికి సర్వేయర్ జనరల్ తర్వాతనైన కర్నల్ కాలిన్ మెకంజీ, చరిత్రజిజ్ఞాసతో ధన

1 దీనికిఁ గినియకుఁడు. మనపూర్వులు సమస్తదేశీయులకన్న గొప్పవారు కావచ్చును. కాని, నేఁటివారు పాశ్చాత్త్యులనుండి నేర్వఁదగినవిచాలకలవు.

మును వెచ్చించి, ప్రతిభాషకుఁ బండితుల నేర్పాటుచేసి దేశ
చరిత్రను గ్రామములనుండి కైఫీయతులద్వారా, గుహల
యాదిశిల్పముల ద్వారా రాఁబట్టెను. ఇతఁడే యమరావతీ
స్తూపసౌందర్యమును జగత్తునకుఁ జాటినవాఁడు. ఇతనియొద్ద
ప్రధానపండితుఁడు కావలి వేంకటబొర్రయ్య. ఈయాంధ్రపండి
తుఁడు పురాతనశాసనలిపిపఠనవిద్య నుద్ధరించినవారికి హిందూ
దేశమున మార్గదర్శి. ఇతనికి ప్రిన్సెప్ పిమ్మటివాఁడు. ఏడు
భాషలలో నేర్పరి ఇతఁడు. బొర్రయ్య తమ్ముఁడు రామస్వామి,
తెనుఁగు, అరవము, మరాటి, కన్నడము ఈభాషాకవులచరి
త్రను 1822 లో దక్షిణాపథకవులను పేరఁ బ్రకటించెను.
ఆర్ష పుస్తకశాలను స్థాపించిన పరవస్తు రంగాచార్యు లింకొ
కరు, పరిశోధకులలోఁ జేరందిరి. సారాంశము పరిశోధకులు
ప్రబలిరనుటయే!

2. చరిత్రజిజ్ఞాసకుఁ దోడుగా సుస్మరణీయమైన విష
యము, ముద్రణాలయస్థాపనము, భూతపురిమాహాత్మ్యము,
కవిజన మనోహరములను కావ్యద్వయిని నిర్మించిన కరాలపాటి
రంగయ్యకవి యాంధ్రభారత, భాగవత, రామాయణాదుల
లేఖకప్రమాదరహితములుగ ముద్రించిన ఘనుఁడు.

3. పై రెంటిని పురస్కరించుకొని గమనింపవలసిన
మూఁడవవిషయము. దేశీయులు లోకయాత్రకై యాంగ్లము
నభ్యసింపవలసివచ్చి, దానియందఖండపాండితిని గడించి, క్రమ
క్రమముగా పాశ్చాత్త్యాచారముల సంఘములోనికి, పాశ్చా
త్త్యభావ సంప్రదాయముల భాషలోనికి సంక్రమింపఁజేయుట
యైనది. ఈమార్పునకు ఫలముగా కార్యకారణవిమర్శనము

ప్రాక్కి, సంఘములో ప్రబలసంచలనము ప్రబలఁజేసిన నూత్న జీవనవికాసమును బ్రసాదించినది. మంచితోఁ జెడుగు బెరసి యుండుట ప్రపంచలక్షణము. తద్విషయము చరిత్రకారుల కార్యరంగము.

4. ప్రాథమికపాఠశాలలు, ఉన్నతవిద్యాలయములు, ప్రభుపోషణమున దేశమందంతటను వ్యాపించినవి. తదర్థమై వచనకృతులు, నూత్నగ్రంథములును నావశ్యకము లైనవి.

5. వార్తాప్రచార మన్నిటికన్న గొప్పసంగతి. పత్రికాప్రచారమనఁగా మహావ్యక్తుల యభిప్రాయప్రచారము. పత్రిక చిన్నదగుటచే నందలి రచనలు నొక్కొక్కటియు నొక్కొక్క విషయమును సమర్థించునదగుటవలన సంగ్రహమయ్యును, బిగువు దప్పక, విషయ నివేదనా వైశద్యమును గల్గియుండ వలసివచ్చినది. అట్టి సంగ్రహరచనలే క్రమక్రమముగా వ్యాస వాఙ్మయముగా ముదిరినది. భాషాసంజీవని, వార్తాప్రదర్శిని, రాజయోగి, శశిలేఖ, చింతామణి, సత్యసంవర్ధని, వైజయంతి, జ్ఞానోదయము, సకలార్థదాయిని, శ్రీశారద మున్నగు పత్రికలు నానావిషయంబులను జర్చించుచు కోలాహలముగ నుండినవి. సరస్వతిలోని శ్రీనాథాదికవుల విమర్శనములును, అముద్రిత గ్రంథచింతామణిలోని నాచనసోమనాది కృతివిమర్శలును, ఆధునిక కవికృతానేకగ్రంథవిమర్శనములు, వివేకవర్ధనిలోనితాత్కాలికసాంఘికస్థితికి సంబంధించిన వితంతూద్వాహాద్యనేక విషయంబులును జూడఁదగినవి.

6. 1875-76 సంవత్సరములలో స్త్రీజనాకర్షకమని కీర్తిని వడసిన ధార్వాడాకంపెనీవా రాంధ్రదేశమున "తెరలనాట

కము" నకుఁ ద్రోవఁజూపిరి. తర్వాత గుంటూరు బళ్లారి నాటక సమాజములవారు పుట్టిరి. కొక్కొండ వేంకటరత్నంపంతులవారు నరకాసురవ్యాయోగమును, దాసు శ్రీరామపంతులు ఉత్తరరామచరితమును, వీరేశలింగముగారు శాకుంతలాదులను, వేంకటరాయశాస్త్రులుగారు ప్రతాపరుద్రీయాదులను వ్రాసిరి. వీథి నాటకముల రుచి పోయి తెరనాటకములు బయలుదేరినవి.

---

## ౨. వాఙ్మయచరిత్ర

### అ. పద్యము

ఈయుగవాఙ్మయమును పద్యమని, గద్యమని రెండు తెఱంగుల విభజించియే తీరవలయును. ముం దిట్టి విభజన మావశ్యకము. పద్యకృతులవలెనే గద్యకృతులు ననేకములు పుట్టి మధ్యయుగములోనే గిట్టినవి. రెంటికిని సమానగౌరవ మబ్బినది. రెంటికిని సంగమ మొనగూర్చినది నాటకము.

1. నన్నయవంశములోని గోపాలుని రామకవి చిత్రాంగదాపరిణయమును వ్రాసెను. ఇతఁ డాధునికుఁడైనను కాలము తెలియదు.

2. శ్రీధరమల్లె వేంకటస్వామి బ్రహ్మోత్తరఖండమును పద్యకావ్యముగా రచించెను. హృదయరంజకమగు కవిత్వము.

3. అక్కెనపల్లి నృసింహకవి యాదిలక్ష్మీవిలాసము, వల్లభాంబాపరిణయము, ఓఘవతీపరిణయము అని మూఁడు ప్రబంధములకర్త. రసవత్కవిత.

4. పైఁడిపాటి వేంకటకవి నృసింహవిలాసమును రచించి గణనకెక్కెను.

5. కొటికలపూఁడి వేంకటకృష్ణకవి శ్వేతాచలమాహాత్మ్యమును రచించి బొబ్బిలిరాజున కంకితము చేసెను. కవనము మృదువై మధురముగనున్నది.

6. కాకరపర్తి కృష్ణకవి, శశిరేఖాపరిణయము, ముఖలింగక్షేత్రమాహాత్మ్యము అను కావ్యముల కర్త.

7. శశిరేఖాపరిణయమును కోనపల్లి వేంకటరంగకవియును,

8. అప్పప్పయను భట్రాజును విరచించిరి.

9. కృష్ణయ్య పార్వతీపరమేశ్వరపరిణయమును రచించెను. ఇతఁడు పినాకినీతీరమువాఁడు.

10. పిండిప్రోలు లక్ష్మణకవి లంకావిజయ మనుద్వ్యర్థి కావ్యమును వ్రాసెను. కుయ్యేరు గ్రామమున కీతఁడు కరణము. ధర్మారాయఁ డనునతనిపై నిది దూషణకావ్యము. శతకరూపమును గాక కావ్యరూపమును దాల్చి దూషణకావ్యములుగాఁ బ్రసిద్ధినొందిన వానిలో 'చంద్రరేఖావిలాపము' తర్వాత నిది రెండవది. శిష్టు కృష్ణమూర్తికి ఇతనికి వాదము లుండెను.

11. శిష్టుకృష్ణమూర్తికవి, చాటుకవిత్వపారగుఁడై శ్రీనాథునివలె నానాస్థానములు దిరిగిన ప్రౌఢ. [శ్రీనాథునివలెనే దేశాటనమును గావించిన కవులు పెక్కురు గలరు.] సర్వకామదాపరిణయ ప్రభృతుల, బహుగ్రంథములను, హరికారికావళినో, లేక, తద్వ్యాఖ్యనో, లేక రెంటినో యితఁడు రచించెను. సాహితితో సంగీతము పొందుపడినది. కాళహస్తిలో నితఁడు చిరకాలము కాఁపుర ముండెను. ఇతనిధార నిరర్గళాశుధాటికలది. సంస్కృతములో భాణములను, కావ్యములను రచించెను

12. మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి కృష్ణార్జునచరిత్ర మను రెండాశ్వాసముల ద్వ్యర్థికావ్యమును, భీమలింగశతకమును,

13. అల్లమరాజు రామకృష్ణకవి, కవిచకోరచంద్రోదయమును, అచ్చతెనుఁగు భాగవతమును, శంతనువిలాసమును (1845) సరసశైలితో రచించిరి.

14. పైయుగమునఁ బేర్కొనఁబడిన కవయిత్రులకంటె విలక్షణమయిన జీవితము గలిగి, బహుగ్రంథరచనముఁ గావించి కీర్తిశేషురాలైన తరిగొండ వెంకమ్మ దత్తమండలమునకుఁ జేరినది. ఈమె ద్విపదయందును వృత్తరచనయందును పరిశ్రమ చేసినది. "రాజయోగసార" ద్విపద ప్రచా

రముం బడయుచున్నది. సాధారణముగ నీమె వేంకటాచలమాహాత్మ్యమే జానపదులలోఁ బఠనీయంబై యున్నది. శృంగారవర్ణన లుచితముగా "పదముల్ శృంగారసారంబుతోడం గూఢంబుగ" మేళగించి కవనమల్లినది. అచటనచట శబ్దాలంకారము లున్నవి. లలితపదవిన్యాసము మనోహరముగా నున్నది. ఈమెతో సమకాలికురాలై రాఘవరామ, రఘురామ, కృష్ణ, కేశవశతకముల రచించిన సుభద్రమ్మను ముందే స్మరించినారము. వెంకమ్మ భాగవత దశమస్కంధమును ద్విపదగా రచించినది. ఇవన్నియుఁ జూడ బాలవితంతువగు నీమె కద్వితీయ వేదాంతభావ మలవడినట్లు స్పష్టపడుచున్నది.

15. కాకరపర్తి బుచ్చిపాత్రకవి, ముఖలింగక్షేత్రమాహాత్మ్యమును రచించిన కృష్ణకవికిఁ దనయుఁడు. సత్యవతీపరిణయమను లలితకావ్యమును రచించెను. మచ్చున కొక పద్యముం గనుఁడు.

> "ఎల్లెడలందుఁ జీఁకటుల హెచ్చులు చెల్లెఁ బయోధివృద్ధి పా
> టిల్లెఁ జకోరభుక్తులు ఘటిల్లె వియోగి హృదంతరంబు ఛే
> దిల్లె రథాంగదంపతుల తేజము డొల్లె రతీశునాజ్ఞ వ
> ర్తిల్లెను జంద్రికాప్రతతి దిక్తరుకోటుల నల్లె నయ్యెడన్."

16. ఫక్కి వేంకటనరసయ్య శకుంతలాపరిణయమును రచించెను. కవికాలము 1836. కవిదర్పణఛందమును, కొన్ని శతకస్తవములనుగూడ నిర్మించెను. ఇతఁ డొక యున్నతపాఠశాలలోఁ బండితుఁడై జీవయాత్రఁ గడపెను.

17. వేల్పూరి వేంకటేశ్వరకవి గోవ్యాఘ్రచరిత్రమును, విచిత్రరామాయణమును రచించినవాఁడు. శ్రావ్యమైనధార. విచిత్రరామాయణము నిటీవల నరసింహదేవర వేంకటశాస్త్రియు రచించెను. వేంకటశాస్త్రియే ప్రౌఢముగా రచించెనని కవిచరిత్రకారుని యభిప్రాయము.

18. కోలమురాజు నాగయ యధ్యాత్మరామాయణమును,

19. దామరాజు లక్ష్మీనారాయణ బృందావనవిహారమును,

20. త్యాగరాజు మొదలి విద్వత్కర్ణామృతమును, సుబ్రహ్మణ్యవిజయమను ప్రబంధమును రచించిరి. కట్టకడపటి త్యాగరాజు మొదలి ఇంజనీరింగు శాఖలో ఓవర్సీరు.

21. తిరుమల బుక్కపట్టణపు తాతాచార్యులు విశ్వగుణాదర్శమును తెనిఁగించెను.

22. నూజవీడు సంస్థానము నాశ్రయించిన మాడభూషి నృసింహాచార్యుఁడు వల్లీపల్లవోల్లాసమును రచించెను. కవిత్వము ప్రౌఢము.

23. ఓగిరాల జగన్నాథకవి తన సుమనోమనోభిరంజనమును 1876 లో ముద్రింపించెను. 1846 లోనే రచించి యుండెనఁట. పూర్వప్రబంధధారఁ దలఁపించు నితనిశైలి సంస్కృతసమాసనిబిడమై యుభయభాషాసాహిత్యమును బ్రకటించుచున్నది. ఇది పట్టపరీక్షకు పఠనీయమైనది. సమకాలికు లితని కవనమును బ్రస్తుతించియున్నారు. కాన, నీకాలములో నితఁడే పండితాదృతికిఁ బాత్రమైన వారిలో నగ్రగణ్యుఁడుగాఁ గన్పట్టు. ఇతఁడు సుధీరంజని యనుపత్రికాధిపతిగను ఉండెను.

24. నడకుదుటి రామకవి ప్రభులింగలీలలు, హరిమీడేస్తవము, ఆత్మానాత్మవివేకము నను వాని ననువదించెను.

25. మాడభూషి వేంకటాచార్యకవి భరతాభ్యుదయప్రబంధమును వ్రాసిన పండితకవి. ఇతఁడు సమకాలికుల మన్నన వడసెను.

26. పెనుమచ్చ బుచ్చిరాజు పరతత్త్వప్రకాశికయను వేదాంతగ్రంథమును కపిల దేవహూతీ సంవాదఘట్టమును తెంచి వ్రాసెను.

27. మండపాక పార్వతీశ్వరకవి సమకాలికుల కెల్లరకును వంద్యుఁడై మన్న విద్వత్కవి. ఎనుబదిగ్రంథములను రచించెను. కవులవంశములో జన్మించినవాఁడు. ఇతఁడు 1833 నుండి 1897 వఱకు జీవించియుండినవాఁడు. ఇతఁడు గొప్పపండితుఁడును, నిరర్గళమాధురీప్రపూర్ణధారావిరాజితకవియు నై మన్ననవడసినాఁడు. పూర్వకాలకవితాజ్యోతి యితనియం దొక్కసారిగా నారిపోనున్న దీప మొక్కతేప విజృంభించినట్లు

గొమెఱసి పోయినది. 1897 నకు తరువాత నిట్టికవులును లేరు. ప్రబంధసంబంధనిబంధనమును, శ్రీకృష్ణాభ్యుదయమును, రాధాకృష్ణసంవాదమును బోలు గ్రంథములు తర్వాతలేవు. ఇతని కాంచీపురమాహాత్మ్యము అమరుకకావ్యము గూడా కొంతపెద్దది. వేంకటగిరి మహారాజుల పరిపోషణము నందిన యితఁడు పాఠకుల కముద్రితగ్రంథచింతామణి మూలమునఁ జిరపరిచితుఁడు. కవిత్వము నిర్దుష్టమై, శబ్దాద్యలంకారబంధురమై శ్రావ్యముగ నుండును. నవ్యత యంతఁ గానరాదు. నవ్యతలేమి మధ్యమయుగమునకు, నీయుగమునకు సామాన్యధర్మమై యున్నదిగదా? ఒకవిధముగా నీయుగము లోని ప్రాచీనానుస్మృతి కితఁడు ప్రతినిధి.

28. గురురాజకవి శేషధర్మములను,

29. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి శ్రీకృష్ణకల్యాణమను ప్రబంధమును,

30. సత్యవోలు భగవత్కవి రుక్మిణీపరిణయమును,

31. గోపీనాథవేంకటకవి యథామూలవాల్మీకి రామాయణమును దెలిగించి వ్రాసిరి. వేంకటకవి వేంకటగిరి సంస్థానమునఁ బ్రసిద్ధికెక్కిన కవీశ్వరుఁడు. బ్రహ్మకైవర్తపురాణములోని కృష్ణజన్మఖండమును, మాఘకృతమగు శిశుపాలవధను కూడ నితఁడు తెనిగించెను. భగవద్గీతాశాస్త్రమును పద్యముగా నొనర్చెను. ఇతనిని మెచ్చి కృతిభర్త యగ్రహార మొసంగెను. ఇతఁ డాధునికుఁ డగుట నితని విలువఁదూఁచుటకు మన మశక్తులమే మో? నా యభిప్రాయము కొందఱకుఁ బడదేమోకాని, ఇతని యథామూల వాల్మీకిరామాయణ మాంధ్రీకృత యథామూలము లన్నిటిలో నుత్తమోత్తమమైనదని యయ్యెపుస్తకముల నొకేచోట, నొకప్పుడే చదివినయెడల పాఠకులకుఁ దప్పక విశదమగును. సంస్కృతపంచకావ్యములలో నొకటి యగు మాఘము నితఁడు తెలిఁగించిన తెఱంగునకు శ్రీనాథుఁడును దల యూపవలసినదే! శైలి "విద్వత్సంస్తవనీయకవితావేశంబును" మెఱయించుచు, సలలితపదప్రయోగసంవిధాన నైపుణ్యమును జూపుచు చదువఁజదువ నింపులు పుట్టించుచున్నది. ఇతఁడు స్వతంత్రగ్రం

ములు ప్రాయమి కళంకము, శోచనీయము. ఉన్నంతలో కృష్ణజన్మ ఖండ మించుక స్వాతంత్ర్యము సూచించెడు. ఇతఁడు మారన సింగనల పఙ్క్తిని కూర్చుండవలసినవాఁ డన్న సాహసోక్తి కాదు. ఒక్కొక్కెడఁ గన్పట్టు పూరణపదంబులు గొన్నితప్ప, నితనియందు లోపము లెవ్వియును లేవు.

32. రసప్రదీపికనాఁబడు వైద్యగ్రంథమును వ్రాసిన ముడుంబి వేంకటాచార్యుఁ డీయుగాదిలోనివాఁ డనిరి.

33. శ్రీకుమారాభ్యుదయమను ప్రబంధమును, కౌసల్యాపరిణయమను కావ్యమును,యథావాల్మీకిరామాయణాంధ్రీకృతియు వ్రాసిన శ్రీవావిలికొలను సుబ్బరావుగారు ప్రశంసనీయులు. వీరును కవిత్వమున నవ్యతఁ గాన్పింపక, ప్రాతవడ్డమార్గమునే యనుసరించినను సమగ్రసాహితీప్రౌఢిమతో కుమారాభ్యుదయ, కౌసల్యాపరిణయముల రచించి రనుట మరువకూడదు. చతుర్విధకవితానిర్వాహకత్వము నెఱపి రనుటకు మనోల్లాసమను టీక సాక్ష్యము నిచ్చుచున్నది. శ్రీమద్రామాయణమును యథామూలముగా రచించుటచే వీరిని 'యాంధ్రవాల్మీకి' యను బిరుదముతో నాంధ్రు లలంకరించిరి.

34. శ్రీవీరేశలింగము పంతులుగారు నిరోష్ఠ్యాదినియమములతోను అచ్చతెల్గులోను రచించిన గ్రంథములెల్లరకును దెల్లమే. గీర్వాణపాండిత్యము కొఱత యేమో ననిపించెడు.

35. పెనుగొండ రొద్దం హనుమంతరావుగారు సుబంధువాసవదత్తను ప్రౌఢముగాఁ దెనిఁగించిరి.

36. శ్రీకొక్కొండము వేంకటరత్నముపంతులుగారు శ్రీబిల్వేశ్వరీయమును వ్రాసిరి. దీనిలో కొన్నిపద్యములనామములు బంగారమని, వెండియని నూతనములు గల్పింపఁబడినందున దూషణలకుఁ బాలైనది. కాని దూషించినవారి కవిత్వమున కేవిధమునఁ దీసిపోవునది గాదంద్రు. వీరు

మరణించగా వీరిని గుఱించి యొకపత్త్రిక యిట్లు నుడువుచున్నది. "ఒకగొప్ప పండితుని, ఒకగొప్పవాఙ్మయసేవకుని తెలుఁగుదేశము కోల్పోయినది. విపుల వాఙ్మయరహితమైన ఒకభాషను జదివినయాతఁ డని ప్రస్తుతము ప్రాక్పశ్చిమదేశములయందలి ఆర్యభాషాపండితులును అర్థావలోకనము పఱపెడి తెలుఁగుపండితుని మహామహోపాధ్యాయ బిరుదము అలంకరించినప్పుడు, వాస్తవముగాఁ దెలుఁగుపండితు లందఱు గర్వపడవలసియున్నది....... వీరు రెండుగవర్న్మెంటు కళాశాలలయందు పండితులుగనుండి వీరుచేసిన భాషాకృషిమాత్రము తరతరములవఱకును స్మరింపఁబడుచుండఁగలదు." వీరు ఆంధ్రభాషాసంజీవనీపత్రికకు సంపాదకులు. వీరిబిల్వేశ్వరీయమున సంస్కృత సమాసనిబిడత పెద్దదోషము. వీరిసాంఖ్యశాస్త్రాచార్యత్వమును, తను మధ్యాంబికాబిల్వేశవరస్వీకారమును, వీరిగద్యపద్యగ్రంథములను మాత్రము పైపత్త్రిక మెచ్చుకొనలేదు. వీరి ప్రసన్నరాఘవనాటకాంధ్రీకరణమును పండితులు తూలనాడిరి.

37. శ్రీపార్థసారథి యను కుమ్మరకొలము కవి దివ్యమైనట్టిదియు, అచ్చతెనుఁగు కవితకుఁ బరమావధియు ననఁదగు సత్యావిజయమును వ్రాసెను. ఈగ్రంథము చెన్నపురి విశ్వవిద్యాలయపు ఆంధ్రభాషాపఠనీయగ్రంథనియామకసభవారిచే పట్టపరీక్ష కొకప్పుడు పఠనీయగ్రంథమైనది. ఈకవి దొరతనమునం దుద్యోగియై యుండెను.

38. కాళిదాస భోజచరిత్రాదులు వ్రాసిన చిల్కపాటి రామానుజశర్మ సుస్మరణీయుఁడు. వీరిది లలిత శృంగారపదబాహుళ్యము గల కవిత. చెన్నపురియందు పాఠశాలలో పండితుఁడై జీవయాత్రను గడపెను.

39. దాసు శ్రీరామకవీంద్రుఁడు 1846 లో జన్మించి 1908 లో నస్తంగతుఁ డయ్యెను. వీరు దేవీభాగవతమును దెనిఁగించిరి. జ్యోతిషధర్మశాస్త్రప్రవీణుఁడు. చిలుకలకొలికి, ముద్దులగుమ్మ, కామాక్షీ సూర్యాదిశతకము లనేకములు వ్రాసిరి. సంఘసంస్కారప్రియుఁడు. మనోలక్ష్మీవిలాస

ప్రభృతి రూపక కర్త. అభినవగద్య పంథను రచించిన ప్రౌఢ. శుద్ధాంధ్ర నాటకముగా శాకుంతలము నాంధ్రీకరించెను. గుంటపల్లి గోపాలకృష్ణకవి మచ్చె వేంకటకవి, కస్తూరి శివశంకరకవి మున్నగువా రితరకవు లెందఱు గలరు. కాని, యాధునికు లగుటచే నట్టివా రెప్పటికైన గ్రంథముల కెక్కక పోరనియు, విషయములు దెలియకయు విడిచి వైచితి నంతియే.

## ఆ. గద్యము

వేలూరి వేంకటేశ్వరకవి, విచిత్ర రామాయణవచనము, గోపీనాథుని రామాయణపద్యము ననుసరించినదే. 1819 లో సుబ్బరాయశాస్త్రిగా రచ్చొత్తించిన ప్రతి విక్రమార్కకథ తమకడఁ గలదని, శ్రీరావుసాహెబు గిడుగు రామమూర్తిపంతు లన్నారు. అదియే ముద్రణమందిన తొలివచన గ్రంథమా? విచార్యము. ముద్రింపఁబడిన గ్రంథము లెట్లున్నను పదునెనిమిదవ శతాబ్దారంభముననే గద్య సారస్వతమునకు, కళువె వీరరాజు, విజయరంగ చొక్కనాథుఁడు, వారి యాశ్రితులు వ్రాసిన గ్రంథపరంపరచేఁ బ్రాచుర్యము గల్గి మంచి పునాది పడిన దని ముందే చర్చించికొంటిమి. తలయెత్తి తీగసాగిన యీవచనము అనేకకృతులతో గడుసుదేఱి యీయుగములో శాఖలను నిగిడ్చినది. కావ్యము, విమర్శనము, వ్యాసము, శాస్త్రము, కథ, చరిత్ర, నవల, ప్రహసనము, సామాన్యవచనము నని తొమ్మిదిభాగవములుగ విభజింప నగు.

I. కావ్యములఁజూతము. 1. 19-వ శతాబ్ది మొదటిది చిన్నయసూరి గారి నీతిచంద్రిక. ఇది యతఁడు వ్రాసిన వ్యాకృతికి లక్ష్యగ్రంథముగ నుద్దిష్టమగుటచే, భారతకవులపోలిక లనేకము లున్నవి. ముఖ్యముగ నన్నయ పదసారళ్యమును, శంభుదాసుని సంస్కృతరచనలను, నాదర్శములుగాఁ గైకొనిన ట్లున్నది. దీనియందలి గుణములు, జాతీయాది నుడికారములు, అల్లిక జిగిబిగిభావము లాంధ్రీకృతములు.

2. కోలా శేషాచలకవి గద్యములఁగొన్నిటి వ్రాసెను. అందు నొక్కటియగు నీలగిరి యాత్రాచరిత్రము శైలి నీరసముగాక యింపుగ నున్నది.

3. ముదిగొండ బ్రహ్మయలింగారాధ్యకవి శివరహస్యఖండమును వచనముగా తెనింగించెను. భాష నిర్దుష్టమైనను, క్లిష్టమై శబ్దాలంకారంబులకుఁ దావలమై యున్నది. విషయనివేదనమే ప్రధానముగాఁ గల గద్యకు సమాస నిబిడంబగు దుర్గ్రాహ్యాధార యంత యవసరము గానేరదు.

4. చదలువాడ సీతారామశాస్త్రిగారు సంస్కృత నాటకాదులను, దండి దశకుమారచరిత్ర పూర్వభాగమును మాత్రమే, విసంధిగ తెలుఁగులోనికిఁ బరివర్తనచేసిరి. సులభశైలి, సొంపుగా నుండును. ఇంగ్లీషుభాషలోని గ్రింసు ఫేరీటేల్సులోని పాత్రలకు ఆంధ్రనామము లిడి "దక్కను పూర్వ కథ"లను పేరితో పసిబాలురకు, స్త్రీలకు బోధపడగల కథలను చక్కని ఆదర్శప్రాయమైన శైలితో వ్రాసిరి. సంస్కృతనాటకముల యాంధ్రీకరణము యొక్క శైలి యాదర్శప్రాయమైన దని యెంచి బహుసంవత్సరములు విరామము లేక చెన్నపురి విశ్వవిద్యాలయపు ప్రవేశపరీక్షకుఁ బోవు విద్యార్థులకు పఠనీయములుగ నుండినవి. వీరు చెన్నపురి గవర్నమెంటుకు సంబంధించిన నార్మల్ స్కూలునందును, ప్రెసిడెన్సీకాలేజీలోను, ఆంధ్రపండితులుగ జీవయాత్ర సాగించిరి. ఆంధ్రపండితులుగను, సంస్కృతనాటకములకు ఆంధ్ర వచనకర్తగను ప్రశంసనీయులైనను వీరి గీర్వాణభాషాపాండిత్య మగ్గలము. వీరికి అశ్వశాస్త్రమునను, రత్నపరీక్షాశాస్త్రమునను, భరతశాస్త్రమునను సైతము పరిచయముండినది. సమకాలికులను, కొన్నిసందర్భములలో తమ పాండిత్యచాతుర్యమునుజూపి, ఆశ్చర్యముఁ గొలుపుచుండెడివారు.

5. వీరేశలింగము పంతులుగారు నీతిచంద్రిక కుత్తరభాగము నిర్మించిరి. వారితర్వాతి యితరరచనంబులవలె ధారాళమగుధారయు, జిలిబిలి తేట తెలుంగుపదంబుల హావణింపును గానరాక, యిందు పండితజనప్రీతికై వ్రాయఁబడిన కఠోరపుశైలి గంతులువేసినది.

6. పార్వతీశ్వరశాస్త్రిగారి యాత్రాచరిత్ర మిందు నుడువఁదగినది.

7. వేంకటగిరి సంస్థానపండితుఁ డగు యెనమచింతల సంజీవరాయ శాస్త్రిగారు, ప్రౌఢరచనలో దండి దశకుమారచరిత్ర ననువదించెను. ప్రశస్తమైన యాంధ్రీకృతి.

8. వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి రామాయణవచనము శ్లాఘనీయము. వీరు భాషాగ్రంథముల నెన్నింటినో పరిష్కరింపించి టీకలు వ్రాయించి, ముద్రింపించి, యమూల్యమగు సారస్వతసేవఁజేసి తరించిన ధన్యులు. వీరి గీర్వాణభాషాపరిచయము స్తుత్యము.

9. బ్రౌనుదొర తాతాచార్యులకథలు సుస్మరణీయము.

10. మెకంజీగారి కైఫీయతులు వివిధ వ్యావహారికభాషాసంప్రదాయములకు నెలవులు; పఠనీయములు; చరిత్రకారుల కావశ్యకములు. వీరిరువురును విదేశస్థులగు పాలకోద్యోగులైనను నాంధ్రభాషాసేవ మిక్కుటముగఁ జేసి ఆంధ్రము నుద్ధరించినారు.

II. విమర్శనము నాలోకింతము. ఇంతవఱకు సులక్షణసారాప్పకవీయాదులు కేవలదోషాన్వేషణములోఁ గాలముఁ గడపినవి. అంతకుపూర్వము గీర్వాణాలంకారగ్రంథముల నెరవు తెచ్చుకొనుటలో సగిపోయినది. తెన్గునఁ బ్రత్యేకవిమర్శనలు లేవు. ప్రభాభిరుచియే ప్రమాణము. కాని, వార్తాపత్రికాప్రచార మురవడిఁ గల్గించి నూతనపథమును ద్రొక్కించినది. 1. అట్టివానిలో పూర్వగ్రంథసంగ్రహణ, తద్విమర్శన, నూతన గ్రంథగుణనిర్ణయములను కార్యత్రయమునకుఁ బూనుకొన్న "యముద్రిత గ్రంథచింతామణి" ముఖ్యమైనది. ఈపత్రిక కధిపతి శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు. ఆంగ్లేయములో "డ్రైడన్" వలె నితఁడు విమర్శనజ్ఞానమునకుఁ బితామహుఁ డన్నఁ దప్పు కానేరదు. ఇతని యభిప్రాయములను రాజశాసనములవలె వీరేశలింగము, పార్వతీశ్వరశాస్త్రి, శ్రీరామమూర్తి,

సుబ్బారావుగార్లవంటి గొప్పవారే తలంచుచుండి రన్నచో నతని యాధి క్యముం బ్రత్యేకముగ నుడువ నవసరములేదు. ఇతనిపేరు పండితకవులు గాని వారికి గుండెబెదరు. ఇతని విమర్శనావిధానము పరిశీలింప నిట్లేర్పడును. (అ) శబ్దశుద్ధి మొదట గ్రహింపఁబడుచుండెను (గ్రామ్యమా, గ్రాంథికమా?) వసుచరిత్రలోని సారంగశబ్దలింగభేదమును గూర్చియు, 'ఏను' ద్రుతప్ర కృతికమా, కళయా యనుటయు, పరిఘాపరిఖాశబ్దముల నెద్ది ప్రయోగ యోగ్యం బగుటయు నితఁడు చర్చించిన తెఱంగుఁ జదువుఁడు. దెయ్యము, శమంతకము, సౌంభకము, కళంను, సభికుఁడు మున్నగువాని పరిశీలనముం జూడుఁడు. (ఆ) ఇరువురు గ్రంథకర్తలు, వ్రాసిరను వసుచరిత్రకావ్యాలం కారసంగ్రహముల విషయమై, ఆముక్తమాల్యదను గుఱించి కర్తృత్వనిర్ణయ మితఁడు చేసెను. భట్టుమూర్తి వేఱనియు, ఆముక్తమాల్యద రాయలదనియు నితని తీర్మానము. (ఇ) రసపోషణ మొనర్చిన మహాకవుల భావములను బ్రదర్శించుటకుఁ బాటుపడెను. రసికజనమనోభిరామములో 'పరిపరి' యను సీసమునకును, 'కీరమనోజ్ఞవాణి' యను వసుచరిత్ర పద్యమునకు నితఁడు వ్రాసిన విశదీకరణములు తార్కాణములు. (ఈ) ఒకయెడనైనను లాక్షణి కాభిప్రాయములకు దూరముగఁ బోవుట కితని కసాధ్యము. లక్షణపరిశీలన మున కడు గడుసరి తనము! ఒకప్పు డీకారణంబుననే పార్వతీశ్వరశాస్త్రి చిరమిత్రుఁడయ్యు నాగ్రహింప వలసివచ్చెను. 'కరమునెయ్యుఁబ' డట్లు సేయుటయు నితనిరేఫాదికవిచారము లుదాహరణములు. (ఉ) కవులనొకరి తోనొకరినిఁబోల్చు తారతమ్యపక్షి కితండు మార్గదర్శి. (హరిశ్చంద్రనలో పాఖ్యాన హరిశ్చంద్రకథలఁ బోల్చి విమర్శించెను.) (ఊ) నిర్భయముగా నిష్పక్షబుద్ధితో సమకాలికుల నితండు విమర్శించె. బిల్వేశ్వరీయవిమర్శనముం జూడుఁడు. (ఋ) అప్పటిరూపకంబుల గుణనిర్ణయంబునకు దొరకొనెను. 'సునందినీ, ప్రతాపరుద్రీయ, చిత్రనళీయముల విమర్శనములఁ జూడుఁడు.' వీరేశలింగకవికృత శాకుంతల మితనికి రుచింపలేదు. (ౠ) 1895 'శశి

లేఖ' లోని తెంగు శబ్దమును, గ్రామ్యభాషను దూలనాడెను. (ఆ) మా. పత్త్రిక 'చింతామణికరణి జడధిభంగసంగతికిఁ దొలంగి రాజసహజసన్మానభాజనంబై' మొదలగు ప్రకటనలలో సైతము ప్రబంధవచనశైలి ననుకరించుటలో నితఁడు పొరపాటుపడవలయు ననవలయునా? లేదా? సారస్వత ప్రజాస్వామ్యమున కితఁడు శాసకుఁడై వన్నె కెక్కెను. 2. శ్రీ గురుజాడ శ్రీ రామమూర్తిగారు కవిజీవితములను వ్రాసిన మహనీయులు. జీవితములు రచించుటలో వినుకలిగ రచించిరే కాని, కాలవిమర్శనములో చరిత్రనుగాక, తమ నమ్మకములనే యాధారముగా గ్రహించిరి. తీక్ష్ణమగు దృష్టితోఁ గొంత వఱకు, నిష్పక్షపాతము గాదనుకొండు, కవిత్వభేదములను విస్పష్టము చేసెను. ఇతఁడే కావలివారి తర్వాత ఆంధ్రకవిచరిత్రకారుఁడు. ఇతని శైలిమాత్రము విమర్శనశాస్త్రాదిగ్రంథములకుఁ జక్కని త్రోవఁజూపిన సులభసరళధార. 3. జీవితకారుని కార్యము చరిత్రకారునిలో వైపుల్యమునొందినది. ఎన్ని యో దోసంగు లుండనగును. కాని శ్రీ వీరేశలింగముగారి కవిచరిత్ర యమూల్యమైనది. ఎందఱెన్ని విధముల వ్రాసినను, ఎట్లో యాతని పరిశ్రమమును, చౌర్యముగనో, తెలియఁజేసియో యుపయోగించుకొనక తప్పదు. ఎన్ని వాఙ్మయవిమర్శనములు బయలుదేరినను, యితనికవిచరిత్ర యితనిస్థానమును వచనవాఙ్మయమున Johnson వంటిదానిని చేయక విడువదు. కాలనిర్ణయము, కావ్యవిమర్శకన్న నితనిలో నధికము. జీవితకారునిది కావ్యవిభజనము, చరిత్రకారుని కాలవిభజనము. చరిత్రకారుఁడు పాటించిన విశేషములు కాలనిర్ణయము, కవిజీవితకథనము, తత్కాలప్రభువులస్థితి, కృతినామములు, భాషాదోషములు, గ్రంథము గడించినకీర్తిపదవులు, శైలిస్వరూపము నను నేడింటిని బేర్కొన నగును. విమర్శన వాఙ్మయమున కెన్నఁడును చెదరని పునాది నితఁడు వేసెనని యుగ్గడింపనగును. ఈమువ్వురిలోనఁ దగినభావములనే తర్వాతివారు గీర్వాణాంగ్లేయ విమర్శనాపథంబుల ననుగమించి మార్చి కూర్చి పెంపొందించి రనుట యుచితము.

III. వ్యాసము లీయుగమున మతవిషయమై భాషావిషయమై మాత్రమే పెరిఁగినవనవలయును. వ్యాస మిట్టిదని వార్తాపత్రికవలన విన్నప్పుడే నిర్ణయించుకొని యుంటిమి. శ్రీవీరేశలింగమువారే వ్యాసవాఙ్మయమున వైపుల్యమునుబట్టి ప్రథములుగా నెన్నఁబడవలయును. ఇతని యన్వయసులభనిర్మలధార యనుకరణీయ మైనది.

IV. చరిత్రలు, కవులచరిత్ర, రాజవంశచరిత్రలలో వెలువడిన పిదప వీరేశలింగముగారి స్వీయచరిత్రలో ప్రబలినది. కాని, వాస్తవముగ చరిత్ర యిరువదవశతాబ్దమునాఁటిదే. బీజములు మాత్ర మిప్పుడే నాటఁబడినవి.

V. ప్రకృతిశాస్త్రాదులను, ఆఱుప్రహసనములను వ్రాసినవాఁడు 'గద్యకవిబ్రహ్మ*'నాఁబడు రావుబహదూరు కందుకూరు వీరేశలింగంగారే.

---

* శ్రీకృష్ణదేవరాయలకాలమువఱకుఁ గవులు, జనులకు వచనరచన లింపు నింపునని కలనైనఁ దలంచి యుండలేదు. వా రట్లెఱింగియే యుండిన నిడుదలగు సమాసములును, కఠినపదాడంబరమును, బూర్ణబిందు సంయోగ బాహుళ్యంబును వారిగద్యల మెందుకొని యుండి యుండదు. రాయలసమకాలికు లగుపెద్దనాదులునైనఁ మీయర్థమును గ్రహింపరైరి. [రాయవాచకము రాజనీతిదెల్పుటకై వ్రాసినది కాన వచనము గృహీతమయ్యె.] తర్వాత విరచితములైన దాక్షిణాత్యగ్రంథము లగు సముఖము వేంకటకృష్ణప్పనాయకుని జైమినిభారతము మున్నగు వానిలోఁ బూర్వకవికావ్యములలోని గద్యలే ఆదర్శము లైనవి. అంతియకాదు; క్రీ. శ. 1650 ప్రాంతమున వెలసిన చిన్నయసూరి శైలికూడ, మిత్రభేదప్రకరణములో దీర్ఘసమాసనిబిడమై తెలుఁగేనా యని సంశయించుట కవకాశమొసంగినది.

వచనరచనలపరిణామ మిట్లుండ 1885 సంవత్సరమునుండి దేశభాషాగ్రంథకరణసభ విద్యార్థులకు వలయుగ్రంథముల నన్వేషింపఁ దొడంగెను.

ఇతని పదిసంపుటములను గ్రక్కదలించినఁ దేలు బంగారము [ఇతనిపద్య కృతులు గావు, అనేకవిషయసంగ్రహణమునఁ బొగడ్తకెక్కిన వ్యాసములు గావు, ఇతనినాటకము లసలే గావుకాన] ప్రహసనరూపముగా, కవిచరిత్రరూపముగా నున్నదనుట సత్యదూర మెన్నటికిఁ గాదు. ప్రహస

---

దానఁజేసి తేనెలొలుకు తెనుఁగునకుఁ దెగులుసోకినట్లు అవతారపు బిక్కిరి వ్రాఁతలు ఎక్కువయ్యెనే కాని సలక్షణగ్రంథములు జనింపలేదు. కాని యిదే సందర్భమున 1875 మొదలు 1885 వఱకు రాజధాని కళాశాలాపండితులైయున్న శ్రీ చదలువాడ సీతారామశాస్త్రులు రచించినసంస్కృతనాటక కథలు, దక్కను పూర్వకథలు అనుగ్రంథములును, వారిదేయగు 'జనవినోదిని' యను మాసపత్రికలో వ్యాసములును గమనింపఁదగియున్నవి. పైగ్రంథములు సాధారణముగ నాంధ్రులెల్లఱకును చిరపరిచితములు. శ్రీ రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు వ్రాసినదియు, స్వాభావిక వికాసముతో నొప్పులుగులుకునదియు నగు పంచతంత్రము నిప్పుడ వెలువడినవి.

పిదప వెలువడిన శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రులుగారి భాగవతభారతవచనము లెల్లవారును జవిచూచినవియ. ముముక్షువులకు విద్యార్థులకుఁ బండితులకు, వారు వీరనక యెల్లవారికి వీరిభాగవతము, చదువఁజదువ హర్ష మొదవించుచు, వెలలేని విజ్ఞాననిధి నొడఁగూర్చుననుట సార్వజనీనము. ఆవిమ్మటి కథాసరిత్సాగరములోని యపూర్వశైలి రామణీయకత యొండొకచో వాఁకొనఁబడినది. అనంతరము ప్రచారముగాంచి విమర్శనాశక్తికి నూత్నవైభవము చేకూర్చిన శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారి వ్యాసములఁగూర్చి తెలుఁగువారి కిట్టిదని నిర్దేశింప నవసరమే లేదుగదా! వారి "టిప్పూసుల్తాన్"లో రసోత్పాదనదక్షమగు శైలిని చూరగొన నిచ్చినందుల కెంతయు వీరు తెనుఁగువారి కభివంద్యులు. ఇవన్నియు నరసిచూడ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులాదిగాగల సమకాలికు లపూర్వులు నుత్తమ

నము లితని స్వభావములో నైక్యమొందినవి. కాననే, యవి యంతయా త్సుక్యమును Interest గల్గించుట! వీరేశలింగకవి శాస్త్రగ్రంథముల ప్రక్కనే కంది సుబ్బరాయకృత పాకశాస్త్రము నుడువఁదగినది.

VI. నవలకును వీరేశలింగమే మొదటివాఁ డనవలసియున్నది. "వికార్ ఆఫ్ వేక్ఫీల్డ్" న కనుసృతియగు నితని రాజశేఖర చరిత్రములోని నీలాద్రిదౌష్ట్యమును, బైరాగి సువర్ణవిద్యయును, సుబ్రహ్మణ్యము ఛాందస బుద్ధియును కృష్ణజగపతి యౌదార్యమును మఱచిపోఁజాలము. జాతీయముల నిండి, ఉమ్మెత్తపూవువలె నందము, మున్నగువిలక్షణపదసామగ్రితో బాగుగ నున్నది.

2. దీని తర్వాత చింతామణిపోటీపరీక్షలలో "అహల్యాబాయి" మూలమున నెగ్గిన శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, సుధాశరచ్చంద్రేతరముల నన్నిటిని సొంతముగ రచించిరి. సౌందర్యతిలక పురాణగాథకుఁ జేరినది. హేమలత, అహల్యాబాయి మహారాష్ట్రపఠానులకాలపు చరిత్రకుఁ జేరినవి. రామచంద్రుఁడు వర్తమానసంఘమునకుఁ జేరినది. చరిత్రయు, పురాణము, సాంఘికము నేదియుంగాక యన్నియు నై యత్యద్భుతకథా సరణితో, నపూర్వపదసన్నివేశముతో, రమణీయపాత్రవిధానముతో రచింపఁబడిన నవల 'కర్పూరమంజరి.' ఆంధ్రప్రపంచము బంకించంద్రుని సీతారామ ఉత్తరభాగ . మెట్లుండునోయని యువ్విళ్లూరిన వంగపాఠకలోకమువలెనే,

---

వచనగ్రంథరచయిత లుండ, కీ. శే. వీరేశలింగముగారి "గద్యకవిబ్రహ్మ" బిరుదునకు మోసపోయి, యంతకు ముందు మంచి వచనవాఙ్మయ ముండనే లేదని మనమూహింపరాదు. అతని గ్రంథబాహుళ్యము, నూత్నవిధాన నిరూపణములను రెంటినే గ్రహింపవలయు గాని పద్యమున నన్నయ వలె, గద్యమున నతం డాద్యుఁడనుట పొసఁగదు. [త్రిలింగపత్రిక. 1922, వ్యాసములు చూడుఁడు.]

కర్పూరమంజరి ద్వితీయభాగమున కెదురుచూచినది. కవికలము తేనంతట నాశ్చర్యచకితమై యాగిపోయినదా? గ్రంథకర్త యేతత్ప్రయత్నమును జేయుండుగాక! ఉన్నంతలో నవలావాఙ్మయములో నిప్పటికి నితనిదే యుత్తమస్థానము. ఇతనిశైలి సారళ్య మవశ్య మనుకరణీయము. సౌందర్యతిలక, కర్పూరమంజరి తర్వాత గుణములఁ బెద్ద. ఇది జాగ్రత్స్వప్నావస్థలమధ్యనుండు అవ్యక్తస్థితిని బ్రదర్శించుచున్నది. కొందఱిమతంబున నిది యతని యుత్తమనవల. అననుకరణీయమగు నితనిధారాచమత్కృతి ప్రశంసనీయము.

VII. కథలు స్త్రీలకై పెక్కు వీరేశలింగము రచించెను. పనప్పాకం అనంతాచార్యులు మంజువాణీవిజయంబును, శ్రీనివాసాచార్యులు ఖేచరోల్లాసమును ప్రౌఢశైలితోఁ గుప్పించిరి. శ్రీకొపల్లె వేంకటరమణారావుగారు నాచికేతూపాఖ్యానమును రచించిరి. వీరియెల్లర మించిన వా రిర్వురు, చిల్కపాటి వేంకటరామానుజశర్మగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు. రెండవవారు కథాసరిత్సాగరమును (ప్రపంచానుభవవిజ్ఞానసర్వస్వము) ననువదించిరి. ఆంధ్రీకృతియగుట విషయవిమర్శన మనావశ్యకము. నిమ్నోన్నతవిరాజితము, వనపుష్పతరులతావృతము నగుకొండసీమవలె కొన్నియెడల నలిజాగ్రత్తగా కష్టపడి కూర్చినట్లున్న సంగ్రహప్రౌఢపదధాటియు, ఒక్కొక్కచో నచ్చతెల్గు జిగిబిగియు, కొండొకచో ధారాళ వాక్సరణియుఁ గల్గి యింపుగ నున్నది. సహజధార లేమిచే నించుకనాధునికులొప్పరేమో! భాషలో చక్కని వైదుష్యము గోరువారి కీగ్రంథము వచనగ్రంథములలో నెల్ల నగ్రగణ్యము.

రామానుజశర్మ బ్రహ్మోత్తరఖండమువ్రాసిన సుకృతి. ఇతని వినోదకథాకల్పవల్లిని, చిత్రకథాలహరిని, చమత్కారకథామంజరిని జూచియుండని యువకుఁ డుండఁడేమో? శైలియో యొక్కొక్కవాక్యము పుటలనే దాటిపోవుచు, గీర్వాణలలితపదసంయోజితమై, పదముల యర్థమును

నైతము లక్షింపకఁ జదువ నౌత్సుక్యముఁ బెంచు. ఇతని యద్భుతకథాసన్నివేశము వర్ణనీయము. విశేషశృంగార సర్వాంగవర్ణనాతిరేకముచే సంభోగఘట్టముల నెన్నిటినో లెక్కలేక యొడలు మఱచి రచించినాఁడు కవి. ఇది యొకలోపమేనైనను, పాఠకుల ప్రీతిని బడసిన ఇతఁడు విపులకథారచన నారితేరినవాఁడు. ఇంతటివారు పూర్వమున వచనకథావాఙ్మయమున లేరు. తర్వాత నెవరును బుట్టలేదు. కాన నాంధ్రబాణుఁ డనఁదగినవాఁడు.

VIII. సామాన్యవాఙ్మయమునకుఁ జేరిన గ్రంథములు సాగరములోని యలలవోలె నసంఖ్యాకములు. వివిధముల మధ్యఁబుట్టిన తిట్లు మఱుగువడినవి. బిల్వేశ్వరీయ విమర్శనము లెన్నియో? ఇఁక స్మరింపఁదగినవాఁడు శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులవారు. వీరు స్వకీయముగ దేనిని బూనుకొన్నట్లు లేదు. ఇతరులపై నాక్షేపణలే వీరికృతులు. అట్టివానిలో హుళిక్కి భాస్కరోదంతము మున్నగునవి విఖ్యాతములు, చిత్రప్రదర్శనములు, వివరణములు, వాదఫక్కికలు, విచారదైకములునని నాల్గుభాగములు చేసినచో శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు వాదఫక్కికవ్యాసమునకు రాచబాటవైచినవార లనవలయును. వావిలికొలను సుబ్బారావుగారి యార్యకథానిధులలోనిదగు నలచరిత్ర చదువఁదగినది. వీరి కృష్ణచరిత్రలు పేర్కొనఁదగినవి. బహూరు త్యాగరాయశాస్త్రులు ప్రకటించిన గ్రంథము లనేకములకుఁ డీకలు వ్రాసియు దశరూపకసూత్రములఁ దొల్దొల్త వచనముఁజేసినట్టియు, స్కాందపురాణము గద్యతో వ్రాసినట్టియు, నోరి గురులింగశాస్త్రులవారు ప్రాచీనవాఙ్మయసేవ నెంతయుఁ జేసినవారు; నుతిపాత్రులు.

## ఇ. నాటకములు

ఆంధ్రీకృత సంస్కృతనాటకములే యీయుగపూర్వార్ధమున "వెలసినవి". కాని, యుగచతుర్థపాదములో యువజనాకర్షకమగు ధార్వాడకంపెనీవారి యార్భాటము పెరిఁగినది. దాని ప్రోత్సాహముచే రాజమండ్రిలో

(శ్రీగురున్నేశ్వరరావుగారు కారకులు గాఁబోలు) నొక నాటకరంగమును, బళ్లారిలో నొకనాటకరంగమును బుట్టినవి. ఒకవైపు సలలితమాధుర్యమహనీయములగు ప్రచండప్రసన్నయాదవములును, మఱొకవైపు చిత్రనళీయ విషాదసారంగధరములును, ఘుమ్మని పరిమళముల వెదచల్లినవి. పేర్కొనఁబడఁ దగినవారు నల్వురు: ఆంధ్రనాటకకవితాపితామహుఁడగు ధర్మవరం కృష్ణమాచార్యులు, చిలకమర్తి లక్ష్మీనరసింహము, కోలాచలము శ్రీనివాసరావు, వేదము వేంకటరాయశాస్త్రి. ఆచార్యుల యనల్పకల్పనాగరిమయును, శైలీమంజులతయుం, ప్రపంచానుభవప్రకటీకరణమును, పాత్రపోషణమును ననన్యసామాన్యములు. వీరి ఏడునాటకములు చిత్రనళీయ, సారంగధర, సావిత్రీ, చంద్రహాస, పాదుకాపట్టాభిషేక, ముక్తావళీ, ప్రమీల లాంధ్రలోకమునకుఁ జిరపరిచితములు. వీరు ముప్పదికిఁ బైఁగా నాటకములను రచించిరఁట! చిలకమర్తివారికి సకలాంధ్రలోకములు ప్రసన్నయాదవములోఁ బ్రసన్నమైన సంగతి మనకుఁ గ్రొత్తకాదు. విజయనగరసామ్రాజ్య పతనమును శ్రీరాఘవాచార్యులు ప్రదర్శింపఁగా చూచినవారు శ్రీనివాసరావుగారి నారికేళపాకములో నెట్టిప్రౌఢభావము లిమిడియుండుటయుఁ దెలిసియే యుందురు. వారి సునందినీ ప్రభృతుల కిట్టిప్రాశస్త్యి యబ్బలేదు. ఇఁక వేంకటరాయశాస్త్రిప్రతాపరుద్రీయమును, ప్రసిద్ధినొందయత్నించు ప్రతినాటకసమాజమువారును మన్నించుచున్కి మన మెఱుంగనిది కాదు. గయోపాఖ్యాన, నరకవధ, చిత్రనళీయ, విషాదసారంగధర, ముక్తావళీ, విజయనగరసామ్రాజ్యపతన, ప్రతాపరుద్రీయము లను నేడు నాటకము లెక్కుచో నుండఁదగినవి. ఆంధ్రవాఙ్మయమున వీనికుత్తమస్థానమున్నది.[ ఈయుంగములోని వారనేకులు ధనికులై యుండుటయుం, కొంద ఱింకను జీవితులై యుండుటం బట్టియు, వీరి తారతమ్యములు మనమనుమలు దేల్చువారగుటను నిదమిత్థ మని నిర్ణయ మెన్నిచోట్లనో తేల్చఁబడలేదు. మధ్యయుగము నంతియే. వీనిలో వాఙ్మయచరిత్రను గడించితినే కాని కావ్యవిమర్శన ఇంచుమించుగ లేదేమో!

ఒకటిమాత్ర మనుకొనుచున్నాను. పైవారు వరుసగా కవిత్వప్రాధాన్యమున Shakespeare, Marlow, Ben Jonson, Webster లను బోలుదురేమో?]

## 3 యుగలక్షణ సమన్వయము

1. పురాణకావ్యప్రబంధ కవిత్వములన్నియుఁ దలచూపినవి. ఈ యుంగములో కవితావృక్షములు నవభావపుష్పములఁ బూచుటకుఁ బూర్తిగ నోచుకొనలేదు. రసఫలములు మృగ్యములు.

2. పేరన్నికఁ గన్నవారు ప్రబంధకవితకు జగన్నాథకవి, ద్వ్యర్థికి లక్ష్మణకవి, ఆశువునకు కృష్ణమూర్తిశాస్త్రి, భాషాంతరీకృతికి గోపీనాథం వేంకటకవి, అచ్చతెనుఁగునకు కుమ్మరకొలపు పార్థసారథి, నవలారచనకు చిలకమర్తి లక్ష్మీనరసింహము, నాటకశ్రీకి ధర్మవరపు రామకృష్ణమాచార్యులవారు.

3. సమగ్రనిఘంటు వ్యాకరణనిర్మాణములు ప్రత్యేకలక్షణములు: చిన్నయసూరిబాలవ్యాకృతి. బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకర ప్రౌఢవ్యాకృతులు ముఖ్యములు.

4. చారిత్రకీయాది పరిశోధన ప్రబలినది.

5. వార్తాపత్రికలు వంగభాషలో నక్షయకుమారదత్త, బంకించంద్ర, వ్యాసరచనాధిషణకాశీప్రసన్నఘోషుల వాసిని వెల్వఱచిన వంగదర్శన తత్త్వబోధినీ ప్రభృతులవలె కవులకీర్తి వ్యాప్తుల కాశ్రయములు మూలములు నైనవి. దాన వచనసారస్వతము విపులీకృత మైనది.

6. నవకవితావిలాసములు శ్లాఘనీయచరిత్రరచనలు పూర్తిగరాలేదు. బీజములు సైతము మాటుపడియున్నవి. ఉద్వేగము మాత్రము పెరుఁగుచుండవచ్చును. లేకున్న నిర్వదవశతాబ్దారంభ పాదములోనే యంత ఫలవంతమై యుండదు.

7. యుగయుగములనుండి పారుచున్న నాటకాభిరుచి యొక్కొత్తుగా బయల్పడి మిఱుమిట్లు గొల్పు నుత్తమనాటక సారస్వతమును సృష్టించినది.

8. వేంకటగిరి పిఠాపురము లాదిసంస్థానములు మిక్కుటముగా భాషాసేవకును బూనుకొన్నవి. క్రమక్రమముగా పిఠాపురము తక్కంగల యన్నింటిని వెనకకు నెట్టునట్టి భాషాపోషణమును జేయుటకు సమకట్టినది.

9. కాళహస్తి, బళ్లారి, పిఠాపురము, వేంకటగిరి, రాజమహేంద్రవరము ప్రధానరంగములు. మద్రాసు ప్రధానరంగస్థానమునకు వచ్చుచుండెను.

10. కొందఱు కవులు శతాబ్దాంతమునకు బయల్పడి నవయుగారంభపాదమనఁగా నిప్పటివఱకు నున్నవారిలో సంధినవయుగముల లక్షణములు సమ్మిశ్రములైనవి. శ్రీసుబ్బారావుగారు, శ్రీవీరేశలింగంగారు నిట్టివారే.

11. ఒకయుపద్రవము మాత్రము వాటిల్లినది. నౌకరీయే జీవనముగాఁ గలవారెల్లరు నాంగ్లేయమునే పఠింపవలసినవా రగుటచే ననేకు లాంగ్లమున నఖండ పాండితిఁ గడించుటచే గురుకులాశ్రమపద్ధతి పోయి, "ఇంగ్లీషు ప్యాసు"పాధ్యాయుల ప్రాథమికపాఠశాలల సందడిలో, పూర్వము పండితులు జీతమును ప్రజనుండి గొనువా రగుట వారు మఱుగుపడి ప్రజాసామాన్యములో సాహిత్యజ్ఞానము తగ్గుటచే నాంధ్రభాషయెడ నుపేక్షయు, గ్రామ్యవాదమునకు తలసూపినవి. యుగారంభముననే దిగి చాల కలవరము గల్గించినవి.

12. పాశ్చాత్త్యవాఙ్మయశక్తి యాంధ్రసారస్వతము నాక్రమించినది.

శ్రీ

# ఆంధ్ర వాఙ్మయచరిత్రసంగ్రహము

## పంచమఖండము - నవ్యకవిత్వము

## నవయుగము

## (1901—?).



ఇరువదవశతాబ్దమును నవయుగ మంటిమి. నవ్యత కవిత్వమునఁ గన్పడినది. కవులు నవీనులు. కాన, నవయుగమను పేరు సార్థకము, సాంఘికస్థితి యందఱకుం దెలిసినదియ. ఇప్పటి యాంగ్లేయానుకరణ నవలకు రాజశేఖరచరిత్ర మాతృకయైనది. నేటివ్యాసములకు, నేటిప్రహసనములకు, నేటిసన్మార్గోపదేశ శ్రీరంగనీతులకు, "గద్యకవిబ్రహ్మగారి పదిసంపుటములలో బీజములు పదిలపడినవి. ఈయుగమునఁ గ్రొత్తగా బయలుదేరిన ఏకభావగీతములు, ఊహాగానములు, పిట్టకథలు, 'నేఁటిభారతీ', 'శారదలు' నాఁటికళావతీ ప్రభృతుల కక్కసెల్లెండ్ర వరుసలోనివి. నవయుగపుఁ దెఱ యెత్తినాఁడు కాలపురుషుఁడు. యుగారంభమైనతోడనే విజ్ఞానచంద్రికలు విరివిగాఁ గాచినవి. ఆంధ్రప్రచారిణీ నృత్యము దర్శనీయమైనది. బొంబయి వాసము వీడి యాంధ్రపత్రికామతల్లి చెన్నపురిఁ జేరినది. ప్రథమాంకమునకు నాందీపద్యమును శ్రీ తిరుపతివేంకటకవుల దివ్యావధానచాటుగానములలో వెల్వడినది. సూత్రధారులగు నీకింకవీంద్ర ఘటాపంచాననులు రసోపాసనము ముఖ్యమని తలంచి పురాతనాధునాతన పంథలఁ బరిశీలించి భారతనాటకముల రచియించి, యేకభావకావ్యములనల్లు తెరువులు సూచిం

చిరి. నాటకారంభమైన వెంటనే శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు "కావ్యకుసుమావళిని" సభ్యులపై నవ్యశైలి పరిమళములు వ్యాపింప నొక్కుమ్మడిఁ జల్లినారు. "హారావళిని" కంఠముక్తావళులుగాఁ దాల్చి దర్శనీయులైనారు. కే. వి. లక్ష్మణరావుగా రాంధ్రులు జుట్టని త్రాగుటకయి "విజ్ఞానసర్వస్వపు" చెఱకు నందిచ్చుటకు మొదలుపెట్టిరి. పాశ్చాత్త్య విమర్శనములోని ముఖ్యసూత్రములనుఁ బ్రసాదించి యాంధ్రులకుఁ "గవిత్వతత్త్వ విచారముఁ" జేయుటకు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు, పాశ్చాత్త్య నాటకఫక్కికిఁ దిరిగి కంఠాభరణము పాఠకుల మెడకుఁ దగిల్చి కడుపుబ్బ నవ్వించిన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, "కన్యాశుల్క" మను కేకతో సభ్యులెల్లర నొక్కసారి హాస్యకళాపరవశులను జేసిన గురుజాడ అప్పారావుగారు మరల వాఙ్మయరంగమునఁ గన్పడలేదు. ఈమధ్య వ్యవహారభాషయే యనుసరణీయమని *శ్రీ రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారు (జులై, 24, రాజమండ్రి ట్రెయినింగు కాలేజిలో నుపన్యాసము) వ్యావహారికభాషలోఁ వెలువడిన వాఙ్మయము ముఖ్యముగా "పిట్టకథలు", భారతిసంపుటముల నెక్కడఁ బట్టిన నక్కడ సాక్షాత్కారమగును. "సఖి" క్రొత్తగా వచ్చినది. ఇది యిట్లుండ ఉగాదినాఁటి వేఁపపూతవలె విరసములైనచో నుత్తమాశయపూరితములు గొన్నియును, పైడాబు సరిపదముల యల్లికలతో, వరిమొక్క, వడ్లగింజ, గోదుమపైరు, పక్షిగూడు మొదలగువానిని వర్ణించునట్టివి కొన్నియును, తళుక్కన మెఱసి పోవు కల్పనావిలాసములతో నొయ్యారములు గుల్కు సరసభావతరంగములతో నోలలాడించునవి కొన్నియును, కళానందమును బూర్తిగ నీఁజాలని

* ప్రాఁ దెనుఁగుకమ్మ మున్నగువానిని పరిషత్సంపుటములందును, 20-1-1926 ఆంధ్రపత్రికలోని ప్రస్తుత భాషాస్థితిఁ దెల్పు "సాక్షి" గారి వ్యాసముం జదువుఁడు. సుప్రసిద్ధవ్యావహారికపదజాలము గైకొనుట తప్పుని సరి. కాని, గ్రామ్యము నింద్యమే.

యపరిపూర్ణవిషయ నివేదనములు గొన్నియును నగు ఖండకృతులు, నేకభావ గీతములు, పాటలు, గీతకావ్యములు, చాటువులు, పిల్లకవులయల్లరులు వచ్చినవి. కాని, ప్రభావసంచలనము వస్త్వైక్యముతో మేళగించినవిగావు. ఈ విశృంఖలవిహారములలో, నీ సెట్టిపాటలలో, నీ విపులవర్ణనములలో నొక పరమార్థముమాత్ర మున్నది. నవభావబీజములు మొలకలెత్తిన వనుట తెల్లము. వసంతర్తు వాసన్నమైనమాట వాస్తవము. మహాకవిచంద్రోదయమునకు ముందటి రిక్కలవలె యనేకులు గానము చేయుచున్నారు. భగవదుద్దేశ మెవనియందుఁ జొచ్చునో వానియందు ప్రజాశయమును ఫలింపక తప్పదు. కాని, యెప్పటికి చూడవలసియున్నది? యుగప్రథమపాదమున ముఖ్యులగు శ్రీ మంగిపూఁడి వేంకటశర్మ, రాయప్రోలు సుబ్బారావుకృతులు జాతీయాదర్శరుచిరములు; లలితశైలి గలవి; అభినందనీయములు.

ఈయుగములో 1925 వఱకు పొరలివచ్చిన సారస్వత[1]రంగము పరిణామతీరమునకుఁ దగిలి కాలసముద్రములోనే లీనమైనది. ఒక యంకము ముగిసినట్లయినది. మొదటిదూకులో నిర్వు రాఱితేఱిన చరిత్రకారులు. ఒకరు కీర్తిశేషులైరి; ఇంకొకరు వృద్ధులైరి. రెండవదూకులో నిర్వురుకవులు గద్యపద్య నిర్మాతలు. ఒకరినాటకోపన్యాసములు విఖ్యాతములై వారును వార్ధక్యమునకు వచ్చుచున్నారు. ఇంకొకరు [ఇర్వురైనను కలిసియే వ్రాయుచుండుటచే నొకరైనారు.] నవలల గీతముల వెదచల్లిరి. మూఁడవదూకులో భాషాంతరకారు లిర్వురు. ఇర్వురును పండితులు. కీ. శే. లక్ష్మణరావుగారి యుపన్యాసపరిశోధనలు, హిందూ మహమ్మదీయమహాయుగములు మరువరానివి; సుస్థిరములు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి కెట్లు మనము కృతజ్ఞతను జూపి ధన్యుల మగుదుమో తెలియదు. ప్రమాదములు లేని సర్వజ్ఞుఁడు సర్వజ్ఞుఁడే! వారు సమస్తాంధ్రమహీతలమునకు నారాధ్యులు. వారి

1 శ్రావణ [రక్తాక్షి] సారస్వతానుబంధము. శ్రీ నందూరి బంగారయ్యగారు.

యాంధ్ర చరిత్ర యాంధ్రజాతీయకథావాఙ్మయసౌధమునకుఁ బునాది. అది చరిత్రగ్రంథము. ఎంతమంది ఇఁక వ్రాసినను అది పడిపోదు. వీ రిరువురును మనకు 'గిబ్బన్', 'మెకాలే' ల వంటివారు. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహ రావుగారి సాక్షి కేక లందఱకును వినంబడినవి. వీనిలో మనుజవర్ణనలు, విచిత్రదీర్ఘసమాసములు, సంకరభాషాప్రయోగము, అసమంజసోపమానములు, విలక్షణసన్నివేశములు మొదలగు వానిసాహాయ్యమున హాస్యవర్షము గురిపించిరి. ఈ హాస్యమునకంటె వారు నాటకములోఁ జూపిన హాస్య మాచిత్యశోభితమనియుఁ గొందఱియభిప్రాయము. వేంకటపార్వతీశ్వరకవుల పేరనే యీ యుగము పిలువఁబడవలయు నని తద్భక్తు లనుచున్నారు. [కాని యీయుగాంత్యము దవ్వులనున్నది. అంత్యము తర్వాతివారు ఇరువదొకటవ శతాబ్దిలో విమర్శకుల కెట్లు తోఁచునో! మాటలకేమి గాని వీరిని మించినవా రిఁకఁ బుట్టరనియా? లేరనియా? వీరి నవలలలో ననేకము లనుసృతు లొండొంటికి కొన్ని యనువాదములవలె నున్నవి. వసుమతీవసంతము లోని కథను 'క్వెన్ టిన్ డర్వ' ర్డనుస్కాటునవలతోఁ బోల్చి చూడుఁడు. పిచ్చిశ్యామలలోనికథను మేక్బత్తనుMacbeth అనుశకవీరు Shakespeare ని నాటక వృత్తమునుఁ బోల్చి చూడుఁడు. పోలికలున్నను సొంతకపనముఁ జూపలే రా యన్నఁ జూపినారు.] మాతృమందిరమున వస్తైక్యము శూన్యము. నిల్చిన దొక 'ప్రమదావనము.' ఈగ్రంథ ముత్కృష్టమైనది. ఇందలి కథావిధానములో కవుల శక్తియంతయుఁ బ్రదర్శిత మైనది. ముఖ్యమగు గుణము శైలి. శైలియే తక్కిన నవలలనుసైత ముత్తమముగా మార్చినది. వీరి శైలి మాధుర్య మపరిమితము. చిత్రకళాచైత్న్యము, సంగీతములోని యానందతన్మయత్వము, భారతీయవిగ్రహ శిల్పములోని నిగ్గనొకచోఁ గుమిగూడినవి. కాని, విశేషముగా కళకవసరముగాక, వసుమతీవసంతము లోని సుందరిని జూచి మనమును ముగ్ధుల మగుచున్నాము. శైలివలననే. ఈశైలిమంజులతామహనీయ రసోదంచితమాధురి హారావళిలో, కావ్య

కుసుమావళిలో నంతమొందినది. ఏకాంతసేవలో నిర్గుణమైనది. [ఏకాంతసేవ యుత్కృష్టమనియందురు శ్రీవీరరాజుగారు కాని యందేమియుఁ గాన్పింపదు. విషయము గగనకుసుమము. పరమాత్మనుగురించి నివేదనమందురు గాని యందు కన్నలేదు; వస్తువులేదు. రవీంద్రునిభావోన్నతి లేదు. (An old Essay on Criticism) చదువుఁడు. వట్టి తబ్బిబ్బుమాటలు. భాగోతుల కృష్ణవేషమువలె నాడంబరము]. నిష్పక్షపాతముతో సత్యమరసినవారికి వారిప్రమదావనవసుమతీవసంతములు రెండే గద్యలో కీర్తి కాలవాలమనియును, పద్యములో హారావళియు, కావ్యకుసుమావళిలోని కొన్నియును మాత్రమే రత్నములనియుఁ దెల్లమగును. ఉత్కృష్ట గ్రంథ మేదియైనను, వారిశైలియు కావ్యాలాపములును స్మరణీయము లనక తప్పదు. క్రమక్రముముగా వీరిశైలి ముదిరి, మార్పులేమి విశేషమగుట, రుచింపని రసాయనమువలె విసుగెత్తించుచున్నది. ఎట్టులున్నను, వంగభాషానువాదములచే, స్వకీయకల్పనాకోరకములచే వీరు తెల్గు సరస్వతి నారాధించి ధన్యులైరి. శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రివారు కవిరాజ బిరుదాంచితులు. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి ఆంధ్రీకృతులనేకములు. భావి విమర్శకులు పండితేంద్రులగువీరి నెట్లు విమర్శింతురో! సాక్షిశైలిని గుఱించి యెంతేని మెచ్చుటింపవలసియున్నది. వ్యాససారస్వతములో నిట్టిది మఱొక్కటి యుండఁబోవదేమో యనిపించు. దీనిమహిమ ముందుఁ దెలియఁబడవలసి యున్నది. సాక్షికర్త వ్రాసిన నాటకములు అటులే సువిమర్శనీయములై యున్నవి.

ఇక్కడికి ముఖ్యులను జేర్కొన్నట్లే. పద్యములో 'భావకవిత్వ' మని బయలుదేరినది. భావకవిత్వ మాంధ్ర శతకములలో నెన్నియేండ్లుగనో దాగ కొని యున్నది. అవి యనేక భావప్రకటనాథవ్యములు. నేటి ఖండకృ లన్నియు నొకవిషయమునే దెల్పును. ఇంగ్లీషు సానెట్లు, బాలెడ్లవంటివి కాన, నేకభావగీతము లంటిని; ఊహాగానము లంటిని.

'కృష్ణపక్ష' కర్త [శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి] యువకవులలో మంచి మార్గమును సూచించుచున్నారు. వీరిలో వేంకటపార్వతీశ్వరకవు లింగ్లీషు

రాదనిచెప్పి చూపిన యనుసృతులంబోలినవియే, యాంగ్లేయానుకరణము లెన్నియో యున్నవి. కాని, 'ఆకులో నాకునై' వీరిశైలి నిరుపమానముగా భావములతో నేకీభవించినది. వీరు రెండవయంకములోనివారు. చక్కనిదియు, ప్రౌఢమైనదియు, రసోపపత్తికి సంపూర్ణకారణముగు వీరిశైలి స్వకీయకల్పనావేశముతో విజృంభింపఁగల దనుట కెడమున్నది. వ్యావహారికభాషలో గ్రంథజాలమునకు దారితీసిన శ్రీ గుడిపాటి వేంకటాచలముగారు విమర్శనీయులు. వారి 'శశిలేఖ' లో కవియేమి చెప్ప నుద్దేశించెనో కాని, తేలినదేమో పూర్ణస్త్రీస్వాతంత్ర్యము గూడదను నీతియే! శశిలేఖా—సుందరరావుల, శశిరేఖా—రామరావుల సమావేశములు భిన్నములు, భిన్నభావసుందరములు. కృష్ణమూర్తి యవకాశమే యియ్యకుండి యున్నచో—కాని, విధి వేఱుగా నున్నది. వీరి 'చిట్టికథలు' సాంఘికములు. భావవ్యాప్తికన్న రసావేశము, కళాలాలిత్యమే ఎక్కుడుగానున్నది. వీరి 'కన్నీటికాలువ' లోని కొన్ని ఇతివృత్తములు కళోచితములు గావు. వీరి 'సారంగధర' లోని రాయబారి బ్రాహ్మణుని పాత్రపోషణము, చిత్రాంగీ స్వభావపరిణామము రమణీయములు. ఇట్టి కళాసన్నివేశము గల వీరు, భాషను సంభాషణములలో నెట్లుంచినను, వర్ణనలలోను గ్రామ్యమే యుపయోగింపఁదలంచుట భావ్యముగాదు. ముఖ్యముగా నవ్యత వీరిగుణము. వ్యావహారికభాషాకవిత్వములో చిట్టికథలకుఁ దర్వాత నూహాగానములు ముఖ్యములు. ఎంకిపాటలు మొదలగునవి మోహాశృంగారకావ్యపరంపరకుఁ జేరునేమో! శ్రీ బసవరాజు అప్పారావుగారి, అబ్బూరు రామకృష్ణయ్యగారి, కవికొండల వేంకటరావుగారి పాటలు సంప్రదాయవిరుద్ధములైనను భావసౌకుమార్యములు గలవియౌట సారస్వతము వానిని విస్మరింపఁ జనదు. వానిభావములకు ప్రజ దలయూఁచిన దనుటయే వానిఘనతఁ జెప్పెడు. (నేటిసారస్వతమను శీర్షికగల శ్రీ ఉమాకాంతంగారియుపన్యాసము అక్షయసారస్వతానుబంధములోఁ జూడుఁడు.)

పార్వతీశ్వరశాస్త్రిగారి స్వదేశసంస్థానచరిత్రము పూండ్ల రామకృష్ణయ్యగారి పార్వతీశ్వరకవి జీవితము పూర్వశతాబ్దగ్రంథములు. శివాజీ చంద్రగుప్తులును, శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి చీనాచరిత్రయు, అశోకుడును, శ్రీ వీరభద్రరావుగారి తిమ్మరుసు తిక్కన జీవితములును, వీరేశలింగంగారి స్త్రీ పునర్వివాహ బ్రహ్మసమాజచరిత్రములు, విద్యాసాగర వల్లభాచార్యాదిజీవితములును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగార శ్రీనాథ కనకాభిషేకములును, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి యర్థశాస్త్రమును, శ్రీ రాయజగపతివర్మగారి పెద్దాపురచరిత్రమును, శ్రీ సదాశివశాస్త్రులవారి వెలుగోటివారి చరిత్రమును గణనీయములు. విమలాదేవి, చంద్రగుప్త, ఆంధ్రరాష్ట్రము మున్నగునవి రచించిన శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారును, రామచూరు యుద్ధము మొదలగునవి వ్రాసిన కేశవరపు వేంకటశాస్త్రిగారును, విజయసింహ, పాతాళభైరవి (రైనాల్డ్సు నావెల్సున కనుసృతి) మున్నగునవి వ్రాసిన ఎ. వి. నరసింహాపంతులుగారును, అళహసింగరీత్యాది పరిశోధక నవలల వ్యావహారికభాషలో వ్రాసియున్న శ్రీ చింతాదీక్షితులును, వేగుజుక్క గ్రంథమాలా సంపాదకులును నవలాకారులుగానున్నారు. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రతిష్ఠాపకులగు శ్రీ జయంతి రామయ్య పంతులుగారు, ఆంధ్రపత్రికాధిపతులు నాగేశ్వరరావుగారును భాషకమితోపకృతి గావించిన మహనీయులు. వీరితోగూడ శ్రీ ముట్నూరి కృష్ణారావుగారును ప్రశంసార్హులు. వీరు ముగ్గురును నవయుగమున భాషాపోషణమునకు బాటుపడుటలో బ్రహ్మవిష్ణు మహేశ్వరులు. బ్రహ్మ (పూర్వగ్రంథ) వేదములనుద్ధరించియు, విష్ణువు భాషాస్థితిని బెంపొందించి సర్వహితుడై దనరియు, మహేశ్వరుడు విజ్ఞాన చక్షుస్సులనముఁ గావించియు వెలయువారనిగదా పురాణములు వాకొనుచున్నవి! వ్యాఖ్యానోపన్యాసకులలో బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారును, శ్రీ. చి. లక్ష్మీనరసింహంగారును, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారును ప్రశంసనీయులు. విమర్శ గ్రంథములలో నుత్తమోత్తమములు

గొన్నియున్నవి. కవితత్త్వవిచార మించుక స్వతంత్రాభిప్రాయములతో విశృంఖలమైనను ననేక విషయముల నేర్చి సుస్థిర గ్రంథరాజమైనది. శ్రీ హరిసర్వోత్తమరావుగారి "విస్మృతరాజకవి" యును, శ్రీ కీ. శే. తంజనగరం తేవపెరుమాళ్లయ్యగారి మనుచరిత్ర, భాగవతాది పీఠికలును, శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారి భాగవతోత్తరరామాయణాదులలోని యుపోద్ఘాతములును, శ్రీ అనంతకృష్ణశర్మగారి వ్యాసములును, అతివిపులము నమూల్యము నగు బ్రహ్మశ్రీ వఝుల చినసీతారామశాస్త్రులుగారి వసుచరిత్ర విమర్శనమను పరిశోధనగ్రంథమును, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి భారతావతారికయు స్మరణీయములు. కీ. శే. వంగూరి సుబ్బారావుగారి వేమనయోగి, శతకకవుచరిత్ర, ఆంధ్రవాఙ్మయచరిత్రలు దివ్యకృతులు. సర్వజనపఠనీయములు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, చాటుపద్య మణిమంజరి, ప్రబంధరత్నాకరములమూలమున భాషకుఁ జేసినయుపకృతి ఇంతింతనరాదు! ప్రజాసామాన్యమునకు వాఙ్మయాభిరుచిని గల్గించుటకు "మణిమంజరి" అద్వితీయసంధానకము. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిది యగు చాటుపద్యరత్నాకరమును జూచినారము. శ్రీ మైనంపాటి హనుమంతరావుగారి మల్లికాగుచ్ఛ మొప్పులకుప్ప. శ్రీ చెన్నాప్రెగ్గడ భానుమూర్తిగారు, రాజతరంగిణి నాంధ్రీకరించిన శ్రీ ఆర్. వి. కృష్ణారావు బహదూర్ వారు, నాస్తికధ్వాంతభాస్కరాదులఁ గల్పించిన శ్రీ కుమారయాచేంద్ర భూపతియు సంస్మరణీయులు. ఆంధ్రభారత భాగవత వచనములు వ్రాసిన శ్రీ శతఘంటము వేంకటరంగ శాస్త్రులుగారును, భక్తవిజయకర్త శ్రీ దేవరాజసుధియును, ఆంధ్రప్రజకు చిరపరిచితులు. నీతికి దూరముగాకనే లక్షణమును త్యజింపకనే మనోహరభావకమలాకరము లనఁదగు కృషీవలుఁ డాదిగాఁగల గ్రంథముల రచించిన [1] శ్రీ దువ్వూరి రామిరెడ్డిగా రభినందనీయులు. "వేణీసంహార" నాటకమును ఆంధ్రీకరించినవారును. వసుసూక్తి ప్రకాశికలో తమయద్వి

1 వీరు పాశ్చాత్త్యుల ననేకచోట్ల ననుకరించిరి. భావముల ననువదించిరి. అయినను నవీనగుణసనాథములగు వీరి కృతులు విమర్శనీయములు.

తీయ సాదృశ్య ప్రదర్శనమును, నీతిని గన్పఱచి, నీతికవితకు నీయుగాదిలోఁ బట్టుకొమ్మ యనఁదగువారును నగు శ్రీవడ్డాది సుబ్బారాయఁడుగారు ప్రశంసనీయులు. వారిభక్తచింతామణియు, శ్రీ ఆదిపూఁడి సోమనాథరావుగారి సర్వమాన్య శతకమును జాల బ్రశంసనీయములు. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమునకుఁ దోడ్పడినవారును ననేక కవుల పండితులఁ బోషించియు, సన్మానించియు, నాంధ్రభోజుఁడను ఖ్యాతికి లక్ష్యమైనవారును, విద్వాంసులును నగు శ్రీ శ్రీ పిఠాపురము మహారాజులుంగారిని భగవంతుఁ డాయురైశ్వర్యముల నిచ్చి చిరకాల మాంధ్రభాషాదేవి నారాధింప ననుగ్రహించును గాక!

మధ్యమ సంధియుగసారస్వతముల గుణనిర్ణయము వానిలోని యుత్తమకవుల నిశ్చయించుటయు ప్రజలపై నాధారపడి యున్నది. నేనిచ్చిన యభిప్రాయములు సమగ్రములుగావు. ఉత్తరరామాయణాంధ్రీకృతికర్త పాఠకులలో బహుసంఖ్యాకులకుఁ బరిచితుఁడు. ప్రాచుర్యమును బట్టియే కవిస్థాననిర్ణయముఁ జేయలేకున్నను, నది యొక్క సుగుణము లేనిదే ఘటిల్లదని ఘంటాపథముగ వక్కాణింపవచ్చును. అయినను 1900 కు, తర్వాతికవులను భావివిమర్శకుల కొప్పగించి, కవిజీవితాదుల నించుక ముచ్చటించుకొనుచు నాంధ్రవాఙ్మయ సర్వస్వ సింహావలోకనము జేసికొని విరమింతము.

సింహావలోకనము

ఇఁక ప్రాయఁబోవునది విశ్రాంతిసంభాషణము. లోకాభిరామాయణము. కాన నించుక ఛాందసము తప్పదు. పైఁగా నన్నియుఁ జిక్కుప్రశ్నలే. అథర్వణాచార్యునకు—నన్నయ్యకుఁ గలహమఁట! ఎట్లు పొసఁగును? వేములవాడ భీమకవి గ్రంథము నడంచివైచుటచే నన్నయకు మతిభ్రంశము గలిగినదా? లేక, యథర్వణాచార్యునివలననా? కవిజనాశ్రయము రేచనదా ? లేక, భీమునిదా ? గోకర్ణుని ఛందోగ్రంథము వేఱున్నదా? లేములవాడయా? లేక, వేములవాడయా? "ఆనీతాభ్యుపదా" వృత్తమును

రచించిన భీమకవి కోమటిదూషణల నంత తేలికపద్యములలో రచించెనా? వేమన్న శ్రీకృష్ణదేవరాయలకుఁ బూర్వుఁడా? అధునాతనుఁడా? మూగచింతలపల్లెయూరు, కొండవీడువాసము, కటారుపల్లె సమాధియునా? తిక్కన తాంబూలరాగముతో నన్నయభట్టారకుని పద్యమునకుఁ మెఱుఁగు పెట్టి దిరెనా! తెల్గుననే కాని, సంస్కృతములో "కవిబ్రహ్మ" కు పాండిత్యము లేదా! కుమ్మరి గురునాథుఁడా మహాకవి భారతరచనకు, వ్యాసునకు శ్రీగణపతివంటివాఁడైనాఁడు. ఎఱ్ఱన్న పూర్వగుణసనాథుఁ డని యీసడించుకొనియే సోమన్న నవీనగుణపారీణుఁ డయ్యెనా? పాల్కురికి సోమనాథుని ద్విపద నప్పటివారు పరిహసించుట, నన్నెచోడుని ఛందోలక్షణము తప్పుటచేఁ బోరులో మడిసెనా? శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగభూపతి యాస్థానమునకుఁ బోవువేళలో దిగులుపడి, "సకలసద్గుణనికురంబ శారదాంబ" యని ప్రార్థించెనా? కర్ణాట కిరాటకీచకులు దనకృతి నాశింపఁగా నాంధ్రభారతియే కన్నీళ్లు రవడింప కన్పడినది పోతన్నకు! శ్రీనాథుఁడు "సిరికిం జెప్పఁడ" నుపద్యమును బోధించుటకు మంచి యుక్తినే పన్నినాఁడు! తంజావూరి సరస్వతీమహాలులో పోతనచే రచింపఁబడిన యసమగ్రభాగవతషష్ఠస్కంధమున్నదట! ఎద్దులు లేకనే నాగలిని దున్నించిన మహాత్ముండు యోగియా? సంసారియా? కొడుకు ప్రౌఢకవి మల్లనయేయైన భాగవత శిథిలాక్షర పూరణ మాతఁ డేల చేయకపోయెను? శ్రీనాథుఁడు "తల్లీ కన్నడరాజ్యలక్ష్మీ" యని సంబోధించిన యున్కికేమి హేతువు! "కవిలోకబ్రహ్మ" యని పెదపాటి సోమన కెవరు బిరుదు నిచ్చిరి? రాయలు కర్ణాటకుఁడయ్యును 'దేశభాషలయందుఁ దెలుఁగులెస్స' యని నుడివినాఁడా? కందుకూరి రుద్రకవి రాయల సభలోనివాఁడేనా? సుగ్రీవవిజయయక్షగానమును రచించిన యీ రుద్రకవి యిభరాముని సంస్థానమువాఁడా? రాయలతోఁ గవీశ్వరదిగ్దంతి యను బిరుదముతో చదరంగపుటెత్తులు వేయుచున్న బొడ్డుచర్ల చినతిమ్మన "చారువచస్స్థితి" నొప్పువాఁ డేల గ్రంథములు వ్రాయలేదు?

ండవీడు మందేరా! కొండపల్లి మందేరా!
ాదనియెవ్వఁడు వాదుకువచ్చిన కటకందాకమందేరా!'

ాకివాని శకునవాణి ఎంత యమోఘమైనది? "వాణిసారాణి" ంకరాత్రిలో జైమినిభారతమును రచించిన పినవీరభద్రుని యసాధా ంత్వ లాలిత్య మెంత వాగడందగియుండెనో? పేకివారికథ నంటఁ ౖ పింగళి సూరన్నగాథ ఎంత నిజమో?

"కదలు మిటమాని దివిజగంగాథవాని!"

తనే దంతులూరి యన్నమరాజు కట్టినకట్ట తెగిపోయినదే యైనచో చెప్పినచొప్పున పద్యములు వ్రాసి యాధునికు లేల కార్యముల ంకొనరు? అప్పటి దృఢవిశ్వాస మిప్పుడు తుత్తుము రైనది. సంశ ులు, కార్యకారణవాదులు పెరుఁగుచున్నారు. ఇది విమర్శనాపథ శుభసూచనయే కాని, సహజప్రతిభావ్యగ్రతకు మూలము గానేర . అహోబలపండితుని యాంధ్రశబ్దచింతామణి కథలో మరణించిన ధరుఁడు బ్రతికివచ్చినాఁడు. మాళవములోని కథ రాజమహేంద్ర ా యెగఁబాఱినది? లోకవార్తల నెట్లు విశ్వసింపనగు? ఇప్పటి కృష్ణప్రణయగీతములసారమును జిత్రించిన కందుకూరి జనార్దనాష్టక వ్రాసిన సుకృతి రుద్రకవియేనా? భృంగపంచకముఁ జెప్పిని భట్రాజ ుండఁడు కదా? శ్రీనాథుని దేనాకృతి? "ఫుల్లకవి నేలు గోపికావల్ల " కొంటెవాఁడుగానున్నను నీతిమంతుఁడు. పూసపాటి సీతారామ నట్టివానికి "వన్నెసుమీరాకొట్టుట" యనుమాట వినవలసివచ్చినది! స్వతంత్రులా సంఘమునందు

"పెండెలనాగి కొప్పుపయిఁ బెద్దికటిస్థలి గంగిగుబ్బచ
న్గొండల నుండు రామకవికుంజరుహస్తము"

యంతపూజ్యమూ? తనగుట్టు వెలివేసికొనుచున్నను నహంకృతి మాత్రము లేదు.

"కూఁతు రాయల కిచ్చి కూర్చునాడు"

అన్న పెద్దన చాటువునకుఁ దుకా్ౕాపంచకమునకు పొత్తుగూడినదందురు. సత్యము దేల్చరాదా? "తారణమాఖ శుద్ధషష్ఠీ రవివాసర"మేనా రాయల నిర్యాణదినము?, "కన్నొక్కటి లేదుగాని కాంతుఁడుగాఁడే" యని తిరుమలరాయని తెనాలి రామలింగకవి వర్ణించియేయున్న, రామలింగకవి యష్టదిగ్గజముల నొక్కఁడేయైయున్న నిఁక దీర్ఘాయువనుట కేమిసందేహము? ముక్కు తిమ్మన్నతో సరసమాడి పండ్లూడఁగొన్నప్పుడు రామలింగకవి యెట్లుండెనో?

"కైకొమ్మని యీయరెయర్థం,బిమ్మహిదున్నంగనేల యిట్టిమహాత్ముల్" నావచించిన శ్రీనాథునకును "ఇమ్మనుజేశ్వరాధముల" యన్న పోతన్నకు నేకకాలము వారయ్యు నెట్టి భిన్నాదర్శములు?

"ఓరచూపుల విటచిత్త మూగులాడ", "హాళి డాచేత విడియంబుఁ గీలుగొల్పి" యన్నంతనే తాను జూచినదేకాక మనకుఁ దత్కాలసందర్శనము జేయించుచిత్రకళాకౌశలము, శ్రీనాథునట్టిభోగికి గాక మఱెవరికి లభించును?

"పరమేశా గంగవిడువు పార్వతిజాలు"

ననియా దైవ ప్రార్థన? "కలారాయనభాస్కరః" యనఁబడి కీర్తినొందిన మహామహుఁడు. దేశములోని ధనాఢ్యబ్రాహ్మణులకు నీతిగఱపను నింకో సారి యేల పుట్టఁడు? ఎవనిపేర సప్తాంగపద్ధతియు, నవరత్నములును పిన వీరన రచించె నను నూహాపాఠిన దట్టి సాళ్వగుండ నరసింహరాయల రాజ్య విభూతి యెట్టిదో? "నెల్లూరి ప్రాంతపు పట్టపురాయి గ్రామానకుఁ దూర్పున నున్న, ఖడ్గతిక్కన ఛాయాపటము నెవరైన తస్మాండలికు లుద్ధరించరాదా? అన్నదమ్ముల పోలికలపై తిక్కన యిట్లుండె ననియైనఁ బోల్చికొందుమే? కవిరాట్టని రాయలసభలోనివాఁ డనంబడుకవి యెవరు? పోతనధారవలెనే మఱి యెవరో భోగినీదండకమును వ్రాసియుండుట నిజమేయైనచో, శైలిని బోలిన శైలిని బుట్టించినవాఁ డెట్టికవి గావలయు? వాసిరెడ్డివేంకటాద్రీశుని సౌధమును పాపయారాధ్యుఁడు వర్ణించెను. అట్టిపండితకవియు లేఁడు. వర్ణించిన వినునంతటి యోర్పుసైతము గలరాజును లేఁడేమో? 70 ఏండ్ల

క్రిందట క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి వానను నిల్పినాఁడు. అట్టివారు నేఁడు లేరు: స్వకీయభావపరిణామమును సరిగా సంక్రమించుశైలి, ఏపదములలోనో ఏపాటలలోనో పుట్టి చిన్నచిన్నకృతులకుఁ బ్రాకి, శాసనముల కెక్కి, తత్తత్స్వభావపేశలము లగుటవలన నాయాద్విపదగీత మధ్యాక్కరాదికర్తలయందు వేర్వేఱు వైచిత్ర్యములతోఁ జిందులాడి, విశృంఖలవిహారముతోఁ గట్టుతెగి తాత్కాలికవ్యావహారికభాష నుద్ధరించిన, ప్రథమ విపులకృతిని నిర్మించిన నన్నయ యనర్గళధారతోఁ గలసి, తిక్కన్నగారి తెనుఁగభారతములో నెన్నియో వ్యవహారసిద్ధపదజాలమును బునీతముఁ జేసి, సంగ్రహవాక్య సంబద్ధ వివిధశ్లోకానుభవార్థగరిమతోఁ బెరసి, తేటతెలుఁగు తీరుతీయముల బలిమిని సంస్కరింపఁబడి ఎఱ్ఱనలో సంస్కృతపదనవాంబుజోజ్జ్వలత నందినది. ఈయాంధ్రకవితాశైలి సోమనాథునివాక్కులకుఁ జొక్కి "అరిఁజూచి హరిఁజూచి" యొకేచూపులో రెండుకార్యముల నెఱవేర్చునుక్కుఁజేవయును గల్గి రెడ్లమందిరములలో శ్రీనాథుని సీసపద్యడోలికలలో మేను కున్కపాట్లుపడి, వాక్కల్లోలములలోఁ దేలియాడు లలితభావకల్హారముల నసంఖ్యాకములుగా వెదచల్లుచున్న పోతన్న కుటీరములో స్వాతంత్ర్యభాగ్యమును జవిచూచినది.

ఇంతలో నాంధ్రీకరణ పద్ధతిపోయి నూత్నప్రబంధకవితలోని కలికిమ్రోతలకు వలచి, వర్ణనల పూబోదరిండ్లలో కన్నుఁ బ్రామినది. బహ్వర్థపఁమళములతో శైలి నడినెత్తిమత్తు నలమికొనఁ జేసినది. తళుక్కున నొక్కెమెఱుపు—శ్లేషపద మహాతరుషండమధ్యమున పూచి కల్పితోహాగానకమనీయతతో కళాపూర్ణోదయము విజృంభించినది. అచ్చతెనుఁగు, అల్లరిశ్లేష, అనర్థప్రబంధములు కుప్పలు పడ్డవి. పాశ్చాత్త్య పద్ధతులు దృష్టికిఁ దగిలినవి. పండితులు పూర్వసారస్వతమునకు వ్యాకృతి, నిఘంటుల నొక్కచో నల్లుచుండ, నింకొకచో సత్యరాజాదేశయాత్రాదికములు నూతనపక్కినిఁ దెలుప సంధియుగము సమసినది. తుదకిరువదవశతాబ్దములో నింతవఱకణఁగియున్న ఖండకావ్య కవిత, గీతములు, ద్విపదలు, విజృంభింపఁగా శైలియు

నానావిధగమనములతో పారిస్‌నగరములో క్రిస్‌మస్ పండుగలోని "డ్యాన్సు" వలె నడలను జూపుచున్నవి. వాఙ్మయశాఖ లనేకము లైనవి. గ్రంథము లసంఖ్యాకము లైనవి. నేడు—

"దేవునాన మున్ను దేశాన కొకరుండ, నిప్పు డూరనూర నింటనింట
నేవు రార్వు రేడ్వు రెనమండ్రు తొమ్మండ్రు, పదువురైరి కవులు పద్మనాభ"

యను పద్యము సార్థకమైనది. అంతతోఁ బోలేదు. పండితపక్షపాతులగు విమర్శకులతో నారంభమై, సంజీవనీపత్రికాకాలమున [ఏకోనవింశతి శతాబ్ద్యుత్తరభాగము] పరస్పరద్వేషభాజనంబై, వాగ్యుద్ధమున చిక్కి శల్యమై, మరల కవిత్వతత్త్వవిచారాదుల భక్షించి యించుక కలతఁదేరిన కృతివిమర్శన మిప్పుడు పరస్పరస్తోత్రపరాయణ సంఘముల Mutual Admiration Societies మంచిమాటలకు మఱగి మందగమన యైనది. అయ్యైసంఘములోనివా రాయాసంఘకవుల వ్రాఁతలను మందలించువారు వోలె మాటలాడుచునే యఖండస్తుతులను బెంచుచున్నారు. కాలదేశ స్థితులతోపాటు వానివాని కర్మఫలము నేకీభవించి, ఎవనికృతికి ప్రజచే సుస్థిరత నిప్పించునో ఎఱుఁగముగాని, పనికిమాలినవారు, వారికృతులు కాలవాయువున నెప్పుడో తూలిపోవుట సత్యము. కావున కవులెంద ఱైనఁ గానిండు. సువిమర్శనము మాత్రము చేయవలయును. పిల్లి పాలు ద్రాగినట్లు మనవాఁడని పొగడుట మాననీయము గాదు. పూర్వశతాబ్దిలోని యన్యోన్య విద్వేష మెట్లు సద్విమర్శకుల త్రోవగాదో యట్లే స్తుతియును కావ్యగుణ తత్త్వమును దెల్పదు. ఇది యెట్లున్నను నేటి సారస్వత సాహితీ భారతీ ప్రభృతికవి సంఘములు భిన్నభిన్నాదర్శములతో సారస్వతమునకు నవ్యతను బ్రసాదించుచున్నవి. కాని, యొక్కవిషయము—దీనిని చెప్పవల సినచోట చెప్పలేదు—నీతి—స్వాతంత్ర్యము—ప్రకృత్యనుకరణము—నను మూఁడుపదముల కపోహాలు కల్పింపఁబడుచున్నవి. నీతికి కవితకు సంబంధము "లేదంటారు," సంఘమున స్వేచ్ఛ యున్నదంటున్నారు. ప్రకృత్యనుకరణమే విషయోక్తము. పాంచభౌతికమగు ప్రకృతియే గొప్ప. ఆదర్శ

భావములు ముక్కులు పట్టుకొని కూర్చుండు మునులకేకాని, సామాన్యుల కేల? అనుభవములో నుండు సత్యములే Practical truth సత్యములు ననంబోవుచున్నారు.—ఇవి కేవలము ప్రమాదములు—సంఘోద్ధృతి కాక కేవల మనోరంజక శిల్పమే కవితకు లక్ష్యమై యున్నను మహాకవుల కావ్యములలో సంఘశ్రేయోదాయకము లగు నాశయములు, సత్యనిరూపణాలు గర్భీకృతములై ప్రధానాంగముగా నున్నవి. దుర్నీతిని బోధించుట కావ్యమునకు వికారము. నీతియున్న సంఘాచారము కానేరదు. వంచనచేసినగాని గుమాస్తాకు నాదాయము రాదు. కాని వంచన నీతియగునా? హింస చేసినగాని కొందఱు దేవతలు తృప్తిపడరట. అది యాచారమైనదేకాని నీతి మాత్ర మహింసయే—సత్యమే నీతి—విశ్వకల్యాణ సంపాదకము సత్యము అట్టి సత్యము నీతిపదముచే గ్రాహ్యము. కాని, స్వైరవృత్తి మూఢాచారములు గావు. కళా సత్యము లేకములు; భిన్నములు గావు. సంఘమునకు కావలసినది హితస్వాతంత్ర్యము. సత్యము. సముద్దీపనకై వ్యక్తికి వలయు భావవికాసము-అంతియేకాని యధర్మ స్వేచ్ఛగాదు-విశృంఖలవృత్తి సంఘమునకు చేటు నాపాదించును. పువ్వు చెట్టున, తలపైన శోభించును. అంతే కాని వీథిలోఁ ద్రొక్కఁబేయుటకుఁ గాదు గదా! ఉచితస్థాన నియమమే స్వాతంత్ర్యహేతువు. అస్థానసంచారిభావము స్వేచ్ఛ; అనావశ్యకము. ప్రాచ్యశిల్పము ధ్యానలక్ష్యము గలది. భౌతికసామ్రాజ్యమే పరమార్థ మిందు గాదు. జీవితము పరమార్థ సంపాదనకు! పాశ్చాత్త్యకళలో జీవితము కేవల సుఖహేతువు. శకవీరుని Shakespeare క్లియోపాత్రా Cleopatra తో కాళిదాసుని శకుంతలను బోల్చి చూడుము. పాశ్చాత్త్య కళాదర్శముఁ నెత్తిపైన నుంచుకొని, మననాగరకతాపృథక్త్వమును కాలఁదన్నుట పాడి గాదు. ఆలోచించినచో పాశ్చాత్త్యులపాంచభౌతిక ప్రకృత్యనుకరణ మవశ్య ముండఁదగినదేకాని, ప్రాచ్యాదర్శములతో మేళగింపవలయును. ఆత్మ శరీరములంబోలునవి ప్రాచ్యపాశ్చాత్త్యశిల్పములు. వాల్మీకికవితలో రెండును నున్నవి. విషయవర్ణనాకథాసంవిధానప్రకృత్యనుకరణపాత్రపోషణలను పాశ్చాత్త్యము, ధర్మములతో ప్రాచ్యశిల్పలక్షణములగు నున్నతాశయ,

విశ్వశ్రేయోభావ, సత్యసందర్శనములందు జెరసినవి. మన కాదివి యతఁడు. అందులకనిరోఁకేసల ... సులౌల్యమును సూచించువానిని మోహాశృంగార కృతులంటిమి. ఇట్టివి పాటలలో, పద్యములలో, నవలలలో నెక్కుచున్నవి. ఇవి యొక్క యువావస్థలో తాత్కాలికానందదాయకములే కాని, తర్వాత గానేరవు. కావున విశ్వమానవభావసమన్వయ మవసరము.

1. పింగళి సూరన్న స్వతంత్రమహాకావ్య మొండు సృజించెను. దానికిఁ బిమ్మట యట్టివాఙ్మయోద్యమమే పుట్టలేదు. ఖండకృతులకు సంపూర్ణావయవశిల్ప పుష్టిలేదు. తత్త్వకావ్యములలో [గీతాంజలి] మంచిభావము లున్నవి. కథతో నైక్యముగాని యాభావములు ప్రజ యభినందింపనేరదు. ప్రజ నున్నతస్థితికిఁ దెచ్చుటకు వస్తుస్వభావనివేదనముతోఁ గల్పి స్ఫుటీకరించిన యాదర్శభావములే కాని తక్కినవి పొందుపడవు. బొబ్బిలిపాటలోని యుద్ధరంగములో నగుపడిన వీరరసమును కథలేకుండ నిర్గుణముగ నెంత చిత్రించినను నిరుపయోగమే. ప్రజకు వాంఛనీయము "కేశవో వా శివో వా" యన్నట్లు సాకారబ్రహ్మమే కాని యనను భావ్యమైన నిరాకారబ్రహ్మముగాదు. కావున మహాకవులు (చేతగానివారు ఖండకృతులనే పాడుకొని తరింపనిండు) కావ్యనిర్మాణమునకు తర్వాత మహాకావ్యనిర్మాణమునకుఁ బూనుకొనుట మంచిది. ఏసూరన్నయో ఏడాంటె Dante యో యుగమునఁ బుట్టి నాయాశను ఫలింపఁజేయుఁడు.

2. భావములు ముఖ్యములు, గొప్పవారను పేరుఁబొందినవారిలో నైతము అనుసృతులేయై యున్నవి. ఈ యనుసృతులను వీడి స్వీయానుభవమును, విచారణము Reflection ను, రసావేశమును ప్రధానములుగాఁ జేసికొని కావ్యము లల్లుఁడు.

3. పెద్దలు నుడివినలక్షణము లనావశ్యకము లనఁబోకుఁడు. లక్షణమనఁగా నియమము. స్వతంత్రపథములకుఁబొండు. కాని, యందును నియమ మవసరము. ఒక యూహాగానము వ్రాసితిరా దానిలో నిన్నిమాత్రలు ఏధాటి యని యొకనియమములేనిది బాగుండదు. నియమరహితమగు కలలిక్కను పిచ్చియందుము. నియమసహితమై ప్రత్యేకతను చూపు తలలిక్కను

మేధామహాశయత Genius యందుము. ఒకరు చేసినలక్షణములు కాబట్టి యున్నను మాలక్షణములైనను మీకుండవలయును. Spenser's Stanza పరిణామము నున్నగునవిచూడుఁడు.) కాని మీమేధాస్ఫూర్తి కాటంకములగు లాక్షణికశాసనములనే యాదలఁదాల్పుఁడని యనరాదు. లాక్షణికులవి యున్న నెవరివో యొకరి వుండుట సహజము.

4. తలకొక్క భాష ననుసరించుట ప్రమాదము. వ్యావహారిక భాషా ప్రవాహములోని సరణి ననుగమించుట లెస్సయే కాని, కట్టుబాటులేక యిచ్ఛకువచ్చినది వాడుట మంచిదా? వ్యావహారికపదప్రయోగము రసోత్పత్తికిఁ గొనుఁడు. రసోదయార్థప్రకటనలకు ఆవశ్యకములగు వ్యావహారికపదములు తమంతట కావ్యములో దొరులునేకాని, పట్టుపట్టి గ్రామ్యమునే జొప్పింపవలయుననుట మంచిదికాదు.

5. ఆంధ్రవాఙ్మయ విజ్ఞానసర్వస్వమును Cyclopædia విజ్ఞానసర్వస్వ నిఘంటువులతోపాటు ఒకదానిని సంతరించుట మంచిది.

6. పద్మపురాణ పూర్వభాగము, శివపురాణము, భవిష్యత్పురాణము, పురాణఖండము, లింగపురాణము, వామనపురాణము(లింగముకుంట రామకవిది లభింపనిచో) తెన్గింపని యుపపురాణములు పండితు లాంధ్రీకరించుట సమంజసములుకాని యిదివఱకున్న మార్కండేయాదులు భారతరామాయణాదుల మరలమరల తెనింగించుట సారస్వతమునకుఁ దలబరువు. ప్రయోజనరహితము (శ్రీ కోటీశ్వరశాస్త్రులుగారు 1925 లో 16-వ ఉగాదిసంచికలో నష్టాదశ పురాణము లనుశీర్షికతో వ్రాసిన గ్రంథనామములను జదువుఁడు.)

7. పత్రికాధిపతులు విమర్శకులు దక్షిణాంధ్ర తెలింగానా దత్తమండల సీమలలోని రచయితలను నిరాకరించుట తగదు. స్వమండలాభిమానమున్నను నాంధ్రదేశస్థు లెవరైన నొక్కటేయనుట మఱువరానిది. [1913 ఉగాదిసంచికలోని దక్షిణభాగాంధ్రకవు లను వ్యాసమును చూడుఁడు] తిక్కన, మారన, సోమన ప్రభృతి మహాకవులెల్లరకును కృష్ణా దక్షిణ తీరమే నిలయమనుట విస్మరింపకుఁడు.

8. కే. వి. లక్ష్మణరావుగారు, చెలికాని లచ్చారావుగారు లారంభించిన పరిశోధనోద్యమములఁ బెంపొందించుట విద్యావంతుల విధు

ధర్మమైయున్నది. ఖండకృతులతోఁ గాలయాపన చేయుటకన్న భాషాభిమాను లీశా[illegible]ముఁ జేసి ధన్యులగుట మంచిది.

9. దేశచరిత్రసారస్వతము లన్యోన్యాశ్రయము లనుటను విమర్శకులు విస్మరింపకుందురుగాక.

10. కవిజీవితమే కావ్యములోఁ బ్రతిబింబించునుగాన నసమగ్రములగు పూర్వకవిజీవితములను సమగ్రములుగా రచించు టుత్తమము.

11. కవులు చాలమంది పేదలగుట ప్రభువులగు ధనాఢ్యులకు కవిపోషణమావశ్యకము, కీర్తిహేతువు, సంఘౌన్నత్యదాయకము.

12. భాషాపోషణమొనర్చిన ప్రభువులచరిత్ర మొకటిని గూర్చుట సమంజసము.

13. శాస్త్రాదులు తెన్గింపఁబడిననేకాని ఫలము లేదు.

14. ఉత్తబిరుదములతోఁ బ్రజకు భ్రమఁ గల్పింపక గ్రంథకర్తలు తమకృతులలో సామర్థ్యములఁ జాటుకొందురు గాక!

15. కళాభిరుచిఁ బొందించు సంధానకగ్రంథముల ప్రచురణ మావశ్యకము.

ఈగ్రంథమున నెన్నియో దోసఁగులు, లోపములు, విరుద్ధభావములు నుండియుండనగును. కించిజ్జ్ఞుఁడనగుట నవి యనివార్యములు. వానిని దిద్దియుఁ, బూరించియుఁ, సవరించియుఁ బెద్దలు నన్నుద్ధరించి వాఙ్మయమునకుఁ దోడ్పడుదురని విన్నవించుచున్నాను. సాంతముగఁ జదివిన పాఠకులకు నమస్కృతులు.

తే. "పరమునికి వందనముఁ జేతు పరిఢవించి
మున్నవితథానువిభూతికి మ్రొక్కికొందు
మెఱయు గుణములఁ దేలు నిమిత్తమాత్ర
బంధువైనట్టి వానికిఁ బ్రణుతి సేతు."

ఓమ్ తత్ సత్.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1936.